శ్రీః

# సాహిత్య జగత్తు




సాహితీ సదస్సు,
*40-371* విద్యానగర్
కర్నూలు - 1
**1973**

శ్రీః

# సాహిత్య జగత్తు




ప్రచురణ

సాహితీ సదస్సు,

*40-371* విద్యానగర్

కర్నూలు - 1.

**1973**

"వేదా నుద్ధరతే, జగన్నివహతే
భూగోల ముద్బిభ్రతే
దైత్యం దారయతే, బలిం ఛలయతే
క్షత్రక్షయం కుర్వతే
పౌలస్త్యం జయతే, హలం కలయతే
కారుణ్య మాతన్వతే
మ్లేచ్ఛాన్ మూర్ఛయతే, దశాకృతికృతే
కృష్ణాయ తుభ్యం నమః

—జయదేవః

# కార్య వర్గము

1. ఆచార్య శ్రీ యం. డి. వెంకటసుబ్బయ్య, **M. A. B. Ed.,**
అధ్యక్షుడు

2. శ్రీ ఉప్పులూరు విశ్వేశ్వరయ్య, **M. A. B. L, B. Ed.,**
సభ్యులు.

3. శ్రీ యం. వి. యస్. సూర్యనారాయణ, **M. A. B. T.**
సభ్యులు,

4. ఆచార్య శ్రీ ఎన్. వి. కృష్ణమూర్తి **M. A, B. Sc. (Hons)**
సభ్యులు

# కృ త జ్ఞ తా ం జ లి

'సాహిత్యజగత్తు' అను మా రెండవ ప్రచురణమున కార్థికసహాయము ద్వేధా లభించినది.

1 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము - విద్యాశాఖ మంజూరుచేసిన బాపతు రూ. 1900—00.

2. ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ ప్రసాదించిన రూ. 500—00.

ఈ సందర్భమున సాహితీసదస్సు ఈ రెండు సంస్థలకు ఎంతయో ఋణ పడియున్నది. ప్రభుత్వసహాయము మాజీ విద్యామంత్రియైన శ్రీభాట్టం శ్రీరామ మూర్తిగారును, శాసన సభ్యులైన శ్రీ ఇ. అయ్యపురెడ్డిగారును అభిమానించి, శ్రమించి, మమ్మనుగ్రహించిన ఫలితమే. వీరి సహకారమే లేనిచో ఈ ప్రచు రణము వెల్వడకపోయి యుండును.

అట్లే సాహిత్యఅకాడమీ ప్రకటించిన ఆర్థికసహాయము శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు మా సాహితీసదస్సునకు ఇచ్చిన ప్రోత్సాహమని భావించు చున్నాము. ఈ విషయమున సాహిత్య ప్రియులైన ఆచార్య శ్రీ డాక్టరు దివాకర్ల వేంకటావధానిగారు మాకు చక్కని దారిచూపిరి. వీరలందరికి సాహితీసదస్సు కృతజ్ఞతాంజలి ఘటించుచున్నది.

# సాహితీసదస్సు ఆశయములు

1. కర్నూలు పట్టణమున నృత్యగానాది కళల యభివృద్ధికొఱకై కొన్ని సంస్థలున్నవి. కాని సాహిత్యాభిరుచిని సామాన్యప్రజలో పెంపొందించుటకు తగిన సంస్థయేదియు లేని కొఱతయే యీ సాహితీసదస్సు సంస్థాపనకు ముఖ్య కారణము.

2. సంస్కృతాంధ్ర సాహిత్యములు, హైందవ సంస్కృతితో చాల సన్నిహితముగా ముడిపడియున్నందున సాహిత్యమునకు సంబంధించిన విషయ ములను చర్చించుటయేకాక హైందవమతమునకు సంబంధించిన ధర్మప్రచారము కూడ సదస్సుయొక్క ప్రముఖమైన ఆశయము. జనతలో నొక నూత్నమైన యుత్తేజమును కలిగించుటయే మా కార్యక్రమముల లక్ష్యము.

3. ఈ సదస్సుయొక్క అభివృద్ధి యితర కళాపోషకములైన సంఘ ముల పెంపునకు దోహదకారిగా రూపొందగలదని విశ్వసించుచున్నాము.

4. సదస్సులో సంఖ్యాబలము ఎంత అవసరమో, కార్యాచరణ దక్షత, లక్ష్యసిద్ధియుగూడ అంతే అవసరములని భావించుచున్నాము.

5. ఇతరములైన సమావేశములలోవలెగాక, యిచట ఆహూతులైన పెద్దల భాషణములను అక్షరరూపమును పొందించి కావ్యకుసుమములుగ ప్రక టించి చందాదారుల కందించుట మా యీ సదస్సుయొక్క విశిష్టత కాగలదని ఆకాంక్ష.

6. సాధ్యమైనంతవఱకు నెలకొక సమావేశము జరుగగలదు. ఆహ్వాన ములు తపాలాపద్ధతిలోనైన చందాదారుల కందింపబడును. ఈ సదస్సుయొక్క ఉదాత్తాశయములు నెఱవేర్చుటకు బద్ధకంకణులైన సాహితీ ప్రియులమగు మన కందరికి దైవము తోడ్పడుగాక!

ఈ మహదాశయములను క్రమగతితో సాధించుటకు చందాదారుల సాహాయ్య మెంతేని అవసరము. సాలుచందా రు 10/- పదిరూప్యములు. చందాదారులుగ చేర్చుకొనుటకు వలసిన దరఖాస్తులు కోరినచో అందింపగలము రూ. 116/-లు, 250/-లు, 500/-లు, 1000/-లు మొదలుగాగల పెద్ద మొత్తము లిచ్చునట్టి దాతలు జీవిత చందాదారులుగ పోషక, రాజపోషక, మహా రాజ పోషకులుగా చేరవచ్చును.

# స్వ కీ య ము

## మా కథ

1970 లో సాధారణవత్సర శ్రీరామనవమి పర్వదినమును పురస్కరించు కొని రామాయణమును గూర్చిన ఉపన్యాస ద్వితయముతో మాసాహితీ సదస్సర స్వతి ఆవిర్భవించినది. తదాదిగా ఇంతవఱకును సమావేశములు జయప్రదముగా జరుగుచున్నవి. మొదటి వత్సరమునందలి యుపన్యాసములు మా తొలిప్రచురణ మైన 'సాహిత్యప్రబోధము' నందు ప్రకటితములు. రెండవ సంవత్సరమునందలి యుపన్యాసములు ఈ ద్వితీయ ప్రచురణమున చేర్చబడినవి. వాని వివరములు క్రింది పట్టికలో పొందుపఱచుచున్నాము.

| సంఖ్య | తేది | విషయము | ఉపన్యాసకులు | అధ్యక్షులు |
|---|---|---|---|---|
| * 1 | 14-3-'71 | అభిజ్ఞాన శాకుంతలము | డా. పుల్లెల శ్రీరామచంద్రుడు | శ్రీ జి. కె. శ్రీగిరిరావు |
| 2 | 25-7-'71 | మహాభారత తత్త్వ వివేచనము | శ్రీ గోసుకొండ వేంకటరామశాస్త్రి | శ్రీ డి. వి. సుబ్బాశాస్త్రి |
| • 3 | 22-8-'71 | మహాకవి ధూర్జటి | శ్రీ టి. ఓ. యం. అయ్యవారు | శ్రీ యన్. శ్రీరాములు |
| 4 | 26-9-'71 | కాళిదాసుని ఆర్ష వాణి. | శ్రీ శలాక రఘునాథశర్మ | శ్రీ కె. అనంత రామసింగు |
| 5 | 28-11-'71 | త్యాగరాజు కృతులపై తులసీదాసు ప్రభావము | శ్రీ వారణాసి రామమూర్తి రేణు | శ్రీ కె. చంద్ర మౌళి |
| • 6 | 30-1-'72 | సంస్కృతాంధ్ర మహాభారతములు. | శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ | శ్రీ గాడేపల్లి పుల్లయ్యశాస్త్రి |
| 7 | 19-3-'72 | దేవాలయము ఉత్పత్తి వికాసములు | శ్రీ గడియారం రామకృష్ణశర్మ | డాక్టరు శ్రీపాద పినాకపాణి |

| సంఖ్య | తేది | విషయము | ఉపన్యాసకులు | అధ్యక్షులు |
|---|---|---|---|---|
| 8 | 29-4-'72 | తెలుగు కవిత్వమూ కావ్యత్వసిద్ధి | డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి | శ్రీ యస్. శంకరయ్య |
| 9 | 30-4-'72 | అష్టావధానము | శతావధాని శ్రీసి. వి. సుబ్బన్న | శ్రీ కె. బి. శేషయ్య |
| * 10 | 4-6-'72 | అరవిందుల సందేశము | శ్రీ దేవరకొండ వీరయ్య | శ్రీ పాలాది రామయ్య |
| 11 | 9-7-'72 | పానుగంటి వారి నాటకాలలో భక్తిరసము | డాక్టరు ముదిగొండ వీరభద్రశాస్త్రి | గౌ. శ్రీభాట్టం శ్రీరామమూర్తి |
| 12 | 20-8-'72 | జయకావ్యమూ కొన్ని విశేషాలు | శతావధాని శ్రీ అనుముల వేంకటశేషకవి | శ్రీ పి. సి. వెంకట రాములు |
| 13 | 3-9-'72 | అనుక్తమన్యతో గ్రాహ్యం : తెనుగు వ్యాకరణమునకు కావలసిన సంస్కృత వ్యాకరణము | శ్రీ వుప్పులూరు విశ్వేశ్వరయ్య | ఆచార్య శ్రీ ఎన్. వి. కృష్ణమూర్తి |
| 14 | 3-9-'72 | కొన్ని చమత్కార శ్లోకాలు | ఆచార్య శ్రీ ఎన్. వి. కృష్ణమూర్తి | |

* ఇది మొదటి వత్సరమునకు సంబంధించినది.

• ఈ ఉపన్యాసము వ్రాతప్రతులు మాకింతవఱకు అందలేదు.

మా సమావేశములన్నియును అతిప్రశాంతవాతావరణములో జరిగినవని చెప్పుటకు సంతసించుచున్నాము. దీనికి ముఖ్యకారణము మా సభాసదుల సభ్యత, సహృదయత, సౌహార్ద్రప్రోత్సాహములే అనుట నిస్సందేహము. వచ్చిన ఉపన్యాసకులందఱును సభాస్తారుల వైజ్ఞానికపిపాసను మెచ్చుకొనుచు ఉత్సాహము ప్రకటించిరి. సభాసీనులయిన సహృదయులును ఉపన్యాసకుల విమర్శనస్థాయిని ప్రశంసించిరి. ఈ విధముగ సభలు జయప్రదముగా సాగినవి.

మా ఈ సాహిత్యకృషికి చేయూతనిచ్చి నూటయేబదికి పైబడినసంఖ్యలో పురప్రముఖులు సాహితీపరులు చందాదారులుగా చేరి మమ్మాదుకొన్నారు. రసజ్ఞులయిన కర్నూలు పట్టణవాసులు మా ఉద్యమములోని ప్రాముఖ్యమును గమనించి ఇతోధికముగా చందాదారులుగా చేరి ప్రోత్సహింతురని ఆశించుచున్నాము.

మా ఆహ్వానముల పురస్కరించుకొని శ్రమ యనక విచ్చేసి ఉపన్యాసము లిచ్చిన వక్తలకు, అధ్యక్షపీఠముల నలంకరించి ప్రోత్సహించిన పెద్దలకుమ మా కృతజ్ఞతలు. సదస్సు చిహ్నమును మా కోరిక మేరకు అందముగ చిత్రించి యందించిన కళాకారుడు శ్రీ సత్యనారాయణరాజుగారికిని మా ధన్యవాదములు.

మాసమావేశములన్నియు మునిసిపలు హైస్కూలు హాలులోనే నిరాటంక ముగా సాగినవి. దీనికి అనుమతించి సహకరించిన శ్రీ కె. నాగిరెడ్డి (మునిసిపలు ఛేర్మను) గారికిని, శ్రీ కె. సీతారామయ్య (హెడ్మాస్టరు) గారికిని, తదితర మునిసిపలు అధికారులకును మా సదస్సు ఈ సందర్భమున కృతజ్ఞతను ప్రకటించుకొనుచున్నది. సాహితీ సదస్సు సమావేశముల ఆహ్వాన పత్రములను. 'సాహిత్యప్రబోధము' అను మొదటి ప్రచురణమును రమ్యముగా ముద్రించి సహకరించిన ఉజ్వల ప్రింటర్సు (కర్నూలు) వారికి, మైక్రొఫోను సాధనము లమర్చి సహాయపడిన తిరుమల సౌండ్సు వారికిని మా హృదయపూర్వక ప్రశంసల నందజేయుచున్నాము.

## మ న లో మా ట

మన పట్టణములోని పండితులు సహృదయులు మొదలైన పెద్దలేకాక, ఉత్సాహవంతులైన యువకులుగూడ ముందుకువచ్చి మా ఆశయముల పెంపొందించు కృషికి తోడ్పడి ఉజ్వలమైన భవిష్యత్తును గలుగజేయుదురని ఆశించుచున్నాము. బయటివారినేకాక స్థానికులైన యోగ్యులగు సాహితీ పరులనుగూడ

ప్రోత్సహింపవలసి యున్నది. మా సదస్సు సాహితీ సమాలోచనములకును హైందవ ధర్మప్రబోధమునకును చక్కని వేదికగా రూపొందించవలసిన బాధ్యత మన అందరిపైనున్నది.

మా వ్యాసమంజరుల సౌరభముమ అందఱును ఆనందించి మమ్ము అభిమానింతురని మా నమ్మిక, వీని విక్రయమునకు చేయూతనిచ్చినచో తన్మూల మున లభించు ద్రవ్యమును మేమొక ప్రచురణనిధిగా ప్రత్యేకింపదలచుకొన్నాము సంవత్సరమున కొకమారేకాక, హెచ్చుపర్యాయములు చిన్న చిన్న సంపుటము లుగ వెలువరించవలెనను సంకల్పముగలదు. కాని 'ధనమూల మిదం జగ' త్తను నట్లు సర్వము మీరుచేయగల ధనరూప సహాయ సంపత్తిపై నాధారపడియున్నది. కాబట్టి పెద్దమొత్తములు విరాళములిచ్చు దాతలు ఇతోధికముగ మా ఆశయసిద్ధికి తోడ్పడుదురని అర్థించుచున్నాము.

## అ భి జ్ఞా న ము

'సాహిత్యజగత్తు' అను మా సదస్సు ద్వితీయ ప్రచురణము సమర్పించు కొన్నాము, చిత్తగింపుడు.

సాహితీసదస్సు రెండు ముఖ్యదృక్పథముల నాధారముగా చేసికొని ఈ కార్యక్రమము తలపెట్టినది. ఇవి సాహిత్య సమాలోచనము, ధర్మప్రచారము అనునవి. తదనుగుణముగా ఇందు సాహిత్యసమీక్షా పూర్వకములైన పెక్కు వ్యాసములతోబాటు, హైందవ ధర్మావలంబకములైన విషయములనుగూడ చేర్చుట జరిగినది.

ఈ సాహిత్య, ధర్మ సమన్వయదృష్టితోనే మా సదస్సు చిహ్నము కూడ చిత్రింపబడినది. దీనిలో కమలము సాహిత్యము, తద్వికాసమును ప్రేరేచు సూర్యుడు ధర్మజ్యోతిగను, పరస్పరము అజ్ఞానతిమిరమును పారద్రోలి జ్ఞాన ముద్రను ప్రపంచించు ఓంకారము సమున్నతమగు పరమాపధిగను వ్యక్తీకృత ములై యున్నవి. ఈ జ్ఞాన విజ్ఞానదీధితులకు ఆలంబముగా "రసో వై సః"అను సూక్తి యిందు జోడింపబడినది. బ్రహ్మానంద సహోదరమై రససిద్ధిని గలుగ జేయునదియే కావ్యమనికదా లాక్షణికుల నిర్ణయము.

ప్రతి వ్యాసారంభమున తత్తదుపన్యాసకుల సంగ్రహపరిచయము చేర్చబడినది. అంతేకాక ఆయావ్యాసములలోని విశిష్టతకూడ రేఖా మాత్రముగా సూచితమైనది.

తత్త్వము, భక్తి, ఆరాధన, ఇతర భాషాప్రభావము, వ్యాకరణము, నాటకము, ఇతిహాసము, కవిత్వసమీక్ష, అవధానము, చమత్కృతి ఇత్యాదివిభిన్న విషయముల సమీకరణ సంపుటియే, మా యీ సాహిత్యజగత్తు. 'లోకో భిన్న రుచిః' అనుట ననుసరించి పలువురిచే నిది మన్ననలందునని ఆకాంక్ష.

ఇట్లు

సాహితీసదస్సు కార్యవర్గము

గ్రంథ సమీక్ష

## ధర్మమును, సాహిత్యమును చక్కగా సమన్వయించిన సంకలనము

# "సాహిత్య ప్రబోధము"

ప్రచురణ: సాహితీ సదస్సు, 40–371 విద్యానగరు, కర్నూలు - 1. మూల్యము : పది రూపాయలు.

"మన సంస్కృతాంధ్ర సాహిత్యములు హైందవసంస్కృతి చాలా సన్నిహితముగా ముడివడి యున్నందున సాహిత్యమునకు సంబంధించిన విషయములను చర్చించుటయేగాక హైందవమతమునకు సంబంధించిన ధర్మ ప్రచారముకూడా సదస్సుయొక్క ప్రముఖమైన ఆశయము."

ఇవీ ప్రచురణ కర్తలు తొలిపుటలలో తమ ఆశయము వివరించుచు చెప్పిన మాటలు.

ఆ ఆశయమునకు మూర్తిరూపము "సాహిత్య ప్రబోధము" అను ప్రస్తుత సంకలనము. 12–4–1970 నుండి 20–6–71 వరకు గల మధ్య కాలములో పండితులైన ప్రముఖులు వివిధాంశములపై చేసిన ప్రసంగముల క్రోడీకరణ.

భోజుడు చంపూరామాయణము (శ్రీ బల్లూరు వెంకోబరావు) ఆంధ్ర రామాయణాలు (శ్రీ ఎం. వి. ఎస్. సూర్యనారాయణ) మానవ స్వభావచిత్రణ-మహాభారతము (శ్రీ అప్పజోడు వెంకటసుబ్బయ్య) ఆంధ్ర మహాభాగవతము (శ్రీ దివాకర్ల వెంకటావధాని) విరాట పర్వములో తిక్కనప్రతిభ (శ్రీ పులిపాటి వెంకటసుబ్బయ్య) వినోదావధానము (శ్రీ ముద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రి) పాల్కురికి సోమన రచనలలో వీరశైవమత లక్షణములు (శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి) కాళిదాసు కవితా వైభవము (శ్రీ మంకాల కృష్ణశాస్త్రి, శ్రీ ఎస్. బి కృష్ణమూర్తి) మహాపురాణములో మార్కండేయము (డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం) శ్రీ లలితా సహస్రము (శ్రీ జమ్ములమడక మాధవరామశర్మ) ఉపనిషత్తులు

(డా, బొమ్మకంటి రామలింగ శాస్త్రి) – సంకలనమునందలి విషయ వైవిధ్య మును, ఉపన్యాసకుల స్థాయి ప్రమాణములను వివరించుటకీ పట్టిక చాలును.

కావ్యము రసాత్మకమన్నారు. అసంఖ్యాకములుగా నున్న అట్టి కావ్యము లందలి రసాలంకారాది విషయములందు ప్రశంసనీయమైన విమర్శలు చేసిన పండితులనేకులున్నారు. కాని భారతీయ సంప్రదాయమున విశిష్టమగు కావ్యా త్మను గురించి, అందలి ధర్మ ప్రబోధమును గురించి ముచ్చటించు విమర్శలు తక్కువ. నిజమునకు దానిని ప్రక్కనుంచిన విమర్శ ఒక విమర్శ యగునా అని సందేహించినను తప్పులేదు. కాని నేడు వెలువడు పలు విమర్శలు కావ్యా త్మకు అందలి ధర్మ ప్రబోధమునకు సంబంధించి తప్పుకొని తిరుగుట అరుదు కాదు. ఈ సంకలనము నందలి ప్రత్యేకత అట్టి ధర్మ ప్రబోధమును కూడా వివరించు ప్రయత్నము జరుగుట. కొన్ని ప్రసంగములందు ఈ ప్రయత్నము ఆసాంతమును కాననగును. అట్లని కావ్యములోని ఇతరములగు అందచందము లను ప్రక్కనుంచుట జరగలేదు. ఇదియొక చక్కని మేళవింపు.

ఈ సంకలనమున మరియొక విశేషము: ఒక్కొక్క సందర్భముగా వివిధ కావ్యముల సమన్వయించుచు, పోల్చుచు, పరిశీలించుట. అట్టివానిలో 'ఆంధ్రరామాయణములు' అను ప్రసంగము గమనార్హము.

హిందువులకు సంబంధించి ఆధునికు లొక విమర్శ చేయుదురు. వారు ఆముష్మికమును గురించి చింతింతురే గాని, ఇహమునగల మానవులను గురించి, మానవతా మూల్యములను గురించి, మానవ స్వభావాదులను గురించి ఆలోచించ రని యీ విమర్శ. ఇది ఎంతటి పొరపాటు అభిప్రాయమో మహాభారతము నిరూ పించగలదు. మహాభారతమున మానవ స్వభావచిత్రణకు సంబంధించిన యంశ మును ఈ సదస్సువారు, ప్రసంగించిన పండితులు ఎత్తుకొనుటలోనే వారి భావ నలు ఎంత విస్తృతముగా, ఎంత అధునాతనముగ నడచినవో సూచితమగును. నిజమునకు మానవతను గురించి భారతీయులను మించి మరెవరును విశేషముగా ఆలోచించ లేకపోయిరనుట స్వోత్కర్ష కాదు. పండితు లీవిషయమును ఆధునికు లకు వక్కాణించుట ఒక గొప్ప లోకోపకారము.

ఈ విధముగ పరిశీలించుచు పోయిన ఈ సంకలనమునందలి ప్రతి ప్రసంగము ఒక వెలలేని ముత్య మనవలె.

గ్రామ గ్రామమున నగరనగరమున పండితు లెందరెందరో యున్నారు. సంస్కృతాంధ్రాధ్యాపకులు, ఉపన్యాసకులు ఉన్నారు. ధర్మము, సాహిత్యము లందు అభిమానము గల పురజనులు, ప్రముఖులు ఉంటున్నారు. కాని "సాహితీ సదస్సు" లెన్ని యున్నవనునది ప్రశ్న. అందును ధర్మమును వెలికితెచ్చి చూపు ప్రయత్నము నెందరు చేయుచున్నారనున దింకొక ప్రశ్న. స్థానస్థానమున ఇట్టి సదస్సులు, సంకలనములు సాగినయెడల జాతికి ఎంతో మహోపకారము జరుగును.

ప్రతి చదువరి, ప్రతివిద్యార్థి చదువదగిన దీసంకలనము. ప్రతి గ్రంథాలయమును అలంకంచ దగినదిది. అంతేకాదు - విద్యాశాఖాధికారులు ఇట్టి సంకలనములను పాఠ్య గ్రంథములుగా స్వీకరించుట - విద్యాధ్యయమునకు పుష్టి నొసగుటయేగాక, సదస్సులకును ఎంతో ప్రోత్సాహమీయుట కాగలదు.

ఈ ప్రయత్నమున కార్యశీలులైన శ్రీయుతులు ఎం. డి వెంకట సుబ్బయ్య, ఉప్పలూరు విశ్వేశ్వరయ్య, ఎం. వి. యస్. సత్యనారాయణ. ఎస్. వి. కృష్ణమూర్తిగార్లు అభినందనీయులు. పండితులు, కార్యకర్తలు ఉండి కూడా ఆర్థికపోషణ మంతగా లేని ఈ దేశమున ఈ సంకలనమున దాతగా నిలిచిన శ్రీ జి. పుల్లారెడ్డిగారు మరింత అభినందనీయులగుచున్నారు.

కర్నూలులో జరిగిన ఈ ప్రయత్నం యావదాంధ్రము నందలి ప్రతి ప్రధాన నగరమునకు ఆదర్శప్రాయము. వీరినుండి మరెన్నెన్నో సంకలనముల నాశింతము.

జయ

('జాగృతి' - 27-8-1973 నుండి ఉద్ధృతము)

## విషయసూచిక

# అభిజ్ఞానశాకుంతలము

డా. పుల్లెల శ్రీరామచంద్రుడు

**పరిచయము :**

| | |
|---|---|
| పేరు | : డాక్టరు పుల్లెల శ్రీరామచంద్రుడు |
| జననము | : తూర్పు గోదావరిజిల్లా 23-10-1927. |
| విద్యార్హతలు | : శిరోమణి, విశారద, విద్వాన్, |
| | ఎం. ఏ. (సంస్కృతము) |
| | ఎం. ఏ. (ఆంగ్లము) |
| | ఎం. ఏ. (హిందీ) |
| | పిహెచ్. డి. |
| పదవి | ఉస్మానియా విశ్వవిద్యాలయములో ఇండాలజీ శాఖలో రీడరు. |
| రచనలు | సంస్కృతాంధ్రాంగ్ల హిందీ భాషా సాహిత్యములలో వీరికిగల పాండిత్యము ఈ తులనాత్మక వ్యాసములో అభివ్యంజితమగుచున్నది. —సంపాదకుడు |

కాళిదాస మహాకవి సంస్కృతభాషలో ఋతుసంహారము, కుమారసంభవము, మేఘసందేశము, రఘువంశము అను నాలుగు శ్రవ్యకావ్యములను; మాలవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞానశాకుంతలము అను మూడు దృశ్యకావ్యములను (రూపకములను) రచించెను. అభిజ్ఞానశాకుంతలము దశవిధ రూపకములలో ప్రధానభేదమగు నాటక విభాగమునకు చెందినది. శ్రవ్యకావ్యములలో రఘువంశమును, రూపకములలో ఈ అభిజ్ఞానశాకుంతలమును కాళిదాసు, చక్కని లోకానుభవమును సంపాదించుకొని,

భారతీయ సంస్కృతినంతను బాగుగ ఆకళించుకొని, ప్రశాంత నిరహంకార స్థితి రూపమగు పరిణతావస్థలోనున్న కాలమున రచించి యుండునని అతని కావ్యముల అంతరంగిక పరీక్షచే అభ్యూహ్యమగుచున్నది.

నాయికా నాయకులు ఆయా ఋతువుల నెట్లు సుఖముగ గడుపుదురో వర్ణించు ఋతుసంహార కావ్యము ఈతని నూనూగు మీసాల వయసు నాటి నూతన కావ్యమై యుండును. అందుచేతనే ఇందలి రచనాశిల్పము కొంత వరకు కుంటువడినట్లు కనబడును. ఇది కాళిదాసుని రచనయే కాదని కొందరు విమర్శకు లభిప్రాయపడుట కిదియే కారణము. మాలవికాగ్నిమిత్ర-కుమారసంభవములు తరువాతి రచనలై యుండవలెను. మాలవికాగ్నిమిత్ర ప్రారంభమున కాళిదాసు, భాస సౌమిల్ల కవిమిత్రాది ప్రాచీనకవుల రూపకములుండగా తననాటకములను ఎవరు లెక్కచేయుదురు అని ప్రశ్న వేసికొని, ప్రాచీనమైనంతమాత్రమున అన్నియు ఉత్తమమైనవి కావు, నవీనమైనంత మాత్రమున అధమములు కావు అని కొంచెము అహంకారముతో సమాధానము చెప్పుకొన్నాడు.

పురాణమిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యమ్
సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః. (మా. అగ్నిమిత్రము)

ఇట్టి అహంకారము, మాలవికాగ్నిమిత్రమునందలి శృంగారకథా కల్పనము, కుమారసంభవములో జగత్పితరుల ప్రణయగాథను గూడ వర్ణించుటకు వెనుదీయని శృంగారలోలుపత్వము—వీటిని అన్నిటినిబట్టి పై రెండు కావ్యములును (కుమారసంభవ మాలవికాగ్నిమిత్రములు) అతని యౌవన ప్రథమదశలోని రచనలని ఊహించవచ్చును. విప్రలంభ శృంగారవర్ణన ప్రధానములును, భావుకతా పరిణతములును అగు మేఘసందేశ విక్రమోర్వశీయములు ప్రౌఢయౌవనదశలోని కృతులని ఊహించవచ్చును. ఇంక లోకానుభవమును పూర్తిగ సంపాదించుకొని, ఇతరులలోనున్న గుణగణముల వైశిష్ట్యమును గుర్తించగల్గు శక్తితోపాటు తన శక్తిసామర్థ్యములను గూడ సరిగా అంచనా కట్టుకొనగలిగిన పరిణతవయస్సులో, లోకపు మనుగడ ప్రశాంతముగ సాగి

పోవలెనన్నచో సంఘములో ఎట్టి నీతినియమాదులు ఉండవలెను అను విష యమున స్థిరమగు ఒక నిర్ణయమునకు వచ్చిన అవస్థలో, రచించినవి రఘు వంశాభిజ్ఞానశాకుంతలములు. మాలవికాగ్నిమిత్రమున చూపిన అహంకారము మచ్చునకైనను వీటిలో కానరాదు. దాని స్థానమున అతివినీతభావము పొడుకొన్నది. రఘువంశప్రారంభములో నితడు—

"క్వ సూర్యప్రభవో వంశః క్వచాల్పవిషయా మతిః
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మి సాగరమ్"

(సూర్యవంశ మెక్కడ ! నా అల్పబుద్ధి ఎక్కడ ! నా ప్రయత్నము చిన్న తెప్పతో సముద్రమును దాటుటకై చేయు ప్రయత్నమువలెనున్నది) అనియు,

"మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః."

(కవి యనిపించుకొనవలె ననెడు ఆశగల మందబుద్ధినైన నేను పొడగరి అందు కొనుటకు వీలైన పండుకై అఱ్ఱులు చాచు మరుగుజ్జువలె పరిహాసపాత్ర మగు దును) అనియు—

చెప్పికొనును. అట్లే శాకుంతల ప్రారంభమున—

"ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవదపిశిక్షితానామాత్మన్యప్రత్యయం చేతః"

(పండితులు మెచ్చునంత వరకు నాప్రయోగవిజ్ఞానము ఉత్తమమైనదని భావిం పను. ఎంత బాగుగ చదివికొన్న వారికైనను (పండితులు మెచ్చునిదే) ఆత్మ విశ్వాసము కుదరదు కదా ?)

అని చెప్పును. దీనినిబట్టి ఈ కావ్యములను వ్రాయునాటికి ఈతని బుద్ధి ఎంతటి పరిణతావస్థను చెందినదో ఊహింపవచ్చును. ఈ పరిణతి ఈతని మాన సికస్థితియందేకాదు, ఈతడీ రెండు కావ్యములలో చూపిన కథాసంవిధాన నైపుణియందును, రచనా శిల్పమునందును, కల్పనాచాతుర్యమునందును గూడ స్పష్టముగ గోచరించును.

నాటకమునందు కథావస్తువు రామాయణ మహాభారతాదుల నుండి గృహీతమై, ప్రసిద్ధమై ఉండును. శృంగారము కాని వీరము కాని ప్రధాన రసమై ఉండును. నాయకుడు ధీరోదాత్తుడై ఉండును. ఐదు నుంచి పది వరకు అంకములు ఉండవచ్చును. ఇవి నాటకమునకుగల సాధారణ నియమములు. అభిజ్ఞానశాకుంతలమునందీ నియమములన్నియు పాటింపబడినవి. అందుచే ఇది నాటకము.

కాళిదాసు కథావస్తువును మహాభారతమునందలి శకుంతలోపాఖ్యానము నుండి గ్రహించెను. ఈ శకుంతలోపాఖ్యానము ప్రకారము— దుష్యంతమహారాజు ఒకనాడు వేటకై వెడలి ఒక లేడిని తరుముకొనుచు కొంతదూరముపోయి కణ్వాశ్రమమును చేరెను. కణ్వుడు ఫలమూలాదులకై అడవికి వెళ్ళియుండెను. ఆశ్రమమున కణ్వుని పర్ణశాలయందున్న శకుంతల దుష్యంతునకు అతిథిసత్కారములను చేసెను. శకుంతల సౌందర్యమును చూచి ముగ్ధుడైన దుష్యంతుడు ఆమె కణ్వుడు పెంచిన మేనకాపుత్రియని తెలిసికొని తనను వివాహమాడుమని ఆమెను కోరెను. తనకు పుట్టిన కుమారుని యువరాజుగచేసి ఆతనికి రాజ్యమిచ్చెదనని వాగ్దానము చేసిన పక్షమున వివాహమాడుదునని శకుంతల చెప్పెను. రాజు అందులకంగీకరించి ఆమెను గాంధర్వవిధిచే పరిణయమాడి, నిన్ను రాజధానికి తీసికొనిపోవుటకై అనతికాలమున సైన్యాదిపరివారమును పంపెదనని చెప్పి స్వనగరికి వెళ్ళిపోయెను. కణ్వు డేమిచేయునోయని మనస్సులో మాత్రము భయపడుచునే ఉండెను. మాసములు గడచినను శకుంతలను తీసికొనిపోవుటకు రాజధానినుండి యెవ్వరును రాలేదు. ఇంతలో ఆమె ఒక పుత్రుని కనెను. క్రమముగా ఆత డైదారు సంవత్సరములవాడాయెను. శకుంతలకిష్టము లేకున్నను కణ్వు డామెను దుష్యంతునివద్దకు పంపుటకై నిర్ణయించెను. కొందరు మునులను తోడుగా ఇచ్చి ఆమెను కుమారుడగు సర్వదమనునితో దుష్యంతుని వద్దకు పంపెను. దారిలోని పౌరులు కొందరు తమ వికృతాకారములను చూచి పరిహాసించుటచే విసిగి ఆ మునులు పుత్రసమేతయగు శకుంతలను మార్గమధ్యమునందే విడచి వెనుకకు మరలిపోయిరి. శకుంతల కుమారునితో దుష్యంతుని సభామండపము చేరి తాను ఆతని భార్యయనియు, ఆ పిల్లవాడు ఆతని పుత్రుడనియు, తమ ఇరువురిని స్వీకరింపవలె

ననియు కోరెను. ఆమెను వివాహమాడిన విషయము జ్ఞప్తియందున్నను దుష్యంతుడు పౌరులేమనుకొందురో అను భయముచే పూర్తిగ విస్మరించిన ట్లభినయించుచు ఆమె అసత్యవాదిని అని ఆక్షేపించెను. అందుల కామె మిక్కిలి దుఃఖించుచు పరుషవచనములచే దుష్యంతుని దూషించి తపోవనమునకు మరలి పోవుటకై బయలుదేరుచుండగా శకుంతలా సర్వదమనులు దుష్యంతునిభార్యా పుత్రులని చెప్పుచు ఆకాశవాణి వినవచ్చెను. అపుడు రాజు చాల సంతసించి మంత్రి పురోహితాదుల అనుమతితో వారిరువురిని సాదరముగ స్వీకరించెను. ఇది మహాభారతములోని కథ.

మహాభారతకథ శుష్కముగను రసవిహీనముగను ఉన్నది. శకుంతలలో ఏకోశమునందును మధుర ప్రేమభావమున్నట్లు కనబడదు. దుష్యంతుడు స్వార్థ పరుడును, వంచకుడును అగు ఒక సామాన్యమానవునివలె ప్రవర్తించును. శృంగార రసభరితమైన ఒక నాటకమును వ్రాయవలెనన్నచో ఈ కథ యథాతథముగ నప్పదు. అందుచే కాళిదాసు ఈ కథను రేఖామాత్రముగ గ్రహించి, నాటక మునకు అనుగుణముగా కథలో కొన్ని మార్పులు, కూర్పులుచేసి, పాత్రము లను చక్కగ పోషించుచు సంభాషణౌచిత్యమును పాటించుచు రసవత్తర మగు ఈ నాటకమును రచించెను. కావుననే దశరూపకకారుడు రసమునకు గాని నాయకునికిగాని విరుద్ధమగు అంశమేదైనకథలో ఉన్నచో దానిని విడువ వలెను లేదా దానిని మార్చవలెను అని చెప్పెను :

> "యత్తత్రానుచితం కించిన్నాయకస్య రసస్య వా
> విరుద్ధం తత్పరిత్యాజ్యమన్యథా వా ప్రకల్పయేత్"
>
> ద. రూ. 3-24.

కాళిదాసు కల్పించిన కల్పనలలో అతిప్రధానమైనది దుర్వాసః శాప వృత్తాంతము. ఈ శాపమున కవధి దుష్యంతాంగులీయకదర్శనము. అందుచే ఈ అంగులీయకము ప్రత్యభిజ్ఞానము. దూర్వాసఃశాప వృత్తాంతము లేకున్నచో ఈ నాటకము చతుర్థాంకముతో ముగిసిపోయి ఉండెడిది. దుర్వాసఃశాప మెంత ప్రధానమో దానితో సంబంధించిన అంగుళీయ రూప అభిజ్ఞానముకూడ అంత ప్రధానమైనది. ఇది కాళిదాసు ప్రతిభచే నిర్మితమైన అపూర్వకల్పన. అందుచేతనే అతడీ నాటకమునకు అభిజ్ఞాన శాకుంతలమని

పేరుపెట్టి స్వప్రతిభా కల్పితమైన అభిజ్ఞానమునకు గల ప్రాధాన్యమును సూచించి యున్నాడు.

వాస్తవమున ఈ అభిజ్ఞానమునకు సాధారణముగ మనము అనుకన్న దానికంటె ఎక్కువ ప్రాధాన్యమిచ్చినాడు కాళిదాసు దీని ప్రాధాన్యము చివరిమూడు అంకములకు మాత్రమే సంబంధించినదికాదు; మొత్తము నాటకమున కంతకును సంబంధించినది. ఇది లేనిచో మొదటి నాలుగు అంకముల కథ కూడ ఉండెడిదికాదు ఉన్నను ఆ విధముగ ఉండెడిదికాదు. దుష్యంతుని అంగుళీయకము దుష్యంతుడు శకుంతలను గుర్తించుటకు మాత్రమేకాక శకుంతలానసూయాప్రియంవదలు దుష్యంతుని గుర్తించుటకు కూడ ఉపకరించినది. ప్రథమాంకమునందు మీరెవరని అనసూయ ప్రశ్నింపగా "పౌరవ రాజుచే ధర్మాధికారమునందు నియుక్తుడను" అను ద్వ్యర్థవాక్యముచే కొంత సేపు దుష్యంతుడు తన సత్యస్వరూపమును కప్పుకోకలిగెను. కాని కొంత సంభాషణము సాగిన పిదప శకుంతలను వృక్షసేచన- ఋణవిముక్తనుగ చేయుటకై తన అంగుళీయకము నీయబోయినపుడు దానిపైనున్న నామాక్షరములను చదివికొని అనసూయాదులు అతడు రాజపురుషమాత్రుడు కాడనియు, దుష్యంతమహారాజనియు తెలిసికొనిరి. దానితో వారికి అతనిపైగల గౌరవభావము ఇనుమడించినది. శకుంతల హృదయమునందు అంకురితమైన ప్రేమ పల్లవితము కాజొచ్చినది. అతడు మహారాజని తెలిసికొనుటచేతనే మరల తమ ఆశ్రమమునకు రావలసినదిగా "ఆర్య! అసంభావితాతిథి సత్కారా భూయోఽపి ప్రేక్షణనిమిత్తం లజ్జామహే ఆర్యం విజ్ఞాపయితుమ్" అని వారు సవినయముగా ప్రార్థించిరి. ఈ రాకపోకలతో పరిచయము ఘనిష్ఠమగుటకు వీలు చిక్కినది. చివరకు శకుంతలమనస్సు నాకర్షించినవాడు రాజర్షి కావున తాము తప్పక ఆమె కోర్కెను అభినందించవచ్చునని నిశ్చయించుకొని ("యస్మిన్ బద్ధభావైషా స లలామభూతః పౌరవాణామ్") అనసూయా ప్రియంవదలు శకుంతలా దుష్యంతుల గాంధర్వ వివాహమునను ఏర్పాట్లు చేసిరి. ఈ విధముగ అభిజ్ఞాన ప్రభావము నాటకమునందంతటను వ్యాపించి యున్నది.

ఈ నాటకమునందు ప్రధానరసము శృంగారము. సంభోగ శృంగారము, విప్రలంభ శృంగారము అని శృంగారము రెండు విధములు. విప్ర

లంభాను ప్రవేశము లేనిదే సంభోగము హృదయంగమము కాదట. 'న వినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే,' అని అభిజ్ఞనిర్ణయము. కాళిదాసు ప్రవేశపెట్టిన ఈ శాపవృత్తాంతము విప్రలంభమునకు అవకాశము కల్పించి ద్వివిధశృంగారపుష్టికి తోడ్పడినది. ఇది ఆలంకారికుల ఆలోచనాపద్ధతి.

రవీంద్రనాథటాగూరు మొదలైన సహృదయులు దీనికి ప్రయోజనాంతరమును కల్పించినారు. శకుంతలా దుష్యంతులకు ప్రథమ దర్శనము నందే కలిగిన ప్రేమ కేవలము శారీరకవాంఛా (కామ) దూషితమైనది. కాళిదాసు తన నాటకమునందు ప్రతిపాదింపదలచిన ప్రేమ దివ్యప్రేమ. దివ్య ప్రేమలో శారీరక సౌఖ్యచింతగాని, స్వార్థదృష్టిగాని ఉండుటకు అవకాశము లేదు ప్రేమలోఉన్న ఈ రెండు దోషములును కరగిపోవలెనన్నచో నాయికా నాయకులిరువురును విరహతాపముచే పూర్తిగ తప్తులగుట తక్క వేరొక మార్గములేదు. ఈ విరహతాపములో భౌతిక కామవాంఛాది దోషము లన్నియు బుగ్గియైపోవును. విశుద్ధప్రేమ మిగులును శకుంతలా దుష్యంతుల నడుమనున్న అట్టి విశుద్ధ దివ్యప్రేమను ప్రధానవిషయముగా ప్రతిపాదింప దలచి కాళిదాసు ఈ శాపవృత్తాంతమును సృష్టించెనని వీరి యభిప్రాయము. ఏది ఏమైనను ఈ శాపవృత్తాంతముచే ఈ నాటకమునందలి కథకు పరిపూర్ణత్వము సిద్ధించెనని చెప్పుటలో సందేహములేదు. మూలభారత కథలో లేని అందమీ కథకు లభించినది. అందుచేతనే ఈ కథను కొద్ది మార్పులతో ఎవ్వరో పద్మ పురాణాదులలోకూడ నిరికించిరి.

కావ్య ప్రకాశకారుడగు మమ్మటభట్టు కావ్యరచన పఠనాదులకు కీర్తి, ధనము, లోకవ్యవహారజ్ఞానము, అమంగళనివారణము మొదలగు ప్రయోజనములను చెప్పియున్నాడు.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసంమితతయోపదేశయుజే".

ఈ ప్రయోజనములలో కాంతాసంమితముగుచు ఉపదేశమును చేయుట అనునది చివరిది (ఆరవది). సద్యః పరనిర్వృతి అనగా పఠనదర్శనాది సమనంతరమే లోకోత్తరానందానుభూతి కలుగుట అనునది ఐదవది. మొదటి నాలుగు

ప్రయోజనముల విషయము మాట ఎట్లున్నను చివరి రెండు ప్రయోజనముల విషయమున విమర్శకులలో విప్రతిపత్తి కలదు. వాఙ్మయములో అనేకప్రక్రియలు ఉండవచ్చును. కాని అన్ని ప్రక్రియలకును సత్పథప్రదర్శనముద్వారా మానవుని ఉన్నతస్థితికి చేర్చుటయే పరమప్రయోజనము. ఈప్రయోజనమును సాధించుపద్ధతిలో భేదములుండవచ్చును. ఉదాహరణకు వేదములు ప్రభువువలె 'నీవట్లుచేయవలెను, అట్లుచేయకున్నచో దండార్హుడవగుదువు' అని శాసించునుకావున అవి ప్రభుసంమితములు. పురాణాదులు మిత్రులవలె "నీవీమార్గము ననుసరించుట మంచిది. అట్లు చేయుటవలన హానికలుగవచ్చును" అని బోధించును. కావున ఇవి మిత్రసంమితములు. ఇక కావ్యనాటకాదులు బోధించుచున్నట్లు తెలియకుండగనే సన్మార్గమును బోధించును. అనగా వాటిని చదువుచున్నంత కాలము లోకోత్తరానందానుభూతి కలుగును. పిమ్మట తీరికగా కూర్చుండి మననము చేయగా వాటిలోకూడ కొన్ని ఉత్తమోపదేశము లిమిడియున్నట్లు తెలియును. కావుననే వాటికి కాంతాసంమితములని పేరు. కాంతలు తమ ప్రియుల కానందముకలుగు విధమున ప్రవర్తించుచు వారియభివృద్ధిని కోరువారగుటచే వారుసన్మార్గమున ప్రవర్తించునట్లుచేయుచుందురు. కాని అందులకు వారు ప్రత్యక్షముగ ఆజ్ఞాపించునట్లుకాక "మీరు ఈవిధముగ ప్రవర్తించినచో మాకు ఆనందము కల్గును" అన్నట్లు సూచించు చుందురు. కాంతల యానందమే తమ యానందమని భావించు ప్రియులుగూడ తదనుగుణముగనే ప్రవర్తింతురు. కాంతా సంమితత్వమనగా ఇదియే. ఈవిధముగ కావ్యములకుగూడ వేదపురాణాదులకువలె. ఉపదేశము ప్రధానప్రయోజనమని అనేకుల అభిప్రాయము.

కాని ఇతర కావ్యములమాట ఎట్లున్నను దృశ్యకావ్యములకు మాత్రము ఆనంద సంధానమే పరమప్రయోజనమనియు, వాటినుండిగూడ ఉపదేశము నపేక్షించుట ఉపహాసాస్పదమనియు దశరూపకకారుని అభిప్రాయము.

> "ఆనందనిష్యందిషు రూపకేషు
> వ్యుత్పత్తిమాత్రం ఫలమత్ర లిప్సుః
> యోఽపీతిహాసాదివదాహసాధుః
> తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ." (దశరూపకము)

(ఆనంద నిష్యందులగు రూపకములనుండికూడ కేవలము వ్యుత్పత్తినే సంపాదింపదలచెడు, మధురవస్తు పరాఙ్ముఖున కిదే ఒక నమస్కారము !)

పైశ్లోకములో 'వ్యుత్పత్తిమాత్రం'అని 'మాత్ర'పదమును ప్రయోగించు రూపకములకు వ్యుత్పత్తి ఒకటియే ప్రయోజనమని చెప్పుట అయుక్తము కాని ఆనందముతోపాటు వ్యుత్పత్తి (ఉపదేశము) కూడ ఒక ప్రయోజనమని చెప్పుట ధనంజయునికికూడ అంగీకార్యమే అని సూచితమగుచున్నది. ఈ విధముగ చూచిన దృశ్యశ్రవ్యోభయవిధకావ్యములకు ఆనందదాయకత్వోపదేశకత్వములు రెండును ప్రధాన ప్రయోజనములే యని అత్యధికుల అభిప్రాయమని తోచు చున్నది. కావుననే నాటినుండి నేటివరకు కావ్యరచన చేయు కవులందరును, తాము ఉత్తమము లనుకొనిన ఆదర్శములను తమ కావ్యములద్వారా బోధించుటకై ప్రయత్నించుచుండుట గోచరించుచున్నది. ఈ పద్ధతి అన్ని మతములకు అన్ని రాజకీయసిద్ధాంతములకు, సాంఘిక సిద్ధాంతములకు సంబంధించిన కావ్యములలో కనబడుచున్నది.

కావ్యప్రయోజనముల విషయమున పాశ్చాత్య విద్వాంసులలో కూడ అభిప్రాయభేదమున్నను ఆనందోపదేశ జనకత్వములను రెండింటిని కావ్యప్రయోజనముగ అత్యధికు లంగీకరించియున్నారు.

"ఆనందమే- కేవలము ఆనందమే కావ్యప్రయోజనము"

—కేస్టెల్ వెట్రో.

"ఆనందము కావ్యము నెప్పుడును వెన్నంటియే యుండును"—షెల్లీ

"ఆనందకరమైన బోధయే కావ్యప్రయోజనము" —స్కాలిజరు.

"ఉపదేంచుట ఆనందపరచుట కావ్యప్రయోజనము"

—సర్ ఫిలిప్ సిడ్నీ.

"ఆనందము ఏకైక ప్రయోజనము కాకున్నను కావ్యమునకు ముఖ్య ప్రయోజనము. ఉపదేశమును అనుషంగికముగా మాత్రమే అంగీకరింప వచ్చును." —జాన్ డ్రైడన్.

"అహ్లాదకరముగా ఉపదేశించుటయే కావ్యప్రయోజనము"

—డాక్టరు జాన్సన్.

"విజ్ఞాన వినోదముల సమ్మేళనము కావ్యప్రయోజనము"—హోరేస్.

కాళిదాసుకూడ అభిజ్ఞాన శాకుంతలమునందు సనాతన భారతీయ సంస్కృతికి చెందిన అత్యుత్తమాంశములను బోధించుటకు ప్రయత్నించెను. వైదికవాఙ్మయమునందును, వైదిక సంస్కృతియందును ఆతనికిగల ఆదరము అనన్యాదృశము. ఈ విషయము ఈ నాటకమునందు అడుగడుగునను సూచితమై, "సరస్వతీ శ్రుతిమహతీ మహీయతామ్" అను భరత వాక్యమున స్పష్టీకృతమైనది.

రోమన్ నాగరికత మొదలగు పాశ్చాత్య నాగరికతలు ప్రధానముగ నగరములకు సంబంధించినవని చెప్పుదురు. కాని ప్రాచీన భారతీయ నాగరికతకు గ్రామములును, ఋష్యాశ్రమములును ఆటపట్టు. కావుననే తపోవనములన్నను తపోధనులన్నను కాళిదాసున కంత అభిమానము. ఆతని దృష్టిలో స్వర్గలోకముకంటె ఆ ప్రాంతమునకు చెందిన తపోవనమే ఆదరాస్పదము. అభిజ్ఞానశాకుంతల కథ అతి మనోహరము, ప్రశాంతము, పరమపావనము అగు భూలోక తపోవన ప్రాంగణమున ప్రారంభమైనది. ఆశ్రమము లోని తరులతాదులు గూడ 'కో' యన పిలచిన 'ఓ' యని పలుకును. కాళిదాసు శాకుంతలమునందు మానవులకు ప్రకృతితోగల సంబంధము అంత ఘనిష్ఠము. నాలుగంకముల కథ ప్రకృతి సౌందర్య నిలయమగు ఆశ్రమమునందే నడచినది. చివరకు సప్తమాంకమున దివ్యతపోవనమైన మారీచాశ్రమమునందు ముగిసినది. ఈ విధముగ కాళిదాసు ఏడంకములలో ఐదంకముల కథను తపోవనమునందు నడిపి తపోవనసంబద్ధమగు భారతీయ సంస్కృతిపై తనకుగల శ్రద్ధను స్పష్టీకరించినాడు.

ప్రాచీన భారతీయ సంస్కృతిలో అతి ప్రధానముగ పరిగణింపబడెడు విషయములు నాలుగు—సత్యము, యజ్ఞము, త్యాగము, తపస్సు. ఈ నాలుగు ధర్మములను కాళిదాసు ఈ నాటకమున చక్కగ బోధించెను. సత్యస్వరూపమును నిర్ణయించుట కష్టమనియు, ఎట్టి అసత్యము పాపావహమో ఎట్టిది కాదో అనునది నిర్ణయించుట ఇంకను కష్టమనియు పెద్దల అభిప్రాయము. అంగుళీయక దర్శనము మొదలు రాజుపడిన బాధఅంతయు తాను ఆనాడు గాంధర్వవిధిచే పరిణయమాడిననాడు, శకుంతల కిచ్చిన మాటను నిలుపుకొనజాలకపోతినే అని మాత్రమే. దైవసాక్షికముగ పరిణయ

మాడిన భార్యను విడచివేయుట అనగా సత్యవ్రతమును ధిక్కరించుట యనియే కదా యర్థము. ఇట్టి సత్యవ్రత పరాయణుడగుటచేతనే దుష్యంతుడు (ప్రథమాంకములో) అనసూయ మీరెవరని అడిగినపుడు తన వాస్తవ స్వరూపమును తెలుపుటకు ఇష్టములేక అసత్యమాడజాలక ఏదో శ్లిష్టార్థ వాక్యముతో "పౌరవునిచే ధర్మాధికారమునందు నియుక్తుడను" అని ప్రత్యుత్తరమిచ్చినాడు. ఎవ్వరికిని అపకారము జరగని పక్షమున చిన్న అసత్యమాడినను అది పాపహేతువుకాదు. కావుననే దుష్యంతుడు (ద్వితీయాంకమునందు) తన శకుంతలా ప్రణయవృత్తాంతమును విదూషకుడెక్కడ అంతఃపురములో చెప్పునోయని భయపడి

"క్వ వయం క్వ పరోక్ష మన్మథో
మృగశాబైః సమమేధితో జనః
పరిహాసవిజల్పితం సఖే
పరమార్థేన న గృహ్యతాం వచః"

అని పలుకుచూ తాను చెప్పిన శకుంతలా వృత్తాంతములో నేమాత్రము సత్యములేదని ఒక అసత్యమాడినాడు. ఇది ఎవ్వరికి అపకారకారి కాని అసత్యము. కనుక క్షంతవ్యమే. వాస్తవమున ఈ అసత్య వాక్యముచే ఎవరికైన అపకారము జరిగినదా అన్నచో దుష్యంతునకే జరిగినది. ఏల అనగా ఈ మాటలే నిజమనుకొని విదూషకుడు మరల ఒక్కమారైనను దుష్యంతునెదుట శకుంతల మాట ఎత్తలేదు.

దాదాపు మొదటినుండి చివరిదాక ఈ నాటక కథ యంతయు యజ్ఞ తపస్సుల వాతావరణములోనే నడచినది.

"దేవాన్భావయతానేన తే దేవా భావయంతు వః
పరస్పరం భావయన్తః శ్రియః పరమవాప్స్యథ"

అని భగవద్గీతలో చెప్పినట్లు యజ్ఞమునునది దేవతలకును మానవులకును మధ్య నేర్పరుపబడిన పరస్పర సహకారము. ఇందుచేతనే ఎన్ని అంతరాయములు వచ్చినను ప్రాచీన భారతీయులు యజ్ఞయాగాదులకంత ప్రాధాన్య మిచ్చుట జరిగినది.

ఇంక తపస్సు. తపస్సుకు ఒక నిర్ణీతరూపములేదు. ఎక్కడనో అడవులలో ముక్కుమూసికొని కూర్చుండుట తపస్సుకాదు. అది ఒక విధమైన తపస్సు కావచ్చును. అదియే తపస్సుకాదు. ఈ విషయమును కాళిదాసు చక్కగ సూచించియున్నాడు. కణ్వాశ్రమమునందలి మునులు యజనయాజనాధ్యయనాధ్యాపనాది రూపమగు తపస్సుచేయగా, మారీచాశ్రమమునందలి తపోధనులు ఒడలినిండ పుట్టలుపోయ పంచాగ్నిమధ్య తపస్సు వంటి ఘోరతపస్సు చేయగా, దుష్యంతుడు రాజ్యపరిపాలనమనెడు తపస్సు చేయుచున్నాడు. ఇవి అన్నియు తపస్సులే. ఈ విషయమును మునికుమారుని ఈ క్రింది వాక్యములు స్పష్టీకరించుచున్నవి.

> "అధ్యాక్రాంతా వసతిరమునాప్యాశ్రమే సర్వభోగ్యే
> రక్షాయోగాదయమపి తపః ప్రత్యహం సంచినోతి
> అస్యాపిద్యాం విశతి వశినశ్చారణ ద్వంద్వగీతః
> పుణ్యః శబ్దో మునిరితి ముహుః కేవలం రాజపూర్వః"

ఇతరమునులందరు ఆశ్రమములలో నివసింతురు. ఇతడు సర్వభోగ్యమైన ఆశ్రమములో (గృహస్థాశ్రమములో) నున్నాడు. వారు కృచ్ఛ్రచాంద్రాయణాదులచే తపోవృద్ధి చేసికొనగా ఇతడు ప్రజాపాలనముచే చేసికొనుచున్నాడు. వారు మునులు. ఇతడు రాజముని లేదా ('రాజ శబ్దముకంటె పూర్వమునందున్న' అని అర్థము చెప్పినచో) ముని రాజు. కాళిదాసు ఇంతటితో ఆగలేదు. ధీవరుని మాటలలో—పైకి నింద్యముగ కనబడినను సహజమగు కర్మ త్యాజ్యము కాదనియు, అది ఉత్తమకర్మయే అనియు నిర్ణయించినాడు.

> "సహజం కిల యద్వినిందితం న ఖలు తత్కర్మ వివర్జనీయమ్
> పశుమారణ కర్మదారుణః అనుకంపామృదురేవ శ్రోత్రియః"
>
> (శాకుంతలము)

మానవుని మానసశాంతికి అత్యుత్తమ సాధనము త్యాగము. తనంత తానుగా భోగభాగ్యాదులను విడచివేయుట త్యాగము. ఆధ్యాత్మికదృష్టి ప్రధానులగు భారతీయులు ఈ త్యాగమున కిచ్చిన ఉత్తమ స్థానమును మరి

దేనికిని ఈయలేనని చెప్పిన అతిశయోక్తి కాదు. కాళిదాసు ఇట్టి త్యాగమును ఎంత చక్కగ బోధించినాడో ఈ క్రింది ఘట్టము నొక్కదానిని చూచిన స్పష్టమగును.

శకుంతల భర్తయింటికి పయనమై వెళ్ళుచున్నది తనకు చిరపరిచితములైన ఆశ్రమ పరిసరములను సఖి పిత్రాదులను విడువలేక విడువలేక విడచి వెళ్ళుచున్నది. ఆ సమయమునందామె తండ్రియగు కణ్వునితో—మరల నేనాశ్రమమునకు తిరిగి వచ్చునది ఎప్పుడు అని ప్రశ్నించును అప్పుడాయన ఇచ్చిన ప్రత్యుత్తరము కేవలము భారతీయుడగు ఋషి మాత్రమే ఈయతగినది. ఆ పండుగలకు ఈ పబ్బములకూ వచ్చుచూ పోవుచూ ఉండవచ్చును అని అనలేదాయన. మరి ఏమనినాడు ?

భూత్వాచిరాయ చతురంత మహీసపత్నీ
దౌష్యన్తిమప్రతిరథిం తనయం ప్రసూయ
భర్త్రా తదర్పితకుటుంబభరేణసార్థం
శాన్తే కరిష్యసి పదం పునరాశ్రమేఽస్మిన్.

"చాలకాలము రాజ్య సుఖము లనుభవించి రాజ్యభారమునంతను కుమారున కిచ్చివేసి నీవు భర్తతోకూడ మరల ఈ ఆశ్రమములోనికి రావచ్చును" అని ప్రత్యుత్తరమిచ్చినాడు. 'శాన్తే' అనునది కేవలము ఆశ్రమే అనుదానికి విశేషణమే కాదు, 'శాంతే' అనుదానిని శకుంతలకు అట్టి పరిస్థితులలో కలుగనున్న మానసిక శాంతిని సూచించెడు సంబోధనకూడ. ఇది భారతీయుల పరమలక్ష్యమైన త్యాగము. ఈ విధముగ శాకుంతలము భారతీయ సంస్కృతికి ఉత్తమభాష్యమని చెప్పవచ్చును.

భారతీయ సంస్కృతి అతిప్రాచీనమైనది. ఎందరో మహాపురుషులు తమ అనుభవముల సహాయముచేతను దివ్యదృష్టిచేతను ఎన్నియో అపూర్వ విషయములను కనిపెట్టి విశ్వశ్రేయోభిలాషచే వాటిని మనకందించియున్నారు. శకునజ్ఞానము జ్యోతిఃశాస్త్ర సహాయముచే రాబోవు శుభాశుభములను తెలిసికొనుట, దక్షిణాక్షి స్పందనాది నిమిత్తములు, మొదలగు విషయములు ఈ కోవకు చెందినవి. వీటి సహాయముచే రాబోవు శుభాశుభములను తెలిసికొని

మానవుడు తదనుగుణముగ ప్రవర్తించును. ఇట్టి విషయములనుకూడ కాళి దాసు నాటకమునందు నాటకశోభ ఇనుమడించు విధమున ఉపయోగించు కొనెను. దుష్యంతుడు తపోవనములో ప్రవేశించుటకు కొంచెము సేపటికి పూర్వమే కణ్వుడు శకుంతలకు ప్రతికూలముగానున్న దైవమును కొంత వరకు అనుకూలము చేయుటకై సోమతీర్థమునకు వెళ్ళినాడు.-

"ఇదానీమేవ దుహితరం శకుంతలా మతిథి సత్కారాయ నియుజ్య దైవమస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః".

గ్రహచారము ప్రతికూలముగ నున్నచో తపోహోమ జపాదులచే దాని ప్రాతికూల్యమును తగ్గింప చేసికొనవచ్చుననియు, ఇదియే జోతిశ్శాస్త్ర నిమిత్త శాస్త్రాదులకుగల ప్రధాన ప్రయోజనమనియు భారతీయులకు గల దృఢవిశ్వాసమునకిది ఎంతయు అనుకూలముగానుండి రాబోవు శకుంతలా శాపము, తత్పరిహారము, పునః దుష్యంతాదిసమాగమము మొదలగు నాటక వస్తువును సూచించుచున్నది. కావుననే ఈ భాగమును శాకుంతల నాటకమున 'బీజము' అని రూపకశాస్త్రజ్ఞులు చెప్పుదురు. దుష్యంతుడు ఆశ్రమ ద్వారము నందు అడుగిడగనే కుడిచేయి అదురును. (ఏడవ అంకమునందు) అతడు మారీచాశ్రమమున ప్రవేశించినపుడు కూడ ఈ నిమిత్తము కనబడును. శకుం తల ప్రయాణమై వెళ్లునపుడు కాళ్లు తొట్రుపడుట, దుష్యంతుని ఎదుట నిలచి ఉన్నపుడు ఎడమకన్ను అదరుట మొదలగు నిమిత్తములు కనబడును. ఇట్టి నిమిత్తముల కాయాఫలితము లున్నవనియు ప్రయత్నముచే వాటిని మాన వుడు తన కనుకూలముగ చేసికొన వచ్చుననియు మన ఋషిపుంగవుల విశ్వా సము. మాకు విశ్వాసము లేదను వారిని ఎవ్వరును ఏమియు చేయునదిలేదు. కాళిదాసు మాత్రము వాటి ప్రాధాన్యమును మనకు సూచించియున్నాడు.

ఒక నాటకము ఉత్తమనాటకమని చెప్పుట కథా నిర్వహణము, పాత్ర పోషణము, పాత్రోచితసంభాషణ వీటిపై ఆధారపడియుండును. కాళిదాసు పైన చూపిన విధముగ కథా సంవిధానమునందు ఎంతటి కౌశలమును కన బరచినాడో ఇతర విషయములందుకూడ అంతటి నేర్పును చూపినాడు. ప్రధానపాత్రలగు శంకుతలా దుష్యంతులనేకాదు, ఇతర సామాన్య పాత్రలను కూడ చక్కగ తీర్చిదిద్దినాడు.

పంచమాంకాంతము వరకును అతిసుకుమారస్వభావయగు సుందర మూర్తిగ మన మనోనేత్రముల ఎదుట నిలిచిన శకుంతల సప్తమాంకమున భర్తృహితైక పరాయణయగు ఉత్తమగృహిణిగ మనకు సాక్షాత్కరించును. దుష్యంతుడు తనను ఆ విధముగ అవమానించినందులకుగాని అన్ని కష్టముల పాలు చేసినందులకుగాని ఆమెకు విచారములేదు. ఆ విధముగ చేసినందుల కాతడు అపకీర్తి పాలుపడెనే అని మాత్రమే ఆమె మానసికా వేదన. దుష్యంతు డావిధముగ ప్రవర్తించుటకు కారణము దుర్వాసఃశాపమని మారీచమహర్షి చెప్పగానే ఆమె నోటినుండి అప్రయత్నముగ వెడలిన–"దిష్ట్యా అకారణ ప్రత్యాదేశీ నార్యపుత్రః" (అమ్మయ్య! ఆర్యపుత్రుడు నన్ను అకారణముగ నిరాకరింపలేదు) అనుమాటలచే ఈ విషయము స్పష్టమగుచున్నది. దుష్యంతుడు మొదటినుండి చివరివరకు ధర్మరక్షణైకపరాయణుడగు ఉత్తమపాలకుడుగ మనకు గోచరించును.

సాధారణ పాత్రలగు అనసూయా ప్రియంవదలు, శార్ఙ్గరవ శారద్వతులు, గౌతమి మొదలగు వారినికూడ చాల స్వాభావికముగ కాళిదాసు చిత్రించెను. అనసూయా ప్రియంవద లిద్దరును శకుంతలకు ప్రియసఖులే, మృదుస్వభావవతులే కాని అనసూయ గంభీర స్వభావముకలది. ప్రియంవద పరిహాసశీల; చిలిపిచేష్టలు చేయు స్వభావముకలది. అట్లే శారద్వతుడు గంభీర స్వభావుడు, తొణకక బెణకక తన కర్తవ్యమును చేసికొనవలెననెడి స్వభావము కలవాడు; ఎంతటి చిన్న తప్పిదమైనను ఎదుటివాడు ఎంతటివాడైనను సహించలేని ముక్కోపి శార్ఙ్గరవుడు. గౌతమివంటి వృద్ధవనితలను నేటికి కూడ భారతీయగృహములలో చూడవచ్చుననిపించును.

నాటకకర్త లందరికిని తమ నాటకములలో అభిమానపాత్రమగు పాత్ర ఒక్కడుండునని విమర్శకుల అభిప్రాయము. ఉదాహరణకు–షేక్స్పియర్‌కు టెంపెస్టు నాటకములోని ప్రోస్పెరో అభిమానపాత్రమనియు, అతని ద్వారా షేక్స్పియర్ మాటలాడుచున్నాడనియు కొందరి విమర్శకుల అభిప్రాయము. ఆ దృష్టితో పరిశీలించినచో శాకుంతలములోని కణ్వుడు కాళిదాసునకు అభిమానపాత్ర మనియు, కాళిదాసే కణ్వుడనియు చెప్పవచ్చును. ప్రేక్షకులకు కణ్వుడు ఒక్క అంకములో మాత్రమే కనబడును.

ఐనను నాటకము మొదటి నుండి చివరివరకును అతని ప్రభావము గోచరించు చునే ఉన్నది. కాళిదాసు ఈ కణ్వుని ద్వారా భారతీయుల ఉత్తమోత్త మాదర్శములను మనకు బోధించినాడు. "యాస్యత్యద్య శకుంతలేతి" మొదలైన శ్లోకములలో అంతటి విషాదమును ప్రకటించిన ఆకణ్వుడే చివరకు—

"అ హి కన్యా పరకీయ ఏవ
తామద్య సంప్రేష్య పరిగ్రహీతుః
జాతో మమాయం విశదః ప్రకామం
న్యాస ఇవాన్తరాత్మా"

(కన్య ఎన్నటికైనను ఇతరుల ధనమే. ఆమె నిపుడు భర్తవద్దకు పంపివేసిన పిమ్మట, దాచనిచ్చిన సొమ్మును ఆ సొత్తు కలవానికిచ్చిన పిమ్మటవలె, నా యంతరాత్మ శాంతిని పొందినది) అని పల్కును. ఈ హృదయ గాంభీర్య మును చూచి పాఠకుల గుండెలు కంపించును. ఇది కణ్వుని హృదయ గాంభీ ర్యము కాదు, కాళిదాసుని హృదయ గాంభీర్యము కాదు, కాదు. ఇది భారతీయ సంస్కృతికిగల హృదయగాంభీర్యము !

పాత్రోచిత సంభాషణ నిర్వహణములో కాళిదాసుకు ఆతడే పాటి. కణ్వుడు సోమతీర్థమునుండి తిరిగివచ్చి కామవశంవదయై శకుంతల దుష్యం తుని వివాహమాడెనని ఆకాశవాణి ద్వారా తెలుసుకొనెను. అపుడాయన ఆమెతో—"ధూమాకులితదృష్టేరపి యజమానస్యాహుతిః దిష్ట్యా అగ్నావేవ పతితా. వత్సే సుశిష్యదత్తేవ విద్యా నానుశోచనీయాసి సంవృత్తా" (యజ మానుని కండ్లకు పొగకమ్మినను అతడు విడచిన హోమద్రవ్యము అదృష్ట వశముచే అగ్నియందే పడినది, (బూడిదలో పడలేదు). అమ్మా మంచి శిష్యునకిచ్చిన విద్యనుగూర్చివలె నిన్నుగూర్చి కూడ నాకింక ఏ విచారమును లేదు) అని యనును. కులపతియై ఎందరో శిష్యులకు అధ్యాపనముచేయుచు నిత్యము యజ్ఞయాగాదులతో మసలెడు మహాముని నోట నీమాటలెంత యుచితములో చెప్పబనిలేదు.

ఎంతో భావమును చిన్న మాటలలో సూచించుట కాళిదాసునకు గల విశిష్టశక్తి, ప్రథమాంకమున మొక్కలకు నీళ్ళు పోయుచున్న ముగ్గురిలో నొకతె శకుంతలయని తెలియగానే దుష్యంతుని నోటినుండి అప్రయత్నముగ- 'కథం, ఇయం సా కణ్వదుహితా శకుంతలా' (ఏమీ! ఈమెయా కణ్వదుహిత యైన శకుంతల!) అనువాక్యము మాటలలో చెప్పుటకు వీలుకాని ఎంతో భావమును సూచించుచున్నది దుష్యంతుడు ఆశ్రమద్వారమువద్ద కణ్వుని కుమార్తె యగు శకుంతల ఆశ్రమమునందున్నదని వైఖానసునిద్వారా వినెను. ఆమె విషయమున అతనికి గౌరవభావ ముండవచ్చును. కాని అమె ఒక తపస్వికన్య యగుటచే ఈ విధముగ నుండునని ఏదిమో ఆటవిక కన్యకాకృతి అతని మనః ఫలకమునందు చిత్రితమై యుండవలెను, కాని తానిపుడు చూచుచున్న వ్యక్తికిని తానూహించిన వ్యక్తికిని ఏమియు సంబంధము లేదు, అట్టి సమయమున అతనికెంత ఆశ్చర్యము కలగవలెను? కాని ఆశ్చర్యమునంతను మాటలలో చెప్పుట ఎట్లు? వ్యంజనా సిద్ధహస్తుడగు కాళిదాసు ఈ ఒక్క మాటలో అంత భావమును ఇమిడ్చివేసినాడు.

మన స్తత్వ నిరూపణమునందుగూడ కాళిదాసుది అందెవేసిన చెయ్యి. చిన్నతనమునుండియు వివిక్తమగు అరణ్య ప్రదేశమునందు ప్రశాంతమగు జీవితమునకు అలవడిన మునిశిష్యులు జనాకీర్ణమైన నగరమును ప్రవేశింపగనే వారి మానసిక పరిస్థితి యెటుల నుండెనో ఈ క్రింది శ్లోకములు చక్కగ చూపుచున్నవి.

> "మహాభాగః కామం నరపతి రభిన్నస్థితిరసౌ
> న కశ్చిద్వర్ణానామపథమపకృష్టోఽపి భజతే,
> తథాపీదం శశ్వత్పరిచితవివిక్తేన మనసా
> జనాకీర్ణం మన్యే హుతవహపరీతం గృహమివ."

("ఈ మహారాజు చాల ఉత్తముడు. లౌకిక మర్యాదలను చాల చక్కగ పాలించుచున్నాడు. ఈతని రాజ్యములో ఎవ్వడును చెడుదారి తొక్కుటలేదు. ఐనను జనసమూహముతో నిండిన ఈ రాజగృహము సర్వదా

వివిక్త ప్రాంతములలో నుండుటకు అలవడిన నా మనస్సుకు నాల్గు మూల లందును నిప్పు అంటుకొనిన ఇల్లువలె కనబడుచున్నది")

అని ఒక శిష్యుఁడనగా మరియొక శిష్యుఁడు—

"అభ్యక్తమివ స్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధ ఇవ సుప్తమ్
బద్ధమివ స్వైరగతిః జనమిహ సుఖసంగినమవైమి."

(ఇక్కడ భోగలంపటులైన ఈ జనులందరును నాకు, స్నానము చేసిన వానికి తైలము పూసికొనిన వాఁడువలెను, పవిత్రునకు అపవిత్రుడు వలెను, మేల్కొన్నవానికి నిద్రపోవుచున్న వాడువలెను. స్వేచ్ఛగా తిరుగువానికి బద్ధుడైన వాడువలెను కనబడుచున్నారు)

అని యనును, పుట్టినది మొదలు పల్లెలోనుండి హఠాత్తుగ ఒక మహా నగరమునకు వెళ్ళినవాని మనస్తత్వమిట్లేకదా ఉండును?

ఒక ప్రక్క చంద్రుడు అస్తమించుట మరియొక ప్రక్క సూర్యుడుద యించుట ఎందరో చూచుచుండవచ్చును. వారి మనస్సులలో వేరువేరు భావ ములు కలఁగుచుండవచ్చును అట్టి దృశ్యమును చూచునపుడు నివృత్తిమార్గ ముననున్న తాపసాదుల కెట్టి అభిప్రాయము కలుగునో కాళిదాసు మనోహర ముగ వర్ణించినాడు. అరుణోదయ సమయమున ఇట్టి దృశ్యమును చూచిన కణ్వశిష్యుడు ఈ విధముగ వర్ణించుచున్నాడు:—

"యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽరుణపురఃసర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు."

("ఒకవంక చంద్రుడు అస్తమించుచున్నాడు; మరియొకవంక సూర్యు డుదయించుచున్నాడు. ఒకే సమయమున రెండు తేజస్సులలో ఒకటి వ్యస నాభిముఖ మగుటను రెండవది ఉదయాభిముఖమగుటను చూడగా ప్రతి యొక్కరును తమతమ దశలలో విధినియతులై యుందురని చెప్పవలసి యున్నది).

ఇట్టి మనస్తత్త్వ విశ్లేషాత్మకములగు స్థలము లెన్నియో అభిజ్ఞాన శాకుంతలమునందు కవి సమకూర్చి యున్నాడు.

కాళిదాసు కొన్ని ఘట్టములలో గూఢార్థ సూచకములగు వాక్యము లను ప్రయోగించి తద్ద్వారా సంభాషణాదులలో నూతనోత్తేజమును కూర్చును. పంచమాంకమునందు శకుంతల దుష్యంతునకు తనవిషయమున స్మృతి కలుగు నట్లు చేయుటకు చాల ప్రయత్నించును. కాని ఆమె ప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. ఐనను ఆమె ఒక్క పరుష వాక్యమైనను పలుకలేదు, చివరకు- అరణ్యమునందు పెరిగిన ఈ శకుంతలకు వంచకత్వముండుట అసంభావ్యము అను గౌతమివాక్యములు విని దుష్యంతుడు పలికిన-

"స్త్రీణామశిక్షిత పటుత్వమమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్షగమనాత్స్వ మపత్యజాత-
మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి"

(ఎవ్వరును నేర్పకుండగనే స్త్రీలు చాతుర్యము కలవారుగ నుందురను నది మనుష్యేతరములలోకూడ కానవచ్చుచున్నది జ్ఞానము కలవారి విషయమున చెప్పవలెనా? కోవెలలు తమ సంతానమును వాటికి ఆకాశముపై కెగురు శక్తి లభించుటకు పూర్వము, ఇతర పక్షులచే పోషింపచేయునుకదా?)

అనుమాటలు వినగనే శకుంతల కోపావిష్టయై "అనార్య! ఆత్మనోహృదయానుమానేన పశ్యసి" (అనార్యుడా! నీ బుద్ధినిపట్టి ఇతరుల విషయమున కూడ ఊహించుచున్నావు) అని పరుషముగ మాటలాడును. ఇంతవరకును పల్లెత్తుమాటైనను పల్కని శకుంతల ఒక్కమాటుగ ఇంత పరుషముగ మాటలాడుట చూడగనే ఆశ్చర్యము కలుగకమానదు. కాని అందులకు తగిన కారణము పై శ్లోకమునం దిమిడియున్నది. అది ఆ మాటలు పలికిన దుష్యంతునకు కూడ తెలియదు. శకుంతలమనస్సులో సూటిగ గుచ్చుకొన్నది. గౌతమ్యాదులకుకూడ అది తెలిసి యుండవచ్చును, అదియేమనగా దుష్యంతుడు తననే కాక తన తల్లియైన మేనకనుకూడ అధిక్షేపించినట్లు శకుంతల కావాక్యములలో గోచరించినది, "అశిక్షిత పటుత్వము అమానుష స్త్రీలలో-అప్సరః స్త్రీలలో-గూడ కనబడుచున్నది. ఆకాశముపైకి ఎగసి స్వర్గలోకమును చేరక

ముందు పరభృతలు- ఇతరులచే పోషింపబడు దేవవేశ్య- తన సంతానమును (నిన్ను) ద్విజములచే (పక్షులచే) పోషింపచేయలేదా" అను అర్థము రాజు అమాయకముగా పలికిన పైమాటలలో శకుంతలకు గోచరించుట సహజము. అందుచేతనే ఆమె అంత అంతఉగ్రురాలైనది. ఇది కాళిదాసు చూపిన సంభాషణ చాతుర్యమునకు చక్కని ఉదాహరణము. పై శ్లోకమునందు కొంత భావ్యర్థ సూచనముకూడ లేకపోలేదు. "దుష్యంతుడు దేవసహాయార్థమై స్వర్గమునకు వెళ్ళుటకు పూర్వము తన సంతానమును శకుంతల మారీచాశ్రమమునందు ఇతర ద్విజులచే పోషింప చేసినదికదా?

కాళిదాసుని భావములలో కొంత ఆధునికత్వముకూడ కనబడుట ఒక వైశిష్ట్యము, ఇరువురు నాయికా నాయకుల నడుమ గాఢ ప్రేమయున్న చాలునట, వారేకారణము చేతనైనను కలియజాలక పోయినను అట్టి పరస్పర గాఢప్రేమయే ఆనంద హేతువగునట. ఇది దుష్యంతుని అభిప్రాయము.

> "కామం ప్రియా న సులభా మనస్తు తద్భావదర్శనాయాసి,
> అకృతార్థేఽపి మనసిజే గతిముభయప్రార్థనా కురుతే."

(ప్రియురాలు దుర్లభురాలను మాట తథ్యము. కాని నా యెడల ఆమెకు ఎట్టి భావమున్నదో తెలిసికొనవలెనని మనస్సు తహతహ లాడుచున్నది. కామము సఫలము కాకపోయినను ఇరువురికిని సమానమగు ప్రేమయున్నచో అదియే ఆనంద హేతువు).

ఈ అభిప్రాయమునే కాళిదాసు మాలవికాగ్నిమిత్రమునందుగూడ చూపియున్నాడు.

> "అనాతురోత్కంఠితయోః ప్రసిద్ధ్యతా
> సమాగమేనాపి రతిర్న మాం ప్రతి.
> పరస్పరప్రాప్తి నిరాశయోర్వరం
> శరీరనాశోఽపి సమానురాగయోః "

(ఒకరికి గాఢానురాగమున్నది, రెండవ వారికి లేదు, అట్టి వారికి సమాగమము లభించినను అది నేనంతగా మెచ్చను. సమమైన గాఢానురాగము

కలవారు సంయోగ విషయమున నిరాశులై మరణించినను అది ప్రశస్యమైనది).

ఆంగ్ల రూపకములలో Tragic Irony అనునది ఒకటి కలదు, ఒక వ్యక్తి ఏ విధముగ తలచునో దానికి విరుద్ధముగ చేయుటగాని, జరుగుటగాని సంభవించినచో దానికి Tragic Irony అని పేరు. దానిని శోచనీయ విధి విలాసమని అనవచ్చును, దుష్యంతునకు, తనకెన్నడును దురాలోచనలు కలుగవనియు, తాను అనుకొనిన విషయము ధర్మవిరుద్ధమగుటకు వీలు లేదనియు ఒక విధమగు గాఢవిశ్వాసము లేదా అహంకారము ఉన్నది. అందుచేతనే శకుంతల తనకు యోగ్యయగునా కాదా యని మొదట సంశయించి, నా మనస్సు ఈమెపై లగ్నమైనదిగాన ఈమె తప్పక వివాహయోగ్యయే; సత్పురుషులకు తమ మనః ప్రవృత్తియే, ప్రమాణముకదా అని తనకుతానే సమాధానము చెప్పుకొనును.

> అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా
>
> యదార్యమస్యామభిలాషి మే మనః,
>
> సతాం హి సందేహపదేషు వస్తుషు
>
> ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః.

అంతటి ఆత్మవిశ్వాసము కలవాడే ఆ విధముగా తాను స్వయముగ అనేక ప్రతిజ్ఞలుచేసి వివాహమాడిన భార్యను గూర్చి పూర్తిగ మరచి లోక విరుద్ధముగ ప్రవర్తించినాడు. కాలాంతరమున స్మృతి కలిగినపుడు అట్టివాని మానసమున ఎంత క్షోభకలుగునో ఊహామాత్రగమ్యము. దుర్వాసః శాప వృత్తాంతమును గూర్చి తెలిసిన సామాజికాదులకు అట్టి భావము కలుగక పోవచ్చును. కాని ఆ కారణము తెలియని దుష్యంతు డెంతయో బాధ పడినాడు. ఇది అతని విషయమున జరిగిన శోచనీయ విధి విలాసము. చివరకు మారీచాశ్రమమున శకుంతలను కుమారుని చూచి గుర్తించి పరిగ్రహించిన పిమ్మట దుష్యంతుడు మారీచుని ఎదుట తన మనస్సులోనున్న బాధను వెళ్ళబోసికొనెను.

"యథా గజో నేతి సమక్షరూపే
పశ్చాదపక్రామతి సంశయః స్యాత్,
పదాని దృష్ట్వా తు భవేత్ప్రతీతిః
తథావిధో మే మనసో వికారః."

(నా మానసవికారము చూడగా నాకే ఆశ్చర్యము కలుగుచున్నది. ఏనుగను తీసికొని వచ్చి ఎదుట నిలబెట్టినపుడు ఇది ఏనుగ కాదు అని నిశ్చయ పూర్వకముగా నిరాకరించినాడట ఒక వ్యక్తి. అది దూరముగా పోయి నపుడు సంశయము కలిగినదట. చివరకు అడుగుల గుర్తులుచూచి అది ఏను గయే యని నిశ్చయము కలిగినదట. ఆవిధముగ నున్నది నా మనోవికార మని వాపోయినాడాతడు) పూర్వాపరములను పరిశీలించినచో దీనిని కాళి దాసు ఎంత చక్కగ నిర్వహించినాడో మనకు స్పష్టమగును.

వాస్తవమున దుష్యంతునకు గల అహంకారము మరియొక పర్యా యము కూడ దెబ్బతిన్నది. దాని నాతడే స్పష్టముగ చెప్పి యున్నాడు. ధర్మాత్ముడైన తన పాలనములో, అందుమ తన గృహమునందు, భూతపిశా చాదుల బాధ ఉండుటకు ఎంత మాత్రము అవకాశములేదని ఆతని దృఢ విశ్వాసము. అందులో సత్యము లేకపోలేదు. కాని మాతలి అదృశ్యుడై విదూషకుని ఆక్రమించగా ఆతడు రక్షణకై మొరపెట్టుకున్నపుడు తాత్కా లికముగ ఆ అహంకారమునకు ఆఘాతము తగిలినది విదూషకుని ఆక్రంద నము వినగానే మొదట 'ఏమీ! మాయింటిని కూడా భూతాదులాక్రమించు చున్నవా?" (మాతావత్, మమాపి సత్త్వై రభిభూయన్తే గృహాః) అని పలికి

"అథవా,
అహన్యహన్యాత్మన ఏవ తావత్
జ్ఞాతుం ప్రమాదస్ఖలితం న శక్యమ్.
ప్రజాసు కః కేన పథా ప్రయాతీ
త్యశేషతో వేదితు మస్తి శక్తిః"

(ప్రతి దినమునను తానేమి తప్పులు చేయుచున్నాడో అనెడు విషయ

మును తెలుసుకొనుటయే చాల కష్టము. అట్టి పరిస్థితులలో (ప్రజలలో ఎవరు ఏవిధముగా ప్రవర్తించుచున్నారని తెలిసికొనుటకు ఎవరికి శక్తి కలదు?)

అని అనను, తమ ఇల్లు చక్కబెట్టుకొనక ఇతరుల విషయములలో జోక్యము కలిగించుకొనువారికి శ్లోకము ఎంతటి సదుపదేశము నిచ్చుచున్నదో భావనైక గమ్యము.

బ్రహ్మ పంచభూతములను కాక కేవలసౌందర్యపు ముద్దను మాత్రమే ఉపయోగించి మనస్సుచే శకుంతలను సృజించెనని కాళిదాసు చెప్పిన విధముగా (రూపోచ్చయేన మనసా విధినా కృతాను?) కాళిదాసు ఈ శాకుంతలను ఆనందోచ్చయము నుపయోగించి భావనచే సృష్టించెనని—"హ్లాదోచ్చయేన కవినా మనసా కృతాను?"—చెప్పవచ్చును. అందుచేతనే ఏదృక్కోణముతో చూచినను ఈ శాకుంతలము నుండి అపూర్వానందానుభూతి కలుగుచున్నది 'కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకున్తలా' అను నార్యోక్తి సర్వథా యథార్థము.

# మహాభారత-తత్త్వవివేచనము

శ్రీ గోసుకొండ వెంకటరామశాస్త్రి

## పరిచయము :

| | | |
|---|---|---|
| పేరు | : | శ్రీ గోసుకొండ వెంకటరామశాస్త్రి |
| జననము | : | రామచంద్రపురం, దర్శితాలూకా (ఒంగోలు జిల్లా) మే 1931 |
| విద్యార్హతలు | : | ఆయుర్వేద ఆచార్య, ఆయుర్వేద ప్రవీణ, సంస్కృత ఎంట్రెన్స్, కాశీ గురుకుల వాసములో వేదాంతము, సాహిత్యము. |
| వృత్తి | : | ధార్మిక ప్రబోధము జీవిత లక్ష్యము-శంకరాద్వైతము విశ్వాస పాత్రము-సంస్కృతము అభిమాన విద్య. |

జీవిత లక్ష్యానుగుణమైన ధార్మిక ప్రబోధదృష్టి వీరివ్యాసమున ప్రస్ఫుటము.

"వింటే భారతమే వినాలె, తింటే గారెలే తినాలె" అని పెద్దలు చెప్పిన మాట. గారెల సంగతి ఎలా ఉన్నా భారతం విషయంలో మాత్రం ఈమాట నిజమనిపిస్తుంది. భారతానికి ఇంత గొప్పదనం ఎందువలన? దానికి సమాధానం భారత కర్తయైన వ్యాసమహర్షియే చెప్పినాడు. "ధర్మే చార్థే చ కామే చ మోక్షేచ.భరతర్షభ, యదిహాస్తితదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్" ధర్మార్థకామమోక్షా అనే నాలుగు పురుషార్థాల విషయంలో ఈ గ్రంథంలో ఉండే సంగతులే ఇతరత్రా దొరుకుతాయిగాని ఇందులో లేని విషయం మరెచ్చటా దొరుకదు అని. అందుకే "భారతం పంచమో వేదః"

"సర్వశ్రుతి సమూహో౽యం" అని మహాభారతము భారతీయ వాఙ్మయంలో మిన్నగా ప్రశంసింపబడింది. పెద్దలందరూ నేటికిని మహాభారతాన్ని ఐదవ వేదంగానూ, సర్వశ్రుతిసారముగానూ ఆదరించి పఠిస్తున్నారు. ఇది సర్వ ధర్మాలను, వేదాంత విషయాలను విపులముగా చర్చించి నిర్ణయమొనర్చిన సిద్ధాంత గ్రంథమని చెప్పవచ్చు. ఇట్టి ఈ మహాగ్రంథము భారతీయ సార స్వతమున కలంకారప్రాయమై ఉంది. ప్రపంచానికంతటికీ జ్ఞానభిక్ష పెట్టిన భగవద్గీతలు దీనిలోవే! మరియు శ్రీ శంకర భగవత్పాదులచే ఉత్తమంగా అంగీకరించి భాష్యం వ్రాయబడిన విష్ణు సహస్రనామములు గూడా దీని యందు అనుశాసనికపర్వంలో చెప్పబడ్డాయి. ఇట్లు ధర్మబోధకములూ, వ్యాసమహర్షి కృతములైన యితర గ్రంథాలెన్ని యున్ననూ దీని ప్రశస్తి గొప్పది. దీనిలోని కథలనేకములు భాసాది మహాకవులచే గ్రహించబడ్డాయి. మరియు ఖండాంతరాలకు గూడా దీని వ్యాప్తి జరిగింది. ఇట్లు సర్వతోముఖ మైన ఈ మహాగ్రంథాన్ని సాకల్యంగా చర్చించడం అశక్యమే అవుతుంది. యథోచితంగా కొన్ని విషయాలు వివరిస్తాను.

భారతాన్ని అనువాదం చేసిన తెలుగు కవిత్రయం కేవలం కావ్య శైలికి, కథలోని ఔచిత్య పోషణకూ ఇచ్చినంత ప్రాధాన్యం తక్కిన విషయా లకు ఇవ్వలేదేమో అనిపిస్తుంది. అందుచేతనే ధార్మిక విషయాల సంక్షేపమూ, కథలో కొన్ని మార్పులూ, పరిత్యాగాలూ గోచరిస్తాయి. ఏమైనా సం స్కృత భారతం పూర్తిగా యథాతథంగా తెలుగులోకి చేరలేదనే సంగతి పండితులందరూ అంగీకరించేదే. అందుచేత కావ్యశైలి, కథాగమనంలోని బిగువు సంస్కృత భారతంలోకంటె తెలుగు భారతంలో మనోరంజకంగా ఉన్నప్పటికీ, కథా ప్రామాణ్యం మాత్రం వ్యాస భారతాన్ని అనుసరించే నిర్ణయించుకోవాలి. కాబట్టి నేను సంస్కృత భారతాన్ని అనుసరించే ఈ విష యాలు వివరింపదలుచుకున్నాను.

## మహాభారత శబ్దార్థము—కర్తృత్వము

భరత వంశరాజుల చరిత్రము కాబట్టి ఈ గ్రంథానికి భారతమని పేరు. అయితే ఈ గ్రంథానికి మహాభారతమని పేరెట్లా వచ్చింది. మహాభారత మన్నప్పుడు అల్పభారత మింకొకటి ఉండాలిగదా? మహారామాయణమని

గానీ, మహాభాగవతమని గానీ అంటున్నామా? ఏ పురాణానికి గూడా 'మహా' అనే పదంలేదు దీనికీ క్రొత్తవిధానం ఎందువలన? దీనిపై కొందరు పండితులు అల్పభారతము ఒకప్పుడు ఉండేదని అభిప్రాయ పడ్డారు. వారనే దేమంటే వ్యాసమహర్షి జయము అనే పేరుతో భారత కధను సంగ్రహంగా రచించాడు. తర్వాత వైశంపాయన మహర్షి జనమేజయునికి కొన్ని ఉపాఖ్యానాలు చేర్చి ఆ కధను చెప్పాడు. అప్పుడు దానికి భారతమని పేరు వచ్చింది. తర్వాత సూతపుత్రుడు ఉగ్రశ్రవుడు శౌనకాది మహర్షులకు ఇంకా కొన్ని ఉపాఖ్యానాలు చేర్చి ఇప్పుడు ఉండే గ్రంథాన్ని బోధించాడు. అప్పుడు దానికి మహాభారతమని పేరు వచ్చింది. ఇట్లా వ్యాసకృతము కొంత వైశంపాయనకృతము కొంత, సూతకృతము కొంత కలిసి ఇప్పటి మహాభారతగ్రంధ మేర్పడింది. వ్యాసకృతజయము వైశంపాయనకృత భారతంలోనూ భారతం సూతకృత మహాభారతంలోనూ లీనమైయున్నందున విడి విడిగా గ్రహించ వీలులేదు. ఇట్లా జయ, భారతాలదృష్ట్యా ఈ గ్రంథము పెద్దదైనందున మహాభారతమని ప్రసిద్ధిపొందింది, లేకపోతే ఇంతపెద్ద గ్రంథాన్ని ఒక్క వ్యాసమహర్షియే రచించడం అశక్యము. అంతే కాక "మన్వాది భారతం కేచిదాస్తీకాది తథాపరే, తథోపరిచరాద్యన్యే విప్రాస్సమ్యగధీయతే" అని ఆదిపర్వం మొదటి అధ్యాయంలో చెప్పబడింది. అంటే "నారాయణం నమస్కృత్య............" అనే మంత్రం ఆదిగా కొందరు, ఆస్తీక చరిత్రం అదిగా కొందరు, ఉపరిచరవసువు చరిత్రం ఆదిగా కొందరు మహాభారత ప్రారంభాన్ని పరిగణిస్తున్నారు అని. మూడువిధాల ప్రారంభం కావడమేమిటి? దీని అర్థమేమిటి? అని విమర్శిస్తే ఈ గ్రంథము పైన చెప్పిన విధంగా మూడు దశలుగా రచింపబడింది కాబట్టి జయము, భారతం, మహాభారతం అనే ఒక్కొక్కదశకూ ఒక్కొక్క చరిత్ర ఆరంభం అనే రహస్యం తేలుపడుతుంది. మరియూ ఆశ్వలాయన గృహ్యసూత్రంలో బ్రహ్మయజ్ఞ సందర్భమున "సుమంతు, జైమిని, వైశంపాయన, పైల, సూత్ర, భాష్య, భారత, మహాభారత, ధర్మాచార్యాః" అని చెప్పబడింది. ఆచార్యనిర్దేశ సందర్భమున భారత, మహాభారత అని ప్రయోగింపబడినందున, భారత కర్తయైన ఆచార్యుడు, మహాభారత కర్తయైన ఆచార్యుడు, వేరుగా సిద్ధించుచున్నారు. అందుచేగూడా ఈ గ్రంథము బహుకర్తృకము అనీ, భారత మహాభారతాలు వేరనీ తేలుతున్నది. లోకమాన్య బాలగంగాధర తిలక్

తనగీతా రహస్య గ్రంథంలో మరొక అభిప్రాయం వెల్లడించాడు. గీతలలో 13 అధ్యాయంలో "ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్, బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః" అని ఈ చెప్పబోవు విషయం బ్రహ్మసూత్రాలలో గూడా విపులీకరింపబడింది అని బ్రహ్మసూత్రముల ఉల్లేఖనము కనిపిస్తున్నది బ్రహ్మసూత్రములలో "స్మృతేశ్చ, అపి చ స్మర్యతే" మొదలైన కొన్ని సూత్రములకు భాష్యంలోస్మృతి శబ్దంచే ఇచట భగవద్గీతయే అభిప్రేతమని భాష్యకర్తలు నిర్ణయించారు ఇట్లా రెండు గ్రంథాలూ ఒకదానిలో ఒకటి ఉల్లేఖింపబడి ఉంది. పూర్వం రచితమైన గ్రంథము తర్వాత రచితమైన గ్రంథంలో ఉల్లేఖింపబడవచ్చును గానీ, తర్వాత గ్రంథం మొదటి గ్రంథంలో చెప్పబడదు గదా? ఈ రెండు గ్రంథాలలో మొదటిదేది, తర్వాతదేది అని విచారిస్తే భారతం, భగవద్గీత మొదట కొంత సంక్షేప రూపంలో ఉన్నాయనీ, అందుచే బ్రహ్మసూత్రాలలో గీతలపేరు చేరిందనీ, తర్వాత భారతాన్నీ గీతలనూ విస్తృత పరచడం జరిగిందనీ అప్పుడు బ్రహ్మసూత్రాల పేరు గీతలలో చేరిందనీ, దీనివల్ల భారతం అంతా ఒకేమారు రచన జరుగక కొన్ని దశలుగా రచన జరిగి చివరిదశగా ఇప్పటి పెద్ద గ్రంథం తయారైనందున మహాభారతమనే పేరు వచ్చిందనీ ఆయన ప్రతిపాదించాడు...మహాభారతంలోని "వేదానధ్యాపయామాస మహాభారత పంచమాన్, సుమంతుం జైమినిం పైల శుకం చైవ స్వమాత్మజం, ప్రభుర్వరిష్ఠో వరదో వైశంపాయనమేవచ, సంహితాస్తైః పృథక్త్వేన భారతస్యప్రకాశితాః" అనే శ్లోకాలవలన గూడా ఈ విషయం దృఢపడుతుంది. వ్యాసమహర్షి వద్ద వేదాలతోసహా మహాభారతాధ్యయనంచేసిన సుమంతుడు మొదలైన శిష్యులు వేరువేరుగా తిరిగి భారతసంహితలు వ్రాసినారని కంఠోక్తిగా చెప్పబడినందున వైశంపాయన మహర్షి వ్యాసకృత భారతాన్ని (జయమును) పెంచి తాను తిరుగా వ్రాశాడనిన్నీ, తర్వాత సూతుడు ఇంకా పెంచి తాను ఇప్పటి మహాభారతాన్ని వ్రాశాడనిన్నీ కొందరు విమర్శకులు నిర్ధారణచేశారు. ఈ విధంగా భారతం బహుకర్తృకమే గాని, ఏకకర్తృకంగాదని చాలామంది విమర్శకులు అభిప్రాయపడ్డారు. కాని వీరి అభిప్రాయం పొరపాటని చెప్పక తప్పదు. ఈ విషయం శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి గారి వంటి మహోద్దండ పండితులు కూలంకషంగా ప్రతిపాదించారు. వ్యాసమహర్షివంటి అపూర్వశక్తి

సంపన్నుడు, భగవదంశ సంభూతుడు లక్ష శ్లోకాత్మకమైన భారతాన్ని పూర్తిగా రచించలేడనడం హాస్యాస్పదం. అలా అంటే 4 లక్షల శ్లోక సంఖ్య గలిగిన పురాణాలు అన్నిమాత్రం రచించగలిగాడా అని శంకవస్తుంది. పెద్దలనుండి అనాదిగా వస్తున్న సాంప్రదాయిక అభిప్రాయాలను హేతు రహితంగా శంకించి ఉపేక్షించడం సాధ్యంకాదు. అటువంటి విమర్శలు మూలానికే హాని కలిగించేటట్లు ఏర్పడతాయి. గ్రంథంలోనే స్వయంగా సర్వము వ్యాసకృతమని చెప్పినప్పుడు మనం వృథాయోచనలతో శంకించడం వివేకం కాదు. గ్రంథాలు విస్తృతం చేయబడినప్పుడు, లేదా నష్టమైన భాగాలను పూరించినప్పుడు ఆకర్తల పేర్లు గ్రంథంలో ఉల్లేఖించబడుతూనే ఉంటాయి. ఈ విధంగా చరక సంహిత అగ్నివేశమహర్షి కృతమనీ, చరక సంస్కృతమనీ, దృఢ బలుడు నష్టభాగాలను పూరించాడనీ ఆగ్రంథంలోనే చెప్పబడింది. తెలుగు భాగవతం సంగతి గూడా అంతేకదా ! అట్టి ప్రసిద్ధి భారతానికి లేదు- కాబట్టి సంపూర్తిగా వ్యాసకృత మనుకోవడానికెట్టి విప్రతిపత్తిలేదు. అయితే మహాభారతమనే పేరు ఎలా వచ్చినట్లు? దీనికి మహాభారతమే సమాధానం చెబుతున్నది.

> "ఏకతశ్చతురో వేదాన్ భారతం చైకదేశతః
> పురా కిల సురైస్సర్వై స్సమేత్య తులయాధృతం॥
> చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యధికం యదా
> తదాప్రభృతి లోకేఽస్మిన్ మహాభారతముచ్యతే॥
> మహత్త్వే చ గురుత్వే చ ధ్రియమాణం యతోఽధికం
> మహత్త్వా ద్భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే॥"
>
> —ఆదిపర్వం. 1 అధ్యా శ్లో 277-279

నాల్గువేదముల కంటే గూడా మిక్కిలి మాహాత్త్వమున్నూ భారవత్త్వము అంటే విషయగౌరవమున్నూ కలిగి యుండుటచేత మహాభారతమని పేరు పెట్టబడింది. కాని కథలు ఎక్కువగా చేర్చినందువల్ల కాదు. ఇట్లా మూలగ్రంథంలోని విషయాలను ఉపేక్షించి ఊహాగానాలు చేయడం ఉచితం కాబోదు. భారతానికి జయ మనే పేరు ఎందుకు వచ్చింది? దానికి సమాధానం భవిష్య పురాణం బ్రహ్మచారి కాండంలో ఉంది "అష్టాదశ

పురాణాని రామస్య చరితం తథా । కార్ష్ణో వేదః పంచమశ్చ యం మహా
భారతం విదుః। తథైవ విష్ణుధర్మాశ్చ శివధర్మాశ్చ శాశ్వతాః। జయేతినామ
తేషాంతు ప్రవదంతి మనీషిణః" భారతంతోసహా పైన చెప్పిన గ్రంథా
లన్నిటికీ జయమనే పేరు వర్తిస్తుంది. జయమంటే అర్థం "చతుర్ణాం పురుషా
ర్థానామపి హేతౌ జయో స్త్రియాం" అని నిఘంటువు. నాల్గుపురుషార్థాల
ప్రాప్తికి హేతువుగా ఉన్న అంటే బోధకంగా ఉన్న గ్రంథానికి జయమని పేరు
లేదా "జయతి అనేన సంసారక్లేశానితి జయః" ఈ గ్రంథపరిజ్ఞానంచే
సంసార క్లేశాలను జయిస్తారు కాబట్టి జయమనిపేరు. ఇట్లా భారతం నాల్గు
పురుషార్థాలను బోధించడంలో అగ్రగణ్యం గనుక దానికా పేరు రూఢమై
పోయింది. మరియు పెద్దలు మరొక తమాషా పద్ధతిలో భారతానికి జయ
శబ్దాన్ని సమన్వయించారు. "కాది నవ, టాది నవ, పాది పంచమ.
యాద్యష్టౌ" అనే అక్షర సంఖ్యా నియమ క్రమంగా య 1, జ-8 కలిసి
జయ అంటే 18 అని సంఖ్య నిర్ణయమౌతుంది భారతం 18 పర్వములు అంటే
భాగములు కనుక జయమనే పేరు పెట్టబడింది. అయితే "మన్వాదిభారతం
కేచిత్......" మొదలైన శంకకు సమాధానం ఏమిటి? భారతం ప్రారంభంలో
ఉపోద్ఘాత రూపకంగా కొన్ని కథలు చెప్పబడ్డాయి. కాబట్టి నిజమైన భారత
కథకు మొదలేది అని ప్రశ్న వచ్చినప్పుడు ఒక్కొక్కరు పెద్దలు ఒక్కొక్క
రీతిగా అన్నారు అని చెప్పాలి. లేదా కల్పాంతరాలలో భారత రచనా
క్రమంలో భేదం వచ్చినందువలన ఒక్కొక్క కల్పంలో ఒక్కొక్క తీరుగా
ఆరంభం ఉండేదని కొందరు పెద్దల అభిప్రాయం అని అర్థం చెప్పుకోవచ్చు.
అంతేగానీ మూడుదశలకూ మూడువిధాలైన ఆరంభాలని అర్థం చెప్పుకో
వడం కుదరదు. ఈ శ్లోకం సూతప్రోక్తంగా చెప్పబడింది. మరి ఆవిధంగానే
అయితే 'కేచిత్, అపరే, అన్యే' అని సందేహాస్పదంగా సూతుడు చెప్పడం
సంభవిస్తుందా? నిశ్చయంగా ఫలానా గ్రంథానికి ఫలానా చరిత్ర మొదలు
అని చెప్పియుండేవాడు. అంతేగానీ కొందరు చెప్పుతున్నారు నాకేమి తెలి
యదన్నట్టు సందేహంగా చెప్పేవాడా? పైగా తాను విన్న వైశంపాయన
ప్రోక్త చరణానికీ, తాను రచించిన మహాభారతానికి గూడా మొదలు
ఎక్కడ వుందో తెలియదా? కాబట్టి ఈ వాదన చేసేవారి అభిప్రాయం సరి
కాదని తేలుతుంది. ఆశ్వలాయన గృహ్యసూత్రాలలోని పైసూత్రాన్ని పరి

శీలిద్దాము. భారత మహాభారత శబ్దంచే రెండు గ్రంథాలు విడిగా గ్రహించ వలెనని వీరంటున్నారు. ఈ సూత్రానికి సరియైన అర్థం దేవీ భాగవతంలో వివరించబడింది.

"సుమంతు జైమినీ వైశంపాయనః పైలసూత్రయుక్
భాష్యభారతపూర్వాశ్చ మహాభారత ఇత్యపి ।
ధర్మాచార్యా ఇమే సర్వే తృప్యన్త్వితి చ కీర్తయేత్ ॥ "

అని పై సూత్రములోని సూత్ర, భాష్య, భారత, మహాభారత శబ్దములు ఆచార్యనామములనీ, వారందరికీ బ్రహ్మయజ్ఞమున తర్పణము చేయవల యుననీ వివరించబడినది. కానీ భారత, మహాభారతములు పృథగ్గ్రంథా లని అర్థం చెప్పబడలేదు. అట్లా చెప్పడానికి అన్వయం కుదరదుకూడా ? వీరిక్కడ క్రమికాన్వయం కల్పించి సుమంతుడు మొదలైన నలుగురూ సూత్రము మొదలైన నాలుగు గ్రంథాలకు ఆచార్యులుగా అన్వయించి వైశంపాయమునికి భారతకర్తృత్వాన్ని అంటగట్టారు. అలా అయితే మహా భారతకర్త పైలుడు కావలసివస్తుందికదా! అట్లాంటి ప్రసిద్ధి ఎక్కడా లేదే! మహాభారతం సూతకృతమని వీరంటున్నారుగదా! కాబట్టి దీనికి పైన చెప్పబ డిందే సరియైన అర్థం కాని క్రమికాన్వయం కుదరదు. అందుచే ఈ విమర్శ కుల అభిప్రాయం అసత్యమని తెలుస్తుంది,

ఇక 'వేదానధ్యాపయామాస మహాభారత పంచమాన్' మొదలైన శ్లోకాల అభిప్రాయం పరిశీలింతాము. వ్యాసమహర్షి సుమంతు, జైమిని, పైల వైశంపాయనులనే నలుగురు శిష్యులకూ, తనకుమారుడైన శుకునికీ మహా భారతంతో సహా నాలుగువేదాలను బోధించాడు. తర్వాత శిష్యులందరూ భారతానికి విడివిడిగా సంహితలు వెలువరించారు అని స్థూలార్థము ఇందు తో వ్యాసమహర్షి వద్ద శిష్యులు మహాభారతాన్ని పఠించి తర్వాత సంహి తలు వ్రాశారని చెప్పడం హాస్యాస్పదం కదా? పైవిమర్శకులు వ్యాసరచితము జయమనీ, వైశంపాయనరచితము భారతమనీ, సూతప్రోక్తము మహాభార తమనీ నిర్ణయించారుకదా! సూతరచితము కాబోయే మహాభారతాన్ని ముందుగానే వ్యాసమహర్షి వద్ద వారెట్లాపఠించారు? మహాభారతాన్ని పఠించి తర్వాత అంతకంటే చిన్నదైన భారత గ్రంథాలను రచించడమేమిటి ?

కాబట్టి సామాన్యులకు గూడ ఈ అర్థము అస్తవ్యస్తమని బోధపడుతుంది. ఇట్లా ఈ విమర్శకుల అభిప్రాయం పొరపాటని నిర్ణయమౌతున్నది. దీనికి సరియైన అర్థం నీలకంఠ పండితుని వ్యాఖ్యలో చూడండి "భారతస్య మూలభూతాః సంహితాః మంత్రబ్రాహ్మణరూపా వేదాః తైః సుమంతు ప్రభృతిభిః ప్రకాశితాః ఇదమస్య మూలం ఇదమస్య మూలమితి స్పష్టీకృతాః తేన ప్రత్యక్షవేదమూలమేతదితి భావః" భారతంలోని ధర్మాలు వేదముల నుండియే గ్రహింపబడినవి. సంహితలనగా వేదాలు. సుమంతుప్రభృతి శిష్యులు మహాభారతాధ్యయనానంతరం మహాభారతంలోని ఈ యా భాగాలకు వేదములలోని ఫలానా ఫలానా మంత్రములు మూలములని వెల్లడించారని అర్థం. అంతేకాని మరలా భారత రచనం చేశారని చెప్పడం అసంగతం. ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. గౌరవార్థంగా మహాభారతమనీ, సామాన్యంగా భారతమనీ వ్యాసమహర్షి ఈ గ్రంథాన్నే రెండు విధాలుగా పలు తావుల చెప్పి ఉన్నాడు. ఇది శ్లోకాలలోని ఛందస్సుకు అనుకూలంగా చేయవలసి వచ్చింది. ఇంతమాత్రంచేత రెండు గ్రంథాలని అర్థం కాదు. లోకంలో గౌరవంగా శ్రీ, గారు చేర్చిగాని, సామాన్యంగా మామూలు పేరుతోనేగాని మనం ఒకే వ్యక్తిని చెప్పుతుంటాము. అంతమాత్రంచే ఇద్దరు వ్యక్తులు అని అర్థం కాదుకదా! ఇదీ అంతే. ఇలాంటి చిన్న విషయాలు పట్టుకొని అభూతకల్పనలతోగూడిన నిర్ణయాలు చేయడం సంభావ్యంకాదు. ప్రాయశః ఇప్పటి కొందరు విమర్శకులదృష్టి ఇలాంటి వక్రమార్గంలో ఉంటున్నదని చెప్పడం అతిశయోక్తి కాదు. ఏదో రవ్వంత హేతువుతో మూలగ్రంథంలోని అనేక ప్రమాణాలను, సాంప్రదాయిక అర్థాలను త్రోసి రాజని అసంబద్ధ నిర్ణయాలు చేయడం జరుగుతున్నది. పదిమంది అనుకుంటున్నది మనం కాదంటే గొప్పవాండ్లమవుతామని అభిప్రాయమేమో! ఇటువంటి విమర్శలు గ్రంథాలకు మేలుకు బదులుగా హానిని కలిగిస్తాయని చెప్పడం నిర్వివాదము. ఇక తిలక్ మహాశయుని అభిప్రాయం చూతాము. గీతల ఉల్లేఖము బ్రహ్మసూత్రాలలో ఉన్నమాట నిజమే! కాని బ్రహ్మసూత్రాలపేరు గీతలలో ఉన్నదా? పై చెప్పిన "బ్రహ్మసూత్రపదైశ్చైవ.........అనే శ్లోకానికి శంకరభాష్యం. "బ్రహ్మసూచకాని వాక్యాని బ్రహ్మసూత్రాణి తైః పద్యతే గమ్యతే జ్ఞాయతే బ్రహ్మ ఇతి తాని పదాని ఉచ్యంతే తైరేవ చ క్షేత్రక్షేత్రజ్ఞయోః యాథాత్మ్యం గీతం ఇత్యను

వర్తతే" అంటే బ్రహ్మసూచకమైన వాక్యాలకు బ్రహ్మసూత్రాలని పేరు అని అర్థం చెప్పబడింది. "బ్రహ్మ సూత్ర్యతే నిర్దిశ్యతే ఏభిరితి బ్రహ్మ సూత్రాణి. బ్రహ్మసూత్రాణి చ తాని పదాని చ బ్రహ్మసూత్రపదాని" అని వ్యుత్పత్తి చెప్పుకోవచ్చు. కాబట్టి ఇక్కడ బ్రహ్మసూత్రములని చెప్పబడే ఉత్తర మీమాంసా సూత్రములు అభిప్రేతం కాదనీ, బ్రహ్మసూచకమైన ఉపనిషద్వాక్యాలని అర్థమనీ భాష్యకర్తల అభిప్రాయం తేటపడుతున్నది. ఇది ఉపాదేయమైన భావం. ఇందుచే గీతలలో బ్రహ్మసూత్ర గ్రంథ ప్రసక్తి లేదు. ఒకవేళ ఈ అర్థంతో తృప్తికలుగకపోతే మరియొక విధంగా సమన్వయించుకోవచ్చు. వ్యాసమహర్షి అలౌకిక మేధాసంపన్నుడగుటచే గ్రంథాలన్నిటినీ మొదట ప్రతిపాద్య విషయ నిర్ణయంచేసి ధారణలో ఉంచుకొని తర్వాత తీరుబాటుగా శ్లోకరూపంగా లిఖితం చేశాడు అని అనుకోవచ్చు. అప్పుడు అవసరమైతే కొంత సంస్కరణ రూపంగా ఒక గ్రంథప్రసక్తి మరియొక గ్రంథంలో చేర్చియుండవచ్చు. ఈ భావానికి దోహదంగా కొన్ని విషయాలు కనిపిస్తున్నాయి, భారతాన్ని విషయమంతా ధారణచేసి పిదప వ్రాయుటకై గణేశుని ప్రార్థించగా ఆయనవచ్చి వ్రాస్తుంటే ఆశువుగా శ్లోకరచన చేసినట్టు భారతంలోనే చెప్పబడింది. పురాణాలు కూడా ఒకదాని మాహాత్మ్యం మరొకదానితోనూ, అన్యోన్య ప్రసక్తితోనూ నిండి ఉన్నాయి. కాబట్టి విషయ నిర్ధారణ మొదట, శ్లోకరచన తర్వాత అని ఊహించుకోవడానికి వీలున్నది. లేదా త్రికాలజ్ఞానం కలిగిన మహర్షి తాను రచించబోయే అన్ని గ్రంథాల సంపూర్ణ స్వరూపాన్నీ, ముందుగానే జ్ఞానదృష్టిచే దర్శించినందువలన ఒక గ్రంథప్రసక్తి మరియొక గ్రంథంలో తెచ్చి రచించాడనడానికి వీలున్నది. భవిష్యత్కాలంలో జరుగబోయే వైశంపాయన, జనమేజయ సంవాదం, సూతశౌనక సంవాదం భారతాది గ్రంథాలలో ఎట్లు ముందుగానే వ్రాయబడింది ? అనే శంకకు వ్యాఖ్యాతలు ఈ విధంగానే సమాధానం చెప్పారు. మహర్షి తన దివ్యదృష్టితో ఆగామి విషయాలన్నిటినీ గ్రహించి సూతశౌనక సంవాదరూపంగానే రచించినందువలన గ్రంథాలన్నీ సంవాదరూపంగా ఉన్నాయనీ, కాబట్టి సూతుడు శౌనకాదులకు బోధించిన పిదప రచన కాదనీ, దీనిలో పౌర్వాపర్యములను గురించి శంకించనవసరం లేదనీ, భగవదంశమైన వ్యాసమహర్షి ప్రజ్ఞముందు ఇది ఆశ్చర్యజనకం కాదనీ వ్యాఖ్యాతలు నిర్ణయించారు. కాబట్టి పై ఊహకు కొంత ఆధారం ఉన్నది.

ఇట్లా పెద్దలనుండి వచ్చిన సాంప్రదాయిక రీతులను భంగపరచకుండ అర్థ కల్పనమూ, సమన్వయమూ చేసుకోవాలిగానీ, గ్రంథప్రామాణ్యానికీ, సంప్ర దాయరీతికి భిన్నంగా విమర్శించి సిద్ధాంతాలు చేయడం యుక్తిసహంతా బోదు. వ్యాసభగవానుని వాణికాకుండా సూతరచితమైన భారతమంచే వేదమువలె ప్రమాణమని చెప్పడానికి వీలుంటుందా ? అప్పుడు భారతంలోని దైన భగవద్గీతకుమాత్రం ప్రామాణ్యము నిలువగలదా? 'భారతం పంచమో వేదః' అనేసూక్తి గతిఏమిటి? భారతం పారాయణం చేసినందువలననే మహా పుణ్యమని భావించి పారాయణచేసే పెద్దలందరు వెర్రివారా? గ్రంథమంతా వ్యాసరచితం కాకపోతే ఈ సంప్రదాయం ఏలా ఏర్పడింది? కాబట్టి ఇన్ని ఇబ్బందులను సృష్టించే ఈ బహుకర్తృకత్వ వాదం సమంజసంకాదు. గ్రంథ మంతా వ్యాసరచితమేననీ, ఏకకర్తృకమేననీ నిశ్చయించడం సర్వవిధాలా న్యాయబద్ధం.

## మహాభారత స్వరూపము

భారతం 18 పర్వాలనీ, ఇందులో అంతర్గత పర్వాలు 100 ఉన్నా యనీ, మొత్తం లక్ష శ్లోకాలనీ వ్యాసమహర్షియే చెప్పిఉన్నాడు. అయితే ఇందులో చాలాతికమక కనిపిస్తున్నది. 18 పర్వాలలోని అంతర్గత పర్వాలు 98 మాత్రమే ఉన్నాయి. హరి వంశంలోని హరివంశ పర్వము, భవిష్య పర్వము కలుపుకుంటే నూరు పరిపోతాయి. శ్లోకసంఖ్య ఆది పర్వం ప్రథ మాధ్యాయంలో చెప్పబడిన ప్రకారం లెక్కవేస్తే 18 పర్వాలకు కలిపి 84828 మాత్రమే ఉన్నాయి. హరి వంశంలోని రెండు పర్వాలుకలిపి 12 వేలని చెప్ప బడింది. మొత్తం కలిపినా 96,828 మాత్రమే కనిపిస్తున్నాయి. అందుచే దీని సమన్వయం చాలా క్లిష్టంగాఉంది, తెలుగు భారతంలో నన్నయ మొదట అనుక్రమణిక అనువాదం చేస్తూ పర్వసంఖ్య హరివంశ పర్వం, భవిష్య పర్వంతోసహా 99 మాత్రమే చెప్పాడు. కాని తర్వాత 18 పర్వాలు విడివిడిగా గణనచేస్తూ 18 పర్వాలకు అంతర్గతపర్వాలు 98 చెప్పినాడు. (వావిళ్ళ వారి ప్రతి) శ్లోకాలు మొత్తం భారతానికి ఎన్నిఉన్నాయో చెప్పకుండా ప్రౌఢంగా తప్పించుకున్నాడు. కాని 18 పర్వాలకు చెప్పిన శ్లోకసంఖ్య చూస్తే 1 లక్ష 7 నూర్లు తేల్తున్నాయి. ఇట్లా తెలుగు భారతంకూడా ఈ విషయంలో సహా

యం చేయడంలేదు. ఈ విషయంలో పండితులు పరిశోధించి సరియైన నిర్ణయం చేయవలసిన అవసరం ఎంతైనాఉంది ఇట్లా సంఖ్యలో గజిబిజి ఉన్నప్పటికినీ, భారతంయొక్క ప్రామాణ్యానికి కొదువలేదని గ్రహించాలి. వ్యాసమహర్షి వచనం "ఈ షద్వైపమ్యా మవివక్షితం" అనే న్యాయం ప్రకారం లక్షకు దగ్గిరగా ఉన్నాయి కాబట్టి లక్ష శ్లోకాలని చెప్పినాడని సరిపెట్టుకోవచ్చు. ఈ విషయంలో తగినంత పరిశీలన ఇంకా జరుగవలసిఉంది.

హరివంశం భారతానికి ఖిలపర్వం. ఖిలమంటే "యచ్చ శాఖాంతరస్థం శాఖాంతరే ప్రయోజనవశాత్పఠ్యతే తత్ ఖిలం" అనగా మరియొకచోట ఉన్న విషయాన్ని ఈ గ్రంథానికి ముఖ్యంగా ప్రతిపాద్యం కాకపోయినా, ప్రయోజనాన్ని అనుసరించి ఇక్కడ చేర్చుకొన్నప్పుడు ఆ విషయం ఈ గ్రంథంలో ఖిల భాగమని ప్రసిద్ధి, ఇలాంటి ఖిల గ్రంథాలు వేదాలలోనూ, పురాణాలలోకూడా కనిపిస్తున్నాయి, ఇక్కడ హరివంశంలో వర్ణింపబడింది శ్రీకృష్ణ చరిత్రము. అది పాండవ చరిత్రమైన భారత కథకు ముఖ్య సంబద్ధము కాకపోయినా, శ్రీకృష్ణ సంబంధంచే ఇక్కడ వర్ణింపబడి భారతానికి ఖిల భాగమైంది మరియు భారతానికి ఇతిహాసమని పేరు. వాఙ్మయంలో రామాయణం, భారతం రెండే ఇతిహాసాలు. ఇతిహాసమంటే 'ఇతి-హ-ఆస' ఈ విధముగా ఉండెను. అని అర్థం. అంటే అనగా అనగా ఒక రాజు ఉండెను అని లోకంలో కథను ఆరంభించినట్లు ఒకనాయకుని చరిత్రను ప్రధానంగా తీసికొని దానికి సంబంధించిన ఇతర ధార్మిక విషయాలు ఉపాఖ్యానాలు చేర్చి వ్రాయబడిన చరిత్రము అని అర్థం. 'ఇతిహాసః పురావృత్తం' అని అమరకోశము. పూర్వమందు జరిగిన వృత్తాంతము ఇతిహాసమని చెప్పబడుతుంది. ఇది రెండువిధాలు. ఏకనాయకము, బహు నాయకము, రామాయణము ఏకనాయకము. భారతం బహునాయకము. "ధర్మార్థకామమోక్షాణాం ఉపదేశసమన్వితం పూర్వవృత్త కథాయుక్తం ఇతిహాసం ప్రచక్షతే" అని కావ్యమీమాంసయొక్క నిర్వచనము. ఇట్లా నాలుగు పురుషార్థాలను పూర్తిగా ప్రతిపాదించినది ఒక్క భారతమనే చెప్పాలి. ఇది 1. ఆదిపర్వము, 2. సభాపర్వము, 3. అరణ్యపర్వము, 4. విరాటపర్వము, 5. ఉద్యోగపర్వము, 6. భీష్మపర్వము, 7. ద్రోణపర్వము, 8. కర్ణపర్వము, 9. శల్యపర్వము, 10. సౌప్తికపర్వము, 11. స్త్రీపర్వము, 12. శాంతిపర్వము, 13. అనుశాసనిక పర్వము, 14. అశ్వమేధ

పర్వము, 15. ఆశ్రమవాసపర్వము, 16. మౌసలపర్వము, 17. మహాప్రస్థానిక పర్వము, 18. స్వర్గారోహణ పర్వము. అని 18 భాగములు. పర్వమనగా కణువు, అని అర్థం. భారతాన్ని 18 కణువులుకల ఒక చెఱకు గడగాపోల్చి వ్యాసమహర్షి ఈ పేరు పెట్టాడని అనుకోవచ్చు. ఇందులో శాంతిపర్వము ప్రధాన పురుషార్థమైన మోక్షోపాయ బోధకముగనుక అది ముఖ్యమని వ్యాస మహర్షియే "శాంతిపర్వమహాఫలః" అని భారతాన్ని ఒక వృక్షరూపంగా వర్ణిస్తూ, శాంతిపర్వము ఆ వృక్షానికి పండుఅని చెప్పాడు. భగవద్గీత ముఖ్యమే ఐనా వ్యాసమహర్షి శాంతిపర్వానికి ప్రాధాన్యం ఇచ్చాడని మనం గుర్తించు కోవాలి. ఎందువల్ల? దానిలోని విషయగౌరవమట్టిది. ఇట్లా మహాభారతం ఒక అపూర్వ జ్ఞానఖనియని సర్వత్ర కీర్తింపబడింది. ఖండాంతరాలలో గూడా దీని వ్యాప్తి జరిగిందంటే ఆశ్చర్యపడ నవసరంలేదు. బౌద్ధులుగూడా ఇందు లోని శ్లోకాలను యథాతథంగా పాళీభాషలోనికి మార్చి వాండ్ల గ్రంథాలలో వ్రాసుకున్నారు.

ఇలాంటి ఈ బృహద్గ్రంథంలో ఉపాఖ్యాన రహితంగా కేవల భారత కథ 24 వేల శ్లోకాలని మహర్షి చెప్పియున్నాడు. ఈ విషయం ఇలా వర్ణింప బడింది-

"ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణా
ఉపాఖ్యానైస్సహ జ్ఞేయం శ్రావ్యం భారతముత్తమం
చతుర్వింశతి సాహస్రీం చక్రే భారత సంహితాం
ఉపాఖ్యానైర్వినైతావత్ ప్రోచ్యతే భారతం బుధైః।"

అంటే కథలతోసహా లక్ష శ్లోకాలు, కేవల భారతకథ 24 వేల శ్లోకాలు ఉన్నాయి. అసలు వ్యాసమర్షి భారతాన్ని 60 లక్షల శ్లోకాలుగా వ్రాశాడట. ఈ శ్లోకాలు చూడండి-

"షష్టిం శతసహస్రాణి చకారాన్యాం ససంహితాం
త్రింశచ్ఛతసహస్రంతు దేవలోకేత్ర తిష్ఠితం।
పిత్ర్యే పంచదశప్రోక్తం గంధర్వేషు చతుర్దశ
ఏకం శతసహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితం।

నారదో శ్రావయద్దేవాన్ అసితో దేవలః పితౄన్
గంధర్వ యక్షరక్షాంసి శ్రావయామాస వైశుకః
అస్మింస్తు మానుషేలోకే వైశంపాయన ఉక్తవాన్॥"

అందులో 30 లక్షలు దేవలోకంలో నారదుడు ప్రచారం చేశాడు 15 లక్షలు పితృలోకంలో అసితదేవలుడు ప్రచారం చేశాడు. 14 లక్షలు గంధర్వ లోకంలో శుకుడు బోధించాడు. 1 లక్ష మాత్రం మానవలోకంలో వైశంపాయనుడు ప్రబోధించాడు. ఇట్లా భారత సంహిత వేదంలాగా అనంతమైనది. అంతేకాక భారతంలో గ్రంథ గ్రంథులు అంటే చిక్కుముడిలాగా విడిపోక అర్థం త్వరగా తెలియని శ్లోకాలు 8,800 ఉన్నాయని మహర్షి చెప్పాడు. ఈ శ్లోకాలు పరిశీలించండి-

"గ్రంథ గ్రంథిం తదా చక్రే మునిర్గూఢం కుతూహలాత్
యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ మునిర్ద్వైపాయనస్త్విదం।
అష్టౌ శ్లోకసహస్రాణి హ్యష్టౌ శ్లోకశతాని చ
అహం వేద్మి శుకో నేత్తి సంజయో వేత్తి వా న వా॥"

ఈ శ్లోకాల అర్థం సంజయునికి కూడా తెలియకపోవచ్చునంటున్నాడు మహర్షి, భారత లేఖకునిగా వ్యాసుడు విఘ్నేశ్వరుని కోరాడట అందుకు విఘ్నేశ్వరుడు 'నాకు వ్రాస్తూ' కూర్చోడానికి తీరుబాటులేదు. నా కలం ఆగకుండా నీవు కవిత్వం చెప్పితేనే వ్రాస్తాను. లేదా మధ్యలో వెళ్ళిపోతాను, అని షరతు పెట్టాడట, అందు పై వ్యాసమహర్షి ఆ చిక్కు తప్పించుకోడానికి 'నేను చెప్పే ప్రతి శ్లోకం నీవు అర్థం గ్రహించి వ్రాయాలని' తానుకూడా షరతు పెట్టాడట! విఘ్నేశ్వరుడు అంగీకరించాడట ఆపై తనకు ఆలోచించుకోవలసిన అవసరంవచ్చినప్పుడు ఒక చిక్కు శ్లోకం అల్లి చెప్పాడట మహర్షి. దాని అర్థం తెలుసుకోడానికి విఘ్నేశ్వరునికి కొంత సమయం కావలిసి వచ్చేదట! ఈ లోగా అవతలి గ్రంథం ఆలోచించి తయారు చేసుకునేవాడట మహర్షి! ఇట్లా ఈ చిక్కు శ్లోకాలనే గ్రంథ గ్రంథులు 8,800 ఏర్పడ్డాయి. ఈ విషయం మహర్షియే భారతంలో చెప్పాడు. ఈ విధంగా భారతం ఒక అపూర్వ గ్రంథంగా ప్రశస్తి సంపాదించుకుంది, దీనిని రచించడానికి 3 సంవత్సరములు పట్టిందని మహర్షి స్వయంగా వ్రాసియున్నాడు.

## మహాభారత కాలము

మహాభారత కాలాన్ని గురించి సనాతన భావాలకు కట్టుబడినవారి కెటువంటి అనుమానం లేకపోయినా. అధునికులకు మాత్రం చాలా క్లిష్ట సమస్యగా నేఉంది. ఈవిషయంలో బాలగంగాధరతిలక్ తన గీతా రహస్యంలో చాలా విమర్శించాడు. చివరకు తేల్చినదేమంటే షుమారు 8 వేల సంత్సర ముల క్రిందట రచింపబడి యుండాలని. దీనికి కొన్ని కారణాలు చూపించాడు. భారతంలో నక్షత్ర గణనం కృత్తికనుండి ఆరంభమైనట్లు కన్పడుతుంది. పైగా ఉత్తరాయణ ప్రారంభంకూడా శ్రవణానక్షత్రంనుండి అగుతున్నట్లు తెలుస్తున్నది. (ఇప్పుడు ఉత్తరాషాఢ 2వ పాదంనుండి ఉత్తరాయణ ప్రారంభం) ఒక నక్షత్రం వెనుకకు రాశి జరగాలంటే షుమారు వేయి సంవత్సరాలు పడుతుంది. అని ఇలాంటి జ్యోతిషికనియమానుసారం షుమారు 8 వేల సం॥ క్రిందట రచింపబడి యుండాలని ప్రతిపాదించాడు. ఈ విధంగా చెప్పిన ఇంకా కొందరు జ్యోతిశ్శాస్త్రవేత్తల అభిప్రాయంకూడా జోడించాడు. తక్కిన విమర్శకులుగూడా మొత్తంమీద కొంచెం ఎక్కువ తక్కువ అయినా ఇదే ప్రకారం నిర్ణయించారు. ఇంతకూ యిప్పటి గ్రంథం బౌద్ధులు, క్రీస్తుకంటే చాలా ప్రాచీనమని మాత్రం తేల్చారు. ఇది అధునికులు అందరి అభిప్రాయం కాని ఒక్క విషయాన్ని వీరు గుర్తించినట్టులేదు. భారతకాలాన్ని గురించి భారతంలోనే చెప్పబడింది.

> "అంతరేచైవ సంప్రాప్తే కలిద్వాపరయోరభూత్
> శమంతపంచకే యుద్ధం కురుపాండవసేనయోః"

అని ద్వాపరాంతంలో కలిప్రారంభదశలో యుద్ధం జరిగింది. ఆ తర్వాత 36 సంవత్సరాలకు శ్రీకృష్ణ నిర్యాణం జరిగింది. ఆ రోజునుండే కలియుగం ప్రారంభమైందని అన్ని గ్రంథాలలో కంఠోక్తిగా చెప్పబడి యుంది. కలియుగం ప్రారంభించి ఇప్పటికి 5072 సం॥ అని సాంప్రదాయక మైన అవిచ్ఛిన్న పరంపరగా పంచాంగకర్తలందరూ వ్రాస్తున్నారు. కలి యుగం ప్రారంభించినతర్వాత 30 సం॥కు పరీక్షిత్తు మహారాజుకు శుకుడు భాగవతం చెప్పాడు. "ఆ కృష్ణనిర్గమాత్త్రింశద్వర్షాధికగతే కలౌ। నవమీ తోనభస్యే చ కథారంభం శుకోఽకరోత్" అని ప్రమాణము. కృష్ణనిర్యాణం

తర్వాత 30సం॥లకు భాద్రపద నవమిరోజున భాగవతప్రవచనం శుకుడు మొదలు పెట్టాడట! అయితే అప్పటికే వ్యాసమహర్షి భారతం రచించి తృప్తికలుగక భాగవతం రచించినట్లు అందులోనే చెప్పబడిఉంది. తర్వాత ఎక్కువకాలం జరుగకుండానే జనమేజయ సర్పయాగం భారతకథనం ఏర్పడింది. జనమేజయ రాజ్య కాలపరిమితి గూడా అధికం కాదు. ఆవిషయం భాగవతంలో 12 స్కంధంలో స్పష్టంగా చెప్పబడింది. ఈ విషయాలన్నీ సాకల్యంగా ఎదుట ఉంచుకొని ఆలోచిస్తే భారత రచనం పాండవ రాజ్యకాలంలో అనగా కలి ప్రారంభానికి కొద్ది ముందర, లేదా పాండవ నిర్యాణానంతరం కలి ప్రారంభమైన వెంటనే, అంటే పరీక్షిత్తు రాజ్యకాలమైన 30 సం॥లోపుగా కాని జరిగి ఉండాలని తేలుతుంది. అంటే ఎట్లా లెక్కగట్టినా 5 వేల సం॥పై మాట. మరి భారతంలోని ఈమాటనుఉపేక్షించి వీరెట్లా 3వేల సం॥ అని తేల్చారు. తిలక్ లాంటి విద్వాంసుడు గూడా ఈ పంథాలో చేరిపోవడం దురదృష్టం. గ్రంథంలోని స్పష్టమైన వాక్యాలను ఉపేక్షించి ఏవో అనుమానగ్రస్తమైన ఆధారాలతో, శిలాశాసనాలతో నిర్ణయాలు చేయడం సమంజసం కాబోదు. త్రికాలవేత్తలు, దీర్ఘజీవులైన మహర్షులు ఆయా సందర్భాల ననుసరించి నక్షత్ర గణనంలాంటి విషయాలను అనేకతీరుల ప్రతిపాదించవచ్చును. అవి విషయంలో ముఖ్యప్రమాణం కాజాలవు. మూలగ్రంథ ప్రామాణ్యానికి విఘాతుకమైన విమర్శలు యుక్తంకాదు. దౌర్భాగ్యవశాత్తు నేడు ఇటువంటి పరిస్థితి అంతటా గోచరిస్తున్నది. విమర్శకులు ఆంగ్లేయుల వద్దనుండి సంక్రమించిన విజ్ఞానము, విమర్శన ధోరణులతో ఆర్షగ్రంథాలను పరిశీలించి, అందులోని కాలనిర్దేశాలు, యుగప్రమాణాలు మున్నగువానిని లక్ష్యము చేయక, నేటి విజ్ఞానరీత్యా చెప్పబడుతున్న మానవసృష్టి, మానవ నాగరికత, కాలప్రమాణాలు మాత్రమే దృష్టిలో ఉంచుకొని గ్రంథ రచనా కాలములను నిర్ణయించుతున్నారు. అందువల్లనే కొన్ని మహాయుగాలక్రిందట ఉన్నట్టు చెప్పబడుతున్న రామావతారం గురించి నమ్మక ఇవన్నీ బూటకం అనీ, కల్పిత కథ అనీ చెప్పిన వారు గూడా కొందరు ఉన్నారు. వీరి నిర్ణయాలు అసత్యపూరితాలు కావడమేగాక దీనివల్ల మరియొక అనర్థం గూడా ప్రాప్తించడానికి వీలున్నది. ఈ గ్రంథంలోని కొన్ని విషయాలు ఉపేక్షింపబడి, అప్రమాణమని నిర్ణయించబడినప్పుడు అందులోని తక్కిన విషయాలు మాత్రం ప్రమాణమని నమ్మకమేమిటి? ఏతావతా ఆర్ష గ్రంథాలన్నీ అప్రమాణాలు,

అభూతకల్పనలుగా ఏర్పడి, రామకృష్ణాద్యవతారాలు కల్పిత వ్యక్తులుగా సిద్ధాంతితమై, ఆ గ్రంథ ప్రతిపాద్యమైన భక్తి, జ్ఞానం, ధర్మం ఇవి ఆచరించవలసిన అవసరంలేకుండా పోతుంది. ధర్మాధర్మఫలాలైన స్వర్గనరకాలు, భక్తిఫలమైన భగవత్ప్రాప్తి ప్రత్యక్షదృష్టములు కానందున గ్రంథాలను నమ్మి మాత్రమే వీనియందు ప్రవర్తించవలసి ఉంది. మరి వీనిని బోధించే గ్రంథాలు ప్రమాణములుగా నిలువలేకపోయినప్పుడు ఆ విషయాలు మాత్రం నిజమని నమ్మేదెట్లా? దీనివల్ల సమాజాన్ని నైతికవిశ్వాసాల నుండి, భగవద్భక్తి నుండి చెడగొట్టడానికి వీరి విమర్శలు బాగా ఉపకరిస్తాయని మనం గుర్తించాలి. ఈ విమర్శల ప్రచారం ద్వారా సమాజంలోని నైతిక విశ్వాసాలు సడలిపోయి, సమాజంలో స్వేచ్ఛా ప్రవృత్తి రెచ్చగొట్టబడి కల్లోలానికి కారణమవుతుంది. ఇవి మన ఆర్ష విజ్ఞానాన్నే అప్రతిష్ఠపాలు చేస్తున్నది. మనసంస్కృతిని మన విజ్ఞానాన్ని సత్యమని నిరూపించినప్పుడే మన జాతీయత నిలిచి ప్రపంచంలో గౌరవం లభిస్తుంది. వాటిని మనమే అవహేళనపరిచి మనను మనమే అవమానించుకోవడం తగదు. స్వర్గనరకాలు లేకపోతే మానవుడు నైతికంగా నడవడానికి ఎన్నడూ సిద్ధపడజాలడు. మరి స్వర్గనరకాలను నమ్మడానికి గ్రంథప్రామాణ్యాలకంటే వేరే ఆధారమేమిటి? పైగా ఇట్టి విమర్శల ద్వారా మన పూర్వులను తెలివితక్కువ వాండ్లుగా మనమే ప్రకటించుకుంటున్నా మన్న మాట! ఇన్ని అనర్థాలకు మూలమైన ఈ విమర్శలను వీలైనంతదూరంగా ఉంచడం నేటి భారతీయుల కర్తవ్యం. ఇప్పుడు మన ఆర్షగ్రంథాలన్నిటికీ దాదాపు ఇదే అవస్థ ప్రాప్తించి ఉంది. అతినిగూఢమైన సాంప్రదాయాలన్నీ అనాలోచితంగా త్రోసివేయ బడుతున్నాయి. ఈ గ్రంథకర్తలైన ఋషులు త్రికాల జ్ఞానం కలిగిన మహనీయులనే మాట అందరంగీకరించేదే! వారిచే చెప్పబడిన మాటలు పూర్వాపరవిచారణ లేకుండా నిరాకరించ బూనడం యుక్తిసహం కాబోదు. ఈ నాడు పాశ్చాత్యులు కూడా మన ఉపనిషద్విజ్ఞానానికీ, సంస్కృతికి జోహారు లర్పిస్తూ, మనకంటే శ్రద్ధగా ఆదరణతో పఠిస్తున్నారు. అలాంటి మన ప్రాచీన విజ్ఞానాన్ని మనమే శంకించి న్యూనతపరచ బూనడం సహృదయులకు సహించరానిది. కాబట్టి మూలగ్రంథంలోని మాటలకు అనుకూలంగా మాత్రమే ఇతర చోట్ల ఆధారాలను సమన్వయించాలి గాని వాటికోరకు మూలగ్రంథాన్ని ఉపేక్షించగూడదు. ఇట్లా భారతకాలం 5 వేలసం॥ క్రిందటని నిర్ణయంసముచితం.

# మహాభారత కథ - కొన్ని విమర్శలు

భారత కథ అందరికీ సుప్రసిద్ధంగా తెలిసినదే. తెలుగు భారతంలో కథలో ఔచిత్యదృష్ట్యా కొన్ని మార్పులు చేయబడినా ప్రధాన కథలో మార్పేమీ లేదని చెప్పుకోవచ్చు ఇప్పుడు లోకంలో ఈ భారత కథవిషయమై కొన్ని విమర్శలు వినిపిస్తున్నాయి. ధర్మరాజుకు మాత్రమే పూర్తి రాజ్యాధికారంగానీ, దుర్యోధనునికి అసలు రాజ్యాధికారం లేదని ఒక విమర్శ. దీనికి వీరు చెప్పేదేమంటే ధృతరాష్ట్రుడు పుట్టంధుడగుటచే పాండురాజు రాజైనాడు. ఆ విషయం సంస్కృత భారతంలో "రాజా పాండుర్బభూవహ" అని స్పష్టంగా చెప్పబడింది. కాబట్టి తర్వాత అధికారం వారసుడుగా ధర్మరాజుదే. దుర్యోధనుడు అన్యాయంగా ఆక్రమించాడు. అయితే కృష్ణుడు రాజకీయ చతురుడు కాబట్టి మొదట తగాదా పెట్టక సగం రాజ్యమైనా చాలు అని ఇంద్రప్రస్థ నగరం ధర్మరాజుకు ఇప్పించి తర్వాత రాజసూయ యాగం ద్వారా మహారాజును చేశాడు. ఇట్లా ధర్మరాజుదే పూర్తి హక్కు. ఈ విషయంలో తెలుగుభారత కర్త నన్నయ కవి కథను తారుమారు చేసి అనుచితమైన పని చేశాడు అని వీరనేది. ఇది నిజంగా లోతుగా ఆలోచించ వలసిన సమస్య. నన్నయ మహాకవి ఆదిపర్వం 4వ ఆశ్వాసంలో ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డైనట్లున్ను, పాండురాజు అన్నకు శాసటగా ఉండి రాజ్య వ్యవహారాలు చూస్తూ దిగ్విజయం చేసినట్లున్ను స్పష్టంగా వ్రాశాడు. కాని పాండురాజు రాజైనట్లు నన్నయ్య చెప్పలేదు కాని 6వ ఆశ్వాసంలో దుర్యోధనుడు తండ్రితో చెప్పిన మాటలలో లోగా పాండురాజు రాజైయున్నాడు ఇప్పుడు ధర్మరాజు మళ్ళీ రాజైతే వారివంశానికే రాజ్యాధికారం నిలిచిపోయి, తన వంశానికి రాబోదని తన దుఃఖం చెప్పుకున్నాడు. ఈ విధంగా నన్నయ రచనలో వైరుధ్యం గోచరిస్తుంది. మూలమైన సంస్కృతభారతంలో ఇట్లాఉంది

> ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వాద్రాజ్యం న ప్రత్యపద్యత
> పారసీవత్వాద్విదురో రాజా పాండు ర్బభూవహ"
>
> —ఆదిపర్వం 109 అధ్యా.

కండ్లు లేకపోయినందువలన ధృతరాష్ట్రుడు రాజ్యాన్ని పొందలేకపోయినాడు. విదురుడు దాసీ పుత్రుడైనందున రాజు కాలేదు. పాండురాజు

రాజైనాడు అని. మరి నన్నయ ఈ విషయాన్ని ఎందుకు గమనించలేదు? తగిన పరిశీలన చేయకుండానే భారతరచనచేశాడా? తన గ్రంథంలోనే పూర్వాపర విరుద్ధంగా ఏలా వ్రాశాడు. ఆ మాత్రం తెలుసుకోలేక పోయాడా? ఇదీ ఇక్కడ కలిగే అనుమానం. ఈ విషయం సునిశితంగా పరిశీలించదగినది. మహాకవియైన నన్నయను వెర్రివానిగా జమకట్టి, పొరపాటు చేశాడని అంత సులువుగా అనలేము. అపాత దృష్టితో తప్పు పట్టడంకంటే, కవి ఆంతర్యం తెలుసుకోడానికి వీలైనంతవరకు యత్నించడమే గొప్పదనమూ,విజ్ఞతయునూ కథలో ఔచిత్య పోషణకు కావ్యదృష్టితో నన్నయ కొన్నిచోట్ల మూలంలో కంటే కథలో మార్పులుచేసిన మాట నిజమే! తిక్కన కవిగూడా అలాచేసిన ఘట్టాలు చాలా ఉన్నాయి. అయితే ఈ మార్పు ఏదృష్టితో నన్నయ చేసినట్టు? దీనివలన కథలోవచ్చే కొత్త సౌందర్యంకాని, ఔచిత్యంకాని ఏమిటి? పాండురాజు రాజైనందువలన ధర్మరాజుకు పూర్తి రాజ్యహక్కు ఏర్పడి, దుర్యోధనుడు దాన్ని అపహరించడానికి యత్నించి అడ్డు తగిలాడంటే పాఠకులకు ధర్మరాజుపై ఇంకా ఆదరణా, దుర్యోధమనిపై ఏహ్యభావము కలిగి కథకు పుష్టికరంగానే ఉంటుందికదా! అలాంటిది ధృతరాష్ట్రుని పట్టాభిషిక్తుని జేసి, పాండురాజును సహాయకునిగా మాత్రమే నిలిపి, ధర్మరాజుకు అర్ధ రాజ్యానికిగూడా సరియైన హక్కులేనట్లు వివాదాస్పదంగా చిత్రించడంలో ఆయన సాధించదలుచుకున్న గొప్పదనం ఏమిటి? పైగా పూర్వాపరవిరోధంగా తన గ్రంథంలోనే ఎందుకు వ్రాశాడు. ఇది చాలా లోతైన విషయం. నన్నయ అనాలోచితంగా చేశాడని చెప్పలేము. భారతకథను ఆమూలాగ్రంగా చూస్తే నన్నయ అభిప్రాయం నిజమని తోచకమానదు. కండ్లు లేకపోయినందువలన రాజ్యానికి ధృతరాష్ట్రుడు తగకపోయినా వాస్తవంగా ధృతరాష్ట్రుడే రాజ్యానికి ముఖ్య హక్కుదారుడు. అందుచే పాండురాజు అన్నగారి అనుమతితోనే అన్ని వ్యవహారాలూ చేస్తున్నట్టు మూలంలో చెప్పబడింది. ఈ శ్లోకాలు చూడండి.

"ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతః స్వబాహు విజితం ధనం
భీష్మాయ సత్యవత్యై చ మాత్రేచోపజహార సః।

తస్య వీరస్య విక్రాంతైః సహస్రశతదక్షిణైః
అశ్వమేధశతైరీజే ధృతరాష్ట్రో మహామఖైః.
—ఆదిపర్వం. 114 అధ్యా.

పాండురాజు దిగ్విజయంచేసి తెచ్చినధనాన్ని ధృతరాష్ట్రునికి సమర్పించి ఆయన అనుమతితో అందరికీ కానుకలిచ్చాడు మరియు అనేక యజ్ఞములుగూడా అన్నగారిచే చేయించాడు. కాని తానుస్వయంగా యజ్ఞములు చేసినట్లు భారతమందెక్కడా చెప్పబడలేదు. ఈ విషయం గమనింపదగ్గది.

"పాండుర్ధనుషి విక్రాంతో నరేష్వభ్యధికోఽభవత్
అన్యేషు బలవానాసీ ద్ధృతరాష్ట్రో మహీపతిః".
—ఆదిపర్వం- 109 అధ్యా.

ఇక్కడ ధృతరాష్ట్రునికి "మహీపతిః" అనే విశేషణం ముఖ్యంగా గమనార్హం.

"తతస్తు భీతవద్రాజా ధృతరాష్ట్రోఽబ్రవీదిదం
. . . . . . . . . . . . . . .
యుధిష్ఠిరో రాజపుత్రో జ్యేష్ఠో నః కులవర్ధనః
ప్రాప్త స్స్వగుణతో రాజ్యం న తస్మిన్ వాచ్యమస్తినః
అయం త్వనంతరస్తస్మాదపి రాజా భవిష్యతి"
—ఆదిపర్వం- 115 అధ్యా.

దుర్యోధనుడు పుట్టినప్పుడు ధృతరాష్ట్రుడు బ్రాహ్మణులను అడుగుతాడు ధర్మరాజు పిల్లలందరికంటే పెద్దవాడగుటచే ఏలాగూ రాజవుతాడు. కాని నా కుమారుడు అతని తర్వాత పుట్టినా రాజు కాగల జాతకుడేనా ? అని. ఇక్కడ ధృతరాష్ట్రునికి రాజా అనే విశేషణం వాడబడింది. మరియు దుర్యోధనునికి రాజ్యాధికారం ఉందని ధృతరాష్ట్రుని మాటలవల్ల వ్యక్తమవుతుంది. ఎందుకంటే తను రాజు కాకపోతే తన కుమారునికి మాత్రం రాజ్యం ఎట్లావస్తుంది ? అప్పుడు రాజు కాగలడా అనే ప్రశ్నకు ప్రసక్తిలేదు. పెద్దవాడు ధర్మరాజు ఉన్నాడు కాన ఈ అనుమానం వచ్చింది. ఈ విషయాల

నన్నింటిని సూక్ష్మంగా ఆలోచిస్తే తేలే పర్యవసానమిది. రాజ్యాన్ని నిర్వహింపదగిన యోగ్యత లేకపోయినందువలన ధృతరాష్ట్రుడు పేరుకు రాజైనా వ్యవహారమంతా పాండురాజే నిర్వహిస్తూ వచ్చాడు. కాని హక్కు ధృతరా నికి ఏర్పడేయుంది. ఆ విధంగా రాజు కాబట్టే పాండవులకు అర్ధరాజ్యం ఇవ్వడానికిగానీ, ధర్మరాజును యువరాజుగా చేయడానికిగానీ, మొదటి ద్యూతసమయంలో పాండవులను దాసత్వంనుండి విడుదలచేసి రాజ్యం పునః ఇవ్వడానికిగానీ, ధృతరాష్ట్రునికి అధికారం ఏర్పడింది. ధృతరాష్ట్రుని చర్యలను భీష్మాదులైన పెద్దలందరూ ఆమోదించారు. విదురుడు అనేక పర్యాయములు రాజు అని ధృతరాష్ట్రుని సంబోధిస్తాడు. రాజా అనే విశేషణం అనేక ప్రదేశాల్లో ధృతరాష్ట్రునికి వాడబడింది. ఈ విధంగా రాజు ధృతరాష్ట్రుడే అయినట్లు వ్యాస భారతంలో పలుతావుల స్పష్టపడుతుంది. అయితే దుర్యోధనుడు తండ్రితో చెప్పిన మాటలలో పాండురాజు రాజుగా ఉండెను, అనే మాటల తాత్పర్యమేమిటి ? పై అభిప్రాయాన్నిబట్టే అర్థం చెప్పుకోవాలి పాండురాజు అన్నకు బదులుగా రాజ్యం నిర్వహించాడు. కాబట్టి ప్రజలందరూ పాండురాజును రాజుగానే గౌరవించారు. ఇప్పుడు ధర్మరాజు పునః రాజైతే వారి వంశంలో గౌరవప్రతిష్ఠ లధికమై తమకు ప్రజలలో పలుకుబడి పోవచ్చునని ఆ మాటల అర్థం చెప్పుకోవాలి. అలా కాదంటే కొన్ని ప్రశ్నలు ఇక్కడ తలెత్తుతాయి. ధర్మరాజు చాలా మాటకారి ఎప్పుడైనా తన పూర్తి హక్కును గురించి వెల్లడించి దుర్యోధనుని బెదిరించడా ? ఎప్పుడూ అర్ధరాజ్యాన్ని మాత్రమే అడుగుతూ, చివరకు అయిదు ఊళ్లైనా ఇమ్మని హీనంగా అడుగుతాడా ? భీష్మాదులు ఎవరైనా ఒక్కసారైనా ఈ విషయం అనక పోతారా ? అలాటి మాట మరి ఒక్కసారైనా భారతంలో లేదే ! మహారాజకీయ చతురుడైనా కృష్ణుడు తన రాయబారంలో ఈ విషయం ఎందుకు ప్రస్తావించలేదు. కాబట్టి ధర్మరాజుకు పూర్తి హక్కు ఉన్నదని చెప్పడానికి వీలులేదు. ఇట్లా ఆమూలాగ్రంగా పరిశీలించినప్పుడు సంస్కృతమే నన్నయ రచనకు దోహదం కల్పిస్తుంది. పాండురాజు మరణానంతరం పునః రాజ్యాభిషేకం ఎవ్వరికనే విచారణ భారతంలో లేదు. అంటే అర్థమేమిటి ? ధృతరాష్ట్రుడు రాజై యే ఉన్నాడు కనుక మరలా రాజును ఏర్పాటు చేయడం అనే ప్రసక్తి లేదు. ఇదిగూడ గమనింపతగ్గది. ఇలాటి అభిప్రాయాలు అతిసూక్ష్మంగా పరిశీలించియే మహాకవి

యైన నన్నయ్య సౌలభ్యం కొరకు మొదటనే స్పష్టంగా ధృతరాష్ట్రుడు పట్టాభిషక్తుడైనట్లు వ్రాశాడు. పై శ్లోకానికి గౌణంగా అర్థ కల్పనం చేసుకుంటే సరిపోతుంది. "రాజ్యం న ప్రత్యపద్యత" అంటే ధృతరాష్ట్రుడు పుట్టంధుడైనందువలన పేరుకు రాజైనా రాజ్యం నిర్వహించలేక పోయాడు. "రాజా పాండుర్బభూవహ" అనగా పాండురాజే రాజుగా ప్రవర్తిస్తూ సర్వం నిర్వహించేవాడు అని. అప్పుడు ఎట్టి విప్రతిపత్తి ప్రాప్తించదు.

ఇంకా అర్జునుని కంటే కర్ణుడే గొప్ప వీరుడు అనే విమర్శ ఒకటుంది. వీరొక పద్యం ఉదహరిస్తారు.

"నరుచేతను నాచేతను
వరమడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధరచేత శల్యుచేతను
నరయంగా కర్ణుడీల్గె నార్గురిచేతన్"

అని ఈ పద్యం ఎక్కడిదో తెలియదు కాని ప్రసిద్ధిగా ఉంది, పైగా కర్ణ పర్వంలో అర్జునుడు కర్ణునిచూచి బెదిరిపోయినట్టుగా వర్ణింపబడియుంది. అందుచే అర్జునుని కంటే కర్ణుడే సమర్థుడు అని. కాని ఈ విధంగా నిర్ణయం కాజాలదు. పై పద్యాన్ని పరిశీలిద్దాము. కుంతి కోరింది తక్కిన నలుగురిని చంపవద్దని కాని, అర్జునుని చంపవద్దని కాదుగదా! అందుచే అపరం కర్ణునికి అడ్డంరాదు. శల్యుడు కొంత నిరుత్సాహపరిచినా, అందువల్ల కర్ణుడు యుద్ధం చేయలేక పోయినట్లు భారతంలో ఎక్కడాలేదు. నాగాస్త్ర సమయంలో శల్యుడు మోసగింపజూచినా కర్ణుడు మోసపోలేదు. భూమిలో రథ చక్రం క్రుంగడం, కవచ కుండలాలు పోవడం కొంత ఇబ్బందిని కలిగించినా, కర్ణుని పూర్వచరిత్ర తలుచుకుంటే కర్ణుని పరాక్రమం గొప్పదికాదని తెలిపోతుంది. తనరాజైన దుర్యోధనుని ఘోషయాత్రలో చిత్రరథుడనే గంధర్వుని బారినుండి రక్షించలేక పారిపోతే అర్జునుడువచ్చి రక్షించాడు. ద్రౌపదీ స్వయంవరంలో అర్జునునితో యుద్ధంచేసి చేతగాక ఊరుకున్నాడు. ఉత్తర గోగ్రహణంలో అర్జునుడు ఒంటరిగా వచ్చిన మంచి సమయమని తెలిసికూడా ఏమి చేయలేకపోయాడు. అభిమన్యుడు, భీముడు, సాత్యకి చివరకు ఘటోత్కచుని చేతిలో గూడా ఓడిపోతాడు. యుద్ధంలో కర్ణుడు పారిపోయిన సంద

ర్థాలు అనేకం. ఉభయుల బలాబలాలు తెలిసిన ద్రోణాచార్యుడు మొదలైన వారందరూ కర్ణుడు అర్జునుని చేతిలో చాలడని మొదటినుండి చెబుతూనే ఉన్నారు. కాబట్టి కర్ణుని శక్తి గొప్పది అని చెప్పడం అసమంజసం. ఇంకా ద్రౌపది, కుంతి వీరిని గురించి విమర్శించే వారున్నారుగాని అది ఆలోచించని విమర్శ. దేశకాలపరిస్థితులను బట్టి ధర్మం భిన్నంగా ఉందనీ, ఎప్పటి సాంఘిక న్యాయం ప్రకారం శాస్త్రరీత్యా నడుచుకోవడమే అప్పటి ధర్మమని సూక్ష్మ విచారణ కలిగినవారు ఈ విమర్శ చేయబోరు. ఇలాటి భిన్న భిన్న దేశ కాల, యుగ, ఆపద్ధర్మాలు వివరంగా భారతంలో చెప్పబడి యున్నాయి.

భీష్మద్రోణులు అధర్మం తరపున యుద్ధం చేయడం సబబేనా? అనే విమర్శ ఒకటి ఇది సారవంతమైన విమర్శయేగాని, ఇందులో సూక్ష్మ తత్త్వం గమనించాలి. బహుశా యుద్ధం రాకపోవచ్చునని వారనుకొని యుండవచ్చు. కాని యుద్ధం రానేవచ్చింది, అంతవరకు దుర్యోధనుని పోషణలో ఉండి అప్పుడు వ్యతిరేకించడం ధర్మం కాదుకదా! అందుచే భీష్మ ద్రోణులు ఆ కార్యం యొక్క పాపపుణ్యాలు యజమానికి వదలి వీరోచిత మైన సేవాధర్మం నిర్వర్తించారు. ఒకరి పోషణలో ఉండేవారు పరవశంగా ఏ పని చేసినా ఫలితం వారికి లేదని ధర్మశాస్త్రం చెబుతుంది. పైగా వారు జ్ఞాన దృష్టి కలవారు కాబట్టి ఇతరుల ప్రారబ్ధ ప్రేరితులై నిరహంకారంగా ఏ పని చేసినప్పటికీ ఫలితం వారికి అంటదని "శారీరం కేవలం కర్మ కుర్వన్నా ప్నోతి కి

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా

అనే భగవద్వచనంరీత్యా మనం సరిపెట్టుకోవచ్చును.

ధర్మరాజు అబద్ధమాడలేదా? మరి ధర్మరాజు ఎట్లా అయినాడు ? అనే ప్రశ్న ఒకటి ధర్మరాజు ఆడింది అబద్ధంకాదు, అశ్వత్థామ అనే ఏనుగు చని పోతే ఆనెపంతో "అశ్వత్థామా హతః" అని పెద్దగా పల్కి, "కుంజరః" అని చిన్నగా అన్నాడు. కనుక చెప్పింది నిజమైన విషయమే ! కాని కార్యావ సరాన్నిబట్టి చెప్పే వైఖరిని ఉపయోగించుకున్నాడు. అందుచే ఇది అబద్ధం కాక వంచన అని చెప్పబడుతుంది. వంచన అబద్ధంవలె పాపకారి కాదనీ

దాన్ని కనుక్కోలేకపోవడం అనతరివారి లోపమేనని పెద్దలు నిర్ణయించారు. భీష్ముడుగాని, ఇతర ఋషులుగాని ఎన్నడూ దీనిని ఆక్షేపించలేదు. అందరూ ధర్మరాజును సార్థకనాముడు అనే అన్నారు. మనంగూడా లోకంలో కొన్ని క్లిష్టసమయాలలో మాట సగంమింగి ఎటూ తేలకుండా మాట్లాడడం సంభవిస్తుంది. అది అబద్ధమాడడం అనిపించుకోదుగదా! అందుచే ధర్మరాజు చరిత్రలో కళంకంలేదు.

అతివిస్తృతమైన భారత కథలో ఇంకా అనేక చిన్నచిన్న విమర్శలు వచ్చినా, అవి సరిగా భారతకథ తెలియకా, కేవలం తప్పు పట్టాలనే కొంటెతనంవల్లనూ చేసే విమర్శలు కాబట్టి వాటిని మనం లెక్కించ నవసరంలేదు.

## భారతం - ధర్మవేదాంత వివరణము

'సర్వత్రులై సముపాహోక్షిప్తః; భారతం పంచమోవేదః' అని నీతి, ధర్మ, వేదాంత నిర్దేశములందు భారతము మిగుల ప్రశంసింపబడి ఉంది. ఈ విషయాలు భారతమంతటా ప్రాసంగికంగా వివరించబడినే ఉన్నాయి కాని విశేషించి శాంతి, అనుశాసనిక పర్వాలు, భగవద్గీత ఇందుకు ప్రసిద్ధి వహించాయి కాగా ఉద్యోగపర్వంలోని విదురబోధ, సనత్సుజాతీయం, అశ్వమేధ పర్వంలోని అనుగీతలు, అరణ్య పర్వంలోని యక్షప్రశ్నలు మొదలైనవికూడా ముఖ్యమైన ఘట్టాలే! మానవులకు కావలసిన సామాన్యమైన నీతులు, సాంఘిక నియమాలు, రాజధర్మాలు, మొదలు వేదాంత తత్త్వంలోని నిగూఢ రహస్యాల వరకూ కూలంకషంగా చర్చించి సిద్ధాంత మొనర్చింది సంస్కృత వాఙ్మయంలో ఒక్క భారతమేనని చెప్పడంలో అతిశయోక్తిలేదు. భగవద్గీతవంటి మహోన్నత తత్త్వబోధక గ్రంథాన్ని ప్రసాదించిన భారతాన్ని గురించి ఈ విషయంలో అధికంగా చెప్పవలసిన పనిలేదు. ఇంత విస్తృతమైన ఈ ధర్మ నిర్ణయ సముద్రంలో కొన్ని రత్నాలలాగా కొన్ని విషయాలు-భారతంలోని అపూర్వతను, వ్యాసమహర్షి మేధాశక్తిని స్ఫురింప జేసేవి యథా సంభవంగా ఇక్కడ ప్రస్తావిస్తాను. భగవద్గీత సర్వతః ప్రసిద్ధమే గనుక దానిని పునః వివరించవలసిన పనిలేదు అనుకుంటాను, గీతనే గనుక వివరించబూనుకుంటే ఎన్నిరోజులు, ఎంతవ్రాసినా అంతు తేలదని చెప్పవచ్చు. దానికి నాటినుండి నేటివరకు వ్రాయబడిన, వ్రాయబడుచున్న వ్యాఖ్యానాలు,

పెద్దల ప్రచారాలే దాని గొప్పదనానికి తార్కాణం. అందుచే సర్వులకు ఎంతో కొంత పరిచయమైన భగవద్గీతకాక, యితరచోట్ల భారతం చెప్పే ధార్మిక వేదాంత విషయాలనే ఇక్కడ వివరింప దలుచుకున్నాను.

ఉద్యోగపర్వంలో విదురుడంటాడు:

"అర్థాగమో నిత్యమరోగితా చ
ప్రియా చ భార్యా ప్రియవాదినీ చ
వశ్యశ్చ పుత్రోఽర్థకరీ చ విద్యా
షట్ జీవలోకస్య సుఖాని రాజన్".

నిత్యమూ ద్రవ్యార్జన, ఆరోగ్యము, తనకు ప్రియమైన భార్య- తన యందు ప్రేమ కలిగిన భార్య, చెప్పినమాట వినే కుమారుడు, ద్రవ్యార్జనకు పనికివచ్చే చదువుకల్గి యుండుట— ఈ ఆరు లోకంలో చాలా సుఖకరాలు. ఇందులో 1,6 విషయాలు ఎంత లోకానుభవాన్ని చాటుతున్నాయో గమనించండి.

ఉద్యోగపర్వంలోనే అంటాడు:

"ద్వావంభసి నివేష్టవ్యౌ గవే బధ్వా దృఢాం శిలాం
గృహస్థశ్చ నిరారంభో కార్యవాంశ్చైవ భిక్షుకః"

ఏపనీ చేయకుండా దైవమే తెచ్చిపెట్టాలని వ్యర్థ కాలక్షేపంచేసే గృహస్థును ఏట్లోకి నెట్టినా తప్పులేదట.

వ్యాసమహర్షియొక్క ధర్మ నిర్ణయం ఎంత సూటిగా ఉంటుందో చూడండి.

"నతత్పరస్య సందధ్యాత్ ప్రతికూలం యదాత్మనః
ఏష సంక్షేపతో ధర్మః కామాదన్యః ప్రవర్తతే".

—అను. పర్వ అధ్యా. 113

తనకు బాధాకరంగా తోచేవన్నీ ఇతరులకు గూడా బాధాకరాలే కాబట్టి అట్టి ప్రవర్తన యితరులయెడ మానుకోవాలి. ఇదీ ఒక్క మాటలో వున్న స్వరూపనిర్ణయం. దీనికే తిక్కన కవి తెలుగుపద్యం.

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పదములకెల్లన్"

అని ఇంత నిశితంగా నిర్ణయిస్తాడు వ్యాసమహర్షి. మరియొక రీతి చూడండి.

"యో యథా వర్తతే యస్మిన్ తస్మిన్నేవం ప్రవర్తయన్
నాధర్మం సమవాప్నోతి న చాశ్రేయశ్చ విందతి"
—ఉద్యో.ప. అధ్యాయ. 179.

యస్మిన్ యథా వర్తతే యో మనుష్య
స్తస్మిం స్తథా వర్తితవ్యం స ధర్మః
మాయాచారో మాయయాం బాధితవ్య
స్సాధ్వాచారః సాధునా ప్రత్యుపేయః"
—శాం.ప. అధ్యా 109.

అవతలివాడు మోసగాడైై మనం గూడా ఆత్మరక్షణకొరకు మోసగాండ్లమైనా తప్పులేదట! ఎవడు ఏవిధంగా నడుచుకుంటాడో వాడియందు అలాటి ప్రవర్తననే చూపించవచ్చునట! ఎంత నిశితనిర్ణయమిది !

సత్యము యొక్క స్వరూపాన్ని ఎలా నిర్ణయిస్తాడో చూడండి.

"సత్యస్య వచనం శ్రేయస్సత్యాదపి హితం వదేత్
యద్భూతహితమత్యంతం ఏతత్సత్యం మతం మమ"
—శాం.ప. అధ్యా 329.

"యద్భూతహితమత్యంతం తత్సత్యమితి ధారణా"
—వన.ప. అధ్యా 208.

నిజంచెప్పడంకన్నా జనహితమైన మాటచెప్పడమే శ్రేయస్కరమట! అసలు ఉన్నది ఉన్నట్టు చెప్పడంకన్నా జనహితమైన మాటకే సత్యమని పేరు పెట్టాలంటున్నాడు. ఎంత చక్కని నిర్ణయం! అసత్యం విషయంలో అంటాడు.

"అకూజనేన చేన్మోక్షో నావకూజేత్కథంచన
అవశ్యం కూజితవ్యేవా శంకేరన్వాప్యకూజనాత్
శ్రేయస్తత్రానృతం వక్తుం సత్యాదితి విచారితం"

—శా.పర్వ. అధ్యా 109.

తాను చెప్పే సత్యమైన మాటవల్ల జనులకు అపకారం కలిగేటట్టుంటే ఆమాట చెప్పకుండా వీలైనంతవరకు తప్పించుకోవాలట! అలా కుదరక చెప్పవలసివస్తే అబద్ధం చెప్పు. అంతే కాని జనబాధ కలిగించే సత్యం చెప్పవద్దంటున్నాడు. ఇంతటి సూక్ష్మనిర్ణయాలు మనకు మరొక గ్రంథంలో లభించవు. మరొకవిషయం చూడండి.

"ఏతావానేవ పురుషో యదమర్షీ యదక్షమః
క్షమావాన్నిరమర్షశ్చ నైవ స్త్రీ న పునః పుమాన్"

రోషం కలిగినంతవరకేనట పురుషుడని అనిపించుకొనేది. క్షమమాత్రం కలిగి రోషంలేకపోతే వాడు షండుడేనట! నిజంగా ఇది ఎంత ఆత్మాభిమానాన్ని ఉద్బోధిస్తున్నదో చూడండి! భారతాన్ని పూర్తిగా ప్రజలకు బోధించి, వారికి వికాసం కలిగించిననాడు మనజాతి ప్రపంచంలో మహోన్నతస్థితిని అనుభవించగలదనడంలో సందేహంలేదు. ధర్మాన్ని గురించి యేమి చెబుతున్నాడో గమనించండి.

"ధారణాద్ధర్మమిత్యాహుః ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యాద్ధారణ సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః."

—కర్ణ.ప. అధ్యా 69.

ప్రజలమనుగడను దేశకాల పాత్రములకు తగ్గట్టుగా తీర్చిదిద్ది, వారికి శ్రేయస్సును కలిగించేదే ధర్మం. సమాజస్థితిని ధరిస్తుంది అంటే స్థిరంగా ఉంచుతుంది కాబట్టి ధర్మం అని చెప్పబడుతుంది. అని నిర్వచిస్తూ ఇంకా అంటాడు.

"అన్యే కృతయుగే ధర్మాః త్రేతాయాం ద్వాపరే పరే
అన్యే కలియుగే నౄణాం యుగహ్రాసానురూపతః"

"న హి సర్వహితః కశ్చిదాచారస్సంప్రవర్తతే
తే నైవాన్యః ప్రభవతి సోఽపరం బాధతే పునః"
—శాం.ప. అధ్యా 259.

ధర్మస్వరూపం యుగయుగానికీ మారుతుంటుంది. ఆయా యుగాలలోని మానవుల మానసిక, శారీరకశక్తి తారతమ్యం అనుసరించి మార్పులు అవసరమౌతాయి. కాబట్టి అప్పటి సాంఘిక పరిణామం, అవసరాన్నిబట్టి ధర్మనిర్ణయం చేయాలిగాని, మరియొక స్థితిలోని ధర్మంతో దీనిని పోల్చగూడదు. అందరికీ అన్నివేళలా అన్ని పరిస్థితులలో సరిపడే ధర్మం ఏదీ ఉండదు. ఒకప్పటి ధర్మం మరియొకప్పటికి సమాజ కల్లోలానికి కారణం కావచ్చు. కాబట్టి మార్పులు అవసరం అని తీర్మానించాడు. ఇది యెంతటి నిశితమైన పరిశీలనమో చూడండి. ఇట్టి సందేశాలొసగిన వ్యాసమహర్షి మన భారతదేశానికే గర్వకారణం. ఆయనకు మనజాతి యెంతైనా ఋణపడి ఉంది. ధర్మస్వరూపాన్ని గూర్చి ఇంకా అంటాడు.

"తర్కోఽప్రతిష్ఠః శ్రుతయశ్చ భిన్నా
నైకో ఋషిర్యస్య వచః ప్రమాణం
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతస్సపంథాః" —వన.ప. అధ్యా 312.

ధర్మస్వరూపాన్ని మన ఊహద్వారా తర్కముద్వారా నిర్ణయించలేము. ఎందుచేతంటే తర్కము, ఊహ నిలుకడకలిగినవి కావు. మనకంటే బుద్ధిమంతుడు దీనిని తప్పని నిరూపించవచ్చును అలాగే శ్రుతులు, స్మృతులు కూడా పరస్పరం భిన్నంగా అక్కడక్కడ గోచరిస్తున్నాయి. అందుచే ధర్మస్వరూపం గుహలో దాగిఉన్నట్టు నిగూఢంగా ఉంది పెద్దల ఆచారాన్ని అనుసరించి ప్రవర్తించడంకంటే గత్యంతరంలేదు.

"యేనాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః
తేన యాయాత్సతాం మార్గం తేన గచ్ఛన్నరిష్యతి॥"

మన తాతలు తండ్రులు నడిచిన ధార్మిక మార్గాన్నే మనం గూడా అనుసరిస్తే మిక్కిలి శ్రేయస్కరమట ! ఈ ధర్మనిర్ణయానికి మనం జోహారు

ఆర్పించాలి! ఇదే ఆత్మవివేచనాన్ని గురించి భారతం ఏమి చెబుతోందో చూద్దాము. జీవలక్షణాన్ని చెబుతూ

"ఆత్మా క్షేత్రజ్ఞ ఇత్యుక్తః సంయుక్తః ప్రాకృతైర్గుణైః
తైరేవతు వినిర్ముక్తః పరమాత్మేతి కథ్యతే॥"

—శాం. వ. అధ్యా 187

చిద్రూపమైన ఆత్మ ప్రకృతికి సంబంధించిన గుణాలతో కలిసినప్పుడు క్షేత్రజ్ఞుడు అంటే జీవుడు అని చెప్పబడుతుంది. ఆ గుణాలతో సంబంధం వదులుకున్నప్పుడు పరమాత్మగానే ఉండిపోతుంది. ప్రకృతి గుణాలంటే గుణకల్పితాలైన మనస్సు, బుద్ధి, ఇంద్రియాలన్నమాట! మనస్సు, ఇంద్రియాల సముదాయానికి మనోమయకోశమనీ, బుద్ధి, ఇంద్రియాలు వీని సముదాయానికి విజ్ఞానమయకోశమనీ పేరు. ఇట్టి ఉపాధిలో చేరిన అనగా తాదాత్మ్యాభిమానం కలిగిన ఆత్మ చైతన్యం ఆ దశలో జీవుడని చెప్పబడుతుంది. అందుచేత పంచకోశ వివేచనం చేసి ఆత్మను గ్రహించాలి అని వేదాంత శాస్త్రం చెబుతుంది. అయితే "ఆత్మైవేదగ్ం సర్వం, నేహనానాస్తి కించన, సర్వం ఖల్విదం బ్రహ్మ" మొదలైన శ్రుతులు ఆత్మకంటే భిన్నంగా వేరొక వస్తువు లేదని చాటుతున్నాయి. మరి ఉపాధిభూతమైన రెండవ వస్తువు ఎక్కడ ఉన్నది? లేకపోతే ఉపాధి ఎట్లా ఏర్పడింది? అనే శంక వస్తుంది. కావుననే "తత్త్వాన్యత్వాభ్యామనిర్వచనీయ రూపా" అని ఆత్మయొక్క అనిర్వచనీయశక్తినే మాయ అని, అట్టి మాయవల్లనే ఇవి అన్నీ ఉన్నట్టు భ్రాంతిమాత్రంగా కల్పింపబడుతున్నాయి గానీ వాస్తవంగా లేవనీ, అయినా ఈ విషయం తెలియక అజ్ఞాన దశలో ఉన్నంతవరకూ ఇది ఉన్నట్టుగానే ప్రతీతమై ఆత్మకు ఉపాధిగా ఏర్పడుతున్నాయనీ వేదాంత శాస్త్రం నిర్ణయిస్తున్నది. దీనికి స్వప్నం, రజ్జుసర్పభ్రాంతి మొదలైన ఉదాహరణములు ఎన్నో చూపింపబడ్డాయి

"అనేన జీవేన ఆత్మనా అను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"

అని ఉపనిషత్తు ఆత్మయే జీవరూపంగా ఉపాధిలో గోచరిస్తున్నది అని స్పష్టపరుస్తున్నది. ఇట్లా ఉపనిషత్తుల పరమతాత్పర్యమైన అద్వైతరహస్యాన్ని ఒక్క శ్లోకంలో ఇమిడ్చి చక్కగా చెప్పింది భారతం.

ఉద్యోగ పర్వంలో సనత్సుజాతీయంలోని ఈ శ్లోకాలు చూడండి.

"దోషో మహానత్ర విభేదయోగే హ్యనాది యోగేవ భవంతి నిత్యాః
తథా స్యనాధిక్యమపైతి కించిత్ అనాదియోగేన భవంతి పుంసః॥"

—ఉద్యోగపర్వం. అధ్యా. 42

ఈ లోకంలో భేదవాదాన్ని నమ్మి భేదదృష్టిని పాటించితే మహాదోషము కలదు. "మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అని ఉపనిషత్తు నానాత్వభావనకలవాడు అంతకంతకూ హీన జన్మలు పొందుతూ మృత్యువశుడౌతుంటాడని చాటి చెప్పుచున్నది. మరియు "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తత్త్వమసి" "అయమాత్మా బ్రహ్మ" "నేహనానాస్తి కించన" మొదలైన శ్రుతులు వ్యర్థములౌతాయి. ఇలాంటి దోషము ప్రాప్తిస్తుంది. అయితే జీవులు ఎట్లా ఉద్భవించారు? దానికి సమాధానం. అనాదియోగం అంటే మాయా సంబంధంచేత నిత్యులైన జీవులు పురుషుడు అనగా పరమాత్మనుండి అభివ్యక్తమౌతున్నారు. అనగా ఆత్మ జీవునివలె గోచరిస్తున్నాడు. ఇట్లా అనేక విధాల ఉన్నట్టుగా గోచరిస్తున్నప్పటికి పరమాత్మకు స్వరూప భూతమైన ఆధిక్యం అంటే శుద్ధత్వాది గుణాలు పరమార్థంగా తొలగి పోవడంలేదు. ఎందువల్ల? ఈ జీవులందరు మాయాచమత్కారం చేత మాత్రమే పరమాత్మనుండి గోచరిస్తున్నారు కనుక. ఈ విధంగా సర్వశ్రుతి సిద్ధాంతం ఒక్క శ్లోకంలో చక్కగా చెప్పాడు. మరియొకటి చూడండి

"శరీరమేతౌ కురుతః పితా మాతా చ భారత
ఆచార్యశస్తు యజ్జన్మ తత్సత్యం వై తథామృతం॥"

—ఉద్యోగ. పర్వ. అధ్యా. 44

తల్లిదండ్రులు ఈ శరీరాన్ని ఉత్పాదించారు. కాని శరీరం అనిత్యము కనుక ఈ జన్మగూడా అనిత్యము. సద్గురువువల్ల కలిగే జ్ఞానరూప జన్మ సత్యము, దుఃఖ రహితం కనుక అమృత స్వరూపమున్నూ అవుతుంది. కాబట్టి గురువు వలన కలిగే జన్మకొరకు మానవుడు యత్నించాలి.

మరియొకటి—

"న చ్ఛందాంసి వృజినాత్తారయంతి
మాయావినం మాయయా వర్తమానం

నీడం శకుంతా ఇవ జాతపక్షాః
ఛందాంస్యేనం ప్రజహంత్యంతకాలే"

—ఉద్యోగ పర్వం. 43 అధ్యా.

మాయా ప్రవర్తన కలిగిన కపట స్వభావుడు ఎన్ని వేదాలు చదువుకున్నా ఆ వేదాలు పాపంనుండి వానిని ఉద్ధరించవు. రెక్కలు వచ్చిన పక్షులు గూటినుండి ఎగిరిపోయినట్లు ఆ వేదాలు మరణ కాలంలో వానిని విడిచి పోతాయి. అంటే వేదపాఠ ఫలమైన జ్ఞానము బుద్ధిలో గోచరింపక, వేద పాఠంవల్ల కలిగే పుణ్యంగూడా నిస్సారమై వాడు కర్మఫలాన్ని అనుభవించవలసే ఉంటుంది. ఇట్లా వేదాంతం అతి సుందరశైలిలో భారతంలో నిర్వచింపబడింది శాంతి పర్వంలోని హంసగీత, జనకసులభాసంవాదము, మొదలైన ఉపాఖ్యానాలు మనోరంజకంగా తత్త్వనిరూపణం చేస్తున్నాయి. భగవద్గీత, సనత్సుజాతీయం- వీనిని గూర్చి చెప్పవలసిన అవసరమే లేదు. ఈ నాడు భగవద్గీత పేరు తెలియని అతురాస్తికుడున్నాడంటే నమ్మలేము. సర్వులకు గౌరవనీయమైన ఇది భారతంలోదే కదా! ఇట్లా ఆత్మ నిరూపణమే గాక మానవజీవితానికి అవసరమైన అన్నివిషయాలనూ నిష్కర్షగా బోధించినది ఒక్క భారతమేనని చెప్పవచ్చు. భగవద్గీతలతాత్పర్యంగురించి కొన్ని అభిప్రాయభేదాలు ఉన్నాయి ముఖ్యంగా అందులో బోధింపబడింది అద్వైతమా ? భక్తియా ? కర్మయోగమా ? మొదలైన వాదోపవాదాలు ఉన్నాయి. కాని ఉపనిషత్తుల ముఖ్యతాత్పర్యం అద్వైతమని నిర్ణయింపబడినప్పుడు గీతలు దానికివిరుద్ధమని చెప్పలేము. సర్వోపనిషత్తులసే అవులపాలే గదా భగద్గీత! అందుచే ఉపనిషత్తాత్పర్యాన్ని వ్యతిరేకించదు. శ్రుతిమతవిరుద్ధమైతే దాని ప్రామాణ్యమే లోపిస్తుంది, కాబట్టి అద్వైతమే దాని తాత్పర్యమైయుండాలి కాని భక్తి, కర్మయోగాలు ప్రారంభంలో జ్ఞానయోగానికి సాధనలో అవసరమౌతాయి. కాబట్టి అవిగూడా గీతలలో వర్ణింపబడ్డాయి. ఈవిధంగా సర్వమార్గాలకు సమన్వయంకలిగించి అపూర్వవేదాంతగ్రంథంగా, మానవజీవితానికిమార్గదర్శకంగా, లోకానికి శ్రీకృష్ణుడిచ్చినవరంగా, భారతదేశం యొక్క అమూల్యసంపదగా, విజ్ఞానభాండాగారంగా ప్రపంచమంతటా ప్రసిద్ధినొందిన భగవద్గీత భారతానికేకాక, భారతదేశానికే ఒక అమూల్యాలంకారం. దీనితో భారతం వేదాంతంలో ఎంతమహోన్నతస్థితిని అందు

కన్నదో మనం గ్రహించవచ్చు. కర్మవిపాకం మొదలైన యితరవిషయాలను గురించి భారతం అభిప్రాయం పరిశీలింతాము.

"పాపం కర్మ కృతం కించిత్ యది తస్మిన్నదృశ్యతే,
నృపతే తస్య పుత్రేషు పౌత్రేష్వ పి చ నప్తృషు"
—శాం-ప-అధ్యా 129

మానవుడుచేసినపాపం ఒకవేళ వాడియందు ఫలితాన్ని ఇవ్వకపోతే అఫలితాన్ని వానికుమారులు, మనుమలు మునిమనుమలైనా అనుభవించ వలసివస్తుందట !

ఇంకా అంటాడు.

"కదా చిత్సుకృతం తాతకూటస్థమివ తిష్ఠతి,
మజ్జమానస్య సంసారే యావద్దుఃఖాద్విముచ్యతే"
—శాంతి. ప. అధ్యా 290

చేసిన పుణ్యకార్యముల ఫలితం వెంటనే కలుగలేదని చింతవద్దు. ఆఫలితం తప్పక వీనిని అనుసరించియుండి ప్రతిబంధకప్రారబ్ధము నివర్తించగనే ఫలితాన్ని ఇచ్చితీరుతుంది కాని నశించదు. ఆవిధంగానే లోకంలో హఠాత్తుగా, నిష్కారణంగా అదృష్టంకలిసివచ్చేవారిని చూస్తుంటాము గదా! పుణ్య కార్యాలు చేసినప్పుడు దురభిమానం ఉంటే- అవి ఫలితాన్నీయవంటాడు.

"చత్వారి కర్మాణ్యభయంకరాణి
భయం ప్రయచ్ఛంత్యయథాకృతాని,
మానాగ్నిహోత్రముతమానమౌనం,
మానేనాధీతముతమానయజ్ఞః"

అగ్నిహోత్ర ఉపాసన, మౌనం, అధ్యయనం, యజ్ఞము ఇవన్నీచాలా మేలుకలిగించేవే అయినా మానం అంటే అహంకారంతో చేసినప్పుడు తగిన సత్ఫలితాన్నీయవట !

"తస్మాద్ధర్మానిమాంత్సర్వాన్నాభిమానాత్సమాచరేత్"
—వన. ప. అధ్యా 2

ధర్మాలను అభిమానం-అంటే అహంకారం, ఫలాసక్తితో చేయగూడ దనీ అలాచేస్తే అజ్ఞానమనే అనర్థాన్ని అభివృద్ధిచేస్తాయనీ అంటాడు.

మరొకవిషయం చూడండి.

ప్రాయేణ శ్రీమతాం లోకే భోక్తుంశక్తిర్న విద్యతే,
కాష్ఠాన్యపి హి జీర్యంతే దరిద్రాణాంమహీపతే"
సంపన్నతరమేవాన్నం దరిద్రా భుంజతే సదా,
క్షుత్స్వాదుతాం జనయతి సాచాఢ్యేషు న దృశ్యతే"
—ఉద్యో. ప. విదురనీతి

లోకంలో భాగ్యవంతులకు భోజనంచేయడానికి తగిన ఆకలి, జీర్ణశక్తి ఉండటం అరుదు. కాని తినడానికిదొరకని అభాగ్యులకు కర్రలుతిన్నా జీర్ణించుకొనేశక్తి ఉంటుంది. ప్రారబ్ధకర్మవైచిత్ర్యమిది. మరొకరహస్యం. భాగ్యవంతులకంటే దరిద్రులే రుచికరమైన ఆహారం తింటున్నారని చెప్పాలి. ఎలాగంటే వీరుత్రాగేది గంజిఅయినా కడుపులో ఉండేఆకలి దానికి అమృతం లాంటి రుచిని కలిగిస్తూంది. వానికి తృప్తికలుగుతుంది. కాని భాగ్యవంతులలో ఎప్పుడూ అజీర్ణంతో బాధపడుతుంటారు గనుక ఆకలిలేక, పంచభక్ష్య పరమాన్నాలుతిన్నా అరుచిగా, అసంతృప్తిగానే ఉంటుంది ఎంతనిశితమైన లోకానుభవమిది ! వ్యాసునిదివ్యదృష్టికి ఒక ఉదాహరణ.

"సూక్ష్మయోనీని భూతాని తర్కగమ్యాని కానిచిత్,
పక్ష్మణోఽపి నిపాతేన యేషాం స్యాత్ స్కంధపర్యయః"
—శాం. ప. అధ్యా 15

కొన్ని అగోచరమైన సూక్ష్మప్రాణులు ఉన్నాయట! వాటి శరీరస్థితి ఎంతసూక్ష్మమంటే మనంకంటిరెప్పలాడించినప్పుడు ఆరెప్పలమధ్య పడితే నలిగి చనిపోతాయట! ఇది ఇప్పటి సైంటిస్టులు చెప్పేమాటేగదా! ఏయంత్రసహాయం లేక అంతటి సూక్ష్మప్రాణులను దర్శించగలిగిన వ్యాసమహర్షిశక్తి అలౌకికము. ప్రశంసనీయము. చిత్రమైనశైలిలో విషయాన్ని గూఢంగాబోధించే చమత్కార ధోరణి భారతంలో పలుతావుల గోచరిస్తుంది.

ఒక ఉదాహరణ.

"ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీంశ్చతుర్భిర్వశే కురు
పంచ జిత్వా విదిత్వా షట్ సప్త హిత్వా సుఖీ భవ"
—ఉద్యోగపర్వం విదురనీతి.

ఒకటి సహాయంగా పెట్టుకొని రెంటిని స్థిరంగా నిశ్చయించు అంటే బుద్ధిని సహాయంగా పెట్టుకొని రెంటిని అంటే కృత్యము, అకృత్యము వీనిని నిశ్చయించు లేదా ధర్మము అధర్మము వీనిని నిశ్చయించు. నాలుగు అంటే సామ, దాన, భేద, దండోపాయాలచేత ముగ్గురిని అంటే శత్రు, మిత్ర, ఉదాసీనులను స్వాధీనపరుచుకో! ఐదు ఇంద్రియాలను జయించి, ఆరు అంటే సంధి, విగ్రహ, యాన, ఆసన, ద్వైధీభావ, సమాశ్రయాలనే రాజకీయ షడ్గుణాలను తెలుసుకొని, ఏడు వ్యసనాలను వదలిపెట్టి సుఖంగా జీవించు అని అర్థం. ఇలాంటి శ్లోకాలు భారతంలో మనకు చాలా దొరుకుతాయి. దీనికే తిక్కనకవి అనువాదం.

"గీ॥ ఒకటిగొని రెంటి నిశ్చలయుక్తి జేర్చి
మూటి నాల్గింట గడు వశ్యములుగ గూర్చి
ఏనిటిని గెల్చి యారింటి నెరిగి యేడు
విడిచి వర్తించువాడు వివేకఘనుడు"

అని ఇట్లా భారతం సర్వజ్ఞాన సంపూర్ణమైన గ్రంథం. దీనిని గురించి వివరంగా వ్రాయాలంటే మళ్ళీ భారతమంత గ్రంథం తయారుకాకతప్పదు, నా శక్తికొలది, యథాసంభవంగా, శాఖా చంక్రమణ న్యాయంగా ఉదహరించాను. వ్యాసమహర్షి చేసిన ఒక్క ప్రతిజ్ఞ జ్ఞాపకం చేసుకుంటే ఈ గ్రంథ గౌరవం తేటపడుతుంది.

"ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ
యదిహాస్తి త దన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్"

నాలుగు పురుషార్థాల గురించి ఈ గ్రంథంలోలేని సందేశము మీకు లోకంలో మరేవాఙ్మయములోనూ దొరకదని ఈప్రతిజ్ఞనుమహర్షి అతురాలా

నెరవేర్చుకున్నాడు. అందుకే గుణగ్రాహులైన మన పెద్దలు "వింటే భారతమే వినాలి అన్నారు. మన దేశం విజ్ఞానానికి మూలకందం అనే ప్రశస్తి మనకు చిరకాలంగా ఉంది. అందుకే మనుస్మృతిలో మనువు.

"ఏతద్దేశ ప్రసూతస్య సకాశాదగ్రజన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః"

అంటాడు ఈ దేశంలో జన్మించిన పండితులవద్దనే పృథివిలోని మానవు లందరూ విజ్ఞానము, ధర్మస్వరూపము తెలుసుకోవాలట. ఇది వాస్తవమైన మాట! లోకంలో ఇతర దేశాలవారు భౌతికంగా ఎన్ని విధాల సమర్థులని పించుకొంటున్నా, పరమశ్రేయో రూపమైన విజ్ఞానము మాత్రం మన దేశంలో నేర్చుకోవలసిందే! అది మన స్వంతం. మన దేశానికుండే ఏకైక మహత్త్వ చిహ్నం ఈవిజ్ఞానమే! వివేకానందస్వామి ఈ జ్ఞానవాహినినే ప్రపంచమంతటా ప్రవహింపజేసి అందరిచేత భారతదేశానికి జోహారు లర్పింపజేశాడు. అది నేడు ప్రత్యక్షంగా చూడబడుతున్నది భౌతికంగా గొప్పదనం సంపాదించడానికి భారతీయులు విదేశాలకు వెళ్ళవచ్చుగాక! విజ్ఞాన సముపార్జనకు మాత్రం విదేశాలకు వెళ్ళేవాడు ఒక్కడూలేడు. వారే మన దేశానికి అసంఖ్యాకంగా వస్తున్నారు. ఈ జ్ఞానామృతంతో తరించిన మన దేశానికి నమోవాకము లర్పిస్తున్నారు ఇట్లా ప్రపంచానికి జ్ఞానభిక్ష మన దేశంలోనే లభిస్తున్నది. అలాంటి భారతీయ జ్ఞానానికంతటికీ భారతం సంపూర్ణ ప్రతినిధి. ఇట్టి ఈ అపురూప గ్రంథం ఇప్పుడు ఆదంరిచేవారులేక మూలబడుతున్నది. నిజంగా భారతాన్ని ప్రచారంలోకి తెచ్చిననాడు మన జాతి పునః ఉత్తేజంపొంది నవ్య జీవనం ఆరంభించగలదు. గాంధీమహాత్ముడు కోరిన రామరాజ్యం సిద్ధిస్తుంది, భారతీయజాతి లోకానికి ఆదర్శప్రాయ మౌతుంది, భారతం, భారతదేశం, భారతీయులు అనే నామసాదృశ్యంలోనే మన దేశానికీ మనకూ ఇది యెంత జీవగఱ్ఱయో తెలుస్తున్నది ఇట్టి దీనిని లోకంలో తగినంత ప్రచారం, ప్రబో ధం చేయడానికి ప్రభుత్వమూ, పెద్దలూ నడుంకట్టడం నేడు ఎంతైనా అవ సరం. ఇందుకు యథాశక్తిగా కృషి చేస్తున్న శ్రీ సాహితీ సదస్సువారు ఎంతైనా అభినందనీయులు, వారి కృషిని శ్రీకృష్ణ భగవానుడు ఉత్తరోత్త రాభివృద్ధిగా సఫలము చేయుగాక!

# కాళిదాసుని యార్షవాణి

శ్రీ శలాక రఘునాథశర్మ


పరిచయము :

పేరు : శ్రీ శలాక రఘునాథశర్మ

జననము : గొల్లపల్లి, కృష్ణా జిల్లా. 23 జూలై 1941.

విద్యార్హతలు : భాషా ప్రవీణ & ఎం.ఏ. (తెలుగు)

రచనలు : 1. బాణుని హర్షచరితానువాదము

2. సరళతమ విధి — (సంస్కృత వ్యాకరణము హిందీ నుండి తెలుగున కనువాదము)

3. లఘు సిద్ధాంతకౌముది వ్యాఖ్యానము - ముద్రణమునకు యత్నము జరుగుచున్నది.

4. పి. హెచ్ డికి గాను "ధ్వని సిద్ధాంతము-కవిత్రయ భారతములో అది ప్రయోగింపబడిన తీరు" అను విషయముపై పరిశోధన.

పదవి : అనంతపురమునందలి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పోస్టుగ్రాడ్యుయేటు కేంద్రములో ఆంధ్ర ఉపన్యాసకులు.


కళాశాల విద్యార్థులకు కాళిదాసుని రఘువంశాది గ్రంథ భాగములు బోధించువట్టుల వీరికిగల అనుభవాసక్తులీ వ్యాసమున ప్రదర్శితములు.

భారతీయులు కవిని ఋష్యంశ సంభూతునిగా సంభావింతురు. అతీంద్రియ దర్శన సామర్థ్యమును ఋషిత్వముగా పేర్కొనవచ్చును. కాని యీ శబ్దమున కింత మాత్రమే యభిలషితార్థ మనుకొనరాదు. ఋషికి సంయ

మనము, పవిత్రభావనలు, లోకహితైక దృక్త్వము, సదుపదేశప్రదాన సామర్థ్యము అన్నింటికిమించి యంతర్ముఖత్వము తన్మూలమున ఆనంద సోపానపరంపరాధిరోహణము మున్నగు లక్షణములు ముఖ్యములు. కేవల ఋషులయం దీ లక్షణములు చాలవఱకు వారి యుత్తమ గతికి చేయూత నీఁజాలును, కాని ఋష్యంశ గల కవిలో నివి యాత్మోద్ధరణముతోపాటు లోకకల్యాణమునకు నుపకరణములై విరాజిల్లును ఋషియైన కవియొక్క యీలక్షణములు కవితలో ప్రాధాన్యమును వహించినపుడు వానిని పరిశీలించు టెంతయు నవసర మగుచున్నది.

మనస్సు అనగా నిరంతర భావపరంపర. దీనిని నిరోధింపకున్నచో నింద్రియలౌల్య మధికమై మానవునిఁ దనకు దాసునిగా నొనరించుకొనును. చిత్తవృత్తిని నిరోధించుటనే యోగముగా పతంజలి భగవానుఁడు పేర్కొనెను, యోగము మోక్షసాధనము, దానిని సాధించుటకు లౌల్యమును విడనాడ వలయును. దీనికే సంయమన మనియు పేరు, సంయమనగుణము వ్యక్తిపరమై శాశ్వత సుఖమును ప్రసాదించును కావ్యమునందీలక్షణము గోచరమై దాని నాలోచనామృతము నొనరించును చాపల్యమును విడనాడఁ జాలని కవి యాలోచనామృతమైన సారస్వతమును సృజింపఁజాలఁడు. మహాకవులలో ప్రతిపదమునకు సంయమనము మనకఁ గన్పట్టును కావుననే యాలోచించిన కొలఁది ప్రతిపదము అర్థవంతమై పఠితకు రసానందమును ప్రసాదించును కావ్యముయొక్క పరమప్రయోజన మిదియే యని భారతీయాలంకారికుల యభిప్రాయము.

కొందఱు వాల్మీకి కవికోకిలను దృష్టాంతీకరించి కవిత్వమునకు ఉద్రేకమును కారణముగా పేర్కొందురు. ఉద్రేక సంయమనములు విరుద్ధధర్మములు. మఱి సంయమనము వలన కావ్యము పుట్టునా ? కామమోహితమైన క్రౌంచమిథునమునం దొకదానిని వ్యాధుఁడు హింసించుటచే నామహర్షి హృదయ ముద్రిక్తమైనది. క్రౌంచాక్రందన జనిత శోకము శ్లోకముగా మాఱినది. సత్యమే. కాని యిట్టి యుద్రేకములో వెనువెల్లువగా పొడిచికొనివచ్చు కవితా వాహినికి సంయమనమును నగస్త్యోదయము కానిచో ముదిరిన ప్రబంధ పాకమువలె నది కళ్మలకాలవాలమై యనుపదేయమే యగును. వాల్మీకి యెంతటి యుద్రేకియో యంతటి సంయమి కనుక నాతని మేధా-

క్షీరసాగరమునుండి రామాయణమను నమృతభాండము దేశకాల పరిణామములకు చెక్కుచెదరని రూపమున నుద్భవించినది. కావున కవిత్వమునకు సంయమనము ప్రాణమని నిరూపిత మైనది

"అస్మిన్నతివిచిత్ర కవి పరంపరా వాహిని సంసారే కాళిదాస ప్రభృతయో ద్విత్రాః పఞ్చషావా మహాకవయ ఇతి గణ్యన్తే" యని విమర్శక శిరోమణియగు ఆనంద వర్ధనుఁడు కాళిదాసునికి మహాకవి పంక్తిలో ప్రథమ పీఠము నొసఁగె నఁగా దాని తాత్పర్యమేమో విచారింప వలయును మహాకవి సంయమనమును పాటించి, పాంచభౌతిక శరీర లక్షణమును బట్టి జనించునేహో భావనలకు పవిత్రతను జేకూర్చుకొనును. పవిత్ర భావనల యుత్పత్తిస్థానమున లోకహితైకదృక్తము తప్పక యుండును లోకహితైకదృష్టికి సదుపదేశ ప్రదాత యగుమ సదుపదేశము కాంతాసమ్మితమైన కావ్యమున రసనిర్భరమై బ్రహ్మానంద సబ్రహ్మచారియగు నానందమును ప్రసాదించును. కాళిదాసుని కవితలో పైయంశములను సమన్వయించుటకు నానేర్చినభంగిని ప్రయత్నింతును. ఈ ప్రసంగమున సాధారణముగ రఘువంశ మహాకావ్యము మాత్రమే పరామర్శింపఁబడుచున్నది.

కావ్య- ఇతివృత్తము నెన్నుకొనుటలోఁ గాళిదాసుని జాగ్రత్త పరిశీలింపఁదగినది. అతని మూఁడు కావ్యములలో రఘువంశము రామావతార ప్రశస్తి గలదియగుటయే కాక యందు వర్ణింపబడిన మహారాజులందరు పరమ ధార్మికులు. కావ్యారంభముననే కాళిదాసు వారి లక్షణముల నుగ్గడించెను. వారాజన్మశుద్ధులు. ఆఫలోదయ కర్మలు. ఆసముద్రక్షితీశులు. ఆనాక రథవర్త్మలు, త్యాగముకొఱకే ధనమార్జింతురు సత్యమునకై మితముగా భాషింతురు. వారి జయేచ్ఛ యశస్సుకొఱకు మాత్రమే గృహమేధిత్వము కేవల మపత్యార్థమే కాలదశాను గుణవర్తనము వారిది. అగ్నిహోత్రార్చనము, అతిథి పూజాతత్పరత్వము, రాగ ద్వేష విహీన చిత్తముతో దండ్యుల ను దండించుట మున్నగునవి వారి యుత్తమ గుణములు. కావ్యేతివృత్తమెంత ఉదాత్తముగ నుండవలయునో చెప్పుటకే కాళిదాసీలక్షణములను క్రోడీకరించెనని చెప్ప నొప్పును. ఈ లక్షణము లన్నియు రఘువంశజుల యందు సమన్వయింపఁ బడినవి. ఇట్టి ఉత్తమపురుష చరితము నెన్నుకొనుట యందే యాతని సంయమన లక్షణ మభివ్యక్త మగుచున్నది.

సాధారణముగ కవులు వర్ణనీయాంశముల పట్టున కొంతకుఁగొంత చాపలమును ప్రదర్శింతురు. కాని ఔచిత్య వేత్తయైనకవి దేశ కాల పాత్రతల నెఱిఁగి తగిన ప్రమాణములో వర్ణనలు చేయును. ఔచిత్యము రసపుష్టి కెంత సహాకరించునో యనౌచిత్యము రసభంగమున కంత సహాకరించును. కాళిదాస మహాకవి కావ్యములో నీయంశమున గొప్ప మెలఁకువ పాటింపఁబడినది. ఈ యంశమును పరిశీలింతము.

రఘుమహారాజు తండ్రిచే దత్తరాజ్యుఁడై సర్వ దిగ్విజయ మాచరించిన సందర్భముగలదు. అతఁడు సర్వస్వదక్షిణాకమైన విశ్వజిద్యాగమును నిర్వహించుటగలదు. వర్ణనా ప్రియుడైన కవి కిట్టి ఘట్టము వెంతేనిత్పత్తినీఁ గలవు. కాని ఔచిత్య వేత్తయగు కవి కొంచెమాలోచించును. వరతంతుమహర్షి శిష్యుఁడగు కౌత్సుఁడు గురుదక్షిణగా చతుర్దశకోటి సువర్ణరాశిని యాచించి రఘుమహారాజు వలన లబ్ధకాముఁడై సర్వశ్రేయస్సులను తనంతానే పొందఁ గలవానికి ఆయా యాశీస్సులు పునరుక్తభూతములగునని చింతించి నీవంటి సద్గుణములు గల పుత్రుని,నీతండ్రి నిన్ను బొందినట్లుగా,పొందుమని యాశీర్వదించెను. తత్ఫలితముగా రాజమహిషి గర్భవతియై యొక బ్రాహ్మముహూర్తమున కుమార కల్పుండగు కుమారునిఁ బొందెను. కాళిదాసు ఈ సందర్భమున నామె దౌహృద చిహ్నములమగాని యామెకుఁ జేయఁబడిన సీమంత పుంసవనాది క్రియాకలాపములనుగాని వర్ణింపదొరకొవలేదు. కేవలము శ్లోకార్ధమున నాకుమారుని జననమును బేర్కొనెను.

"బ్రాహ్మే ముహూర్తే కిల తస్య దేవీ
కుమారకల్పం సుషువే కుమారమ్
అతః పితా బ్రహ్మణ ఏవ నామ్నా
తమాత్మజన్మాన మజం చకార."

వేదవిద్వరుఁడును, బ్రహ్మతేజముతో నాజ్యవయగ్నివలె వెలుగొందుచున్న మహనీయుఁడును; వరతంతు మహర్షికడ పదునాల్గు విద్యలు నేర్చిన తపోధనుఁడును నగు కౌత్సుఁడొసఁగిన యాశీస్సెంత సద్యఃఫలదాయకమయ్యెనో తెలుపుటకో యన్నట్లు కాళిదాసకవి యిచట వర్ణనల పొంతకుఁ బోలేదు.

చైత్రయాత్రా సందర్భమున వృక్షాహారచనాదుల వర్ణనములనుగాని, పై సందర్భమున గర్భవతీలక్షణములను గాని వర్ణింపలేదని చెప్పుటం బట్టి వర్ణనావైముఖ్యము కవి గుణముగాఁ జెప్పుట నా తాత్పర్యముగాదు. సమయోచితములగు వర్ణనలను మనోహరముగాఁ జేయుట ఆవశ్యకమే. కవి కులగురువగు కాళిదాసుఁడును అట్టి వర్ణనలను పలుతావులఁ జేసెను. అజ మహారాజు ఇందుమతీ స్వయంవరమునకేగుచు నడుమ నర్మదా తీరమున తనపరి వారమును విడియించెను. అటనొక మహావనగజము జలక్రీడ చేయుచుండెను. కాళిదాసాగజేంద్రమును నాలుగ్శ్లోకములలో వర్ణించెను. ఆవర్ణనము హృదయ హారులగు స్వభావోక్తులతో నతిరమణీయముగ నుండెను. ఏనుఁగు నీటిలో మునిగియుండెను. అది పైకిఁగన్పించుటలేదు. అయినను అది యటనున్నట్లు తెలియుచునేయుండెనఁట. దాని మదజలపు కమ్మని తావికి గ్రమ్మిన తుమ్మె దలు అది జలమున మునిగినవుడును వీడలేక పైపై సంచరించుటచే నచటి యేనుగుస్థితి యనుమేయమగుచున్నదఁట. అది తన భీకరకరముతో నెదురుగా వచ్చు నీటియలలను జీల్చికొనుచు నొడ్డునకుఁ జేరుచుండఁగా దాని యుదరపు టొత్తిడికి పైకుబ్బినజలము ముందొడ్డునకుఁ జేరెనఁట ఇట్టి మనోహర స్వభా వోక్తులతో నావర్ణనము సాగినది. సందర్భము విశ్రాంతికి సంబంధించిన దగుటచే పాఠకుని మనస్సుకాని కథాభాగముగాని ముందునకుఁ బరుగిడవలసిన రములేని యిట్టి తావులలో వర్ణనలు సముచితములేకదా! అంతియ కాక యిట నీయేనుఁ గొక శాపగ్రస్త స్వరూపము. దానికి శాపవిమోచకుఁడీ యజమహా రాజు. కావున కథాంశముతోని గజమునకుఁగల సంబంధమును బురస్కరించు కొని యీవర్ణన మిచట నావశ్యకమని మహాకవిచే సంభావింపఁబడి యుండును.

పంచమ సర్గాంతమున ప్రాతఃకాలమున వందిమాగధులు అజమహా రాజును మేల్కొలుపుటకై చేసిన స్తోత్రపాఠములనెపమున నా ప్రాంతఃకాల సౌందర్య మును గాళిదాసు పరమరమణీయముగా వర్ణించెను

తద్వల్గునా యుగపదున్మిషితేన తావత్
సద్యః పరస్పరతులా మధిరోహతాం ద్వే
ప్రస్పందమాన పరుషేతర తారమంత
శ్చక్షుస్తవ ప్రచలితభ్రమరం చ పద్మమ్.

## కాళిదాసుని యార్షవాణి

తెలియుటకు మున్ను తెప్పలలో కదలుచున్న యాతని నేత్రములును, లోపల తుమ్మెదగల పద్మమును ఒక్కొకటిగా పరస్పర సాదృశ్యమును పొందవలయునట. ఆతని పెదవులమధ్య నుదయించిన మందహాస లక్ష్మివలె చిగురుటాకుల నడుమ పడిన మంచుబిందువు విరాజిల్లుచున్నదట. ఇట్టి మధురోహాలతో నిండిన యీ వర్ణనము రేపటి స్వయంవరమున జగదేకమోహిని యగు నిందుమతి యాతని వరించుటలోఁగల సామంజస్యమును నిరూపించుచున్నది. కావున నావశ్యకతను బట్టి మాత్రమే కాళిదాసు వర్ణనలను జేయు నన్న యంశము నిరూపింపఁబడినది. ఇట్టి మెలఁకువను సంయమములో నొక భాగముగా నేను భావింతును.

సంస్కృత భాషలో 90శాతము పదములు యౌగికార్థ సముపేతములు ఆయా సందర్భములందు సమానార్థకమైన యేదో పదమును ప్రయోగించుట కంటె నచటి భావమునకు పుష్టినిచ్చు పదమును బ్రయోగించుట మేలైన త్రోవ. అనఁగా నాసన్నివేశమున నాపదమిచ్చిన యర్థవిశేషమును దానితో సమానార్థకమైన మఱియొక పదమీఁజాలదు. అనఁగా నది పరివృత్తిని సహింపదన్నమాట. అట్లు పరివృత్తిని సహింపని పదముల గుంభనమునే శబ్దపాకముగా నాలంకారికులు నిర్వచించిరి. ఆశబ్ద పాకము కూడ కాళిదాసుని కవితలో సమృద్ధిగాఁ గలదు. ఇది కావ్యమున శాత్మభూతమైన ధ్వనికి మిక్కిలి సహకరించును. దానిని ధ్వనిసిద్ధాంతులు చక్కగా నిరూపించిరి. ఉదాహరణమున కొక్కదానిని మాత్రము పేర్కొని ముందుకుఁబోవుదును. 'ప్రజాయై గృహమేధినామ్' అనుమాటను బరిశీలించినచో నచటి గృహమేధి శబ్దమెంత చక్కగా అదుకుమన్నదో చూడుఁడు. "గృహైః దారైః మేధన్తే సంగచ్ఛన్తే ఇతి గృహమేధినః" అని దానికి వ్యుత్పత్తి. భార్యలతో కూడువారని యర్థము. సంతానార్థము భార్యాసంగమముచేయువారని తాత్పర్యము. యజమాని, గృహస్థు, సంసారి మున్నగు పదములు గృహమేధి శబ్దమునకు సమానార్థకములేయైనను నీపదమువలె నవి యీ సందర్భమున నదుకవు. ఇట్లు మఱియొక పదముతో సాధింపఁజాలని యర్థములుగల సన్నివేశములలో నాయర్థమును సమగ్రముగా నీఁగల పదములను మాత్రమే యెన్నుకొనుట కాళిదాసులో మనకు మిక్కుటముగాఁ గన్పట్టును. దీనికిఁ గూడ మిక్కిలి మెలఁకువ కావలయును.

ఋష్యంశ గలకవి పవిత్రభావనాయుతుఁ డగుననుకొంటిమి. కాళిదాసు కవితల్లో నీపావిత్ర్య గుణము సర్వత్ర విరాజిల్లుచుండును. అపవిత్రము, అధార్మికము, అనార్షమునైన భావన కాళిదాసు కవితలో మనకుఁ జూపట్టదు. అంతేకాదు పవిత్ర భారత ధాత్రికి వేదచోదితమార్గము భుక్తిముక్తిదాయకము. కాని యయ్యది ప్రభు సమ్మితమై మిక్కిలి గంభీరముగా నుండుటచే తను స్వరభంగాది దోషములవలన దురర్థస్ఫురణమును, ప్రత్యవాయభీతియు నుండుటచేతను దానిని సర్వజనులు సమీపింపఁజాలరు. అగుచో నందలి ధర్మములు తెలియక లోకులు వాని నాచరించుట యెట్లు? ప్రభు సమ్మితములైన వేదముల పరమార్థమును, మిత్రసమ్మితములైన శాస్త్రముల రహస్యములను కాంతాసమ్మితములైన కావ్యములు ప్రీతిపూర్వకముగా జనుల కందించును. ధ్వనిమార్గ నిష్ణాతులగు కవిశేఖరులు తత్తద్ధర్మానుష్ఠాతల కథాంశముల వివరించు పట్టుల నాధర్మముల వైశిష్ట్యమును వ్యంగ్యవైఖరితో చక్కగా నిరూపింతురు. ప్రభుపద సునిష్ఠుఁడైన కాళిదాస మహాకవి శ్రుతిస్మృతిపురాణశాస్త్ర విజ్ఞానమున పారమునొందినవాఁడు. కావున నాతని వాక్సారము ఛందస్సారమే. ఋషియను శబ్దము వేదమనునర్థమునఁగూడ వర్తించునదగుటచే నాతని వాణి యార్షవాణియగుచున్నది

వేదములందు కేవలము జ్ఞానపరములైన యుపనిషత్తులు ప్రముఖములు. మానవుఁడు కరచరణాద్యవయవ విశిష్టుఁడై మాత్రమే మానవుఁడు కాక యథార్థమైన మానవత్వమును బొందుటకును, తన్మూలమున నుత్తమ పురుషుఁడై పురుషోత్తముఁడగుటకును వలయు సాధనసంపత్తి నీయుపనిషన్మాత మన కందించును. కాళిదాస మహాకవి వానిలో పెక్కింటిని కథారూపమున వ్యాఖ్యానించెను. వట్టి సూత్రములకన్న సమన్వయము మిన్న కదా? శ్రుతిస్మృతుల పరమార్థము ను వ్యంగ్యరూపమున నిరూపించుట భారతీయకవి కర్తవ్యము కావున కాళిదాసాకార్యమును నిండువూనికతో నిర్వహించెను. కొన్ని యుదాహరణములను పరిశీలింతము

రఘువంశ రాజులందఱు మహాధార్మికులు. వారిపాలనలోఁ బ్రజలు మనుధర్మమార్గమును రేఖామాత్రమైన నతిక్రమింపరు. వారికిఁ దండ్రులు కేవలము జన్మహేతువులే కాని రక్షణభరణముల భారము రాజులదే. ఆరాజుల పాలనమునందుఁ బ్రజలకు అనావృష్ట్యాదులగు ఈతిబాధలు లేవు. రాజు

ధర్మమూర్తియై వేదచోదిత క్రియాకలాపమునందు శ్రద్ధాసక్తులు గలవాఁడై నచో దానివలన దేవతాతృప్తి ఘటిల్లి జనుల కీతిబాధలు తొలఁగును. ఉప నిషత్సారమైన గీతయం దీ యర్థము విస్పష్టముగాఁ జెప్పఁబడినది.

సహ యజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్ట కామధుక్
దేవాన్ భావయతానేన తే దేవా భావయన్తు వః
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ
ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః
తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుఙ్క్తే స్తేన ఏవ సః.
గీత—తృతీయాధ్యాయము— 10,11,12

మానవుఁడు యజ్ఞాది క్రతువులచే ఇంద్రాది దేవతలను తృప్తిపఱచి నచో నాయజ్ఞము లాతనికిష్టకామములను సమకూర్చును. యజ్ఞభావితులైన దేవతలు వారికి ఇష్టభోగముల నిత్తురు. వారొసఁగిన సస్యాదులను వారి కీకుండ ననుభవించువాఁడు దొంగ యగునని పై శ్లోకముల తాత్పర్యము. కావున వేదమతానుయాయియగు ప్రభువు యజ్ఞానుష్ఠాన నిరతుఁడు కావల యును. ఈగుణమును కాళిదాసు దిలీపునందు సమన్వయించిన విధమును చూడుఁడు.

దుదోహ గాం స యజ్ఞాయ సస్యాయ మఘవా దివమ్
సంపద్వినిమయేనోభౌ దధతు ర్భువన ద్వయమ్.
—రఘు. ప్ర. అ. 26

అదిలీపమహారాజు దేవతాతృప్తికరమైన యజ్ఞమునకై భూమిని పిదికెను. ఇంద్రుఁడు భూజన ప్రీతికరమైన సస్యమునకై స్వర్గమును బిదికెను. ఇట్లు వారిరువురును వారి వారి సంపదలను వినిమయము చేసికొని రెండు లోకములను భరించిరి. పైగీతా శ్లోకములకీ శ్లోకము వ్యాఖ్యానము వంటిది. దిలీపుఁడట్లు ప్రవర్తించెనని చెప్పు వ్యాజమున రాజులకర్తవ్యమును గాళిదా సుపదేశించుచున్నాడు. ఈ యర్థమునే మఱియు విస్పష్టముగ నాదిలీపవృత్తాం తమునందే కాళిదాసు వివరించియున్నాఁడు.

హవిరావర్జితం హోత స్త్వయా విధివదగ్నిషు
వృష్టిర్భవతి సస్యానా మవగ్రహ విశోషిణామ్॥

—రఘు. ప్ర- 62

దిలీపమహారాజు వశిష్ఠమహర్షితో 'ఓ యాజకోత్తమా! నీచే విధివత్తుగ త్రేతాగ్నులందు సమర్పింపఁబడిన హవిస్సు వర్షాభావముచే నెండెడు సస్యములకు వర్షమగుచున్నది' అని పలికెను. ఈ శ్లోకము కూడ పై గీతావాక్యమునే స్మరింపఁజేయుచున్నది. మనుస్మృతిలో కూడ నీ విషయము ప్రమాణీకరింపఁబడినట్లు వ్యాఖ్యాత మల్లినాథసూరి యీ క్రింది శ్లోకమును జూపెను.

అగ్నౌ దత్తా హుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్రజాః.

అగ్ని యందు శ్రద్ధాపూర్వకముగా దత్తమైన యాహుతి సూర్యభగవానునిఁ జేరుచున్నది, సూర్యునివలన వర్షము సంభవించుచున్నది. దాని వలన నన్నమేర్పడుచున్నది. దానితో ప్రజలు పుట్టుచున్నారు. కాళిదాసు శ్రుతిస్మృతి వాక్యముల నెట్లు విశదీకరించునో పై యుదాహరణము వలన సువ్యక్తమగును.

[ఈ సందర్భమున నొకమాట. యజ్ఞాదికర్మము లన్నంతనే కొందరివి మూఢ(పునమ్మకములు. ఇందు శాస్త్రీయమైన (Scientific) దృక్పథము లేదని విమర్శింతురు. ఈ అనాలోచిత దుర్విమర్శనమునకు స్వామిదయానంద సరస్వతి చక్కనిసమాధానమును జెప్పెను. అగ్నియందు హోమద్రవ్యముగా నుపయుక్తమగు నాజ్యాదికము బూడిదలోఁ బోసినదివలె వ్యర్థము గాదు. దానిశక్తి వాయు సమ్మిశితమై యది వ్యాపించినంతమేర జనులకు లభించుచుండును. అది యేయొకరిద్దరో యనుభవించుట కంటె నిది యుత్తమమైన వినియోగముగదా!]

'న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' అను తైత్తిరీయ వాక్యమును బట్టి త్యాగగుణముద్వారా యమృతత్వమును పొందిన మహామహులు రఘువంశమహారాజులు. వారు కర్తవ్య నిర్వహణములో సంపదను గాని, కడకు దేహమును గాని త్యజించుటకు వెనుదీయరు.

రఘుమహారాజు సర్వస్వ దక్షిణాకమగు విశ్వజిద్యాగమున అక్షరశః సర్వస్వమును బరిత్యజించి అతిథ్యర్చనమునకు మృణ్మయపాత్రము లుపయోగింపవలసిన వాఁడయ్యెను ఆతనితండ్రి దిలీపమహారాజు గురువుల హోమధేను రక్షణమున కనుచున్న మాటలు వినుఁడు.

సత్వం మదీయేన శరీరవృత్తిం
దేహేన నిర్వర్తయితుం ప్రసీద
దినావసానోత్సుక బాల వత్సా
విసృజ్యతాం ధేనురియం మహర్షేః. రఘు. ద్వి 45

"ఓసింహారాజమా! ప్రసన్నతనొందుము. నాదేహముతో నీశరీర వృత్తిని నిర్వర్తించు కొనుము. సాయంసమయమున నాతల్లిఁజూడ గందునని యుబలాటపడు లేదూడగల యీ మహర్షి ధేనువును విడువుము" రఘువంశ రాజుల ధర్మత్యాగశీలమున కింతకంటె నుదాహరణ మేముండును?

రఘువంశ పంచమసర్గమునందలి కౌత్సుని చరితము తైత్తిరీయోపనిషత్తునందలి శిక్షావల్లికి లక్ష్యభూతమైనది. పరిశీలింపుడు. "వేదమనూచ్యాచార్యోఽన్తేవాసిన మనుశాస్తి. సత్యం వద. ధర్మం చర, స్వాధ్యాయాన్మాప్రమదః. ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః" కౌత్సుఁడీ శ్రుతివాక్యములను యథాతథముగా పాటించిన ట్లాతని చరితము నిరూపించుచున్నది.

దానమెట్లుండవలయునో యాయుపనిషత్తే యిట్లు ఉపదేశించుచున్నది. "శ్రద్ధయా దేయమ్ అశ్రద్ధయాఽదేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్. భియా దేయమ్" మానవుఁడు శ్రద్ధాపూర్వకముగాఁ జేయవలయును. అశ్రద్ధతోఁ జేయరాదు. తనకున్న భాగ్యము ననుసరించి దానమీయవలయును. ఉచితమైన లజ్జతో, ఈయనిచో నేమి మూడునో యన్నభయముతో త్రికరణశుద్ధిగా నొసఁగవలయును. రఘుమహారాజు కౌత్సునికి గుర్వర్థము నొసఁగిన సందర్భ మీయుపనిషదుపదేశమునకు సుంతయేని భేదములేని పద్ధతిలో నున్నది, పాప మాతఁడు పైరుకోసిన నివ్వరి కాడవలె నిర్ధనుఁడై యుండెను. ఈవలసిన ధనమా అపారము. వచ్చిన వ్యక్తియో వేదవిద్వరుఁడు.

అదియు స్వార్థమునకుఁగాక కులపతి కీవలసిన ధనము తానా వదాన్య శేఖరుఁడుగా లబ్ధప్రతిష్ఠుఁడు. అట్టిస్థితిలో ఇచ్చుటెట్లు? అయిన నాతఁడు వెను కాడలేదు. కౌత్సుని మరియొక దాతను జూచుకొమ్మని పంపలేదు కాని కాలమున వచ్చెనని విసిగికొనలేదు, ఏదోసమాధానము చెప్పి యాతఁడే హతాశుఁడై పోవునట్లు చేయలేదు. అడిగెను గదా, ఎట్లైన మాటనిలఁబెట్టు కోవలయునని యసమర్థ ప్రభువువలెఁ ప్రజలపైఁబడి ధనమును రాబట్టలేదు. ఆ కులపతి శిష్యుని రెండు మూఁడు రోజులు తనయగ్నిహోత్ర గృహమున నాలుగవయగ్నివలె నుండుమని కోరి కుబేరునిపై దండెత్త నుంకించెను, ఆ మహానుభావునకా యభిప్రాయము కలిగినదని తెలిసికొని కుబేరుఁడే యాతని కోశమును సువర్ణ వృష్టిచే పరిపూర్ణము కావించెను. దానినంతటిని కౌత్సు నికే యాతఁడు సమర్పించెను. ఇట్లుసమర్పించుటలో నాతని దాతృత్వము, అందాతఁడుచూపు శ్రద్ధాదులును సువ్యక్తము లగుచున్నవి ఈ సందర్భ మున. కావుననే యాతని చరితము కీర్తనీయమగుచున్నది.

రఘు వంశ మహారాజుల ధర్మశీల మత్యుదాత్తమైనది. ఎంతటి క్లిష్ట పరిస్థితులయందును వారు ధర్మము నతిక్రమింపరు. పండిన వయస్సునందును పరమముగ్ధమైన బాల్యమునందును వారిదొకే విధమగు ప్రవృత్తి "ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా. లోకే ధర్మిష్ఠం ప్రజా ఉప సర్పన్తి, ధర్మేణ పాప మనుదతి. ధర్మే సర్వం ప్రతిష్ఠితం. తస్మాద్ధర్మం పరమం వదన్తి" అని ప్రజాపతి అరుణి కుపదేశించినట్లు నారాయణోపనిషత్తు చెప్పుచున్నది. ధర్మము సర్వ జగత్తును ప్రతిష్ఠించును. ప్రజలు ధర్మిష్ఠు నాశ్రయింతురు. ధర్మముతో జనుఁడు పాపమును బోఁద్రోలును. ధర్మమునందు సర్వమును ప్రతిష్ఠితమగును. కావున తత్త్వవేత్తలు ధర్మమును సర్వశ్రేష్ఠముగాఁ బ్రవచింతురు అని పైవాక్యముల తాత్పర్యము. ఇట్టి ధర్మమును నిర్వహించుటలో నీరాజుల యభినివేశ మెట్టిదో పరిశీలింతము.

అజమహారాజు ఇందుమతీ స్వయంవరమునకై విదర్భ దేశమునకుఁ బోవుచు మార్గమధ్యమున నర్మదాతీరమున విడిసియుండెను. అప్పుడొక మహావనగజము నర్మదయందు స్నానమాడి పైకి వచ్చెను. దాని మదజలపు తావి సోకినంతనే సేనాగజేంద్రము లాధోరణు లెంత తీవ్ర యత్నము

లోనర్చినను లోంగక కట్లు త్రెంచుకొని పారిపోయినవి. ఈ సేనానివేశమును గాంచినంతనే దానికి మఱింత యుద్రేకము కలిగినది. దాని విజృంభణమునకు గుఱ్ఱములన్నియు త్రాళ్ళు త్రెంచుకొని త్రొక్కిన లాటలో చెల్లాచెదరైనవి. రథములు భగ్నాక్షములై తలక్రిందులైనవి. వీరభటులందరు స్త్రీసంరక్షణ మున నిమగ్నులయిరి ఒక్కనిమేషములో సమస్తమును విధ్వస్తమైనది. ఇంత చేసిన యా యేనుఁగును గాంచి యజమహారాజు వన్య గజమును వధింప రాదని కేవలము మరలింపఁగోరి నారిని కొంచెముగా లాగి కుంభస్థలమున మెల్లగా నొక్క బాణముతో కొట్టెనఁట. ఈ సంఘటనము చాలను వారి ధర్మానురక్తిని వ్యక్తపఱచుటకు అంతటి నష్టము వాటిల్లినచోట, తనకును ప్రాణాపాయమగునేమో యను సంశయము కలిగినచోట, ధర్మశాస్త్ర స్మరణమునకుఁ దావుండునా? "లక్ష్మీకామో యుద్ధా దన్యత్ర కరివధం న కుర్యాత్" అని ధర్మశాస్త్రముండుఁగాక. కాని ఆసందర్భము దానిని స్మరింపఁజేయునా? వికారహేతువు లేకుండు నప్పుడెల్లరును గొప్పవారే అది యున్నపుడే వారిధైర్యము వెల్లడియగునది. "వికారహేతౌ సతి విక్రియన్తే యేషాం న చేతాంసి త ఏవ ధీరాః" అనిగదా కాళిదాసోక్తి, ధర్మరక్షణము ప్రథమకర్తవ్యము, అటు పిమ్మటనే ప్రాణసంరక్షణ ప్రసక్తి యనునది యా మహారాజుల సిద్ధాంతము. కాళిదాసిట్టి సచ్చరిత్రముల నెన్నుకొని యిట్టి యనర్ఘ-అర్ష సందేశముల జనుల కందించెను.

పైని పేర్కొనిన యుదాహరణములద్వారా కాళిదాసుని యార్ష వాణిని నాయోపినంతవరకు నిరూపించుటకుఁ బ్రయత్నము చేసితిని మల్లినాథ సూరి యంతటి మహాపండితుఁడు "కాళిదాస గిరాం సారం కాళిదాస స్సరస్వతీ, చతుర్ముఖోఽథ వా సాక్షాత్ విదుర్నాన్యేతు మాదృశాః" అని వక్కాణించినపుడు నిజముగా నావంటివాఁడిందుఁ బ్రయత్నింపరాదు. కాని 'చాపలాయ ప్రచోదితః' అన్నట్లిదియొక చాపలము. విజ్ఞులు విమర్శింతురుగాక!



# శ్రీ త్యాగరాజు కృతులపై తులసీదాసు ప్రభావము

శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు'

పరిచయము :


పేరు : శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు'

జననము : పల్లూరు, ఒంగోలు జిల్లా. 1917.

విద్యార్హతలు : ఎం. ఏ.

రచనలు : ఆంధ్ర దేశ్ కే కబీర్ వేమన, భాగవత్ పరిమళ్, ఆదాన్ ప్రదాన్,

పదవి : ఆలిండియా రేడియో హైదరాబాదు కేంద్రములో ఉద్యోగము.


హిందీ తెలుగు సాహిత్యములలో వీరికిగల తులనాత్మక విమర్శక దృష్టి యీ వ్యాసమున జూడవగును.

> "పృథ్వీ రేణురణుః, పయాంసి కణికాః, ఫల్గుస్ఫులింగాలఘు
> స్తేజో, నిశ్వసనం మరుత్తనుతరం, రంధ్రం సుసూక్ష్మం నభః,
> క్షుద్రా రుద్రపితామహప్రభృతయః, కీటాస్సమస్తాస్సురాః
> దృష్టే యత్ర స తావకో విజయతే భూమావధూతావధిః."
>
> —శ్రీ కులశేఖరాళ్వారులు

ఏపరతత్వాన్ని మానసించినప్పుడు సప్తద్వీపాలతో కూడికొన్న యీ వసుంధర అంతా ఒక అల్పాల్ప కణంగా భాసిస్తుందో, సప్తసముద్రాలు,

సమస్త నదీనదాలు, కూపవాపీతటాకాలు స్వల్పమైన నీటితుంపురుగా కని పిస్తాయో, సూర్యచంద్రనక్షత్రాదులతో కూడిన జ్యోతిర్మండలమంతా చిన్న నిప్పురవ్వగా గోచరిస్తుందో, అనంత నీలాకాశం సన్నని బెజ్జమువలె కనిపిస్తుందో, శివుడు బ్రహ్మ మొదలుగా గల దేవసమూహమంతా చిన్న పురుగుల్లాగా గోచరిస్తారో అలాంటి భూమావాచ్యుడైన పరబ్రహ్మను గానం చేసి తాము తరించి యితరులకు తరణోపాయ మనుగ్రహించిన భాగవతోత్త ముల కోవలో తులసీదాసుత్యాగరాజులకు గల స్థానం విశిష్టమైనది. పరతత్వ గుణానుకీర్తనం చేసే భాగవతులు సాధువులు ఋషులు ఫకీరులు - వారు ఏదేశానికి, ఏ కాలానికి చెందినవారైనాసరే — మానవసమాజపు మనుగడకు ప్రధానమైన జీవనాన్ని ప్రసాదిస్తుంటారు. జలాలుద్దీన్ రూమీ, తబ్రీజ్, మన్సూర్, జీసస్ క్రీస్తు, బుద్ధుడు, మహావీరుడు, శంకర రామానుజ మధ్వాది ఆచార్యపుంగవులు, కబీరు, తులసీదాసు, సమర్థ రామదాసు, నర్సిమెహతా, పురందరదాసు,ఆళ్వారులు, నాయనారులు, పోతన, రామదాసు, రామకృష్ణ పరమహంస, వివేకానంద, దయానంద సరస్వతి, రమణ మహర్షి, అరవిందుల లాంటి మహానుభావులంతా యీ కోవకు చెందినవారే. వీరందర జీవయాత్ర కుపాదేయం ఒక్కటే; వాణికి ఉపజీవ్యం ఒక్కటే - భగవద్గుణానుకీర్తనం !

'దర్శనములు వేరు తత్వంబదొక్కటే' అని వేమనయోగి 'ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి' అనే వైదిక సూక్తిని సూటిగా తేటతెనుగులో చెప్పాడు. ఆవిధంగా వీరు తమ తమ దర్శనాలను అనుభూతులను అనుసరించి కొందరు రామకృష్ణాది రూపాల్లో, మరికొందరు శివ శక్త్యాది రూపాల్లో, యింక కొందరు నిరాకారమైన ఓంకార ప్రణవరూపంలో అపరతత్వాన్ని కొనియాడారు. తమకు సాధ్యమైనంతవరకు నిర్వచింప బూనుకున్నారు. వారి వారి అనుభూతులు దర్శనాలు అన్నీ దేశకాలపరిస్థితుల ననుసరించి రూపొందినవని చెప్పడంలో ఏమాత్రం సందేహంలేదు. ఆకాశాన్నుంచి భూమి మీదపడిన నీరంతా వేర్వేరుపేర్లతో నదీనదాలరూపంలో చివరకు సముద్రాన్ని చేరినట్లు ఈ దివ్యగాయకుల వాణీవిన్యాస మంతా కడకు పరతత్వ తాత్పర్య నిరూపణంలోనే పర్యవసిస్తుంది.

కౌసల్యా దశరథుల గర్భశుక్తి ముక్తా ఫలమై సమస్త మర్యాదలకు నెలవై, శక్తి సౌందర్య శీలసంపదలకు శేవధియై, లోకంలోని అత్యాచారాలను అనాచారాలను రూపుమాపి ధర్మప్రతిష్ఠాపనం చేయడానికి అవతరించిన మర్యాదా పురుషోత్తముడు శ్రీరామచంద్రుడు ఆయన గుణగణాలు శ్రీతులసీదాసునూ త్యాగరాజస్వామినీ సమ్మోహితులను గావించినవి. ప్రకృత్యా యిద్దరు రామభక్తులు. రామకథ ఇద్దరి జీవిత నౌకలకూ చుక్కాని యైనది. తులసీదాసు తమ వాణిని పూర్తిగా శ్రీరామ కథకే అంకితం గావించారు. త్యాగరాజ కృతులలో గూడ నూటికి ఎనుబది పాళ్ళు రామకథనే ఆశ్రయించినవి. వీరిరువురు తమ కృతులను నరాంకితాలు చేయలేదు, ఈ విధంగా అనేక విషయాలలో వీరికి పోలికలు కనుపిస్తాయి.

ఇరువురు గ్రంథకర్తల జీవితాల్లోనూ కృతులలోను యేవో కొన్ని సమాన విషయాలున్నంత మాత్రాన వారలు ఒకరినొకరు ప్రభావితుల గావించారని చెప్పడం సాహసమే అవుతుంది. వారల జీవితాల్లో మనః ప్రవృత్తుల్లో ఉండే సామ్యం యాదృచ్ఛికంకూడ కావచ్చు. అయితే కొన్ని కొన్ని సందర్భాలలో బలవత్తరాలయిన అంతఃసాక్ష్యాలు లభించినప్పుడు, ఆరచయితల జీవితకాలాలను దృష్టిలో నుంచుకుని కొట్టవచ్చినట్టు కనుపించే ఆ సామ్యాన్ని 'ప్రభావం' గా భావించడం కూడా అసంగతం, అనుచితం కానేరదు. ఈ దృక్కోణంతో పరిశీలించినప్పుడు, తులసీదాసు భావనాసరళి, జీవిత లక్ష్యాలూ ఆయనకు తరువాత కాలంలో అవిర్భవించిన త్యాగరాజ స్వామిని 'ప్రభావితుణ్ణి' గావించినవని చెప్పవచ్చును.

అయితే, ఈ భక్తకవులిద్దరు ఏశతాబ్దాల్లో ఏ ప్రదేశాన జన్మించారు? ఒకరు మరొకరిని ప్రభావితులను గావించుటకు అవసరమైన పరస్పరపరిచయం వారలకెలా లభించినది? సుగమంగా స్వల్పకాలంలో ఒకచోటనుండి మరొక చోటికి పోవుటకు అనువైన యాత్రాసౌకర్యాలు లేవి ఆ రోజుల్లో ఒకర్ని గురించి మరొకరు తెలుసుకోవడమనేది ఎలా పొసగింది ? అనే ప్రశ్నలకు సరియైన సమాధానం అన్వేషించడం యీ సందర్భంలో అత్యావశ్యకం,

గోస్వామి తులసీదాసు అక్బరు సమకాలీనుడు. పోతే శ్రీ త్యాగరాజ స్వామి 18, 19 వ శతాబ్దానికి చెందినవాడు. ఇరువురకు మధ్య తేడిగ్గా 2½ శతాబ్దాల వ్యవధానం కనిపిస్తుంది. అదీకాక ఒకరు ఉత్తరహిందూస్థానంలో కాశీ అయోధ్యలలో జీవితంగడిపితే మరొకరు అక్కడకు 1500 మైళ్ళదూరాన చోళమండలంలోని తిరువయ్యారులో నివాసం ఏర్పరచుకున్నారు. ఒకరి మాతృభాష హిందీ, మరొకరిది తెలుగు. ఇంత తేడా ఉన్నప్పటికీ, త్యాగరాజు గారికి తులసీదాసునూ ఆయన రచనలనూ గురించిన పరిచయం పూర్తిగా లభించింది. అందుకు తిరుగులేని సాక్ష్యాధారాలు దొరికాయి.

అనర్ఘాలయిన కృతులేగాక శ్రీ త్యాగరాజస్వామి రెండు సంగీత ప్రబంధాలు – యక్షగానాలవంటివి – రచించారు. 1. ప్రహ్లాద భక్తవిజయము 2 నౌకాచరితము. ఇందు ప్రహ్లాద భక్తవిజయములో గ్రంథారంభంలోని ఇష్టదేవతాస్తుతిలో కనిపించే ఒక కందపద్యం ఎంతో ఆనందాన్ని ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది

కం తులసీ కానన మందున
  విలసిత మగు హరిని జూచి విస్మయయుతుడై
  పులకీకృతతనుడగునా
  తులసీదాసవరు సన్నుతులుసేతు మదిన్

శ్రీరాముడు, విష్వక్సేనుడు, నారదుడు. ఈ ముచ్చురిని స్తుతించిన వెంటనే లౌకికులయిన భక్తాగ్రగణ్యులలో ప్రథమస్థానాన్ని తులసీదాసున కిచ్చారు త్యాగరాజస్వామి! ఆతర్వాతనే పురందర, రామదాస, నామదేవ, నారాయణతీర్థాది భక్తయతిపుంగవులను స్మరించారు. దీనినిబట్టి ఆయనకు హిందీలో రామచరితము వ్రాసిన మహా భక్తకవిపట్ల మక్కువఅని తేలుతుంది. తులసీదాసును తనకృతిలో స్మరించినాడంటే ఆయనను గురించిన విషయ మంతా త్యాగరాజునకు తెలిసియుండక తప్పదుగదా! పైన ఉదహరించిన పద్యంలోనివిషయం ఈ ఊహ నిజమని ఋజువుచేస్తుంది. ఆ పద్యంలో శ్రీ తులసీదాసుగారి జీవితంలోని యొకమారుమూల గాథ ప్రసక్తమైనది.

ఒకపర్యాయం బృందావనమునందలి భక్తబృందం కోరికపై తులసీదాసు ఆక్షేత్రానికి వెళ్ళారట! అక్కడి ప్రధాన దేవాలయంలోని శ్రీకృష్ణ

విగ్రహంఎదుట దర్శనార్థం నిలబడిరట. ఆసమయంలో అందరూ స్వామికి నమస్కరి స్తే తులసీ నమస్కరించకపోగా తలనువంచమగూడాలేదట. అదిచూచి అందరు ఆయనను గర్విష్ఠి అనీ ప్రభుభక్తిహీనుడని గుసగుసలాడికొన్నారట. వారల విమర్శలను లెక్కింపక ఆమహాభక్తుడు ఆస్వామినుద్దేశించి ఇలా అన్నాడట-

"కహా కహాం ఛవి ఆపకీ భలేబనే హో నాధ్ !
తులసీమస్తకతబనవై ధనుష్ బానలేహు హాథ్!"

"ప్రభూ! ఈనాటినీవేషాన్ని ఏమని కొనియాడనయ్యా! విచిత్రమైన అవతారాన్ని తాల్చావే! అయితే స్వామీ! నీవు ధనుర్బాణాలు ధరించినప్పుడు మాత్రమే ఈ తులసీ శిరస్సు నీ ముందు అవనతమౌతుంది సుమా!"

భక్తుడు విసరిన ఈసవాలును భగవానుడు తలవొగ్గి స్వీకరింపక తప్పలేదు వెంటనే గుడిలోని కృష్ణవిగ్రహం ధనుర్బాణాలను ధరించి శ్రీరామ విగ్రహంగా కనిపించినదట!

తనువును మనస్సును పులకింపజేసే ఈభక్తవిజయగాధయే పై పద్యంలో నిబద్ధింపబడింది! అంటే త్యాగరాజ స్వాములకు తులసీదాసు జీవితంలోని చిన్న చిన్న ఘట్టాలుకూడ తెలుసునన్నమాట! అంతలోతుగా ఆమహాభక్తుని గాధను ఆయన మాననించుకున్నారు.

తనకుపూర్వం 250 ఏండ్లక్రితం ఎక్కడో ఉత్తరాదిన తనకు తెలియని భాపలో రచనలు గావించిన కవి ఉదంతం ఆయనకు తెలియడం ఎలా సంభవించింది? ఇందుకేమైన ఆధారం ఉందా?

శ్రీ త్యాగరాజు జీవితచరిత్రలో ఒకానొక హిందుస్తానీ భక్తగాయకుడు తనకు శ్రీరామచంద్రుడు కలలోయిచ్చిన ఆదేశంమేరకు కాశీనుంచి బయలుదేరివెళ్ళి తిరుగుప్రయాణంలో తిరువయ్యూరులో శ్రీస్వామివారిని దర్శించినట్టు ఒకకింవదంతి కనిపిస్తుంది. తంజావూరిలోని సౌరాష్ట్రసభవారుగూడ, 1957వ సంవత్సరంలో నే నచటికి వెళ్ళియుండినప్పుడు జరిగిన సంభాషణలో ఈ విషయాన్ని ధ్రువపరిచారు. కాశీనుంచివచ్చిన ఆ ఉత్తరాది భక్త

గాయకుని పేరు 'గణేశభావే' అనికొందరూ 'గోపీనాథ్‌భట్టాచార్య' అని కొందరూ అంటారు. పేరు ఏదైతే ఏమి? ఆ భక్తుడు త్యాగరాజస్వాములను తిరువయ్యారులో కలసికొనినప్పుడు తనస్వప్నవృత్తాంతాన్ని చెప్పిమోకరిల్లాడట. తనప్రభువైన శ్రీరాముడు, తుచ్ఛుడైన తనపేరుప్రతిష్ఠలను ఆవిధంగా ఆశాంతాలకు దూరదేశాలకు వ్యాపింపచేయడం తెలుసుకొని కృతజ్ఞతాభారంతో త్యాగరాజులవారు తోడిరాగంలో ఒకకృతిని ఆశువుగా గానంచేసి ఆనందబాష్పాలు వదలాడట!

> దాశరథే నీఋణము దీర్ప నా తరమా
> పతిత పావన నామ!
> ఆశ దీర దూరదేశముల బ్ర-
> కాశింప జేసిన రసికశిరోమణి ! ॥ దాశ ॥

ఆ హిందుస్తానీ గాయకుడు ఆరునెలలపాటు తిరువయ్యారులో స్వామివారి సత్సంగంలో ఉన్నారట. సమానమైన మనస్తత్వాలు గల యిద్దరు భక్తులొకచోట చేరినప్పుడు వారు తమ ఆరాధ్య దైవాన్ని గురించో లేక భక్తులను గురించో ముచ్చటించుకొనుట సహజంగదా! అలాంటప్పుడు ఆఆరు నెలల కాలంలో ఉత్తరాదిన అజరామరకీర్తి ప్రతిష్ఠలగడించిన మహాభక్తుడు శ్రీతులసీదాసుగారిని గురించిన ప్రసక్తి అవశ్యం వచ్చి ఉంటుంది. అంతేగాక ఆయన అనర్ఘరచన రామచరిత మానసాన్ని గురించి అందులోనికొన్ని మనోహర ఘట్టాలను గురించి త్యాగరాజు తెలిసికొనడం ఆసందర్భంలో జరిగింది. అందుకు తార్కాణాలు త్యాగయ్యగారి రచనలలో ఎన్నైనా చూపవచ్చును. పైన ఉదాహరించిన పద్యంలో తులసీజీవితానికి సంబంధించిన ఉదంతం ఆ విధంగానే స్వామివారికి తెలిసింది.

తులసీ జీవితాన్ని ఆయన రచించిన రామాయణాన్ని గురించి తెలిసికొని శ్రీ త్యాగయ్య ఎంతగానో ప్రభావితులయ్యారు. ముఖ్యంగా శ్రీరామచంద్రుని శీలనిరూపణంలోనూ సౌందర్య శక్తుల ప్రదర్శనంలోనూ తులసీదాసు కనబరచిన అభిమానం, అభినివేశం, ఆసక్తి, ఆవేశం ఆయన్ని ముగ్ధుణ్ణిగావించాయి. సమస్తకల్యాణగుణాభిరాముడైన రాముని యందలి ఆ సద్గుణత్రయం - సౌశీల్యం, సౌందర్యం, శక్తి – విశేషించి త్యాగయ్య

గారికెంతగానో నచ్చాయి. తన కృతులలోనూ ప్రహ్లాద భక్తవిజయమనే ప్రబంధంలోనూ శ్రీరామచంద్రుని ఈ గుణాలను త్యాగయ్య అడుగడుగునా కొనియాడారు. ముఖ్యంగా బాలకాండలో హరధనుర్భంగ ఘట్టంలో తులసీ కావించిన చిత్రణం త్యాగయ్య తన ప్రహ్లాద భక్తవిజయంలో ఒక సందర్భాన ఉట్టంకించారు. అలా చేసేటప్పు డాయన సందర్భౌచితిని గూడ లెక్కచేయ లేదు. - ప్రహ్లాదుని చేత "సీతాసుఖాన్ని" అర్థింపచేశారు! నృసింహావతారా నికి చెందిన ప్రహ్లాదుడెక్కడ, రామావతారానికి సంబంధించిన సీతాసుఖ మెక్కడ? భక్త్యావేశంలో ఆయన ఆ రెండుగాథలకు మధ్యన గల తేడానే మరచి పోయారు.

తులసీదాసు తన రామచరితలో వివాహానికి పూర్వం మిథిలలోని యొక పుష్పవాటికలో సీతారాముల ప్రథమసందర్శనం వర్ణిస్తారు. సీతమ్మ గౌరీపూజార్థం తోటకువెళ్ళిన సందర్భంలోనే రామలక్ష్మణులు విశ్వామిత్ర ముని అనుజ్ఞ గైకొని వనవిహారానికి బయలుదేరుతారు. అక్కడ అనుకో కుండా యిరువురు ఒకరినొకరు చూడటం తటస్థిస్తుంది. యాదృచ్ఛికంగా. ఆ విధంగా ఆపురాణ దంపతులలో పూర్వ రాగాంకురాన్ని సూచిస్తారు తులసీ. అనంతరం హరధనుర్భంగ సమయంలో వజ్రసమానమైన పినాకాన్ని పాలు గారే మొగము గల రాజీవలోచనుడైన రాముని చూచి ఆయన ఆ చాపాన్ని ఎత్తలేడని నిశ్చయించుకుని తల్లడిల్లుతుంది. ఆ సమయాన మర్యాదకు ఏ మాత్రం భంగం రాని విధంగా, అంతర్యామి అయిన రామచంద్రుడు తన అసమాన శక్తి సామర్థ్యాలను ఆమెకు గమపరచి ఊరట కలిగిస్తాడు. ఈ సందర్భాలన్నీ తులసీ ఎంతో మనోహరంగా చిత్రించారు. ఆ ఘట్టం త్యాగ రాజస్వామికి బాగానచ్చింది. అంతే, దానిని ఒకకృతిలో నిబద్ధించారు. ప్రహ్లా దుడు విష్ణుమూర్తిని వరంగా అర్థించిన "సీతాసుఖం" ఆసందర్భానకుచెందినది!

యదుకుల కాంభోజి – ఆదితాళం.

ప॥ దయసేయ వయ్యా సదయ రామచంద్ర!

అ॥ప॥ దయను కొంచెమైన - నాడు దలచుచున్న సీతాసుఖము! ॥ద॥

చ॥ క్షితినాథుల రాకయు స - మ్మతిలేక శ్రీ సాకేత

పతి రాడేయన, వచ్చునని - సతికి గల్గిన యానందము ॥ద॥

చెలియరో నావలె నాధునకు - గలరేమో రాలేదని జాలి
దెలిసి మ్రొక్కుకొనబోవువేళ-బలిమిని ఎదురైన సుఖము ॥ద॥
కొంచె మీ రూప మావిల్లు - వంచ కూడకపోనోయని
ఎంచి జాలి జెంద మేను - జెంచి కనిపించినట్లు ॥ద॥
ఎట్టి వారికైన దొరక - నట్టి జనకజను బోట్టు
గట్టి కరము బట్టువేళ - కాంతకున్న సుఖము తనకు ॥ద॥
కోరిన వారలను నే - నీరీతి బ్రోతునని సభ
వారలకు దెలియజేయు - దారి త్యాగరాజునకు ॥ద॥

ఇక "మానసం" లో తులసీదాసు కావించిన వర్ణన గమనించండి రాజసభలో మూడువందల మంది బలశాలురు పట్టితెచ్చి ఉంచిన పినాకాన్ని దానికెదురుగా ఊనషోడశ వర్షీయుడై శిరీషకుసుమ నవకాన్ని అధఃకరిస్తూ నిలచిన రఘువీరుని చూచి సీతమ్మలో అంతర్ద్వంద్వం చెలరేగుతుంది,

అహహా! తాత దారునహఠ ఠానీ। సముఝుతనహిఁకఛు లాభనహానీ॥
కహఁధను కులిసహు చాహికఠోరా? కహఁస్యామల మృదు
గాతకిసోరా?

విధి! కెహి భాంతి ధరౌఁ ఉరధీరా? సిరిససుమనకన భేదియహీరా!
సకలసభా కై మతిభయిభోరీ। అబమోహిసంభు-చాపగతి తోరీ!
నిజజడతాలో గన్హపరడారీ! హోహిహరుఅ రఘుపతిహి నిహారీ!
అతిపరితాపసీయమనమాహీఁ।లవనిమేష జుగసయసమ జాహీఁ!

* * * *

ప్రభుతన చితై ప్రేమపనఠానా। కృపానిధాన రామ సబజానా।
సియహిఁవిలో కితకెవు ధనుకైసే। చితవగరుడ లఘువ్యాలహికైసే!

ఆదర్శప్రేమమూర్తి అయిన రాఘవస్వామి జగజ్జనని పరితాపాన్ని తొలగించేందుకు ఆప్రచండపినాకాన్ని వైనతేయస్వామి చిన్నపాముపిల్లను చూచునట్లుగా నిర్లక్ష్యంతో చూచారట! ఎంతటి మర్యాదా విలసితమైన క్రియావైదగ్ధ్యం!

వేదవేద్యుడైన శ్రీరామచంద్రునిలోని మూడుశక్తులు తులసీదాసును ఆకర్షించాయి. అవి శ్రీరాముని అద్భుతమైన శీలం, సౌందర్యం, బలం. అవే త్యాగయ్యగారి హృదయాన్ని గూడ చూరగొన్నాయి. శ్రీరామభద్రుడు శీల సముద్రుడు— తులసీ అంటారు.

సుని సీతాపతి సీలసుభావు !
మోదనమన తనపులక నయన జలసోనర ఖేహోరభావు॥సుని॥

సీతాకాంతుని శీలస్వభావాలు విన్నంతనే ఎవని మనస్సు ఆనందంతోను, శరీరం పులకలతోను, నేత్రాలు ఆనంద బాష్పాలతోను ద్రవించవో ఆదౌర్భాగ్యుని జీవితం నిరర్థకం.

ఎలాంటి దాగుణోన్నిద్రుడైన రామభద్రుని శీలం?—

ఖేలత సంగ అనుజబాలక నిత, జగపత అనట అపావు.
జీతిహోరి చుచుకారి దులారత, దేతదివావత దావు॥
నిజకరు నా కరతూతి భక్తపర, చపత చలతచరచావు
సకృతప్రనామ ప్రనత జస వరనత, సునత కహాత 'ఫిరిగావు!'॥
మురఘు సమురఘు గునగ్రామ రామకే, ఉర అనురాగ బఢావు
తులసిదాస అనయా సరామపద, పయిహై ప్రేమపసావు ॥సుని॥

పువ్వు పుట్టగానే సౌరభం వెదజల్లునట్లు బాల్యంమంచి రామునిలో శీల సంపద ఘనీభవించి ఉంది. తోడి బాలురతో ఆడే ఆటల్లో యితరులు ఓడిపోయి తాను గెలిచినప్పుడు, వారలమనస్సు ఎక్కడ నొచ్చుతుందో అని తానే ఓడిపోయినట్టు అంగీకరించేవాడు. వారలకు మరల మరల గెలిచేవరకు 'పందెం' యిస్తూనే ఉండేవాడు! పెద్దవాడైన తర్వాత తన ఎదుట భక్తులకు తాను గావించిన ఉపకారాన్ని ఎవరైనా ఉగ్గడిస్తే సిగ్గుపడి నొచ్చుకునేవాడట! అలాకాక తన భక్తుల చరిత్రను గుణాలను ఎవరైనా కీర్తిస్తుంటే మహదానందపడి తానుకూడ వారలతో అభక్తగుణానుకీర్తనంలో భాగం పంచుకునే వాడట! ఇలాంటి రాముని గుణగ్రామాన్ని విని తెలిసికొని మానసించే కొద్దీ ఎంతటి పరుష హృదయాలైనాసరే ద్రవించి రామభక్తి పూరితాలౌతాయని తులసీదాసు గానం చేస్తారు.

సీతాన్వేషణంలోను రావణసంహార కార్యంలోను తనకు గోరంత సాయం చేసినవారిపట్ల గూడ కొండంత కృతజ్ఞత కనుపరచి వారలకు సాయుజ్య పదవి అనుగ్రహించాడు రాముడు. జటాయువు హనుమంతుడు, సుగ్రీవుడు, విభీషణుడు, గుహుడు, శబరి మొదలగు వారలను తనకు పితృ సములుగా, సోదరతుల్యులుగా, ప్రాణసమానులుగా ప్రేమించడం శ్రీ రాముని స్వభావం. ఈ విషయాన్ని తులసీదాసు ఎంత హృద్యంగానో వర్ణించారు అనేకాలయిన సందర్భాల్లో. ఇక త్యాగయ్య విషయమా? చెప్పనక్కరయేలేదు. ఆయన రచించిన ప్రతి కృతిలోను శ్రీరాముని శీల సౌందర్యం ప్రతిఫలిస్తుంటుంది. నవరస కన్నడ రాగంలో నవరసాలు వెలార్చే ఈ కృతి చూడండి.

పలుకు కండ చక్కెరను గేరునే! పణతులార! చూడరే॥
కొలువుకూటమున గొలుచువారిని
బిలచి దాశరథి ప్రేమమీర బలుకు ॥పలుకు॥

శ్రీరాముడు మితభాషి, స్మితభాషి, మృదుభాషి, స్మిత పూర్వాభిభాషి, మాటాడే పొంకం, పద్ధతి ఆయనవద్దనే చూడాలి.

ఏమని మాటాడితివో! రామ
ఎవరిమనసు ఏ విధమో తెలిసి ॥ఏమని॥
మామ మరుదు లనుజులు, తల్లిదండ్రులు,
భామలు, పరిజనులు, స్వవశమౌటకే ॥ఏమని॥
రాజులు, మునులు, సురాసురులు, వరద్విగ్రాజులు,
మరి శూరులు, శశధర దినరాజులు
లోబడి నడువను త్యాగ
రాజవినుత నయ భయముగ ముద్దుగ! ॥ఏమని॥

శ్రీరామునిది ప్రేమకూ భక్తికీ ప్రాధాన్యం యిచ్చే స్వభావం—

ఎవ్వరే రామయ్య! నీసరి
రవ్వకు దాపులేక సుజనుల రాజిగ రక్షించువా ॥ఎ॥

పగవానికి సోదరుడని ఎంచక భక్తినెరిగి లంకాపట్టణ మొసగగ
నగధర! సురభూసురపూజిత! వరనాగశయన! త్యాగరాజ
వినుత సరి ॥వి॥

సౌశీల్యం తర్వాత శ్రీరాముని రూపసంపద చేతనాచేతనాలను సమ్మోహితం గావిస్తుంది. సీతా కల్యాణ ఘట్టంలో పెండ్లికొడుకుగా ముస్తాబైన రాముని అందాన్ని అద్భుతంగా వర్ణిస్తారు తులసీదాసు. ఆయన 'కోటి మనోజలజావన హారే!' అంటే కోటి మన్మథులను సిగ్గుపరచగలిగినవాడట! నార చీరలు ధరించి అడవికి వెళ్తూంటే నిరలంకృతమైన ఆయన సోయగానికి ఆటవికులు సొక్కిపోయారట. రెప్ప అర్పకుండా అసౌంద ర్యాన్ని చూస్తూ ఆయన వెంట వాళ్ళుగూడ అలాగే తనువు రాము మరచి నడచి పోయే వారట, కొందరు బిడియపడే స్వభావం గలవారు, శ్రీరాముని సహజ సుందర రూపాన్ని నేత్రాలద్వారాన హృదయస్థం గావించుకొని అది మళ్ళీ బయటకు పోకుండా కనురెప్పలనే తలుపులు బిగించి మనో నేత్రాలతో అనుభవించి పుల కించి పోయారట! ఆయన సౌందర్యం వృక్షాల్లో, లతల్లో, వనస్పతుల్లో నవ జీవనాన్ని నిలిపివేసిందట. అవి ఆ భాగానికి తట్టుకోలేక అసమయంలోనే వాసించి వికసించాయట. ఆకాశంలో సంచరించే మేఘం రఘుకులాలంకారుని రూప మాధుర్యానికీ మార్దవానికీ సొక్కి తన శరీరాన్ని ధవళాత పత్రంగాచేసి ఆయన వెంటవెంటనే పయనించిందట! ఇలా సృష్టిలోని అణు వణువును కణకణాన్ని ముగ్ధమోహితం కావించే ఆ రూపాన్ని తులసీ అడు గడుగునా కీర్తించారు. ఇక ఆ లావణ్యరాముని చూచేందుకు వేణు గాన లోలుని రూపాన్ని పానం చేసేందుకు వేయి కనులు కావాలంటారు శ్రీ త్యాగయ్య

"సీయందమునుగని సొక్కితి, నెడబాయని ప్రేమచేత జిక్కితి,
నా ప్రాయమెల్ల నీ పాలుజేసి మొక్కితి. ఆనంద మానందమాయేను."

"బాగుగ నన్నేలుకొమ్ము అల్లత్యాగరాజనుత తనువు నీ సొమ్ము"

"ఎన్నగ మనసుకురాని పన్నగశాయి సొగసు
పన్నుగ కనుగ్గొనని కన్నులేలే? కంటి మిన్నులేలే?"

"మోహముతో నీలవారివాహకాంతిని గేరు
శ్రీహరినే కట్టుకొనని దేహమేలే?"

అంటూ శ్రీరామునిపట్ల తమ దాంపత్యభక్తి వెలిబుచ్చుతారు.

"క్షణే క్షణే యన్నవతాముపైతి
తదేవరూపం రమణీయతాయాః"

అనే అలంకారిక వచనానికి దృష్టాంతంగా, లక్ష్యంగా ఆయన వరాళి రాగంలో నిర్మించిన కృతిబోధంలో శ్రీరామచంద్రుని అందచందాలు, సొబగు ఒదుగులు అడుగడుగునా చోటు చేసుకొని లలితలాస్యం చేస్తాయి.

కన కన రుచిరా కనకవసన! నిన్ను
దినదినమును మనసున చనవున నిన్ను ॥కన॥
పాలుగారు మోమున శ్రీయపార మహిమదనరు నిన్ను ॥కన॥
బాలార్కాభసుచేల! మణిమయమాలాలంకృత కంధర! సర
సిజాక్ష! వరకపోల! సురుచిర కిరీటధర! సంతతంబు మనసారగ ॥కన॥

* * *

కలకలమను ముఖకళ గలిగిన సీత
కులుకుచు నోరకన్నులను జూచు నిన్ను ॥కన॥

శ్రీరాముని శీలసౌందర్యం మనస్సును వశపరచుకుంటే దేహ సౌందర్యం నేత్రాలను ఆకట్టుకుంటుంది. పోతే యిక శిష్టులను రక్షించి దుష్టులను శిక్షించే అప్రతిహతమైన శక్తి సౌందర్యం దేహాన్నీ మనస్సునూ బుద్ధినీ ఆత్మనూ- సర్వస్వాన్నీ వశపరచుకొని తన చల్లని గొడుగునీడలో భవ జ్వాలలలో సంతప్తమయ్యే మానవజాతిని రక్షిస్తుంది. సాధకునికి అద్వితీయమైన ఏకైక లక్ష్యాన్ని ప్రసాదిస్తుంది.

మొదటి (దోహా) శ్లోకంలో చెప్పినట్టు, కోదండపాణి అయిన ప్రభువు సౌందర్యానికే తులసీ కైమోడ్పుఘటిస్తాడు కాని కేవలం గోపీ మానస చోరునకుకాదు, అదే మనస్తత్వం త్యాగరాజుది కూడా. తులసీ తన చంచలమైన మనస్సుకు ఈ విధంగా హితబోధ చేసుకుంటారు.

లవనిమేష పరమానుజుగ బరషకల్ప సరచండ
భజసి నమనతెహి రామకహుం కాలజాసు కోదండ.

"ఓ మనస్సా! కాలాన్నే కోదండంగా ధరించి క్షణాలు ఘడియలు, రాత్రింబవళ్ళు నెలలు ఋతువులు అయనాలు సంవత్సరాలు యుగాలు కల్పాలు అనే తీవ్రశరపరంపరలో బ్రహ్మాండాన్నంతటినీ పాలించే సర్వ శక్తి స్వరూపుడైన శ్రీరాముని భజించ వేందులకు ?" ఈ పంక్తులు పర మేశ్వర శక్తికి అవధులు! అలాంటి శక్తి రూపుకట్టిన తత్వమే శ్రీరాముడు.

ఇక త్యాగయ్యగారెన్నో కృతులలో శ్రీరాముని 'త్రాణశౌర్యా'న్ని రక్షకశక్తిని కీర్తిస్తారు. క్షమాగుణంతో కూడిన త్రాణశౌర్యమే ఆ మహా భక్తున కారాధ్యము.

"రామబాణ త్రాణశౌర్య మేమని దెలుపుదురా! ఓ మనస!
భామకాసపడు రావణు మూలబలముల నేలగూలజేయు ॥రా॥"

శ్రీరాముడు 'ఒక మాట ఒక బాణము ఒక పత్నీవ్రతుడు'. ఆ ఒక్క బాణమే లెక్కకు మిక్కిలిగా రూపుకట్టి రిపుసంహారం చేయడం, స్వామివా రిని అబ్బురపరుస్తుంది. ఆశ్చర్యంతో, ఆనందంతో, ఆత్మీయతాబుద్ధితో, అమా యకుడిలాగా తన ప్రభువును అడుగుతారు—

మధ్యమావతి - ఆది

ఎవరిచ్చిరి రా శర చాపము నీ కినకులాబ్ధిచంద్ర ?
అవతరించువేళగ ల్గెనో! లేక అవనికేగి యార్జించితివో?
ఒకజేసి పదినూరై వెయ్యై చకపకలాడి శత్రులనణచెనట!
వికలుని కాకిని బ్రోవ త్రిమూర్తులు—వెనుకదీసిరట!
సకలద్రుమ కుల్యాల నదీపతికై సంహరించెనట!
ప్రకటకీర్తి గల్గిన కోదండపాణి! శ్రీ త్యాగరాజ వినుత! ॥ఎవ॥

తులసీదాసు తనరచనలో సమకాలానికి చెందిన స్థితిగతులను వర్ణిం చారు. కలియుగంలో మానవుడు జీవితపు నైతికవిలువలను వదలి పతనావ స్థను చెందడంచూచి ఆయన ఆత్మ క్షోభించిపోయింది. ఆపతనానికి కారణం

-యుగపురుషుడు కలి. కలిదౌష్ట్యాలను విశదంగా వర్ణిస్తూ అతడి చేతుల్లో మానవుడుపడే పాట్లను లోకరక్షకుడైన కోదండపాణికి నివేదిస్తూ ఆమహా కవి "వినయపత్రికను" (ముహాజరు) ప్రభువు దర్బారులో సమర్పించుకుం టారు, 250కుపైగా చక్కని గీతాల్లో రచించబడిన ఆవినయపత్రికలోని అం శాలు త్యాగరాజస్వామివారి చెవినబడినట్లుంది. తనకాలంలోని సమాజం కూడ అనాచారాలకు నెలవైపోయింది. దాని దుస్థితికి అయన హృదయం కంపించిపోయింది. నిజమైన ప్రతినిధిగా సంఘంలోని దౌష్ట్యాన్నంతటినీ తనకు ఆపాదించుకుని తనను రక్షించగల 'దొరకొడుకు' ఎవ్వరా? అని ఆరాటపడ తారు

"దుడుకుగల న న్నే దొరకొడుకు బ్రోచురా? ఎంతో॥
కడుదుర్విషయాకృష్టుడై గడియ గడియకు నిండారు ॥దు॥
సకల భూతములయందు నీవేయుండగ మదిలేక బోయిన ॥దు॥
పరధనములకొరకు నొరుల మదిని కరగ బలికి కడుపునింప
దిరిగినట్టి ॥దు॥
తెలియని నటవిట శూద్రులు వనితలు స్వవశమౌట కుపదేశించి
సంతసిల్లి స్వరలయంబు లెరుంగకను శిలాత్ములై సుభక్తులకు
సమానమను ॥దు॥
సతులకై కొన్నాళ్లాస్తికై సుతులకై కొన్నాళ్ళు ధన
తతులకై దిరిగితినయ్యా, త్యాగరాజాప్త యిటువంటి ॥దు॥
మొదటి కులజుడగుచు శూద్రులవనులు సల్పుచుననుంటినిగాక
నరాధములను గోరి సారహీనమతములను సాధింప తారుమారు ॥దు॥

ఈ దుర్గతి కంతకూ కారణం కలిపురుషుడని చెబుతూ ఆదుష్టుని బారి నుండి నరులను రక్షించమని వేడుకుంటారు యింకొకకృతిలో.

ఇది సమయమురా, ఇనకులతిలక!
విదళిత కలి దుర్మద! గజగమన ॥ఇది॥
కలి పురుషుడు నాటకమున గట్టదలచినాడు శ్రీత్యాగరాజనుత!
చాలమతముల నేయాగములకు మేకలుగ నరులజేసి
నీదయజూప॥ నిధి ॥

ఇక తన 'వినయ పత్రిక'లో శ్రీ తులసీదాసు ఆనాటి దుస్థితిని ఎలా వర్ణించాడో చూడండి—

"దీనదయాలు! దురితదారిదదుఖ, దునీదుసహా తిహుం తాప తయీా హై!
దేవ! దువారపు కారత ఆరత, సబకీసబ సుఖహాని భయీా హై॥
రాజ సమాజకుసాజ, కోటికటుకలపతి, కలుషకుచాలనయీా హై॥
ప్రీతిపరమితి పతి హేతువాద హాతిహే రహాయీా హై।
ఆస్రమబరన ధరమ విరహితజగ, లోకవేదమరజాదగయీా హై॥
ప్రజాపతితపాఖండ పాపరత, అపనే అపనే రంగ రయీా హై॥
పరమారథస్వారథ, సాధనభయె అఫల, సఫలనహీ సిద్ధిసయీా హై॥
కామధేనుధరనీ, కలిగోమర బిబసబికల జామతి నబయీా హై॥
కలికరనీబరని యేకుహాంలేం కరతఫిరతబినుట హాలటయీా హై॥
తాపరదాంతపీస కరమింజత, కోజానై చితకహా తయీా హై॥
త్యోంత్యోంనీచ చఢతసిర ఊపర, జ్యోంజ్యోం సీలబసఢీల దయీా హై।
సరుషబ రజితరజియే తరజనీ, కుమ్హిలై హైకుష్మ దే కీ జయీా హై॥"

"దీనదయాలో! ప్రభూ! నీసభా ద్వారాన నిలబడి పతితమైన యీ మానవ సమాజం ఆర్తితో మొర బెట్టుకుంటున్నది. సుఖమంటూ సంఘంలో ఈనాడు లేనేలేదు. సర్వనాశనమే రాజ్యంచేస్తోంది. పరిపాలకులు పూర్తిగా పతితులయ్యారు. నీతి, విశ్వాసం, ప్రేమ, దయదాక్షిణ్యాదిసద్గుణాలను హేతు వాదం పూర్తిగావరాస్తంచేసింది. వర్ణాశ్రమ ధర్మాలు లోపించాయి. లోక మర్యాదలు వైదికధర్మాలు నశించాయి. ప్రజలు పాషండులు, పతితులూ అయి పాపంలో మునిగియున్నారు. ఈనాడు స్వార్థమే పరమార్థమై సంఘాన్ని పీడిస్తోంది. పృథ్వి అనే కామధేనువు, కలి అనే కసాయివాని చేతిలో చిక్కి విలవిల్లాడుతోంది. ఆకలి దౌష్ట్యాలకు అంతేలేదు. ఎన్నని చెప్పను? నీచులు గొప్పవారై కూర్చున్నారు. శీలవంతులు దీనులై దిక్కులేకుండ ఉన్నారు. ప్రభూ! మీరొక్క పర్యాయం మీచూపుడుప్రేలు కలిపురుషుడివైపు

చూపి భయపెట్టండి. అంతే! వెంటనే చూపుడువేలు తగిలిన గుమ్మడి పిందె లాగనే వాడూ వాని దౌష్ట్యాలూ కుళ్ళి నశించిపోతాయి."

హిందీ భక్తకవి శ్రీతులసీదాసు జీవితము, మనస్తత్వము, రచనలు, ఆదర్శాలు శ్రీ త్యాగరాజుస్వామిని ఎంతగానో ప్రభావితుణ్ణి చేశాయనడానికి యిలాంటి దృష్టాంతాలు, ప్రమాణాలు ఎన్నో చూపించవచ్చు. ఈప్రభావం యాదృచ్ఛికంగా సంభవించిందికాదని బాహ్యాంతర సాక్ష్యాలు నిరూపిస్తాయి. కోకొల్లలుగా ఉన్న వానిలో ఏవో కొన్నిమాత్రమే ఈవ్యాసంలో చేర్చడం జరిగింది. తులనాత్మకమైన ఈదృష్టితో భారతదేశంలోని వివిధ భాషల్లోని భక్తకవుల జీవితాలను పరిశీలించినప్పుడు, మనస్సుకు హాయిని, ఆనందాన్ని కలిగించే యిటువంటి విషయాలు ఎన్నో గోచరించగలవు. ఈదేశపు భావ సమైక్యాన్ని సాంస్కృతిక సమన్వయాన్నీ చాటిచెప్పే తథ్యాలు ఎన్నో వెలుగులోకి రాగలవు.

# దేవాలయము - ఉత్పత్తి వికాసములు

శ్రీ గడియారం రామకృష్ణ శర్మ

## పరిచయము

| | | |
|---|---|---|
| పేరు | : | శ్రీ గడియారం రామకృష్ణ శర్మ |
| జననము | : | అనంతపురము జిల్లా. కదిరి :<br>కాళయుక్తి, ఫాల్గుణ శు॥ ౪ |
| రచనలు | : | 1. అలంపూరు క్షేత్ర చరిత్రలు.<br>2. భారతదేశ చరిత్ర.<br>3. తెలంగాణము శాసనములు ౧ భాగము<br>4. దశరూపకసారము<br>5. గదా యుద్ధము (అనువాదము) |
| పదవి | : | హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రముఖ కార్యకర్తలలో వీరొకరు. |

క్షేత్రములయు, దేవాలయములయు శాసనాదులయు పరిశోధనములవలన వీరు పొందిన అనుభవము లీ వ్యాసమున చిత్రితములు

"చిన్మయస్యాద్వితీయస్య - నిష్కలస్యాశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం - బ్రహ్మణో రూపకల్పనా"

—కులార్ణవతంత్రము

"చిన్మయుడు, అద్వితీయుడు, అశరీరుడు అయిన పరబ్రహ్మమునకు రూపకల్పనము ఉపాసకులను తరింపజేయుటకై చేయబడినది."

ఈ అఖండ బ్రహ్మతత్త్వమును లోకమునకు వెల్లడించుటకే దేవాలయనిర్మాణవిధానము లుదయించినవి,

ఈ పరమార్థమును గ్రహింపజాలని పాశ్చాత్యులును, తదనుయాయులగు భారతీయ విద్యాధికులును మనదేవాలయోత్పత్తిని గూర్చియు, విగ్రహారాధనమును గూర్చియు అపసిద్ధాంతములను చేసినారు. విషయ పరిజ్ఞానము లేక వారు ప్రకటించిన ఈ కూలు, సిద్ధాంతములు మనకు ఆశ్చర్యమును అసహ్యమును కలిగించుచున్నవి. భారతీయవాస్తు శిల్పవిషయములలో పేరుగాంచిన పరిశోధకులుగా పరిగణింపబడిన కొందరు మన విగ్రహారాధనను గూర్చి, దేవాలయ నిర్మాణమును గూర్చి వ్రాసిన విపరీత సిద్ధాంతములను సంగ్రహముగ విన్నవించెదను.

(1) వేదయుగమున భారతీయులు విగ్రహారాధనము నెరుగరు. అప్పుడు దేవాలయములు లేవు.

(2) రామాయణ — మహాభారతములలో దేవాలయము ప్రస్తావింపబడలేదు.

(3) ఇటీవల రచింపబడిన పురాణములలోనే దేవాలయ విగ్రహారాధనలు కానవచ్చుచున్నవి.

(4) బౌద్ధుల స్తూపములను, మూర్తులను చూచి వైదికమతానుయాయులు ఆలయములలో మూర్తులను నిర్మించుట తెలుసుకొనిరి.

(5) బౌద్ధులుగూడ చరిత్ర కందని పూర్వకాలపు శిలాయుగ సమాధులను చూచి వలయాకృతిలో స్తూపనిర్మాణమును గ్రహించిరి.

(6) ఆ ప్రాగైతిహాసిక యుగ సమాధులు ఈజిప్టు -మెసపటోమియా ప్రాంతములనుండి భారతదేశమునకు వలసవచ్చినవారివి

ఇవి పాశ్చాత్యులను ఖ్యసిద్ధాంతములు-ఇవన్నియు అజ్ఞాన విలసితములు. ఈ దుర్వాదములు నిర్వాపణమొనర్చుటకై దేవాలయ విగ్రహోత్పత్తులను గూర్చి భారతీయుల మతమేదో పరిశీలింతము, భారతీయ కళాకోవిదుల లక్ష్యమేమియో వివరించుటయే ఈప్రసంగోద్దేశము.

## భారతీయ సంస్కృతి

మనదేవాలయములు భారతీయ సంస్కృతికి ప్రధానకేంద్రములు. సంస్కృతి అను పదము యొక్క అర్థవ్యాప్తి విస్తృతమైనట్టిది. ఒకమాటలో,

ఒక వాక్యములో దాని దిగ్దర్శనము చేయుట కష్టము. "తనలో అణగి యున్న ఈశ్వర చైతన్యమును, దాని సర్వతోముఖ వ్యాప్తిని పూర్తిగ గ్రహించి ఆ చైతన్య ప్రసారణమునందు నిరతుడగుటయే సంస్కృతి." భారతీయ సంస్కృతి యొక్క జీవనాడి ప్రప్రథమముగా వేదోపనిషత్తులందు స్పందిత మైనది. భారతీయ జీవనముయొక్క సకల వికాసములందును ఆధ్యాత్మిక భావము పాలలో నీరువలె సమ్మిళితమైయున్నది భారతీయ కళలు గూడ ఈ నియమమునకు దూరముగ లేవు మనస్సునకు శాంతస్థితిని ప్రసాదించి రసానుభవమునకు మూలమైన దివ్య సత్య దర్శనమును చేయించుటయే మన లలితకళల లక్ష్యము - భారతీయ వాస్తు శిల్ప చిత్ర లేఖన సంగీత నృత్య కవిత్వాది కళలన్నియు మన ఆధ్యాత్మిక జీవనమునకు బహిర్ముఖములై యున్నవని నిస్సంకోచముగ చెప్పవచ్చును.

## భారతీయ శిల్పకళాలక్ష్యము

ఆధ్యాత్మిత జీవనమునకు భారతీయు లొసగిన ప్రాధాన్యమును పాశ్చాత్యు లొసగలేదు. ప్రాచ్య పాశ్చాత్య దృక్పథములలోనే విశేషభేద మున్నది. పాశ్చాత్య శిల్పము వారి సామాజిక, రాజకీయ, జాతీయ జీవనమునకు ప్రతీకగా ఉన్నది. భారతీయ శిల్పము మన సమ్యక్ జీవనమునకు ప్రతీకగా ఉన్నది. పాశ్చాత్యశిల్పి రాజభోగము లనుభవించు విలాసపురుషుడు. భారతీయశిల్పి సామాన్యజనప్రతినిధియై ధర్మప్రసారణమునకు జీవితము నంకితమొనర్చిన భక్తుడు. విరక్తుడు,

కళానిర్వచనమునగూడ వారికిని మనకును విభేదము కలదు. కళ అనగా ప్రకృతికి ప్రతీకగా, సమకాలిక పరిస్థితులకు ప్రతిబింబముగా ఉండవలెనని పాశ్చాత్యుల అభిప్రాయము. భారతీయులు వీనితో తృప్తి నొందలేదు. జీవనమును ఆనందప్రద మొనరించునది, చిత్తక్షోభమునుపోకార్చి పరమశాంతిని చేకూర్చునది, మానవునకు స్వస్వరూప జ్ఞానము కలిగించునది, జీవితమును కలుషిత మొనరించు కామక్రోధాది అరిషడ్వర్గముల ఔద్ధత్యము నడచునది కళ అని మనవారు ఉద్ఘాటించినారు. మన కళావిదులు కేవలము అనుకరణ ప్రియులుగాక చేతోహారి జీవన సృష్టికర్తలు, సమ్యక్ జీవన వ్యాఖ్యాతలు అయినారు. కావుననే భారతీయ జీవనమునందు కళావేత్త

కేవల బింబగ్రాహి కాదు. అతడు దార్శనికుడు; ఉపాసకుడు; ఆచార్యుడు అయియున్నాడు.

వేదయుగమునుండియు మానవునకు బాహ్య ప్రపంచముతో ఉండదగిన సంబంధమును ప్రదర్శించుటయే భారతీయ శిల్పోద్దేశము. సగుణోపాసనయందు జీవాత్మ పరమాత్మలకుగల సంబంధమును అధ్యాస మొనరించునపుడు చిత్తవృత్తుల ననుసరించి అధికార భేదములుండక తప్పదు. అందువలననే మూర్త్యుపాసకుని అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ ఆనందమయ కోశములను ఉత్తరోత్తర సాక్షాత్కారము చేసికొనుటకై మన శిల్పరీతు లదయించినవి.

## దేవాలయ తత్త్వము

మనకు గానవచ్చు ప్రాచీనాలయము లన్నియు గుహాలుగనో, గుహాకృతి గలవిగనో యున్నవి. మనుష్యుని హృదయ గుహాయందు దహరాకాశమున్నదనియు, అందు జ్యోతిఃస్వరూపుడగు ఈశ్వరు డున్నాడనియు, భక్తుడు ఈశ్వర సాయుజ్యమును పొందవచ్చుననియు దేవాలయములు స్థూల నిదర్శనములై నిరూపించుచున్నవి.

"బ్రహ్మపురే పుండరీకం వేశ్మ దహరోస్మిన్నంతరాకాశః"
—ఛాందోగ్యము

"హృదయం తద్విజానీయాత్ విశ్వస్యాయతనం మహత్...
తస్యాన్తేసుషిరం సూక్ష్మం తస్మిన్ సర్వం ప్రతిష్ఠితం, తస్యమధ్యే
మహానగ్నిః...తస్య మధ్యే వహ్నిశిఖా...తస్య శిఖాయా మధ్యే
పరమాత్మా వ్యవస్థితః స బ్రహ్మ స హరిః స శివః"
—మహానారాయణోపనిషత్

దేవాలయములు సంక్షేపముగా పరమేశ్వరుని బాహ్యసృష్టిని మానవుని దేహరచనను, జీవప్రగతిని, వాస్తుశిల్పముల ఆధారముతో భక్తునకు జ్ఞప్తికి దెచ్చుటకై నిర్మింపబడినవి.

"దేహో దేవాలయప్రోక్తో జీవో దేవస్సనాతనః
త్యజేదజ్ఞాననిర్మాల్యం సోహంభావేన పూజయేత్"

"దేహమే దేవాలయము, అందు జీవుడే దేవుడు. అజ్ఞానము అను నిర్మాల్యము తొలగించి వాడే నేను అనుఆత్మజ్ఞానముతో అర్చింపవలెను" అని దీని భావము.

ప్రకృతి, జీవాత్మ పరమాత్మలకు గల సంబంధమును గూర్చి ఉపనిషత్తు ఇట్లు చెప్పుచున్నది.

> "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
> తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి
> సమానేవృక్షే పురుషోనిమగ్నో అనీశయాశోచతి ముహ్యమానః
> జుష్టం యదాపశ్యత్యన్యమీశం అస్యమహిమానమితి వీతిశోకః
> అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతి రివాధూమకః"
>
> —శ్వేతాశ్వతరోపనిషత్తు

"మంచి రెక్కలు స్నేహము కలిగి సమానములై యుండు రెండు పక్షులు (జీవాత్మ-పరమాత్మలు) ఒక చెట్టునందు (దేహము-ప్రకృతి) ఉన్నవి. అందొకటి (జీవాత్మ) దాని తియ్యపండ్లను (కర్మఫలము) అనుభవించును. రెండవది (పరమాత్మ) అనుభవింపక ప్రకాశించుచుండును ఒకే చెట్టునందు పురుషుడు (జీవాత్మ) దిక్కులేక సంసారమున మునిగి శోకించుచున్నాడు. ఎప్పుడీశ్వరుని, మహిమగలవానిని జూచునో అప్పుడు శోకము మాను చున్నాడు. అంగుష్ఠ పరిమాణముగల పురుషుడు పొగలేని జ్యోతివంటివాడు"

ఈ శ్రుతి ప్రమాణము ననుసరించి దేహమునందలి మూడు తత్త్వముల వలె నాలయమునందును మూడుతత్త్వములున్నట్లు గ్రహింపవచ్చును-'దేహము నందు దేహము-జీవాత్మ పరమాత్మలు దేవాలయమునందు గర్భాలయము-అఖండదీపము - భగవన్మూర్తి, - శరీరస్థానమున ప్రాకారము అనుశబ్దము దేహమునకుగల పోలికను తెలుపును. జీవస్థానమున అఖండ దీపముకలదు. అఖండమనగా ఆరిపోరానిది, దేహమునుండి జీవుడుపోయిన అది ఏవిధముగ అపవిత్రమగునో ఆవిధముగనే అఖండము ఆరిపోవ ఆలయముగూడ అపవిత్ర మగును. అందువలననే అఖండము ఆరినచో సంప్రోక్షణము చెప్పబడినది. ఏ విధముగ జీవుడు 'అచ్ఛేద్యుడో', ఎట్లు జ్యోతిస్వరూపుడో అట్లే అఖండ దీపము కూడ ఆ జీవాత్మయే పరమాత్మ, ఈ విషయమునే భగవద్గీత ఇట్లు చెప్పినది.

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః"

—భగవద్గీత 15-7.

జీవుడు తన అంశమే అని శ్రీకృష్ణుడు చెప్పెను.

"ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశోర్జున తిష్ఠతి"

అను ప్రమాణము ననుసరించి ఈశ్వరుడన్న సాకారునిగ గ్రహింప వలయును. గర్భగృహమే హృదయగుహ.

"యదాత్మతత్త్వేన తు బ్రహ్మతత్త్వం దీపోపమేనేహయుక్తః ప్రపశ్యేత్"

ఆత్మజ్యోతిచే పరమాత్మను దర్శించినట్లే అఖండ దీపకాంతిచే భగవన్మూర్తిని దర్శింప వలయును.

"ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్"

"ఓంకారము ధనువు, ఆత్మ బాణము, బ్రహ్మము లక్ష్యము. జాగరూకుడై లక్ష్యభేదన మొనర్పవలెను." అనగా ప్రణవోచ్చారణ పూర్వకముగా తదర్థ సంధానము జేయుచు జీవాత్మను బరమాత్మలో జేర్పవలెను అని భావము. ఆ ప్రణవోచ్చారణ స్థానమున ఘంటానాదమున్నది. ఈ ధ్వని వికార ధ్వనిగలదై యుండరాదు. ఘంటాధ్వని 'ఓం' అని పలుకవలెను.

గర్భగృహము నందలి ముందుభాగము అంతరాళము. అచట "చీకటి" యుండును. అది "తమసః పరస్తాత్" అను శ్రుతి వాక్యమును స్ఫురింపజేయుచుండును. ఈ ఆధ్యాత్మిక భావములతో రూపొందింపబడినది మన దేవాలయము

## విగ్రహారాధనము

వైదికులకు బౌద్ధము తరువాతగాని మూర్తిపూజా పద్ధతి తెలియదని వేదకాలమున మూర్తిపూజ లేదని కొందరు ప్రబుద్ధులు వ్రాసినారు. కాని అది సరికాదు వేదోపనిషత్తులలో సగుణ నిర్గుణభేదముల ననుసరించి మూర్తుల యొక్క ఉల్లేఖనములు కానవచ్చుచున్నవి. బృహదారణ్యకోపనిషత్తునందు

"ద్వావేవ బ్రహ్మణోరూపే-మూర్తంచామూర్తంచేతి"
"ఏకం రూపం బహుధా యః కరోతి"

ఇత్యాది వచనములున్నవి. వేదకాలమునుండి సాకార - నిరాకార ఉపాసనలు అధికార తారతమ్యముల ననుసరించి వ్యవహారము నందియున్నవి తంత్రగ్రంథములలో.

"అగ్నౌ క్రియావతాం దేవో దివి దేవో మనీషిణాం
ప్రతిమా మందబుద్ధీనాం యోగినాం హృదయే హరిః.

—కులార్ణవ తంత్రము

"కర్మిష్ఠులకు అగ్నియే దైవము, బుద్ధిశాలురకు లోకపాలకులు దైవములు, మందబుద్ధులకు మూర్తులే దేవతలు. యోగులకు హృదయమందే దైవమున్నాడు" అని వ్రాయబడినది.

మానవుడు తరించుటకు చేయు పూజావిధానములలో అంతర్యాగము, బహిర్యాగము అను రెండు పద్ధతులుగలవు, యాగమనగా పూజ- యోగులు అంతర్యాగమును భక్తులు బహిర్యాగమును అనుసరింతురు. యోగులు ఆత్మ సాక్షాత్కారము నందుటకు కొన్ని అర్హతలు సంపాదింపవలెనని ఉపనిత్తు చెప్పుచున్నది.

"సత్యేన లభ్యః తపసా హ్యేష ఆత్మా
సమ్యక్ జ్ఞానేన బ్రహ్మ చర్యేణ నిత్యం
అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో
యం పశ్యంతి యతయః క్షీణదోషాః.

—ముండకోపనిషత్తు

"సత్యముచేత, తపస్సుచేత, పూర్ణజ్ఞానముచేత, నిత్యబ్రహ్మచర్య వ్రతాచరణముచేత ఈ ఆత్మ సాక్షాత్కరించును. దేహములో జ్యోతిర్మయుడై శుభ్రుడై యుండువానిని ఏయతులు దర్శింతురో వారు పవిత్రులు. తనయందు భగవంతుని సాక్షాత్కరింప జేసికొనుట మిగుల కష్టసాధ్యము."

"నాయ మాత్మా ప్రవచనే లభ్యో, న మేధయా న బహునా శ్రుతేన. నాయమాత్మా బలహీనేన లభ్యః న చ ప్రమాదా త్తపసోవాప్యలింగాత్, ఏతైరుపాయై ర్యతతే యస్తువిద్వాన్, తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ"

—కఠోపనిషత్తు

"ఈ ఆత్మ వేదాధ్యయనముచేగాని, విశేషచమత్కారవాక్యములచే గాని లభింపదు. ఆయాత్మ బలహీనునకు (శరీరక-మానసిక బలములు శ్రద్ధలేని వారికి) లభింపదు. సోమరికి, అక్రమముగ తపస్సు చేయువానికి లభింపదు. కర్మ - జ్ఞాన - భక్తి యోగములచే నెవడు దృఢప్రయత్నము చేయునో ఆట్టి జ్ఞాని ఆత్మ బ్రహ్మ ధామమున ప్రవేశించును"

కష్టమైన ఈ అంతర్యాగవిధానము నవలంబింప లేనివారికే బహిర్యాగ విధానము చెప్పబడినది.

దేహమున నుండు ఆత్మను సాక్షాత్కరింప జేసికొనుట కే ఉపాయమున్నదో దేవాలయమందలి భగవంతుని సాక్షాత్కారమునకును అదే ఉపాయము దాని కేది ఫలమో దీనికిని అదే ఫలము. ఈ సాకారోపాసనాక్రమమే మానసిక పూజగా పరిణమించి ఆత్మసాక్షాత్కారము నంద జేయగలదు. ఈ విగ్రహారాధనమే సాక్షాదుపాసనము. ఇది దహర విద్యా రూపము. అందువలన అనంత అక్షయ ఫలదాయకము. ఇది వాంఛలు గలవారికి వాంఛలను, కోరికలులేనివారికి మోక్షమును ప్రసాదించును. 'ఆలయ నిత్యార్చనా పద్ధతి' యందు.

"బింబాకృత్యాత్మనా బింబే సమాగత్యావతిష్ఠతి"

"ఆరాధకుల ఇష్టమునకనుసరించి ఏర్పరచికొన్న ప్రతిమయందు భగవంతుడు ఆయాకారమునే వహించియుండును" అని చెప్పబడినది.

"అహం సన్నిహితస్తత్ర - పాషాణ ప్రతిమాదిషు" అని రామతాపనీయోపనిషత్తు చెప్పుచున్నది.

## ప్రాచీనత

దేవాలయ విగ్రహారాధనా పద్ధతులు భారతీయులలో అతి ప్రాచీన కాలమునుండియే ప్రాచుర్యము నంది. యున్నవి, మన వేద- ఆగమ-కావ్య ఇతిహాస పురాణాది ప్రాచీన వాఙ్మయమునందు దీనికి ఆధారములున్నవి. వాని నివేదించెదను.

## వేదయుగము

ప్రపంచమునందే ప్రాచీనతమ వాఙ్మయము మన వేదవాఙ్మయము. ఇది ఈశ్వరీయ జ్ఞానమని, అపౌరుషేయమని భారతీయుల విశ్వాసము. కొందరు పాశ్చాత్య పండితులును, తదనుయాయులును ఊహల నాధారము చేసికొని వేదములకు జాతకములను వ్రాయుటకు ప్రయత్నించిరి. వేద రచనా కాలము క్రీ-పూ, 1000 సం॥ మొదలు క్రి.పూ,25000 సం॥వరకు సాగ దీయబడినది. వేదవాఙ్మయమును మధించిన జర్మన్ విద్వాంసులు ష్లెగల్ వీబర్ పండితులు వేదవాఙ్మయము రచనా కాలమును నిర్ధరించదగు ఎట్టి ఆధారము గాని అందలేదనియు, దాని కాల నిర్ణయ ప్రయత్నము వ్యర్థ మనియు ఉద్ఘాటించి ప్రపంచములో వేద వాఙ్మయమే అత్యంత ప్రాచీన వాఙ్మయమనియు నిర్ణయించిరి. అదియే సమంజసమైనది.

వేదములలో సగుణ నిర్గుణ భేదముల ననుసరించి విగ్రహముల యొక్క ఆత్మ యొక్క ఉల్లేఖనములు కానవచుచున్నవి. ఇంద్ర, రుద్ర, విష్ణు సవితృ. వరుణ రూపములు కొన్ని మంత్రములలో వర్ణింపబడినవి. భారతీ. ఇడా సరస్వతీ దేవతలు హిరణ్యాభరణ భూషితలనియు, సరస్వతి వాగ్రూప - నదీ రూప - మూర్తిరూప యని చెప్పబడినది.

"హోతా యక్షత్వే శస్వతీః తిస్రోదేవీ హిరణ్మయీః
భారతీః బృహతీ ర్మహీః"- తై-బ్రా (11-16-17)
"అమ్బితమే నదీతమే దేవతమే సరస్వతీ" —ఋగ్వే-1.

ఋషులు ఇంద్ర విగ్రహమును ఇంటిలో పూజించుచుండిరని చెప్పబడి నది. వీనినిబట్టి వేదకాలమున భారతీయార్యులు విగ్రహారాధన మొనరించు చుండిరని స్పష్టముగ చెప్పవచ్చును. ఆకాలమున విగ్రహములను దారు-శిలా లోహ- మృత్తికా, రత్నాదులచే తయారు చేసికొనుచుండిరని కొన్ని ఋక్కులు చెప్పుచున్నవి.

"అశ్రీరం కృణుత సుప్రతీకం" —ఋగ్వే-VI-28-6
"కింస్విద్వనం క ఉసవృక్ష ఆసయతో ద్యావాపృథివీనిష్టాతదుః"
—ఋగ్వే X-81-9

అథర్వ వేదమునందు "కృత్యా" విగ్రహములను చేయు విధానము కలదు. తైత్తిరీయ సంహితలో దేవాయతన ముల్లేఖింపబడినది.

"దేవానా మాయతనమేతస్మాద్వా-ఆయతనాద్దేవా
అసురానజయన్ యద్వైశ్వానరం, ద్వాదశకపాలం నిర్వపతి"
—తై. సం. 2 కాం. 2 ప్ర. 6 అ. 1. మం.

## ఆగమములు

వేదములలో ఆలయ విగ్రహారాధనము గూర్చి సూచనాప్రాయముగ నుండగా ఆ తరువాతి ప్రామాణిక వాఙ్మయమగు ఆగమములలో దేవాయతననిర్మాణ, విగ్రహప్రతిష్ఠ, మూర్తిపూజాది విషయాలు శాస్త్రీయ పద్ధతులలో వివరింపబడి యున్నవి. నిగమముల వలెనే ఆగమములు కూడ ప్రామాణికమైనవి.

"ఆ-సమన్తాత్-గమ్యన్తే నిఖిలాఅపి అర్థా ఇతి ఆగమః"
తెలిసికొనదగు సమస్త విషయాలను సంపూర్ణముగ తెలుపునది. అనగా అభ్యుదయ నిశ్శ్రేయస సాధనమైన ధర్మమును సమగ్రముగా బోధించునట్టిది 'ఆగమ' మని పెద్దలు నిర్వచించినారు. ఇవి శైవ-వైష్ణవ-శాక్తేయములని మూడు ముఖ్య విధములుగా నున్నవి. ఆగమములకు తంత్రములనియు వ్యవహారమున్నది.

"తనోతి విపులాన్ అర్థాన్-తంత్రమన్త్ర సమన్వితాన్ ।
త్రాణం చ కురుతే యస్మాత్-తంత్రమిత్యభిధీయతే ॥"
—కామికాగమము

'తంత్ర మంత్రరూపాదులలోని విశేషార్థములను వివరించునట్టియు శ్రవణమననాదులు చేయువారిని తరింపజేయునట్టియు ఆగమశాస్త్రమే తంత్రమని పిలువబడుచున్నది.' సాధారణముగా శాక్తేయాగమములను తంత్రములనుట రూఢి. వీని ప్రామాణికతనుకూర్చి మనువిట్లు చెప్పెను—

"వైదికీ తాంత్రికీ చైవ ద్వివిధాశ్రుతి కీర్తితా
ఆగమానాంతు సర్వేషాం స్వతః ప్రామాణ్యముచ్యతే"
—మనుస్మృతి

'వైదికమని, తాంత్రికమని శ్రుతి రెండు విధములు. అందు తాంత్రికములైన ఆగమములు కూడ స్వతః ప్రమాణములైనవి' అనగా ఆగమేతరములైన ప్రమాణ వాక్యములచే ఖండింపబడవు అని భావము. ఈ ప్రామాణికతను భారతీయ విద్వాంసు లంగీకరించినారు. సుప్రసిద్ధ భాష్యకారుడగు నీలకంఠ శివాచార్యుడు అన్నాడు.

"వయం తు వేదశివాగమయోః భేదం న పశ్యామః"
—నీలకంఠ భాష్యము

వీని ప్రాచీనతను తెలుపుటకు భారతేతిహాసమే ప్రమాణము. మహాభారతమునందు పలుతావుల పాశుపత-పాంచరాత్రములు పేర్కొనబడినవి.

"సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా
జ్ఞానాన్యేతాని రాజర్షే విద్ధి నానామతాని వై"
—భార-శాంతి

మహాభారతమునందలి శాంతి పర్వమున నారాయణోపాఖ్యానములో పాంచరాత్రము వివరింపబడినది. అందు వాసుదేవ-సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధరూప చతుర్వ్యూహాత్మక వైష్ణవ మతము తెలుపబడినది. పాశుపతము పశువు పాశము పతి అను తత్త్వత్రయముతో కూడిన శైవమతమును సూచించును. భగవంతుని సగుణరూపమున నుపాసించు పరిపాటి శైవ-వైష్ణవ మూర్తి పూజా పద్ధతులతో ప్రచలితమైనది.

ప్రతి ఆగమమునందును క్రియాపాద, చర్యాపాద, యోగపాద, జ్ఞానపాదములను నాలుగు విభాగములుండును.

(1) క్రియాపాదము—ఇందు దేవాలయ నిర్మాణము, ప్రతిమా నిర్మాణము, మూర్తి ప్రతిష్ఠ మొదలైన విషయములు వివరింపబడును.

(2) చర్యాపాదము—ఇందు ఆలయములలో ప్రతిష్ఠింపబడిన సకల దేవతా పూజావిధానములు విశదీకరింపబడును

(3) యోగపాదము-దీనిలో హఠయోగాదులేగాక ధ్యాన-విశుద్ధాచరణ ముల వలన కూడ యోగసిద్ధులు పొందగల విధానములు చెప్పబడును.

(4) జ్ఞానపాదము-ఇందు తత్త్వత్రయ వివరణము, విశ్వోత్పత్తి, శివ-జీవ సంబంధము, మలత్రయ విముక్తి అనంతరము శివసాయూజ్యముపొందు విధానములు తెలుపబడును.

ఆగమములందలి ప్రతిక్రియాపాదమునందును ఆలయనిర్మాణ-మూర్తి స్థాపనా పూజావిధానములును, వాస్తుశిల్ప విశేషములును వివరింపబడినవి

## రామాయణ కాలము

రామాయణ రచనా కాలమును గూర్చి దేశీయ విదేశీయ విద్వాంసు లలో చాల మతభేదము లున్నవి. రామాయణ కథ ఋగ్వేదమునందే సూచితమై యున్నదని 'జాకోబి' పండితు డూహించెను.[1] ఎవరేవిధముగ భావించినను భారతీయులు రామాయణమును ఆదికావ్యమని విశ్వసించెదరు.

రామాయణమునందు దేవాయతన ముల్లేఖింపబడినది.

"దేవాయతనాన్యాశు సర్వాస్తాః ప్రత్యపూజయన్"

—బా-కాం. 77-18

"దేవాయతనచైత్యేషు సాన్నభక్షాః సదక్షిణాః,
ఉపస్థాపయిత వ్యాస్స్యుః మాల్య యోగ్యాః పృథక్పృథక్"

—అయో. 3-18.

"సితాభ్రశిఖరాభేషు దేవతాయతనేషు చ"

—అయో. 6-11

## మహాభారతము

భారతీయులకు మహాభారతము పంచమ వేదము. పరమేశ్వరుడు సత్యధర్మములకు గ్లానిసంభవించినపుడు తానే అవతరించి ఏవిధముగ సత్యము నుద్ధరించి దుష్టనిగ్రహ మొనరించునో ఆ వేదతత్త్వమును స్త్రీ-శూద్ర-ద్విజ

[1] 'Das-Ramayana;' Bonrn; 1893.

బంధువులకు ఉపదేశించుటకే ఇతిహాస పురాణములు రచింపబడినవి. ఇతిహాస మనగా (ఇతి + హా + అస) 'పూర్వము ఇట్లుండెను' అని చెప్పు గ్రంథము. భగవాన్ బాదరాయణ మహర్షియే భారతేతిహాసమును, అష్టాదశ పురాణము లను రచించెననుట లోకప్రసిద్ధము. భారతీయ సంస్కృతి చరిత్రలో వ్యాసుని స్థానము చాల ప్రధానమైనది. వ్యాసుడనుట బాదరాయణుని బిరుదము.

మహాభారతము విశ్వమునందలి విద్వద్వరేణ్యులందరిచేతను ప్రశంసింప బడినది. మోనియర్ విలియమ్స్, హీరేన్, S. R. వాలెస్, ఎడ్విన్ అర్నాల్డు, F. A. హోస్లరు మొదలైన పాశ్చాత్య పండితులు భారతేతిహాస ప్రామాణ్యమును, అద్భుత రచనా విధానమును, ప్రాచీనతను వేనోళ్ళ కీర్తించినారు.[1] భారత రచనా కాలమునుగూర్చి గూడ అనేక మత భేదములున్నవి. ఈ మహాగ్రంథము క్రీ. పూ. 1000 సంవత్సరములకు ముందు రచింపబడి యుండునని పలువురు అభిప్రాయపడినారు. భారతము నందు దేవాయతనము ప్రస్తావించబడినది.

"దేవాయతన చైత్యేషు-ప్రాకారాట్టాలకేషు చ
ఏవమేతే మహోత్పాతాః ప్రాదురాసన్ దురాసదః"

—సభా. 80.30

"ఉలూకపక్షిధ్వనిభిః దేవాయతనైర్వృతం"

—శాంతి. 141-32

## పురాణములు

సర్గ-ప్రతిసర్గ-వంశ-మన్వంతర-వంశానుచరితములను అయిదు ముఖ్య లక్షణములుగల ప్రాచీన గ్రంథము పురాణమనబడును. ప్రాచీనములైన చారిత్రక గాథలను క్రోడీకరించి ధర్మబోధ యొనరించుటకై పురాణములు పుట్టినవి. ప్రతియొక పురాణ మొక విశ్వకోశము వంటిది. ఆధ్యాత్మిక విషయములేగాక, న్యాయ, రాజకీయవ్యవస్థా, శిల్ప, వైద్య, సాహిత్య, అలం కార, చిత్రకళా, జ్యోతిష్య, మూర్తి విజ్ఞానాది సకల లోకోపకారకములైన

[1] చూ. హారవిలాస శారదాగారి 'Hindus' Superiority.'

విషయములు కూడ అందు నిక్షిప్తములై యున్నవి. ఈ పురాణరచనా కాలమును గూర్చి కూడ వాదోపవాదములు జరిగినవి పాశ్చాత్యులు పురాణములలో వాయు-మత్స్యపురాణములు మాత్రము కొంత ప్రాచీనములనియు, తక్కిన పురాణములన్నియు క్రీ శ. 4-6 శతాబ్దములలో రచింపబడినట్లు పుక్కిటి పురాణములను వ్రాసినారు. అవి భ్రాంతిమూలకములు.

మన పురాణములలో కొన్ని ప్రక్షిప్త భాగములు ఇటీవలి కాలమున చేరియుండవచ్చును. సంహితాకాలమునందే పురాణ పఠన శ్రవణ పద్ధతి యుండినది. అత్యంత ప్రాచీనమైన అశ్వమేధయజ్ఞమునందు ఒక వత్సరము వరకు అశ్వము దేశసంచారము చేయుచున్నపుడు దీక్షితుడైన రాజు ఇతిహాస వేదమును, పురాణ వేదమును పారిప్లవార్థమునకై హోతృముఖమునుండి వినవలయునని విధింపబడినది.[1] పాణిని మహర్షి తన అష్టాధ్యాయిలో పురాణములు బ్రాహ్మణములతో సమకాలీనములని సూచించినాడు.[2] పాణిని క్రీ పూ. 7వ శతాబ్దము వాడని అందరును నిర్ధారించినారు. అప్పటికే పురాణములు ప్రామాణిక గ్రంథములుగా పరిగణింపబడియుండెను.

పురాణములలో మత్స్య, వాయు, గరుడ, నారద, స్కాంద, లింగ, బ్రహ్మవైవర్త, భవిష్య, అగ్ని పురాణములలో దేవాయతన నిర్మాణ విషయములు వివరింపబడినవి.

## మనుస్మృతి

స్మృతులలో ప్రాచీనతమమైన మానవధర్మశాస్త్రమునందును దేవతారాధనము విధింపబడియున్నది.

"నిత్యం స్నాత్వా శుచిః కుర్యాత్ దేవర్షి పితృతర్పణం,
దేవతాభ్యర్చనం చైవ సమిధాధానమేవ చ"

—మనుస్మృతి

"దేవతాభ్యర్చనం ప్రతిమాదిషు హరహరాది దేవపూజనమ్"

—కుల్లూక వ్యాఖ్య

1. శతపథ-XIII. 4-5., 2. "పురాణ ప్రోక్తేషు బ్రాహ్మణ కల్పేషు" అష్టా-IV. 3-105; తుల్యకాలత్వాత్ (వార్తికము.)

## ప్రాగైతిహాసిక యుగము

చరిత్రకారులు భారతదేశ చరిత్రను ప్రాగైతిహాసిక యుగమని, చారిత్రక యుగమని రెండుగా విభాగించినారు. ఇంతవరకు బయల్పడిన ప్రాచీనావశేషములలో హరప్పా—మొహంజోదారో ప్రాంతముల దిబ్బలు ప్రాగైతిహాసికయుగ విశేషములను దెలుపునట్టివి. ముఖ్యమైనట్టివి. వీని త్రవ్వకాలలో వెలువడిన నాగరికతనుగూర్చి, కాలమునుగూర్చి నానామతములు కలవు. ఆ నాగరికత 'సింధులోయ నాగరికత' అనియు, దాని కాలము క్రీ. పూ. 2500 సం॥ అనియు, అది ప్రాగ్వేద ద్రావిడ సభ్యతకు చెందినదనియు సర్ జాన్ మార్షల్ మొదలైన పాశ్చాత్య పరిశోధకులు ఊహించినారు. భారతీయ విద్వాంసులు డా॥ ప్రాణనాథ విద్యాలంకార్ మొదలైనవారు ఆ నాగరికత క్రీ. పూ. 5000 ఏండ్లకీవలిది కాదని తెలిపిరి సుప్రసిద్ధ పురాతత్త్వవేత్త శ్రీ T. N. రామచంద్రన్ ఈ సింధులోయ నాగరికత వేదకాలానంతర సభ్యతయే కాని ప్రాగ్వేద సభ్యత కాదని నిరూపించినారు.

వేదరత్న వినోద హీరరాయ్ పండితుడు 'హరప్పా' అనునది ఆర్య నగరమని ఋగ్వేదప్రామాణ్యముతో నిరూపించినారు.[1] ఋగ్వేదమునందు 'హరియుపయ' నగరముకడ చ్యవనపుత్రుడగు అభ్యవర్తి రాజునకును, వరశిఖుని పుత్రులకును యుద్ధము జరిగినట్లును, ఇంద్రుడు హారిప్రియ నగరమునకు తూర్పుపడమరలలో విడిసియుండిన వరశిఖుని పుత్రులను వధించినట్లును వర్ణింపబడినది.[2]

హరప్పా, మొహంజోదారో నగరాలలోని కట్టడములందు ఉపయోగించిన ఇటుకలు 'కాశ్యపసంహిత'లో చెప్పబడిన ప్రమాణము ననుసరించియే యున్నందున అందలి సంస్కృతి ఆర్యసంస్కృతియొక్క ఆధునిక రూపమేగాని అన్యముగాదని ప్రసిద్ధ పండితులు డా॥ S. శ్రీకంఠశాస్త్రిగారు తెలిపిరి.[3]

పై త్రవ్వకాలలో దేవాలయములు ప్రత్యేకముగ కానరాలేదు. కాని ప్రతి ఇంటిలో దేవతార్చనకు ప్రత్యేకస్థలముండిన నిదర్శనములు కాన

1. ఇండియన్ యాంటిక్వేరి 1925 జనవరి సంచిక.

2. ఋగ్వేదము VI. 3-27-4, 5, 6. 3. భారతీయ సంస్కృతి పు-48.

వచ్చినవి. ఇచట లభించిన ముద్రలపై 'శివ-పశుపతి-దుర్గ' మొదలైన మూర్తులున్నవి. ఆ విగ్రహాలలోని మీలిత నేత్రములు, నాసాగ్రన్యస్తదృష్టి, నగ్నత్వము, తాండవ భంగిమలు ఉన్నవి. ఆ కాలపు జనులు పులిని, పామును, గరుడుని, గజమును, మొసలిని, మహిషమును, మీనమును, తుల సిని, అశ్వత్థమును, లింగమును, యోనిని పూజించు చుండిరి, అప్పుడు మాతృదేవతారాధన ఉండెను. స్థూలముగ జూచినచో నేటి హిందూమత విధానములే నాడును ఉండినట్లు స్పష్టమగుచున్నది.

## చారిత్రక యుగము

పూర్వకాలమున కట్టడములకు మన్ను, ఇటికలు, కర్రను ఉపయో గించు చుండిరి. గంగా యమునా ప్రాంతములందు రాయి యెక్కువగ లేనందున మట్టితోను, కర్రలతోను కట్టిన గుడులన్నియు కాలవాహినిలో గలిసి పోయినవి. బీహార్‌లోని 'రాజగృహ్' దగ్గర ఉన్న 'జరాసంధకా బైఠక్' అను గుహామందిర మొకటే మనకు ప్రాచీన నిర్మాణములలో మిగిలి యున్నది. దారుమృత్తికలతో ఇప్పటికిని గ్రామజాతరలలో మందిర విగ్ర హములను నిర్మించు పద్ధతి ప్రాచీన విధానమునకు సూచకముగా మిగిలి యున్నది.

మహామహోపాధ్యాయ శ్రీ గౌరీశంకర హీరాచంద్ర మహాశయుడు క్రీ. పూ. 200 సంవత్సరములనాటి 'నగరి' శిలాశాసనమును ప్రకటించిరి. అందు సంకర్షణ వాసుదేవ పూజ కొరకు దేవాలయ నిర్మాణము చేయించిన ఉల్లేఖనము కలదు.[1]

కౌటిల్యుని అర్థశాస్త్రములో మౌర్యచక్రవర్తులు కోశాగారమునకు హిరణ్యమును సంపాదించుటకై దేవతా విగ్రహముల మిషతో మూఢ జను లను భ్రమింపజేయుచుండిరని చెప్పబడినది.[2]

పాణిని అష్టాధ్యాయిలోని 'జీవికార్థేచాపణ్యే' (అష్టా. V.3-99) అను సూత్రమునకు పతంజలి మహాభాష్యములో

1. అర్థశాస్త్రము. X అధి. 2 ప్ర. 2. మధ్యకాలీన భారత సంస్కృతి.

"ఆపణ్యా ఇత్యుచ్యతే, తత్రేదం న సిధ్యతి శివః స్కంధః విశాఖ ఇతి, కిం కారణమ్? మౌర్త్యైః హిరణ్యార్థిభిరాకల్పితాః భవేత్తాసు న స్యాత్.యాస్త్వేతాః సంప్రతి పూజార్థాస్తాసు భవిష్యత

—మహాభాష్యము. 11. పుట 429

## ఆలయ నిర్మాణారంభము

మనదేవాలయ నిర్మాణమునకు వైదిక యజ్ఞ వేదికా నిర్మాణమే మూలమని విద్వాంసులు నిర్ణయించినారు. యజ్ఞములకై 'ప్రాచీన వంశములు' అను శాలలను వెదురుకర్రలతోడను వేదికలను ఇటుకలతోడను నిర్మించుచుండిరి. వివిధ యజ్ఞములకు వివిధాకార వేదికలను నిర్మించుచుండిరి. ఈ వేదికలను 'చితి - చయనము - స్తూపము' అనుచుండిరి. స్తూపము కేశబంధాకారమున నుండెడిది. తైత్తిరీయ సంహితలోని "వృష్ణోస్తూపోసి" అను వాక్యము గమనింపదగినది. యజుర్వేదమునందును, శుల్బసూత్రములలోను వివిధాకృతులు గల చితులు వర్ణింపబడినవి. బోధాయన, ఆపస్తంబ మహర్షులు తమ శుల్బసూత్రములలో చితుల స్వరూప భేదములను విపులముగా తెలిపినారు. ఈ చితులు 10 విధములుగ ఉన్నవి. 'చతురశ్ర శ్యేనచితి, కంకచితి, ద్రోణచితి, పరిచర్యాచితి, అలిజాచితి, ప్రౌగా చితి, ఉభయతః ప్రౌగాచితి, రథ చక్రచితి, సామూహ్యాచితి, కూర్మచితి.' అని వాని పేర్లు.

ఈ వేదికలలో కొన్ని 5 ఇటుకల వరుసలఎత్తు, కొన్ని 10 ఇటుకల వరసల ఎత్తు, కొన్ని 15 వరుసల ఎత్తు కలట్టివి. ఈ హోమవేదికను 1000 ఇటుకలతో కట్టవలెను, క్రింది వరుస, పైవరుస ఒకేప్రమాణము గల ఇటుకలతో ఉండవలెను. ప్రతివరుసలోని కక్కొక్క ఇటుకకు ప్రత్యేకప్రమాణము ప్రత్యేక సంజ్ఞ కలదు. ఈ వైదిక స్తూపచితులనుండియే జైన బౌద్ధస్తూప చైత్యాలయ, విహారాది నిర్మాణము లవతరించినవని చెప్పవచ్చును. యజ్ఞశాలలనుండియే విహార-సంఘారామములు ఉద్భవించినవని చెప్పుటకు తగిన ఆధారము లున్నవి.

యజ్ఞశాలా నిర్మాణమునకు ఉద్దేశింపబడిన మన శుల్బసూత్రములే నేడు క్షేత్రగణితమగు 'జ్యామెట్రీ' కిసంబంధించిన 'పైథాగొరస్ థియరమ్'

నకు మూలములని గ్రీకు చరిత్రకారుడు జార్జిపోకోక్ పండితుడు, శుల్బ సూత్రములను పైథాగొరస్ సూత్రములను తులనాత్మకముగ పరిశీలించి నిర్ధారించినాడు.[1] ఈ పైథాగొరస్ భారతదేశమునుండి వచ్చిన 'బుధగురు' డను పండితుడనియు గ్రీకుల అపభ్రంశరూపముగా పైథాగురూస్ అయి నాడనియు సోపపత్తికముగా నిరూపించినాడు. ఇది విషయాంతరము.

ప్రకృతము ననుసరింతము. సాధారణముగ ఏ నిర్మాణమునకైనను దాని తల విన్యాసము (ground plan) ననుసరించి ఉపరిభాగములేర్పడును. కావున తల విన్యాసముల పరిశీలనము చాలముఖ్యమైనది. ఇంతవరకు కానవచ్చిన ప్రాచీన నిర్మాణములగు స్తూప - చైత్య విహారాదులు, దేవాలయములు మొదలైన వాని తల విన్యాసములన్నియు ముఖ్యముగ మూడు విధములుగ ఉన్నవి, అవి వృత్త - అర్ధవృత్త - చతురస్రాకృతులు గలవి. ఈ త్రివిధ విన్యాసములలో చతురస్ర - వృత్తములు రెండింటికిని వైదిక కర్మలలో మిగుల ప్రాధాన్యము కలదు. వైదిక పరిభాష ననుసరించి చతురస్రమును 'స్థండిలము' అనియు, వృత్తమును 'మండలము' అనియు వ్యవహరించెదరు. ఔపాసనావిధులలో స్థండిల వేదిక మీద అగ్నిసాధానము చేసెదరు. వైదిక యజ్ఞములలో ఒక వేదిక, మూడువిధములైన కుండములు ఉపయోగింపబడును. ఆకుండములను ఆహవనీయ- గార్హపత్య - దక్షిణాగ్ను లనెదరు. ఆహవనీయాగ్ని కుండము చతురస్రముగను, గార్హపత్యాగ్ని కుండము వృత్తముగను, దక్షిణాగ్ని కుండము అర్ధవృత్తముగను ఉండును. ఈ కుండములఆకృతులే కర్మలలో ఆసనములుగను, ఆలయములకు తల విన్యాసములుగను స్వీకరింపబడినవి.

వైదికశ్రాద్ధకర్మలో స్థండిల-మండలములు అందలి దేవతావర్గములకు ఆసనములుగా విధింపబడినవి. విశ్వేదేవ - విష్ణుస్థానములకు స్థండిలాకృతిని (చతురస్రమును) పితృదేవతలకు మండలాకృతిని (వృత్తమును) ఉపయోగించెదరు వృత్తాకార కుండమును గార్హపత్యమనుట, శ్రాద్ధకర్మలో పితృదేవతలకు వృత్తాకారము నుపయోగించుట గమనింపదగినవి దీనివలన వృత్తాకృతికి ప్రాపంచిక సంబంధము స్పష్టమగుచున్నది.

---

1. 'India in Greece' (ఇండియా—ఇన్-గ్రీస్)

నిర్ధారించినారు. అది గజపృష్ఠాకారమున (అర్థవృత్తాకారమున) నిర్మింపబడి నది. దాని కాలము క్రీ శ. 4 శతాబ్దము.

సాంచీ స్తూపము దగ్గర ఒక ప్రాచీనాలయము వినూనరహితముగా ముఖమండప - గర్భగృహములతో గానవచ్చు చున్నది. ఆ తరువాత ఆలయ నిర్మాణమున మార్పులు జరిగినవి. కాలక్రమమున గర్భగృహము - అంత రాళము, రంగమండపము, ప్రదక్షిణా పథము, ప్రవేశద్వారము, ముఖ మండపము, బహిఃప్రాకారము, మహాద్వారము - గోపురము - కల్యాణ మంటపాదులతో గూడి దేవాలయనిర్మాణము విస్తృత రూపము దాల్చినది.

నాగర రీతిలో కట్టబడిన ఆలయాలు పట్టదకల్లు, భువనేశ్వరము, కాశీ, బృందావనము, ఖజరాహు, అజంపురము మొదలైన స్థలములలో కలవు. ఈ శైలిని పాశ్చాత్యులు 'ఇండో ఆర్యన్ - శైలి' అను చున్నారు. ఎల్లోరాలోని కైలాసనాథాలయము, కంచి - మహాబలిపురము, రామే శ్వరము, మధురా, తంజావూరు, విజయనగరము మొదలైన ప్రదేశములలోని ఆలయములు ద్రావిడ పద్ధతికి చెందిన నిర్మాణములు.

ఎలిఫెంటా, బాదామి, మహాబలిపురము, ఎల్లోరాల లోని దేవా లయములను పరిశీలించినచో చాళుక్య శిల్పులు మొదట ఉత్సవమూర్తులకై ఒక మండపమును, దానికి మూడు వైపుల అర్ధమండపములను, వెనుకభాగ మున మూలవిగ్రహమునకై గర్భాలయమును కట్టుచుండిరని ఊహింపవచ్చును ఉత్తర దక్షిణ నిర్మాణ రీతులు మేళవించిన మిశ్రరీతిని చాళుక్యరీతి అని వ్యవహరించిరి. చాళుక్యరీతియందు ఏకకూట, త్రికూట, చతుష్కూట, పంచ కూట, యుగళదేవాలయములు వెలసినవి. బేలూరు - హళేబీడులలోని హొయి సలశిల్పము, వరంగల్లు ప్రాంతములలోని కాకతీయశిల్పము చాళుక్య రీతికి చెందినట్టివే. హొయిసల రీతిలో నక్షత్రాకార తలవిన్యాసము - ఉపపీఠ- అధిష్ఠానములు - వానిపై ఆలయము ఉండును. హొయిసల - కాకతీయ పద్ధతులలో గోపురములకు ప్రాముఖ్యములేదు.

ద్రావిడపద్ధతికి చెందిన ఆలయములలో విస్తీర్ణమెక్కువ. కంచి, తంజావూరు శ్రీరంగము కాళహస్తి మధుర రామేశ్వరాలయములు ఒక్కొక్కటి ఒక పట్టణము వలె ఉన్నవి, సహస్ర స్తంభమండపములపై అనేక

ప్రాకారములు, పుష్కరిణులు, 190-200 అడుగుల ఎత్తుండు గోపురములు, 15-20 ఎకరముల వైశాల్యము నాక్రమించిన ప్రాంగణములు, విశాల కల్యాణ మండపములు కానవచ్చుచున్నవి.

దేవాలయములు కేవలము మతదృష్టి తోడనేకాక విద్యాభ్యాసము-లలితకళాపోషణము. ఆర్థికస్థితి, సమాజసేవ మొదలైన వానిదృష్టితో సమాజమునందు ముఖ్యస్థానమును వహించియుండినవి. అందువలననే చక్రవర్తి మొదలుకొని సామాన్య జనునివరకు దేవదానములు యథాశక్తి చేయవలెనను విశ్వాసము కుదురుకొని యుండినది. ప్రతి ముఖ్యాలయమునందును అర్చకుడు, దేవదాసి. తోటమాలి, గంధకారుడు మొదలైన పరిచారకులుండిరి. దేవస్థాన నిర్వహణమునకై ఎన్నుకోబడిన సదస్యులుండిరి. వీరు క్షామకాలమున శ్రీభండారమునుండి కర్షకులకు ధాన్యమును, ధనమును, విత్తనములను అరువుగా ఇచ్చి లావాదేవీలు చేయుచుండిరి. స్థానికులు, పారుపత్తెగారులు, సదస్యులు నిత్యోత్సవ-మాసోత్సవ, పక్షోత్సవ, బ్రహ్మోత్సవాదులను నడిపించుచు దేవాదాయములను సాగుబడి చేయుచుండిరి, ఆలయమంటపమునందు ధర్మస్థానము ఉండి వివాదములను పరిష్కరించుచుండినది. ఆలయానుబంధముగ నాటకశాలఉండి ఉత్సవ సమయములలో సంస్కృత నాటకములు, దేశభాషా నాటకములు, బయలు నాటకములు. నాట్యములను ప్రదర్శించుచుండెను. దైవసేవకై నడచుచుండిన సంగీత-భరత నాట్యములచే కళాపోషణ జరుగుచుండెను. పురాణపఠన, కథా కాలక్షేప, భజనముల వలన జనులకు నీతి భక్తి ప్రసారణము లగుచుండెను. ఉన్నత విద్యాభ్యాసమునకై ఆలయమున కనుబంధముగ ఘటికా స్థానములుండినవి. అందు వేద-వేదాంగ-దర్శన, వైద్యాది శాస్త్రములు బోధించు అధ్యాపకులకు, విద్యార్థులకు వేతనములను, ఉచిత భోజనసౌకర్యములను సమకూర్చుటకు ఏర్పాట్లు ఉండినవి. ఇవికాక దీన-అనాథ-పంగు-అంధ-బధిర-మూకాదులకు అన్నదానముచేయు సత్రములు, బాలెంతల చికిత్సకు ప్రసూతారోగ్యశాలలు, ఇతర చికిత్సాశాలలు ఉండెను. ప్రతి వర్షము జరుగుచుండు తిరునాళ్ళలో వర్తకుల వ్యాపారము విశేషముగ సాగుచేకాక సామాన్య జనులకు వస్తు ప్రదర్శనశాలలవలె విశేష ప్రయోజనము కూర్చుచుండెను పెద్ద దేవాలయములు సుదృఢ ప్రాకారాములు కలిగి నీరు-ధనధాన్య సమృద్ధి కలిగి కోటల

వెలె భద్రములై యుండుటవలన యుద్ధకాలములలో శరణాగతులకు ఆశ్రయమును ప్రసాదించుచుండినవి, ఈ విధముగ దేవాలయములు భారతీయ సంస్కృతికి సంబంధించిన వివిధ రూపములకు ప్రత్యక్ష నిదర్శనములై ఉండెను. ఈ రీతిగ దేవాలయములు బహుళార్థ ప్రయోజనములలో కూడి సర్వతో ముఖ వికాసమును పొందినవి

# తెలుగుకవిత్వమూ - కావ్యత్వసిద్ధి

డా. శ్రీపాద గోపాల కృష్ణమూర్తి

**పరిచయము :**

| | |
|---|---|
| పేరు | : శ్రీ శ్రీపాద గోపాల కృష్ణమూర్తి |
| జననము | : ప్రియాగ్రహారము 27-9-1908 |
| విద్యార్హతలు | : ఎం. ఏ; డి. యస్‌సి. |
| రచనలు | విజ్ఞాన శాస్త్రముపై ఐన్‌స్టీన్, రాకెట్లు మొదలగునవి; స్త్రీల పాటలు. |
| పదవి | ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కళాశాలలలో ప్రిన్సిపాలుగా పనిచేసి, విరమించి యిపుడు హైదరాబాదులోనే నివాసము |

శా　　పాండిత్యమునకు తోడు, ఆధునిక ఆంధ్రభాషా సాహిత్యములో వీరికి గల పరిశీలనాత్మక విమర్శదృష్టి చాల చక్కగ ఈ వ్యాసము నిరూపించుచున్నది.

“ఈనాడు తెలుగు కవిత్వము ఏ దశలో వున్నది?” అని సంస్కృతిపరుల్ని ఎవరినైనా అడిగితే “అస్థిర దశలో ఉన్నది, అనవస్థా దశలో ఉన్నది” అంటారు. కవులు మాత్రం ఈ మాటకు ఒప్పుకోరు. సభలలో, పత్రికలలో, పుస్తకరూపంగా, కవిత్వము వస్తూనే ఉంది, వింటూనే ఉన్నాము. అయితే అసంతుష్టి ఎందువల్ల? కారణము ఏమైనా వున్నదా? అని అందరమూ ఆలోచించడము అవసరము.

సంస్కృతభాషా సంప్రదాయము వల్లనే అయివుంటుంది, ‘వ్యాకరణ యుక్తమై ఛందోబద్ధమై అలంకార, వక్రోక్తి సహితమైన రచనే కవిత్వము’

అనే అభిప్రాయము తెలుగువారి మనస్సులలో స్థిరంగా ఏర్పడిపోయింది. ఈనాటి కవులు 'కళ్ళల్లో కాంతులు పోగేసుకొమ్మన్నాను' 'సుక్కల్ని రాల్చేస్తానన్నోడివి నీవే సుక్కవై కూకుంటే రాలకేటి సేత్తావో సూత్రాంతే' 'నక్కలు తిరిగే తోటలో రాకాసి రాజొకడుండెరా' అంటూ భాషా నియమాలూ ఛందోనియమాలూ పాటించకుండా రచిస్తున్నారు. 'రాయి విసిరినా రాకెట్ విసిరినా కిట్టని వానిని కొట్టుటకే కద ?' 'ఆ రాత్రి అందరూ నిద్ర పోతున్నారు. నేను మాత్రం తలుపు తెరచి యిల్లు విడిచి ఎక్కడికో దూరంగా కొండదాటి కోనదాటి వెన్నెల మైదానంలోకి వెళ్ళి నిలుచున్నాను' అంటూ అలంకారాలు పెట్టకుండా రచిస్తున్నారు. అయినా ఈ రచనలు మనల్ని పట్టుకుంటున్నాయీ పలకరిస్తున్నాయి. మరి ఎందుకనీ అసంతుష్టి ?

ఒకమారు వెనక్కి చూదాము. తెలుగు కవిత్వము ఏ శయ్యలలో ప్రవహించి వచ్చిందీ ఇంతవరకూ ? ఆ ప్రవాహగతిని పెడసరంగా తిప్పుతున్నారా ఈ వచనకవి బలరాముళ్లు ? ఎన్నడో తొలి రోజుల్లో రేనాటి రాజులు తమ శాసనాలను పద్యాల్లో రాయించారూ, చాళుక్యులు వారి సంప్రదాయాన్ని అనుసరించారు. ఆ శాసనాలు గణబద్ధ రచనలు కావడం చేత జ్ఞాపకముంచుకోడానికి వీలు. జానపదులు చర్చరీ, ద్విపద, తుమ్మెద, చందమామ పదాలు పాడుకునేవారుగాని అక్షరాస్యులు వారి రచనలను పట్టించుకున్నట్లు కనబడదు. పాటలలోని యతిప్రాసలను మాత్రము తెలుగు పద్యాలలో వాడి సంస్కృత వృత్తాలకు లేని అదనపు సౌందర్యము తెలుగులోకి తెచ్చుకున్నారు. నన్నయగారు జాతి రచనలను కత్తిరించి రూపంతీర్చి, సుసంస్కృత పద్య ఛందస్సులతోపాటు వాడి భారతము తెనుగు చేశారు. వారి రచనా పద్ధతే ఇంకా స్ఫుటంగా నిలిచి కనబడుతోంది ఈనాడు కూడానూ. శ్రీనాథుడి వరకూ సంస్కృత పురాణాలు తెనుగుచేసే ఉద్యమం సాగింది. స్త్రీల కథాగేయాలు మాత్రాఛందస్సులలో సాగుతూనే వుండినా, పాటలలో రచించడము కవులకు వ్యాపించలేదు ఈ లోపుగా జానుతెలుగూ ద్విపద రచనా చారిత్రిక కావ్యాలూ వచ్చాయి. అంతవరకూ వాడని వైరి సమాసాలూ వాడడము పరిపాటి అయింది. ఉరుతర గద్య పద్యోక్తుల కంటె ద్విపదలే శ్రేష్ఠమన్నారు. పద్యకవితలు రచించేవారు ద్విపద కవులను ఆక్షేపించారు. ఒకవైపు చాటుకవిత్వమూ ఇంకొక

వైపు స్త్రీల కథాకవిత్వమూ విజృంభించాయి. కొందరికి (జాను) తెనుగు గుణమైంది. కొందరికి సంస్కృతము ఇష్టమైంది. పోతనలాంటివారు 'అందరి మెప్పించు కృతులు' రాశారు. శ్రీనాధుడి వంటివారు 'ఎవరేమంటేనేం నా కవిత్వము అల్లరి (కర్ణాట) భాష' పొమ్మన్నారు. సమస్యలూ నిబద్ధరచనలూ బయల్దేరాయి. ఈ స్థితి అంతకుముందు దానితో పోల్చితె అనవస్థకాదూ?

పోషించే కవిరాజు కృష్ణరాయల కాలంలో సంస్కృత కవిత్వ భాషాంతరీకరణము కాక ఆ కావ్యరీతులను ధారాళముగా వాడే ఆంధ్ర కవితలు బయల్దేరాయి ప్రబంధాలు పుంఖానుపుంఖాలుగా వచ్చాయి రాక్షస తగిడీలో విజయనగర ప్రభ అస్తమించింది కవులు దక్షిణాదివారూ తెలాంధ్రమువారూ పార్వతేయులూగా పరిస్థితులవల్ల విడిపోయారు. ఇభరాము పాదుషా గొడుగునీడనా రాయలసీమలోనూ కొన్ని ప్రకీర్ణక కావ్యాలూ తంజావూరి రాజుల ఆదరణములో శృంగార రచనలూ తెలాంధ్రములో ప్రజ్ఞాప్రకటనముచేసే రచనలూ వచ్చాయి. ఇంగ్లీషువారు వచ్చారు పరిస్థితులు నిరుత్సాహకరంగా నిలిచి శతకాలకు దారిచేశాయి. అవధానాలూ ఆశుకవిత్వాలూ బయలుదేరి ఊరనూర ఇటనిట కవులు పుట్టి జంటలు కట్టి మేము గొప్ప అంటే మేము గొప్ప అని కయ్యాలకు కాలుదువ్వేరు. రచయితలు వారి పక్షమో వీరి పక్షమో చేరి కావలసినంత పద్యకోలాహలము చేశారు గుంటూరు మండలములో జంగం కథలూ విశాఖ మండలములో పదాలూ, నెల్లూరులో వీరగాథలూ చెప్పేరు పండితులైన పామరులు-కీర్తనలు పుంఖానుపుంఖాలుగా వచ్చాయి. మళ్ళీ అనవస్థ వచ్చిపడింది. ఆంగ్లరచనా ప్రక్రియల్ని వీరేశలింగంగారూ జీవద్భాషా రచనలు గురజాడ వారూ, శారీరక శృంగారముకాక హార్దిక శృంగార రచనలు రాయప్రోలు వారూ ఇచ్చారు. దేశస్వాతంత్ర్యోద్యమము విజృంభించింది 'అభినవ కవిత'లూ నాతిదీర్ఘకావ్యాలూ కాశీమజిలీలూ నాటకాలూ నవలలూ వాఙ్మయాన్ని కల్లోలితము చేశాయి. ఇక్కడ మరొకసారి అనవస్థ వచ్చింది.

సాహితీసమితి ఏర్పడి భావాల్ని మాత్రము దండకట్టిన భావకవిత్వాన్ని లేవదీశారు. వారివలెనే విశ్వనాథవారు దేశభక్తి రచనచేసి పర్యటనలుచేస్తూ సభలలో వినిపించారు యెంకి పాటలువచ్చి సాహిత్యంలో గాలిదుమారము లేవదీశాయి. దుబ్బుక్రాపులూ అప్రాప్త ప్రేయసులూ కావ్య

పతనాలూ మామూలు అయినాయి. సహాయ నిరాకరణోద్యమమూ సీతా రామరాజు విప్లవమూ అణిగేయి, అక్కిరాజు ఉమాకాంతంగారు 'నేటి కాలపు కవిత్వము' అనే విమర్శ గ్రంథమురాసి భావకవిత్వము నెత్తిన సుత్తి దెబ్బ కొట్టేరు, కవులు–చిత్రం!–చప్పగా ఊరుకున్నారు, తాళికోట యుద్ధం తర్వాత పెనుకొండ రాజ్యంలాగ నవ్యాధునికులు శ్రీశ్రీ, తిలక్కూ, పద్మ రాజూ, మల్లవరపూ, హనుమచ్ఛాస్త్రీ. వీరందరి తర్వాతా పఠాభీ గొంతులు విప్పి, కవిత్వమూ కవులమూ బ్రతికే వున్నాము అన్నారు. శ్రీశ్రీ ఛందో ఖేలనాలూ, రాజకీయ స్వాతంత్ర్య గర్భితపాదచారిగేయాలూ గట్టిగా విన బడ్డాయి. తిరుపతి వెంకటేశ్వరులను అనుసరించినట్లు శ్రీశ్రీని అనుసరించారు ఎందరో యువకవులు, తిలక్ వచనగేయాల్ని పానబట్టేడు. స్వాతంత్ర్యము వచ్చింది. కవుల గుండెల్లో దేశస్వాతంత్ర్యము కోసము వేదనలేదు–అప్రాప్త మనోహరి కోసమూ రచనా స్వాతంత్ర్యము కోసమూ వారు శక్తి నంతటినీ కర్చు చేసేసి దివాలతీసి ఉండినారు. చలం అన్నట్లు పాతగోరీలకు వెల్ల వూసేవారూ, చక్కగా విడిన తమకోయిల గొంతును గవర్నమెంటు డబ్బుకి అమ్మినవారూ, రోజుకొక ఉద్యమంతో చేయి కలిపే నిత్యమైనరు కవులూ, తీరని పిపాసను సినీమాలో తీర్చుకునే సౌందర్యరసైక జీవులూ ధామ్మని పేలడానికి గర్భంలో అగ్ని లేదుమరి. తెలంగాణాలో పరిస్థితుల బలమువల్ల ఆరు శతాబ్దాల కాలం నిద్రపోవలసిన జనుల గుండెలలో రజాకార్ల తుపాకులు పేలేయి. దానితో దాశరథీ కాళోజీ రామలక్ష్మణుల లాగు–కాదు కృష్ణుడూ బలరాముడూ లాగ– లేచారు. పోలీసుయాక్షనూ దేశైక్యతా సమగూడేయి. ఇప్పుడు ఉద్దేశమేమీలేని కవుల సంగీతి దేశమంతటా జరుగుతోంది. పత్రికలు వస్తున్నాయి, కావ్యాలూ కావ్యసంకలనాలూ, కావ్యపఠనాలూ అన్నీ ఉన్నాయి. అయితే ఏమిటీ అనవస్థా? "ఛందో బందో బస్తులన్నీ చట్ ఫట్ ఫట్ మని తెంచి- డామిట్ ఏమిట్రా ఇదంటే, ప్రే ఇట్ ఈజ్ పొయట్రీ అంటున్నారయ్యా" అని భావుకుల ఆశ్చర్యము! ఏం? ఇది కవిత్వము కాదూ? ఇవి కావ్యాలు కాదూ? ఏది కవిత్వము? ఏది కావ్యము? ఆలోచిద్దాం.

'కవిత్వమంటే ఏది?' అని కాదుగాని కావ్యానికి ఆత్మ ఏది? అన్న ప్రశ్నని సంస్కృతాలంకారికులు చాలా చాలా చర్చించారు. వారి చర్చ

మనకు మార్గదర్శకము కాగలదు. ఆలంకారికుల కందరికీ ప్రాచీనుడు భరతుడు. ఆయన అలంకారములూ గుణములూ కావ్యసామగ్రిగా చెప్పి, కావ్యమునకు రసమే ఆత్మ అన్నట్లు తేల్చినాడు. చదువరులనూ శ్రోతలనూ జల్లుమనిపించే గుణమే రసము. మెప్పించడము వేరు, పింగళి సూరన్న కాబోలు ఇట్నుంచి చదివితే తెలుగూ అట్నుంచి చదివితే సంస్కృతమూ అనే పద్యము రాశాడు. దీక్షితార్ తండ్రి ఇట్నుంచి చదివినా అట్నుంచి చదివినా ఒకటే అయిన (స్వర) గీతము రచించాడు. కవి యొకడు నల యాదవ రాఘవ పాండవీయమని నాలుగు వేర్వేరు కథలను ఇముడ్చుకున్న శ్లేష ప్రబంధము రచించాడు. ఇవి శక్తులూ, నేర్పులూనూ, చదువరుల్ని ఇవి మెప్పిస్తాయి సర్కసులోని ఫీట్లలాగ, జల్లు మనిపించవు 'దినములు పరస్పర ప్రతిధ్వనులు కాగ నిర్నిద్రదైర్ఘ్య జీవితమిట్లు గడచె' అని వేదుల అంటే పాపము అంటాము. 'ఎంత బిగి కౌగిలించినా యీ విభేద మంతరించకయున్నదే' అని ఉమామహేశ్వరరావు వర్ణిస్తే స్త్రీ పురుషుల పరస్పరానుబంధము మనలోది జల్లుమంటుంది. శ్రీశ్రీ 'నేనొక్కణ్ణే నిల్చిపోతే, నింగినుండి తొంగిచూచే రంగు రంగుల చుక్కలన్నీ రాలి నెత్తురు కక్కుకుంటే పేలిపోయి' అన్నప్పుడాతని ఆత్మవిశ్వాసానికి కనుబొమ్మలెత్తి గుండెతో 'హ్హూ' అంటాము. 'కడుపు మంటలకింత గంజియైనా లేని, చిరుతబిడ్డలగోల భరియించగాలేక ఉరిపోసు కొనునట్టి ఇల్లాలి కడుపులో కుండమ్ము నీ వీణ చల్లార్చునా కవీ' అని తురగా వెంకట్రామయ్య అంటే కవికే కాదు మనకూ భయము వేస్తుంది. 'ఎక్కడున్నావోయి వెర్రిశంకరుడ, ఉంగాయి (కాత్యాయిని అన్న తన శిశువు) నీ కొఱకు బెంగతో ఉంది,' అని బొడ్డు బాపిరాజు అంటే పకపక నవ్వుతాము, ఈ అనుభవాలు మన నెత్తురులోకీ మూలుగులోకీ దిగి మనల్ని ఇంకా నిండు మనుష్యుల్ని చేస్తాయి ఇలాటి రచనలు రసాత్మకాలు. రసమంటే మనల్ని జల్లుమనిపించే గుణము. మనకు అనుభవమునిచ్చే గుణము. భరతుడు రసమే కావ్యాత్మ అన్నాడు... భామహుడు 'అదోషమూ సాలంకారమూ అయిన శబ్దార్థములు కావ్యము' అన్నాడు. దేనినైనా ఉన్నదాన్ని కళ్ళకు కట్టేటట్లు వర్ణిస్తే అది అలంకారము కాదటా, అలంకారము లేకపోతే ఆ రచన కావ్యము కాజాలదట. బసవరాజు అప్పారావు 'వటపత్రశాయి' అనే ఖండములో "ఒంటిగా ఉయ్యాల లూగితివా నా ముద్దుకృష్ణా? కంటికంతా జలమయమ్మై మింటి

దాశా ఏకరాశై. జంట దొరకని మహాప్రళయపుటింటిలో వటపత్రడోలిక నొంటిగా ఉయ్యాలలూగితివా?" అన్నాడు. ఇది పలకరించి జల్లుమనిపించడము లేదూ? 'ఎఱ్ఱశాలువ కప్పుకొని మాయి టికొచ్చిందొక రివాల్వర్, బాధలో బెంజైన సీసా ప్రేమలో డైమానురాణీ' అంటే అలంకారము బాగుందా... దండి కావ్యానికి గుణమే జీవమన్నాడు గుణమన్నది రచనా ప్రకారము; శ్లేషప్రసాదము గుణములు. శ్లేషఅసంయుక్తఅల్పప్రాణాక్షరబహుళమట. 'ఏలా లతా జాండోలా సమాలోల బాలామణీ గాన భాసురములు' అన్నది కవిత్వమా? ఏలకితీగెల ఉయ్యాలలూగుతూ బాలామణులు పాటలు పాడేరట! ఈ అర్థమే విరిగిపోతున్న మాటలతో రాస్తే అది 'శ్లేషభంగమా'?– కవిత్వము కాదూ? గుణము అన్నది అర్థమునూ భావమునూ వదలి పదముల వేషముపట్టుకున్నది! చెప్పే వస్తువు సౌందర్యముకాక చెప్పే పద్ధతియొక్క సౌందర్యాన్ని వర్ణిస్తుంది గుణవిచారము. ఎంత నొక్కి చెప్పినా ఇది కావ్యమూసాన్నేగాని కావ్యభావాన్ని ఎత్తుకోనే ఎత్తుకోదు, సగాన్ని వదిలేసిన గుణపరిశీలన! ...వామనుడు శబ్దశ్లేషను దాటి, శబ్దార్థాలను మళ్ళీ కలిపి కావ్యానికి రీతియే ఆత్మ అన్నాడు. రీతి అంటే విశిష్టపదరచనయట! ఇది కావ్యశోభను కలుగజేసే ధర్మములు–శబ్దార్థగుణములు– మీద అధారపడుతుందట! ఈ గుణములు సహృదయ సంవేద్యములు, అన్ని చోట్లా కనబడవంటాడు, శబ్దములా అర్థములా? గుణాలు పది చెప్పేడు, అర్థదృష్ట్యా; అర్థప్రౌఢి ఓజస్సు. అర్థవైమల్యము ప్రసాదము, అర్థసంయోగము శ్లేష, తైలధారవంటి అవైషమ్యము సమత, విసిగించని నిరంతరాయత సమాధి, అర్థవైచిత్రి మాధుర్యము, అపారుష్యము సౌకుమార్యము, అగ్రామ్యత్వము ఉదారత. అర్థము వెంటనే బోధపడడము అర్థవ్యక్తి, రసత్వము కాంతి. చివ్వర చెప్పిన లక్షణము ముఖ్యమూ తక్కినవి దానికి సాధనాలూ అనిపిస్తున్నది నాకు, కాని రసత్వాన్ని 'కాంతి', అని, దానినీ సాధనముగానే చెప్పేడు వామనుడు. ఇంతమాత్రము కవిత్వాన్ని చదువరిని లభించేదాన్నిగా చెప్పడము గొప్పమాట– ఈ గుణాలు తనకు నచ్చిన కవిత్వమునుంచి గ్రహించి ఇచ్చాడు వామనుడు. మంచిదే; కాని కావ్యాత్మవిచారము చేసేవాడు వీటన్నిటినీ ప్రపంచించి చెప్పవలసి ఉండెను, ఆయన అది చేయలేదు, సమకాలిక కవిత్వము వైదర్భి, గౌడీయ, పాంచాలి రీతులలో వస్తూండినది. ఈయనా. కవిత్వమునేకాక చిత్రకళనూ సంగీత

మునూ అనుభవించనేర్చిన కళారసికుడు, ఇవన్నీ తెలిసి అర్థాన్ని కవిత్వము
నుంచి విడదీసినట్లు చెప్పడమే ఎంతమందికో నచ్చలేదు. తనకు వైదర్భి-సమగ్ర
గుణసంపన్నముగా కనిపించింది పడవను దానివైపు పట్టించాడు. అలంకా
రాల్ని ముప్పయి వొకటిని చెప్పిన్నీ అవన్నీ ఉపమాగోళములోనే వున్నట్టు
చెప్పగలిగిన ఆలోచనాపరుడు వామనుడు, తాను పట్టిక వేసిన అర్థగుణాలు
పరిశీలించుకుని రసమును ఎందుకు ప్రపంచించలేదో?

రుద్రటుడు చేళా డీపని. 'కవుల కీర్తికి రసవంతములైన కావ్యములు
ఆధారము'లని చెప్పి, రసానుసారి కావ్యము అబాలవృద్ధులకూ ఆనంద
సంధాయకమనీ రసహీనము హీనకావ్యమనీ రససమ్మిశ్రము చతుర్వర్గ ఫలద
మనీ ముక్తకంఠంగా చెప్పినవాడు రుద్రటుడు రుద్రటుని తర్వాత రసవిచా
రము చేసిన భట్టలోల్లటుడూ, శ్రీశంకుకుడూ, భట్టనాయకుడూ నాటక
ప్రదర్శనములో రసము నటనిష్ఠమా సామాజిక నిష్ఠమా అనే చొప్పదంటు
ప్రశ్నను మీమాంసా న్యాయ సాంఖ్య శాస్త్రపద్ధతులతో గజిబిజిచేసి తెగ అలసట
పడ్డారు, నాటకంలోని నటుడికి దుఃఖము ఉండనక్కరలేదు. దుఃఖమున్నట్లు
బాహ్యనటనను చూపించడమే కావలసినది, దానిని చూచిన సామాజికులు
అసలు కథనే చూచినట్లుగా ప్రతిస్పందిస్తారు. రసము సామాజికనిష్ఠమే చివ
రికి, కావ్యపఠనమో శ్రవణమో చేసే చదువరులలోనే రసానందము కలుగ
వలసినది. కవిగారికి అనుభవమైతే చాలదు

కావ్యరచన కవికొరకు కాదు. చదువరులకొరకే, లేకుంటే ఏదో
భాషలో రాయనక్కరలేదు, కవి ఆనందించి ఊరుకోవచ్చును. కావ్యము
రాయడమూ ప్రచురించడమూ కవిగారి కోసమని కాదుగా? తాను ఆనందిం
చాడూ, తన ఆనందమును ఇతర మానవులకున్నూ కలగాలని మాటలతో
రచిస్తున్నాడు- అదీ కావ్యము. అయితే కావ్యానికి ఆత్మ ఏది? చదువరులను
స్పందింపజేయగల శక్తి, దాని వెనువెంటనే కదా చదువరి జల్లుమనడమూ
అతనికి అనుభవము కలగడమూనూ? అంటే కావ్యానికి జీవము దాని రసోత్పా
దకశక్తి-రసము.

ధ్వని మతమని, పై రసమతానికి తరవాతది, రచనా ప్రక్రియకు-
చదువరిని జల్లుమనిపించడానికి కాకపోయినా చదువరిలో కొంత స్పందన

మును కలిగించే ప్రక్రియకు-సంబంధించినది, ఆనందవర్ధనుడు ప్రతిపాదించాడు, వాక్యానికి దేనికైనా వాచ్యార్థముంటుంది. 'నాకాకలి వేస్తూన్నది' అన్న వాక్యముయొక్క అర్థము అందరికీ తెలుసును-'అమ్మా! నా కడుపు మండిపోతున్నది' అని పిల్లవాడు అంటే వాని తల్లి వానిపై బిందెడు నీళ్ళను దిమ్మరించదు, త్వరగా కంచముపెట్టి అన్నము వడ్డిస్తుంది. చివరి వాక్యము యొక్క వాచ్యార్థముకన్న వ్యంగ్యార్థము శక్తివంతము, అసలదే ఆ వాక్యార్థము, 'నాకు ఆకలివేస్తున్నది' అన్న వాక్యపు వాచ్యార్థముకంటె, "నా కడుపు మండిపోతున్న"దన్న వాక్యపు వ్యంగ్యార్థము శక్తివంతము, ఒకటి ఈవ్యంగ్యార్థమును తాను పలుకకుండనే పలికినప్పటికన్నా ఎక్కువ శక్తితో చదువరికి- శ్రోతకు-స్ఫురింపజేయగలడు కవి. రెండూ ఈ స్ఫురణేకదా శ్రోత అనుభవానికి మూలమూ? ఈ పై వాక్యము ధ్వనించిన వ్యంగ్యార్థము 'నాకు చాలా ఆకలి వేస్తున్నది' అన్న వాక్యముయొక్క వస్తువు, కనుక ఇది వస్తుధ్వని, "తీగెలను త్రెంచి అగ్నిలో దించినావు నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అన్న దాశరథి "నా దేశాన్ని మంటబెట్టావు, నా దేశాన్ని నాశనం చేశావు" అన్న భావాల్ని ధ్వనించాడు, ఇది భావధ్వని, "తరించిపోయాను నీ అభిమానంతో, ఇక చాలు" అన్నది 'నరకానికి వెళ్ళినట్లైంది నీ సాహచర్యము-ఇంక వద్దులే' అన్న అలంకారాన్ని ధ్వనిస్తోంది, ఇది అలంకారధ్వని. 'ప్రేమపట్టున కిటుకిచ్చుగానిచేయి, దాచికొనినాడ మృత్యుఘోషన్ను మరచి, వట్టిబయలున నొకమోడు చెట్టువోలె, ఎత్తినది కరమెత్తినట్లే కృశించె' అన్నది కరుణరసధ్వని. "అద్దములో నా రాజ అంతనీరూపు ఇంతముత్తెములోన ఇమిడెనేలాగు" అని యెంకి అంటే "ఎన్ని పొంకాలున్న యెంకివే నీవు, ఇంత నాగుండెలో ఇమిడిపోలేదా?" అని నాయుడు అంటే ఇది శృంగార రసధ్వని. అయితే ఈ చివ్వరి ఉదాహరణలో 'త్వమసి మమ భూషణం, త్వమసి మమజీవనం, త్వమసి మమ భవజలధిరత్నం, ప్రియే చారుశీలే, ప్రియే చారుశీలే', అన్న వాచ్య శృంగారంకంటె శక్తివంతంగా ఉంది. ఈ శృంగార రసధ్వని, ధ్వనే కావ్యానికి జీవమంటాడు ఆనందవర్ధనుడు-వాచ్యంగా తేల్చకపోయినా రసానికి ఆయన ఇచ్చిన ప్రకృష్టస్థానాన్ని, ధ్వనికి ఆయన ఇచ్చిన ప్రాధాన్యాన్ని చేర్చి రసధ్వనే కావ్యానికి జీవము అని ఆయన అభిప్రాయముగా స్వీకరింపవచ్చును. రసమే చదువరులను జల్లుమని

పించేటిదాయెను, అది కవిగారి రచనవల్ల వాచ్యముగా కాకుండా వ్యంగ్య ముగా చదువరికే స్ఫురిస్తే కావ్యరచనోద్దేశము కడతీరినట్లేకదా?

అయితే ఏది కవిత్వము? అన్న మన తొలిప్రశ్నకు సమాధానమేది? "తన ఆనందాన్ని ఉత్సాహాన్ని ఉద్దేశాన్ని వినేవారికికూడా కలిగించడానికి మాటలతోచేసే రచన కవిత్వము. ఈ కలిగించడము ధ్వని పూర్వకమైతే కవి గారి పని చక్కగా నెరవేరుతుంది."

తెలుగులో ఇలాటి కవిత్వము ఎంతమాత్రమున్నదీ? చదువుతూంటే, లేదా వింటూంటే, వామనుడు చెప్పినట్లు అర్థప్రౌఢి, సమత, సమాధి ఎంత దూరముసాగితే అంతదూరమూ ఆరచనకు కావ్యత్వమున్నట్లే నన్నయగారి కథలూ, తిక్కనగారి సంభాషణలూ వర్ణనలూ, నాచనసోముని ఊర్వశీ నరకా సుర సంభాషణా, భూదేవి పరిదేవనమూ, శ్రీనాధుని వ్యాసోపాలంభనగాథ, దమయంతీ నలరాజుల సంభాషణ, పెద్దనగారి వరూధినీ ప్రవరులకథ, పారి జాతాపహరణము తొలి ఆశ్వాసమూ, ప్రభావతీ ప్రద్యుమ్నమూ, అనంతా మాత్యుని కథలూ.- ఎంతవరకూ రచన చదువరిని కవిగారి స్ఫురణ లేకుండా లాగుకు వెళ్ళుతుందో అంతవరకూ కావ్యత్వమున్నట్లే కాళహస్తీశ్వర శత కమూ, విశ్వనాథవారి మాస్వామీ, నారాయణ రామలింగేశ తాడిమళ్ళ రాజగోపాల నరసింహ దాశరథీ శతకపద్యాలు చాలామట్టుకూ, లాగుతాయి చదువరిని, కవిగారి సమానకల్పనా ధోరణి, ఇతరుల అనుకరణలూ సంస్కృత కావ్యార్థ సంగ్రహణలూ, ఉత్ప్రేక్షా అతిశయోక్త్యాది అభూత కల్పనలూ, శబ్దాలంకారాలూ, ఏకాక్షర ద్వ్యక్షర త్ర్యక్షరపద్యాలూ. బంధ గర్భ శ్లేష కవితలూ, చదువరికి రచనావస్తువును కాక కవిగారిని చూపించేస్తాయి. ప్రబంధాలలోకన్న శతకాలలో ఎక్కువ కవిత్వమున్నదనిపిస్తుంది నాకు.

గురజాడా రాయప్రోలూలతో తెలుగులో కావ్యాలు పొట్టి అయి నాయి. వర్ణనా సౌందర్యం కంటె వర్ణ్యవస్తు సౌందర్యము మీద నొక్కుడు ఎక్కువై కవిత్వము 'అభినవకవిత' అయింది. రసమయరచన మీద రాయ ప్రోలువారూ కావ్యత్వసిద్ధిమీద గురజాడ వారూ దృష్టి కేంద్రీకరించారు రాయప్రోలు వారివి లఘుప్రబంధాలుగానే తీరినా శబ్దలంకారాలూ ఉత్ప్రే క్షాతిశయోక్తులూ తగ్గిపోవడముతోనూ, కావ్యవస్తువు పరిచయ ప్రపంచము

లోని దవడముతోనూ అవి చదువరుల్ని లాగేయి. గురజాడవారి ముత్యాల సరాలు, పూర్ణమ్మ, లంగరెత్తుము అన్నవి చివరిదాకా లాగి భావావేశము కలిగించే ఖండ కావ్యాలు. 'లవణరాజు కల'లో కవిత్వముంది కాని చివ్వరికి అంతర్వాహిని అయిపోయినట్టనిపిస్తుందది. మళ్ళీ యెంకి పాటలలో కావ్యత్వ సిద్ధి చాలాపాటలకుంది, ఎన్నిమాట్లు చదివినా 'ఆరిపేయవె దీపమూ' 'మాట కోటలూ' 'దీపశిఖ' 'రవలవెలుగుల గంగ' చదువరిని చివరిదాకా లాగి అలరిస్తాయి. కవి కనబడడు కావ్యాలలో. కృష్ణశాస్త్రిగారు కవిత్వము చాలానే ఇచ్చారుగాని కావ్యాల్ని తక్కువ ఇచ్చారు. నటరాజు, దాపుల న్నియు మాపె, ఆమె కన్నులు, సంక్రాంతి వంటివి చక్కని కావ్యాలు. ఈయన కావ్యాల్ని ముందో చివరో కత్తిరించి ఇచ్చారు ఎన్నిటినో. మొత్తానికి రాసిన వాటన్నిటిలోనూ కవిత్వము నించి యిచ్చారు తెలుగుదేశము పక్షాన్న కవి ఎవరూ అంటే ఈయన్నే చెపుతాను నేను. వేదుల దీపావళిలో కావ్యత్వమున్న ఖండాలు చాలావున్నాయి. శివశంకరుల పద్యాలు ముత్యాలు; వాటి నిసర్గ సౌందర్యము ఇతరుల పద్యాలలో నాకు కానరాలేదు. బలాకా శ్రేణులవలె అవి ఆపాతమధురాలు. కాని కావ్యాలు 'వీర శైవుడు, విభ్రమము, కరస్పర్శ' మూడు చక్కని కావ్యములు. ఎన్నిమార్లు చదివినా లాగుతాయి చివరదాకా. విశ్వనాథవారి 'మాస్వామి' కవిత్వపు వాన. వారి 'మాధవవర్మ'. 'ఏకవీర' చక్కని కావ్యములు. తక్కినవాటిలో కవిత్వముతోపాటు వాయూ తళుక్కుమంటూంటాయి. నోరి వారి 'నీకోపాటూ' అడవి బాపిరాజు 'గోదావరి', కవికొండలవారి 'శివరాత్రిప్రభ' నాగస్వరము ఎర్రకలువ' చక్కని ఖండకావ్యాలు జాషువా ఆవేదన శ్మశానవాటి కున్న సిద్ధి తక్కిన ఖండాలకు కనబడదు. పద్మరాజు 'పురిటిపాప' మల్లవరపు 'తాతకి దగ్గులూ' ఇంద్రకంటి 'దేవుడూ' బాగుంటాయి. దువ్వూరి రామిరెడ్డి పాన శాల నిండా కవిత్వమే, అభిసారిక ఖండ కావ్యము ఒకటి వారిది జ్ఞాపకము వస్తోంది. పైడిపాటి వారి డొక్కా దంపతులు, బెళ్ళూరివారి కళాజీవి చక్కని ఖండాలు. శ్రీశ్రీది కవిత్వము చాలావుంది. కావ్యాలు 'భిక్షువర్షీ యసి, సప్తాస్తికలూ, జయభేరి, అవతలిగట్టు, జనార్దనరావుకోసం, అన్నవి ఆయన ఝూంఝూలు లేకపోవడంతో చివరిదాకా పరనిర్వృతి కలిగిస్తూ లాగుతాయి. తిలక్ కృష్ణశాస్త్రిలాగ రచనలనిండా కవిత్వం నింపేడూ

వేమలకంటే ఎక్కువ వాటిని కావ్యాలుగా తీర్చాడు. అటు పద్యాల లోనూ ఇటు మాత్రాచ్ఛందస్సులలోనూ సవ్యసాచి అభ్యుదయ కవిత్వ మంటూ జనప్రబోధాశయంతో బయలుదేరిన ఉద్యమానికి అడావిడి చేసిన తీరాంధ్ర కవులకంటే తెలంగాణములో కాళోజీ, రాయలసీమలో గజ్జెల మల్లారెడ్డి ఇద్దరూ రెండు కళ్లు. మల్లారెడ్డి గేయోపన్యాసాలు వినడానికి బళ్ళు కట్టించుకొని ఊరూరువాళ్లు వస్తారు. అభ్యుదయము తక్కినవారికి నినాదము, కాళోజీకి ఊపిరి. నాడు వేమనా నేడు కాళోజీ ఈడులేని వారు. తక్కినవారి అభ్యుదయము రాజకీయము. కాళోజీది మానవాభ్యుదయము అన్ని ముఖాలా వెన్నెలవలె పారుష్యము లేకుండా వ్యాపించిందీ వ్యాపిస్తుంది. తక్కినవారిది ప్రచారము బలమూ, కవిత్వము హీనమూను-వీరిద్దరిదీ కవితా సురభిళాభ్యుదయము. వారి 'చార' వ్యాపించునుగాక!

ఈనాడు విశాలాంధ్రరంగంలో కవులూ కవితారీతులూ కలసిపో తుండడము కనిపిస్తున్నది. సర్గబంధాలు రచించేవారు విశ్వనాథా వానమా మలై వంటివారున్నా పలుకుబడి ఖండ కావ్యాలదే— శనగన నరసింహ స్వామీ గవను కృష్ణారావు ఓరుగంటి గోపాలం వంటివారు పద్యాలు రాస్తు న్నారూ, వచన కవులకు పరిమితే లేదు

పరిమాణము కొంచెముకావడము వల్ల కులకముల (Poems) లో కావ్యత్వసిద్ధికి అవకాశమెక్కువ. వేమన పద్యాలు చూడండి : 'మొక్కత నడవి నుంచి మృగము వెటనె పోయె రామచంద్రుబోలు రసికుడేడి ? చెడు కాలమునకు చెడ బుద్ధి పుట్టును'.అంటాడు. మొదటి రెండు పాదాలు ఉదా హరణ, తరవాతిది ప్రపంచీకరణాను. ప్రతీ పద్యమూ నిందైనదే, తునక కాదు. ఇలాగున్నప్పుడే పద్యము రాసిన ప్రయోజనము. ఈనాడు కొందరు కవులు మేము ఎవరికోసమో ప్రత్యేకంగా రాయడము లేదంటున్నారు. ఇది వెలితనము. మీకెదురుగా ఒక గోపాల కృష్ణమూర్తో ఒక ఉమాకాంతమో కూర్చున్నాడనుకొని రాస్తారు అనడము లేదు. ఒక ఊహపుట్టుతుంది వెంటనే రాశెయ్యరు. అది మనసులో తిరుగుతుంది. ఎప్పుడో రాద్దామనుకుని కూర్చుని ఒకటి రాస్తారు. కవిగా ఈ రాతరాస్తారూ, రాసి, దానిని చదువు తారు రసికుడుగా. అక్కడొక దీర్ఘమూ ఇక్కడొక మాటా సర్దుతారు కవిగా. మళ్ళీ చదువుతారు. అవసరమైతే మళ్ళీ దిద్దుతారు. మీరనుకున్న

అర్థమో ఊతమో వచ్చిందనుకున్న తర్వాత ముందుకి వెళ్లుతారు ఇది రసికలోకాన్ని ఉద్దేశించి రాయడము కాదా ? మీలో వున్న రసికుడే అందరిలోనూ ఉన్నాడు. వాడికి తగిలేటట్టే మీరచన దిద్దుకుంటారు. అందరు కళాకారులూ చేసే పనే ఇది. చిత్రకారుడు కుంచెతో చిత్రిస్తూ దూరంగా పటాన్ని పెట్టిచూస్తూ మళ్ళీ రంగు పెట్టుతూ సాగిపోతాడు. గాయకుడు నిత్యమూ సాధకము చేయడము ఇందుకే. కవి ఏఉద్దేశమూ లేకుండా రాయడు భామహుడు ధర్మార్థకామమోక్ష సంపాదనమూ, కళావైచక్షణ్యమూ, కీర్తి కావ్యరచనవల్ల లభిస్తాయన్నాడు, రుద్రటుడు 'అర్థము. అనర్థోపశమము, యశస్సూ' అన్నాడు. మమ్మటుడు 'యశసే అర్థకృతే శివేతరక్షతయే సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే' అన్నాడు. మనము అనుకున్నది సద్యఃపరనిర్వృతి—ఎవరికి?-చదువరికి దీని అవతారాలే 'Pleasure' అని వర్డ్స్‌వర్తు చెప్పినదీ, 'ఆంధ్రావలి మోదముంబొరయ' నని తిక్కనగారు అన్నదీ, పెద్దనగారు పెద్ద ఉత్పలమాలలో చెప్పినదీ, మాదయగారి మల్లన "రసములు చిప్పిల నప్పప్ప భళి భళియన" అన్నదీ, అడిదము సూరకవి 'అలతి తొలపడ్డ చంద్రమండలము నుండి జలజలను రాలు నమృతంపు జాలులీల రసము తులకింపవలె' నన్నదీనీ. ఏ ఉద్దేశమూ లేదనే డాబుల్రాయళ్ళ 'నీ రచన బాగోలేదు' అంటే నిజరూపం చూపిస్తారు!... ఉద్దేశమంటూ ఉన్నప్పుడు రచనను దానిని సాధించే దారిలో నడపాలి, చదివే రసికుణ్ణి చేయిపట్టి తీసుకువెళ్ళి పరనిర్వృతి-భావావేగము అందాము- కలిగించి వదలాలి కావ్యము. అప్పుడే దానికి కావ్యత్వసిద్ధి. నేడు అందరూ ఖండ కావ్యాలే రాస్తున్నారు. చదువరి ఏ ఆఫీసునుంచో వచ్చి ఈజీఛైరులో పడుక్కుని పత్రికో ఖండకావ్య సంపుటమో విప్పుతాడు ప్రారంభమూ నడకా జోరూ భావమూ వరుసగా జరిగితే కవి గారి రచన అతనికి చక్కగా అందుతుంది. గుణాలూ యతులూ ప్రాసలూ వ్యాకరణ యుక్త రచనా అన్నవి కవి యెంచుకోవలసినవే కాని చదువరి అడగవలసినవి కావు భైరవకవి శ్రీరంగ మహాత్మ్యము అని రాశాడు రెండు గీత పద్యపాదములు: "ఎందు నెవ్వాని చరణారవింద రజము, పేర్మి గౌతమ సంయమి పెండ్లి పెద్ద" అన్నవి తప్ప మిగిలిన రచన పలకరించదు! ఎందుకా గణయతి ప్రాసలూ వృత్తాలూ గడబిడానూ ? తెలుగులో నిన్నటిదాకా పద్యమల్లగలిగిన వాడల్లా కవే! నేడు, రాజకీయాభిప్రాయాల్ని రాసేసి, తునకలు తునకలుగా

'వచన గీతలు' చేసినదల్లా 'గేయమే' కవిత ఉన్నప్పుడే నవతగానీ పద్యము గానీ రాణిస్తుంది. చదువరిని పలకరిస్తూ తనతో లాక్కెళ్ళి ఏదో భావముతో పరనిర్వృతి కలిగించేది కావ్యము. కావ్యమూ కాక, కవిత్వమూలేక ఎందుకా రచనా? చదువరి "కులాసాని చెడగొట్టేందుకు అలాస్కాదాకా అవకాశం వుంది." కవిగారు ఏ భాషమాట్లాడుతున్నాడో తెలుసుకోడానికి పడ్డశ్రమ అల సటే మరి.

'పడును వాన ఝుర ఝురా
ప్రియా రమ్మా బిర బిరా'

అని మాత్రాబద్ద అంత్య ప్రాసరచనచేసినా

ఆకాశాన్ని మేఘం నల్లని కంబళీలా కప్పుకుంది
ఆనందం మనసులో మయూర బర్హంలా విప్పుకుంది
ఆలోచన లెందుకు ఇవ్వాళ్టి, విలోకించు వర్షాసంధ్యని
సరుగుడు చెట్లనీడల్లో సరదాగా తిరుగుదాం
ఒకసారి యిల్లువిడిచి ఉత్సాహంగా రా చెలీ!

అన్నా చదువరి మనస్సులో ఫాజిల్స్ లేకపోతే ఇదేమిటి ఇలాగ రాశావు? అనడు. అలాకాకుండా "పురుషుల III క్లాస్ బోగీలో, చెట్ల గురించి చిట్టెలుకల గురించి చెదపురుగుల గురించి చిన్న చిన్న చీమల గురించి సంభాషణ రెయిన్లో రెయిల్లో చెయిన్స్యులేని మొగాళ్ళముందు చెదపురుగులు కాని మగాళ్ళముందు నిటారుగా నించొని తన బట్టలు నింపాదిగా తాపీగా, ఒలచుకునే నిటారుగా నిస్సిగ్గుగా నించొనే నీతిమంతురాలు" అంటూ గేయం మధ్య రాస్తే, 'ఇదంతా 1948, జూలై పదవ తారీఖు కృష్ణాపత్రికలోని ఉదం త'మని కవి చెప్పుకునేదాకా చదువరి ఏమనుకోగలడూ? స్పెయిన్ మీద ఆడెన్, స్పెండర్, సి. డే. లూయిస్, జార్జి బార్కరు రాసిన కావ్యాలు ఖండాలుగా చదివిన వాడిలో, కృష్ణాపత్రికలోని రిపోర్టు 'స్పెయిన్' భావాలు కలిగిస్తుందన్నారు ఆర్ద్ర. వారి ఆ గేయం, ఆలాచదివిన వాళ్ళకే 'స్పెయి నల్ కార్డులో స్పెయిన్' అన్నపంక్తికి ఇంత అర్థం ఉందని తెలుస్తుందట! అది చదవని వాళ్ళ మాటో? ఆలోచనలకి స్థానం స్పైనల్ కార్డు కాకపోయే రిఫ్లెక్సు కేగాని! 'ట్రెయిన్‌లో అనగానే ట్రెన్‌గన్ వచ్చే, స్పెయిన్ అనేమాట ?

స్పెయిరల్ కార్డుని తెచ్చె. రచయిత ఆలోచనల బ్రెయిన్ మాటల్ని అక్షరాల్ని అనుసరిస్తే చదువరికి అది 'న్' భాష అని ఏలాగ తెలియడమూ? తెలియకపోతే నష్టము లేదు. అది రాసినపుడు కవిగారి యెదుట ఎవరూ లేరుగా ?

ఇదొక చిక్కు ఈ నాటి నవకవిత్వంలో, రాస్తూన్న కవులకు ఒక రకం వారికి యెదట చదువరి ఉండడు. కనక తమ ఆలోచనల తీగలకు రూపకాలం కారాన్ని ఉత్ప్రేక్షనీ కోలాములతో కోటికోటి చేర్చిన ముద్దని నొక్కి అనుప్రాస పర్బత్ జల్లి అయిస్ ఫ్రూట్ గా చేతికందిస్తారు. చదువరి అయిస్ ఫ్రూట్ తిన్నట్లే ఆనందించాలి గాని 'కడుపులోకి'! వెళ్ళేది తక్కువ. కవిగారి ఊహ ఏమిటో అది అందదు చదువరికి! ఉపమా రూపకాల రుచే నడపాలి చదువరుల్ని. ఈ నిజాన్ని, ఈ కవులు కావ్యపఠనాలలో పంక్తుల (యూనిట్ల)ను మళ్ళీమళ్ళీ చదవుతూండడము నిరూపిస్తుందంటాను, ఇవి వచన పచనాలు అనిపిస్తాయి. చూడండి: శాంతీ విప్లవాలు వాగర్థావివ సంపృక్తాలు పచనించినవాడుల్లో ప్రవహించే రక్తం శాంతి, జడీభూత లోకంలో జీర్ణింపని మానవుడే క్రాంతి 'శాంతి అంటే ఇదీ, క్రాంతి అంటే ఇదీ నా అభిప్రాయం లో' అని చెపుతున్నారు దుర్గానంద్, ఇది అర్థం చేసుకోవలసినట్టిది; అనుభవించి ఆనందించవలసినదా? ఒక స్కూలువారి అర్థాలు పాఠంలాగ కాకుండా కవుల కావ్యాల్లో కలిసిపోయి చదువరికి తెలియకుండానే తెలిసిపోవాలనే వాణ్ణి నేను, కాని ఇలాగ చెపితే ప్రతిక్రియలేచి 'మీ వుద్దేశ్యంలోనా?' అన్న ప్రశ్నగా నిలబడుతుంది. ఇంకొకచోట వీరే 'నా జీవితమొక రవ్వల దీపం నా కవిత్వ మొక పువ్వుల కిరణం, చుక్కలనన్నీ పొట్లంగట్టి రవ్వల పువ్వులు రేపేస్తా గిరగిర తిప్పి పారేస్తా, కావంటే గుప్పున ఊదేస్తా' నంటాను, ఇట్లాంటివి వినడం కంటె చూడడంలోనే నాకిష్టం. ఆనాటినుంచి నిన్నటివరకూ తెగవిన్నాం, ఇంకా ఇవేనా?... వరవరరావు గారంటారు; 'ఆశించినట్టుగనే ఉషస్సు ఉదయించింది, ఆశయాల గట్టుమీద ప్రత్యూషకిసలయం ప్రభవించింది, నిశాదేవి తుషారమయనిషా తొంగిపోయి ఉషోబాల కషాయవసనావృతయై తొంగి చూచింది' అని. మనుచరిత్రలో సాయంకాలమూ రాత్రీ చంద్రోదయమూ చదివితే ఇలాటి అలంకారాలే కనబడతాయి, కానైతే 'చనిపోయిన కోర్కెలకు దహన సంస్కారమూ, ఆశయాల గట్టు,' అన్నవి మానసిక వస్తువు,

భౌతికములు కావు, భౌతికాలుకూడా వింతైనవి ఉన్నాయి: 'నీలాకాశ గుహాముఖంనుండి బయల్వెడలిన కాంతిసింహం' అన్నారు మాదిరాజువారు, సింహానికున్న భయంకరత్వము సూర్యచంద్రులకు ఉదయ కాలంలో లేదు! మరి, ఇక్కడిది అక్కజమా? అదీన్నీ ఉండదే! వారే ఇంకోచోట 'గాలి తెరల మంపులపై తుమ్మెద కాలిజాడల్లా' అన్నారు. తుమ్మెద కాలిజాడా? ఇది ఉన్నదేనా? ఊహించినదా?... అరిపిరాల వారంటారు; 'రాత్రి పూసిన బాధల మూగిపువ్వులు తాగలేని అనుభవాలను రేపనే ముత్యపు చిప్పకు స్వాతి మధువుగా అందించినప్పుడు' ఇది చదివి "రాత్రి (అనేమొక్క) బాధలనే పువ్వులు పూచిందా? అవేమో తాము ('నేను' అనలేముగా) తాగలేని అనుభవాలను రేపు అనే ముత్యపు చిప్పకు స్వాతి వానచినుకును వలె అందించాయా? ఏమిటిది? 'తాగలేని' అనుభవాలా? కవిగారి ఊహాసూత్రము అందడములేదు, రాత్రి పూచినబాధలు పువ్వులా? అవి మూగివి, అంటే వాసనలేనివనా? పూలపూత, తాగలేని అనుభవాలూ స్వాతివాన చినుకూ ముత్యపు చిప్పా తెలుస్తున్నాయి, వీటిని కలిపే సూత్రముమట్టుకు అందలేదు, కృష్ణశాస్త్రిగారు 'కాలమే పసిపాప కనువిచ్చిన యుషస్సు కలిగా కలవరించి, వెలుగుగా పులకరించి' అంటూ రాసినది ఇలాగేవుంది, ఈ రచనలలోని ఊహాలుకాదు ముఖ్యం, మరి అలంకారాలు కాబోలు. అన్నీ పడగలే, పామెక్కడా? "నీ నేత్రవిహంగపు కనీనికల రెక్కలనీడల కదలికలలో రూపుగొన్న అవ్యక్తపు వెలుగురేకల బొమ్మల్లో తోచింది" అని వీరే ఇంకొకచోట, నేత్రవిహంగముయొక్క కనీనికల రెక్కలా? వాటి నీడల కదలికలా? నేత్రాలనే పిట్టల కనీనికలా? నేత్రాల కనీనికలే అనా? లేక, నేత్రాలు విహంగాలు, కనీనికలు రెక్కలూనా? దీన్ని వింటూ ఏ రూపకమో ఉత్ప్రేక్షో తెలియుద్దా నాకు? అందుకే కోపంతో అలంకారాల్ని కోటి ఆ ముద్ద కనబడని ఊహ అనే తీగకు పట్టేటట్టు నొక్కి, (నీడల కదలికలూ వెలుగురేకలూ అనే) కవితాపర్బత్ వేసినట్టు కనబడుతోంది అన్నాను ఈ కవులు తమ మనసులో దీపించిన సౌందర్యాన్ని పాఠకుని ఊహ కందకుండా విసిరేసి, రుద్రాక్షల్లాంటి అలంకారాల్నే మిగుల్చుతున్నారు రచనల్లో అలంకారికులు పీ.ఎస్. శీలావీర్రాజుగారి 'కొడిగట్టిన సూర్యుడు' కథాగేయాలు, అది చదివితే అలంకారాల జిలుగు బురఖావంపులవలె ఉన్న (రైనుకొకకట్టున్న)మాటల ద్వారా తెలుసుకోవాలి ఆ బురఖాలోని నర్సు కూర్చుంది. నర్సు లేచింది అని

కవిత్వం ఆలోచనామృతం అన్నారు. ఈ కవితా తుంగభద్ర అలంకార శిలల లోంచి ప్రవహిస్తోంది, నదిలో నీటిని వెతుక్కోవలసి వస్తోంది రెండు పుటలు చదివేసరికి మెదడు అలిసిపోతుంది! కమ్మిశెట్టి వారిదీ ఇదే పంథ.

నేటి కవులలో ఇంకొక వర్గము వారు, గిరిరావు సి. వి. కృష్ణరావు, స్వర్ణరాజ హనుమంతరావు లాటివారు సూటిగా ఉపన్యాసాలవలె రాస్తున్నారు వచన గీతలను. "నీవెంతరివయితేనాకేం? నువ్వో పెద్దజమీందారువయితే నాకేం? నువ్వో పెద్ద అధికారివి అయితే నాకేం?... నాదగ్గర చెల్లలేనిది నీఅహం, నా ముందు నిజవలేనిది నీ దర్పం," అని గిరిరావు, "మండు వేసవిలో మల్లెపూల అంగడి పెట్టినవారు, ప్రతివనిత ముంజేతికి మువ్వయి గాజులు తొడిగినవారు, పచ్చని ఆకు కూరలు ప్రతి గడపని పంచి నిత్యం పండుగగా నడిపినవారు." అని సి. వి. కృష్ణరావు, స్వర్ణరాజ హనుమంతరావుది వ్యంగ్య కవిత. 'దుష్టలోకాన్ని మండించేస్తాము' అనక "ఓడిపోయాను చేయి చాచి చేయి వంచి, చేతు కింద చేయి యుంచి దగాకాక ధర్మంగానే స్వీకారానికి సిగ్గుపడే చేయి యిపుడు వింత! వీపమెత్తు పనిచేయక ఋణంసేవు శ్రమచేయక, పళ్ళు వంచక కళ్ళు మూసుక సంపాదన నాశిస్తోందే? పరాజితుణ్ణి కాక నేను విజయుణ్ణె లాగవుతాను?" అంటున్నారు. దెబ్బ అలాగ బ్రతికే వాళ్ళమీద. చాలా మృదువుగా సంస్కారము తెస్తాకియన, వాచ్యంగా కాక వ్యంగ్యంగా చెప్పడంతో కాన్యోద్యానంలో ప్రవేశిస్తుంది వీరి రచనా గంధము. ఈ కవులు ప్రబోధకులు.

ఇక సమకాలిక లోకాన్ని 'కొట్టు, నరుకు, చంపు, మింగు' అనే కవులు ఇంకొకవర్గము, "పెళ్ళికానిపిల్ల గుండెలోని కోరిక, ఆకలితో చచ్చే ఆర్తనాదపుగీతిక, దిక్కులేని ఆడదాని హృదయరోదన చాలీచాలని గుమాస్తా గుండెవేదన, అనుకొన్నచోటికి చేరలేని జీవితాన్ని మరిచిపోయి వ్రాస్తున్నావెందుకు?" అన్న చౌడూరి గోపాలరావు ఆవర్గానికి బయటివాడు, నయాన్నా వ్యంగ్యంగా భేదోపాయంతో బెదిరింపుతో వ్యక్తినీ సంఘాన్నీ పాలకులనూ సంస్కృతినీ సంస్కరించ యత్నిస్తూన్న అభ్యుదయ కవి చక్రవర్తి, దీనిని కంటె దీనుడు కాళోజీ అతనికి ఇవతలివాడు. మరో ప్రపంచానికి పదండి పదండి అనీ, జగన్నాథ రథము వస్తోందని దాన్ని భూమార్గము పట్టిస్తానని చెప్పి, సద్యః సాహిత్య పద్ధతులమీదికి పట్టించిన శ్రీ శ్రీ వీరినాయకుడు

(సాహిత్యములోనే లెండి). వీరు ఏమంటారు? 'కుళ్ళిన సమాజంపై అనల కిరణవృష్టి కురిపిస్తాను.' అని మనికొండ, 'ప్రతిమనిషీ వెలుగు కిరణమై చీకట్లను చీల్చాలి' అని మహాదేవ్ (మహాదేవా ప్రతీమనిషీ వెలుగు కిరణమైతే చీకటి ఎక్కడిదయ్యా?). యువకలాలు విప్లవాన్ని రాసి. యువగళాలు విప్లవాన్ని పాడి యువశక్తి యుగశక్తియై కాళ్ళే గమ్యాలయి, చేతులే కాగడాలయి (కాగడాలే చేతులయి అని కాబోలు!) యువసాహసం విప్లవాన్ని సాగిస్తున్న'దని వరవరరావు. 'పార్టీలు మారే పగటి వేషగాళ్ళని...కాల్చేసే తిరుగుబాటు యువతరాన్ని సమర్థించి తీరుతాను' అని చెరబండరాజు 'పేనుకు పెత్తనమిచ్చిన పెమ్మయలను తింటా'నని భైరవయ్య-'నమ్మకద్రోహాన్ని నిలువునా కాల్చు' అని నగ్నముని

అయితే ఇది జరిగేదెలా? అని నాకు ఆశ్చర్యం. "ఈ రకం చేసే కవితలను మార్క్సిం గోర్కీ మున్నగువారు అవలంబించి" ఉండవచ్చు అయితే వారిదేశం ఆ రకపు గమనానికి ఉన్ముఖమైనప్పుడు రచయితలు అనుసరణము చేశారు. మన సాహిత్యం లోనో? ప్రేయసిని శృంఖలాలలోంచి బయటికి తెస్తామని స్వేచ్ఛాప్రేమికులూ, అభ్యుదయం తెచ్చేస్తామని అభ్యుదయ సంఘమూ చాటి చెప్పేరు. ఇప్పుడు వీరు విప్లవం తెస్తామంటున్నారు. వారు చెప్పినది వారిద్వారా జరగలేదు, నేడు, కవులలో కాళోజీకి ఒక్కడికే తెలుసు రావలసిన అంత మార్పు సంగతిని. తక్కిన వారికి ఒక సందులోని విప్లవం కనిపిస్తోంది. వీరి రచనలు ప్రజలకు అర్థం కావు. వీరు ప్రజ ప్రజ అంటున్నారు గాని వీరు రాసేది మట్టుకు శ్రద్ధగా వినండి - తమలాటి రచయితలకే, జనానికి కాదు, దిగంబర కవుల రాతలు వారి పుస్తకాలు ఆవిష్కరణ చేసిన వారికి తెలుసునా? చదువుకున్నవారికే అర్థం కావడం లేదు! ఈ రూపకాలూ ఈ కవిత్వాలూ ఈ తీర్మానాలతో పొలం కోతలేనా అవుతాయా? అవసరమంటూ వస్తేనే అన్నీ జరుగుతాయి.

చెప్పుకోదగిన సంగతి ఏమిటంటే, ఇంతమంది ప్రగతి శీలురూ క్రాంతి వాదులూ ఉచ్చైస్స్వరంతో భీషణ కోలాహలంతో 'పదండి ముందుకు పదండి తోసుకు' అని భీషణ ధ్వానాలు చేస్తూన్నప్పటికీ మననూ హృదయమూ ఉన్న ప్రాణిగా, అంతా సజీవమే అంతా సుందరమే అయిన విశ్వనూతన పలకరింతలకు జల్లుమంటూ జీవితోత్సాహాన్ని కాటుక పిట్టలాగా నెమలి లాగా

చేపల్లాగా నృత్యంలోనూ, కోడిలాగా నెమలిలాగా కోయిలలాగా గానము లోనూ వ్యక్తపరిచే నైసర్గిక చైతన్యాన్ని నేటికవి పోగొట్టుకోలేవు. రాత్రులు నిద్రపోయేవాడే అయినా అమృతం కురిసిన రాత్రి తలుపు తెరచి ఇల్లువిడిచి అలా అలా వెన్నెల మైదానం మీదికి వెళ్ళి నిల్చుంటూనే వున్నాడు. "రావే బర్హి శిఖా చకచ్చకిత నేత్రా" అని ఊహాసుందరిని ఆహ్వానిస్తూనే వున్నాడు. 'తనకైన నిరీక్షణలేని బ్రతుకెందుకూ అనుకుని, ఎంత బీద కుటీరంలోనైనా పైకప్పులోని కన్నాలను అందమైన ఆశల నక్షత్రాల్ని చూస్తూ, కటిక నేల మీదనే నిద్రపోతూ కలల పంచ కల్యాణి పైన స్వర్గంలో తిరుగుతూ, చుట్టూ మొలిచిన చీకటి పిచ్చి తుప్పల్లో మిణుగురుల్ని పెంచి, వెలుగులు పరచి, కిటికీలు తెరచి గాలి సంగీతము వింటూనే వున్నాడూ వినిపిస్తూనే వున్నాడు. నారాయణరెడ్డి, పల్లాదుర్గయ్య, కుందుర్తి ఆంజనేయులు వంటివారు కవిత్వావిర్భావ క్షణము నుంచి నేటి వరకూ గంగానదిలాగ పారుతున్న ఈ జీవిత సరస్వతి మీద తేలి సాగిపోతున్నారు. ఎన్ని శాఖలు చీలిపోతున్నా ఈ జీవ నది ప్రవహిస్తూనే వుంటుంది.

అయితే ముడిమాటలు ఏమంటారూ తెలుగు కవిత్వాన్ని గురించి? చెప్పేదుంటే శక్తివంతంగా చెప్పమంటాను, అదే ఏ దేశంలోనైనా ఏ కాలం లోనైనా చదువరుల హృదయాలలోకి ప్రవేశించి అనురణనము తెస్తుంది. నలుగురూ చెపుతున్నారనికాదూ, పీడిత ప్రజ పాడైపోతారనీకాదు నీకు. చెప్పవలసింది ఉంటేనే చెప్పు. దాన్ని గాలికి పారెయ్యకు. గ్రీన్‌హము లోంచి చెప్పబోకు. శక్తివంతంగా తెలిసేటట్టు చెప్పు. చెప్పేది నీకు కాదు, వినేవారికి.

# అష్టావధానము

శ్రీ సి. వి. సుబ్బన్న, శతావధాని

**పరిచయము :**

వేరు : శ్రీ సి. వి. సుబ్బన్న. శతావధాని.

జననము : కడప జిల్లా ప్రొద్దుటూరు నందలి రామేశ్వరము 22వ వార్డు; 28-10-1931

విద్యార్హతలు : బి. ఓ. యల్; బి. ఏ.

రచనలు : దుర్నీతము, కళావాహిని, పల్లపదాలు, చెంచులక్ష్మి, భోజకువింద చరిత్రము, గోపవధూ కైవల్యము, దివ్య స్మృతి.

రెండు కనకాభిషేకములు, ఒక గజారోహణము, కవి గండ పెండేరము, హస్తకంకణములతో సత్కారముల నందిరి. చేసిన అష్టావధానము లసంఖ్యములు.

వీరి అవధానానుభవపాటవమునకు రచనయే తార్కాణము

గురుసుతి

సీ॥ తానెన్ని భాషల ధర్మంబు తెలిసెనో
భాషామహోజగచ్ఛేషుఁ డితఁడు,
తానెన్ని కృతులల్లి ధారుణి నిలిపెనో
శివ తత్త్వమెఱిఁగించు కవి ఋతండు,
తానెంత మధుర వాత్సల్యంబు నెరపెనో
సతత సచ్ఛాత్ర సేవితుఁ డితండు,

తా నెంత ఆత్మ బలానూనుఁడో, అక్ష
 లన్నిర్భయోక్తి కలాపుఁ డితఁడు
చెప్పవచ్చునె రాయల సీమఁగాని
మఱియు నెందైనఁగాని, అస్మద్గురూత్త
మునకు వేకడు శేషశాస్త్రి నయనిధికి
మృదుల చంద్రికాప్రణయి కీర్తికిని, సాటి

**అవధాన కళ**

అనాదిగా తెనుగు నాట అవధానులున్నారు. వారి వృత్తి వైదికము. సారస్వతముగా, శ్రీనాథమహాకవికి పూర్వము నుండియే తెనుగున అవధాన విధాన మొకటి యుండెడిదని మనకు జక్కన విక్రమార్క చరిత్రము చెప్పుచున్నది. నాటి యవధాన పద్ధతి యెట్టిదో మనకు చక్కగా తెలియదు. అద్యతన కాలమున విద్వాన్మాడభూషి వేంకటాచార్యులు అవధానకళ ప్రదర్శించిన వారిలో ప్రథమ గణ్యులు. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు ఆచార్యులవారి కళాచాతుర్యము నవలోకించి తామును అవధాన ప్రదర్శనములు ప్రారంభించిరి. అష్టావధానమునకు ఒక పద్ధతి నిర్దేశించిరి. అవధాన కళా సామ్రాజ్యమును ఏకాతపత్రముగా నేలి చిరకీర్తి నార్జించిరి. కాగా, అవధాన విద్య ఆంధ్రదేశమున ప్రవేశ పెట్టిన కవిబ్రహ్మలు శ్రీ తిరుపతి వేంకట కవులేయను ప్రసిద్ధి యేర్పడినది. "అత్యద్భుతంబైన అవధాన విద్యకుఁ బ్రభవ కారణమైన ప్రతిభవాఁడు" అని శ్రీ కాటూరి వేంకటేశ్వర రావు గారు శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని (తిరుపతి వేంకట కవులలో జ్యేష్ఠులు) స్తుతించిరి. ఆ మాట వాస్తవమే.

తిరుపతి వేంకటకవులు లెక్కలేనన్ని అవధానములు చేసిరి. గ్రంథములు వ్రాసిరి. ఆయవధాన పద్యములు, ఈ గ్రంథ పద్యములు కలిపి చూచినచో భేదము కనిపించదు. అవియివి యొకేమాదిరిగా నుండును. అవధాన సభలో, అల్లజడిలో, ఆశువుగా జెప్పెడి పద్యములకు, ఇంట హాయిగా నూయెల మంచము మీద గూర్చుండి వ్రాసెడి పద్యములకు తేడా ఉండదా? అని కొందరు ప్రశ్నించవచ్చు. తేడా ఉండదు.

ఒక వ్యక్తికి, తత్ సంస్కారానుగుణముగ ఒక శైలి ఒక శయ్య ఒక బంధము సంగతములై యుండును. ఇంట-బయట వాని స్వరూపమంతే; మాఱదు. తద్భిన్నముగా నుండెనా, వాని సంస్కారమింకను పక్వము కావలసి యున్నదని యర్థము. తిరుపతి వేంకటకవులు పూర్ణపురుషులు.

"అష్టావధాన కష్టావలంబనమన్న, నల్లేరుపై బండినడక మాకు" అన్నారు గదా! "కష్టావలంబన" మన్న మాట యెవరికి? అపరిపూర్ణులకు. పరిపూర్ణుల కది 'నల్లేరుపై బండినడక'

అవధానవిద్య అదియొక కళ. కళయనగా పరమేశ్వరానుగ్రహమున ఒకొక్కని యందు కౌశల మలవడుట. వాడు శిల్పి : అప్రయత్నముగా బొమ్మలు గీయును. నాలుగు గీతలుగీచినచో అదొకరమణీయమూర్తి యగును. వీడొక పద్య నిర్మాత, నాలుగు మాటలు ప్రోగుచేసినచో అదొకపద్యమగును. ఇంకొక డొకగాయకుడు : వాడు నోరువిప్పిన ముత్యాలు రత్నాలు రాలును. వీరు కళావిలసితులు. బొమ్మలు గీయువాడు, పద్యములు కట్టువాడు, పాట పాడువాడు వీరెవ్వరును కష్టపడి ముక్కిమూలిగి, తలప్రాణము తోకకు వచ్చి నంతపనియై తమకార్యము నిర్వహించరు. అవధాని అంతే.

చూచెడి వారు అవధాని బరువుపడుచున్నాడని భావించరాదు. భర పడి చేసినచో అది అవధానమనిపించుకొనదు.

అవధాన మొక సహృదయ సమారాధనము. సమారాధనమనగా భోజనము పెట్టుట యనునర్థము కూడ రూఢమైయున్నది. పచ్చడి— అన్నము పెట్టినను విందే. పంచభక్ష్య పరమాన్నములు పెట్టినను విందే కదా! ఆ రీతిగా పృచ్ఛకు డడిగినదానికి ఏదో యొక పద్యము వాని మొగాన పాఱవేసి, చేతులు కడిగికొనుట పచ్చడి విందు. సరసము, సాలంకారము, సాధుబంధమునైన పద్యము చెప్పుట పంచభక్ష్య పరమాన్నముల తోడి విందు.

తిరుపతి కవుల పద్యములు రత్నములు. తరువాత మద్గురువర్యుల అవధాన పద్యములు అట్టి రత్నములు. ఆధునిక జగత్తునకు పద్యరచనా నైపుణి తద్దత్త భిక్ష.

30-4-72 తేదీన కర్నూలు సాహితీ సదస్సు వార్షికోత్సవ సందర్భమున ప్రొద్దుటూరి వాస్తవ్యులు శతావధాని శ్రీ సి.వి. సుబ్బన్న గారి అష్టావధానము జరిగినది. జిల్లాపరిషత్తు హాలులో జరిగిన యీ సభను స్థానిక వణిక్ప్రముఖులు శ్రీ కె.బి. శేషయ్యగారు అధ్యక్షత వహించి నిర్వహించిరి. జిల్లా పరిషత్తు హాలు అంతయు సదస్యులతో నిండి కిటకిటలాడెను. అష్టావధానమున ఈ క్రింది వారు పృచ్ఛకులుగ నుండి తమకర్తవ్యము నెఱవేర్చిరి.

1. నిషేధాక్షరి : శ్రీ టి. రామకోటేశ్వరరావు గారు, తెలుగు పండితులు, మునిసిపలు హైస్కూలు, ఆదోని.

2. సమస్య : శ్రీ బి యస్. రాఘవ, M.A. P&T Kurnool.

3. పురాణము : శ్రీ జి. వి. సుబ్రహ్మణ్యము, M A. తెలుగు పండితులు, మునిసిపలు హైస్కూలు, కర్నూలు.

4. దత్తపది : శ్రీ ఎన్. శ్రీరాములు, తెలుగు పండితులు టి.జి. యల్. హైస్కూలు, ఆదోని.

5. వర్ణన : శ్రీ హెచ్. హీరాలాల్, సాహిత్యరత్న S.V.S. హైస్కూలు కర్నూలు & కార్యదర్శి జిల్లా రచయితల సంఘము.

6. అప్రస్తుత ప్రసంగము : శ్రీ ఎం. వి. శేషాచార్యులు గారు M.A. LLB. BEd., గుంటూరు.

7. ఆశువు : శ్రీ కె. మద్దయ్య గారు, M.A. B.Ed., ఆంధ్రోపన్యాసకులు, ప్రభుత్వ బోధన కళాశాల, కర్నూలు.

8. గంటలు : శ్రీ ఎం. శ్రీరామచంద్రమూర్తి.

ఇష్టదైవ ప్రార్థనానంతరము శతావధాని శ్రీ సి.వి. సుబ్బన్న గారు సాహితీ సదస్సును ఈ విధముగ అభినందించి యాశీర్వదించిరి.

**అవధాన ప్రారంభ ప్రార్థనము :**

శిరః కల్హారామోదవశమధులిట్శ్రేణి ఝుంకారముల్ శ్రో
ణి రాజత్కాంచీ కింకిణిరణితముల్ స్నిగ్ధవక్షోరుహాద్వం
ద్వరోధోలోలత్కచ్ఛపి ముఖమృదుక్వాణముల్ సర్వనాదై
కరూపాత్మోజ్జ్వల్శ్రీ బయలు పరుపన్ గ్రాలు వాణిన్ భజింతున్.

ఆశీస్సు :

హృదయము భవ్యసంస్కృతి పరిస్ఫుటమై నవజీవనానుకూ
లదశ రహింప నిర్వృతిఫలంబు ఘటింప సమంతతోమహో
భ్యుదయము పొందజేసి పొలుపొందెడుగావుత మల్ల సాహితీ
సదమిది కందనోలుపురిఁ జారుయశంబును గాంచి మించుచున్?

ప్రశంసాగీతము :

అతిరథశ్రేష్ఠుఁ డంచితస్వాంతుఁడైన
యం. డి. వెంకట సుబ్బయాహ్వాయుఁడు రెండు
బాసలను సవ్యసాచియై వరలి, సాహి
తీసదస్సు నడుప, వెలితిగననౌనె !

1. నిషేధాక్షరికి : దశావతారములలో ఏదే నొక అవతార వర్ణ నము విషయముగా నొసంగబడెను. పండితులగు శ్రీ కోటేశ్వరరావు గారు చెప్పబోవు నక్షరము నెల్ల నూహించి నిషేధించుచుండిరి. అయినను శ్రీ సుబ్బన్న గారు సామర్థ్యముతో దాని నిట్లు పూరించిరి.

అలలన్ జేలో ప్రరక్ష ః
ఖలుల్ తదాత్మాశి సాగగాఁ దత్త్వట్కాం
డలసచ్ఛటలు కడున్ మి
న్కుల వెలలించె హరి యక్కాట శోభితరతమై.

(అర్థములు. ఆత్మాశి : మత్స్యము. మిన్కులు : కాంతులు ; వేదములు)

2. సమస్య : శ్రీ బి.యస్. రాఘవ గారు "రంభం గూడి శకుం తలం గనియె నారాజర్షి హర్షంబునన్" అను సమస్య నిచ్చిరి. అది యీ రీతిగ పూరింపబడెను.

గంభీరోగ్ర తపః ప్రలీనమతియై కామాదులంగెల్చి శ్రీ
శుంభన్మూర్తి వెలుంగు కౌశికుని గచ్చున్విచ్చుగావింప వ
చ్చెం భాస్వద్గతి మేనకారమణి తచ్ఛృంగారలీలా కళా
రంభంగూడి శకుంతలంగనియె నారాజర్షి హర్షంబునన్

**3. పురాణము :** శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యము గారు భారతములో విరాటపర్వములోని యొక రమణీయ ఘట్టమును చదువగా శ్రీ శతావధాని గారు పురాణము చెప్పిరి.

**4. దత్తపది :** ఇందు శ్రీ యన్. శ్రీరాములు గారు 'చండి, కొండి, వెండి, బండి, అను పదములు ఉపయోగించి ఇందిరాగాంధిని వర్ణింప గోరిరి. శతావధాని గారు ఆ వర్ణన మిట్లు గావించిరి.

చండి విధాన రేగి మహిషప్రథితాసుర మూలసైన్యముల్
కొండి పుటుక్కునన్ విరిగిరూల పరాక్రమలీలజూపెఁదా
వెండియు శీతభానుగతి వెన్నెలలన్ గురియించె కంటఁదాఁ
బండిన శేముషీవిభవబంధుర యిందిర కీర్తనీయయే.

**5. వర్ణన :** శ్రీ హెచ్. హీరాలాల్ గారు కర్ణుని దాతృత్వమును గూర్చిన వర్ణన యడిగిరి. అవధాని గారు దాని నిట్లు వర్ణించిరి.

కర్ణుఁడు కవినుతసద్గుణ
పూర్ణుఁడు శిబి బలి దధీచి ముఖులన్ నిజదిక్
గీర్ణయశంబున గెల్చి ను
దీర్ణుఁడు భారత శిరః ప్రదీప్తి వహించున్.

**6. అప్రస్తుత ప్రసంగము :**

**7. ఆశువు :** శ్రీ కె. మద్దయ్య గారు కోరిన విషయములపై నాశువుగ నీక్రింది పద్యములు చెప్పిరి.

నరసింహులైన వానికి
పరగన్ మంత్రిత్వమీయవలయున్ ధరణిన్
నరసింహరావు యోగ్యుడు
ధరణీసురుడయ్యె నేమి తప్పగు దానన్.

ప్రసంగవశమున 'వనిత వనితఁ గలయ నొక్క బాలుఁడు పుట్టెన్' అను సమస్యనీయగా అవధాని గారిట్లు పూరించిరి.

కనుగవ మిలమిలలాడెడు
కనుగొన ఋతుకాలమిదియ కావలె ననుచున్
ఇనుఁ డొకఁడు తఙ్ఞుఁ డారసి
వనిత వనితఁ గలియ నొక్క-బాలుఁడు పుట్టెన్.

**8. గంటలు** పదమూడు అని అష్టావధానిగారు సరిగా చెప్పిరి.

ఇట్లు జయప్రదముగా అష్టావధానము పూర్తియైనపిమ్మట శ్రీ ఎం.వి. యస్. సూర్యనారాయణగారు అష్టావధానిగారు చెప్పిన పద్యముల సారస్యము వివరించి ఇట్టి కఠిన నియమములకు లోనై ఆశువుగా చెప్పినను ఆ పద్యములు రసవంతమై యున్నవని ప్రశంసించిరి.

శ్రీ హెచ్. హీరాలాల్‌గారు సాహితీ సదస్సు నీ విధముగ ప్రశంసించిరి.

సాహితీ సదశ్శారద సాధుకార్య
సరణి సద్భావ భరితమై సాహితీప్ర
బోధ కృతితో ప్రబుద్ధమై బుధులు మెచ్చ
హైందవాత్మకు జాగృతి నంద జేయు
కార్యమొనరించె-వినుతింతు కార్యరీతి.

శ్రీ ఎన్. శ్రీరాములుగారు శ్రీఅవధానిగారిని పద్యకుసుమాలతో పూజించిరి. సదస్సువారు అవధానిగారికి నూటపదార్లను శాలువ ఇచ్చి సత్కరించిరి. అవధానిగారిట్లు మేలమాడిరి.

విమతచ్ఛేది కృపాణపాణియగు ఆ విక్టోరియారాణి కా
లమునన్ నూటపదారు లే, పరపతుల్ పాశ్చాత్యులేగన్ స్వరా
జ్యముసిద్ధించి, వ్యయప్రమాణ మధికంబై పోవు ఈనూత్న కా
లమునన్ నూటపదాఱులే కవులకున్ లక్షింపుడీ సజ్జనుల్ !

అధ్యక్షులు తమ భాషణములో సదస్సు కార్యములను, అధ్యక్షులైన శ్రీ యం. డి. వెంకటసుబ్బయ్య గారి కార్యదీక్షను ప్రశంసించిరి. శ్రీ పుష్పులూరు విశ్వేశ్వరయ్యగారు ఎల్లరకు వందన సమర్పణము చేసిరి.

# పానుగంటి వారి నాటకాలలో భక్తిరసము

డాక్టరు శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రి

పరిచయము :

పేరు : శ్రీ ముదిగొండ వీరభద్ర శాస్త్రి.
జననము : గుంటూరు జిల్లా నరసారావుపేట, 14-9-1933
విద్యార్హతలు : ఎం.ఏ. మద్రాసు పి.హెచ్.డి. (ఉస్మానియా)
రచనలు : 1. పానుగంటి వారి సాహిత్య కృషి. (డాక్టరేటు పరిశోధక కృషి)
2. నివేదన (అచ్చులోనున్నది)
పదవి : హైదరాబాదు నందలి తెలుగు అకాడమీలో పరిశోధకులు.

వీరి డాక్టరేటు పరిశోధనలోని భాగమిది యని వ్యాసమే సువ్యక్తమైయున్నది.

"జ్ఞాన మాత్రమె ముక్తికిఁ గారణంబు
గాదు; షట్వైరిపంథి నిగ్రహము వలనఁ
గాని జ్ఞానము గలుగదు; జ్ఞానమునను
గాని దన్మహా శత్రు నిగ్రహము గాదు"
"ఏమి సేయ వచ్చు నీ యసాధ్యపు సంధి
యందు భక్తి యోగ మమర కున్న?
భక్తి లేని జ్ఞాన పరి పాక మే లేదు
భక్తి లేక యున్న ముక్తి లేదు"

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారినాటకాలలో తలమానిక మయిన 'రాధాకృష్ణ' లో నారదుని నిశ్చితాభిప్రాయం ఇది. నారద మహర్షి భక్తిసూత్రములు చేసినవాడు. నారద శబ్దానికి పరమాత్మ విషయిక జ్ఞానాన్ని ప్రసాదించేవాడనే అర్థాన్ని పెద్దలు చెబుతారు. సంగీత జ్ఞానము, భక్తి రంగరించిన సన్మార్గ వర్తి ఆ మహర్షి. భక్తిని సాహిత్య పరంగా ఒక రసంగా స్వీకరించడమా లేదా అన్న విషయంపై వాదోపవాదాలు ఉన్నాయి. ప్రాచీనాలంకారికుల అదర్శాలు ఎలా ఉన్నా, కవులు, నాటక కర్తలు మాత్రం తమ రచనలలో భక్తిరసాన్ని ఆశ్రయించారు.

ఏ రసానికైనా ఒక స్థాయీభావం ఉండాలి. పరమాత్మ గతమయిన రాగం ఏర్పడిన భక్తిపీకుని చిత్తంలోని భావం సుస్థాయి కాదనగలమా? సాహిత్య రసము బ్రహ్మానంద సబ్రహ్మచారి. భక్తిరస గమ్యము బ్రహ్మానందము, ఆ భక్తిని కావ్యగతంగా నిరూపించినప్పుడు అది ఆనందదాయకం ఏ విధంగా కాకపోతుంది? కనక అనుభవ దృష్టితో భక్తిని రసముగా పరిగ్రహించటమె సమంజసము.

భక్తిరసానికి జనబాహుళ్యాన్ని తొందరగా ఆకట్టుకొని, పరవశులను చేసే శక్తి ఉన్నది, ఆ కారణం చేతగాని, సంసారతరణం చేయాలన్న తహ తహ చేతగాని, ఎందరో మహానుభావులు భక్తి సాహిత్యాన్ని పలుభాషలలో నిర్మించారు,

ఎన్నడో నాచన సోముడు తనను గూర్చి నవీన గుణ సనాథుడనని, రసపోషణ సంవిధాన చక్రవర్తినని చెప్పుకొన్నాడు. జంటగా ఈ రెండు లక్షణాలు వర్తించే మరొక మహనీయుడు పానుగంటి లక్ష్మీ నరసింహారావు.

పానుగంటివారి రచనా జీవితం ప్రారంభ మయినది, ఒక పద్య కావ్యంతో. అది "విష్ణునామ సహస్రమూల," నలభై నాలుగు సీసపద్యాలలో అనంత గుణుడైన ఆది విష్ణుని వేయి పేళ్ళను కూర్చి వ్రాసిన ఈ చిన్న పుస్తకం వారి కవితా విశారదత్వానికి దర్పణం కాదు కాని వారి మానసిక పీఠాన్ని అధిష్ఠించి ఉన్న భగవంతుని యెడ వారికున్న భక్తిని మాత్రం ప్రదర్శిస్తుంది. లక్ష్మీ నరసింహారావుగారు తారకనామ జప పరాయణులని వారి సన్నిహితత్వ భాగ్యం కలవారు చెబుతారు. వారికి శ్రీమద్రామాయణం

పయిన ఉన్న గౌరవాదరాలు అంతా ఇంతా కావు. పంతులు గారి కంఠా భరణంలో పిచ్చిరామశాస్త్రి అంటాడు. "మాకు భారతము కంటె రామా యణమన్న ఎక్కువ ప్రీతి" అని. ఆ మాటలు పానుగంటి వారివి కూడా,

పానుగంటివారు వ్రాసిన నాటకాలు మొత్తం ముప్ఫయి ఉన్నాయి, అందులో ఉత్తమ నాటకాలు కనీసం ఎడెనిమిదయినా ఉన్నాయి. వాటిలో భక్తిరస ప్రాధాన్యం కలవి ఆరునాటకాలు. అవి 1. రాధాకృష్ణ, 2, పాదుకా పట్టాభిషేకము, 3. వనవాస రాఘవము, 4. విజయ రాఘవము, 5. విప్రనారాయణ, 6. కల్యాణరాఘవము.

ఈ నాటకాలను గురించి కొంచెం వివరంగా చెప్పుకొనేముందు పాను గంటి వారి వ్యక్తిత్వ వైశిష్ట్యం గురించి కొంత ముచ్చటించుకోవాలి. లక్ష్మీ నరసింహారావుగారి లో ఒక విధ మయిన ద్వంద్వ వ్యక్తిత్వం ఉన్నది. వారి నాటకాలలో ఉత్తమమయిన వాటిలో ఒకటయిన కంఠాభరణంలో ఒక విచిత్ర పాత్ర ఉన్నది. అతని పేరు కృష్ణారావు. అతడు వివరిస్తాడు. "నామనస్సునం దన్ని రసములున్నవి. సదాచార మున్నది. వ్యభిచారమున్నది. భక్తి యున్నది, రక్తియున్నది, వైరాగ్య మున్నది, పామరత్వ మున్నది. నా మనస్సృష్టి వైఖరి యట్టిది.

తులసి సాలగ్రామముల మీద నుంతును,
　　పూవులు వేశ్య కొప్పునను ముడుతు;
వాయుస్తుతినిఁ గపి ప్రభు నభిషేకింతుఁ,
　　బన్నీటి జడి వారభామ కిడుదుఁ;
జందనాగురు చర్చ స్వామికి నర్పింతు,
　　జందనాగురు చర్చ సాని కిడుదుఁ;
గప్రంపుటారతి కంసారి కొసఁగుదు,
　　మణి దీపముల వెల మగువ కిడుదు;
బట్టి మెడఁ జుట్టుకొనుచు శ్రీ వల్లభునకు
భక్తి సాష్టాంగ మొనరింతుఁ బాపహృతికి.
బైట చేపట్టి జారిణీ పదములందు
వ్రాలుచుందును బ్రణయ కోపంబు దీర.

తేజస్తిమిర న్యాయంలో ఉండే విరుద్ధాంశాల సమన్వయాన్ని కృష్ణా రావు పాత్రలో ఊహించిన పంతులుగారి మనస్సుకూడా అలాగే పొందికకు అందని భిన్నాంశాల సమన్వయ రూపమైనదే. వారిలో ఎంతటి ఉదాత్తత ఉన్నదో, అంత పరిహాస ప్రియత్వము ఉన్నది. ఎంతటి మార్దవం ఉన్నదో అంతటి ఆక్షేపణ హాస్యమున్నది.

పానుగంటివారిలో ఉన్న ఈ సంశ్లిష్టవ్యక్తిని గూర్చి ఆలోచిస్తుంటే మరొక ఊహ వస్తుంది. వారు అంతరంగంలో సాత్త్విక స్వభావులు, పైకి నిత్య జీవితంలో రాజసి. బహుకాలం రాజామాత్యులుగా, రాజాస్థాన కవులుగా ఉన్నవారు కాబట్టి ఇలా ఉండటంలో ఆశ్చర్యం లేదు. ఈ గుణ ద్వయ సమ్మేళనంలోనే వారికి ఒక విశిష్ట వ్యక్తిత్వం అబ్బింది. ఒక విషయం పై వారి కెంత లాలస ఉండేదో, అంత నిర్లిప్తత, వైరాగ్యము కూడా ఉండేవి. పారమార్థికంగా వారికి ఎంత వినమ్రత ఉండేవో, ఐహికంగా వారికి అంత ఆత్మవిశ్వాసాధిక్యం ఉండేది

ఈ విచిత్ర సమ్మేళనం వల్ల వారి మనస్సుకు ఒక అనితర సామాన్య మయిన ఉద్వేగం సమకూడింది. ఆ ఉద్వేగమే వారి నాటకాలను, ఇతరరచ నలను రసప్లావితం చేసింది.

పంతులుగారు వ్యవహార విదులు, లోకజ్ఞులు. మనుష్య మనస్తత్త్వపు అంతరాంతరాలను గుర్తెరిగిన వారు. ఆ కారణంచేత వారు ఎన్నటికీ మరపు రాని సజీవ పాత్రలను నిర్మించగలిగారు. అయితే పానుగంటివారి పాత్ర ప్రపంచాన్ని రెండు వర్గాలుగా గుర్తించవచ్చు. ఒక వర్గం నిసర్గ శాంత గంభీరోదాత్తమై సాత్త్వికతా నిబిడమైనది, రెండవది ఔజ్జ్వల్య ప్రధానమయి, పరిహాస ప్రియమయి, తర్కనిపుణమయి త్రుళ్ళిపడేవి, ఈ రెండు చిత్ర ప్రకృతులు వారిలో ఉండటం చేతనే వీటిని రసవంతంగా తీర్చి దిద్ద గలిగారు.

పంతులుగారి మనస్సుకు ఉన్న ఉద్వేగవృత్తి వారి విజయానికి మూల కారణం అని భావించవచ్చు. అయినా వారి రచనలన్నీ సమగ్రంగా గుణో పేతములయినవని చెప్పడానికి వీలులేదు. అయితే సత్యము, చిత్రము అయిన విషయం ఏమంటే, వారి గుణదోషాలకు రెండింటికీ మూలహేతువు వారి తీవ్రతయే,

కరుణము, వీరము, భక్తి, ఈ రసములలో ప్రజ్వలనము, ఉద్వేలత సహాయకారులౌతాయి. శృంగార, హాస్యాలను కూర్చినప్పుడు మాత్రం ఈ ఉద్రిక్తతకు కొంత అదుపు ఉండితీరాలి. కనకనే, పంతులుగారి గొప్పదనం కరుణ, వీర, భక్తిరసాల లో అత్యుత్కటంగా కనిపిస్తుంది.

తమ నాటకాలలో మూడవది అయిన ప్రచండచాణక్యం వ్రాసే వేళకు కొంచెం యించుమించుగా, వారు లక్ష్మీనరసాపురం ఎస్టేట్‌లో దివాన్‌గిరి మానివేశారు. ఆ విధంగా మానివేయటానికి దారితీసిన పరిస్థితు లేవో వారి మనస్సును గాఢంగా ప్రభావితం చేసినాయి. ప్రచండచాణక్యం లో తోటివారి అసూయ ఫలితంగా ఉద్యోగ భ్రష్టుడైన చాణక్యుడు రాజ వంశం పయిన పగ తీర్చుకొన్న ఘట్టాలు బహుశా అనాడు పానుగంటివారి మానసికస్థితిని నిరూపిస్తాయి. అతరుణంలో పంతులుగారి అబాల్యమిత్రుడు, ఆప్తస్నేహితుడు అయిన కూచి నరసింహంగారు పానుగంటివారిని దారిన పెట్టే బాధ్యత స్వీకరించినట్లు కనబడుతుంది. చైతన్య దేవుని పయిన ఆంగ్ల భాషలోఉన్న ఒక గ్రంథాన్ని తెచ్చియిచ్చి ఇది చదివి గౌరాంగుని చరిత్రను నాటకంగా వ్రాయమని హితవుచెప్పారు. పంతులుగారు దానిని చదివి, గౌరాంగుని చరిత్రను పద్యకావ్యంగా వ్రాసే బాధ్యతను కూచివారికి విడిచి, రాధా చరిత్రను నాటకంగా వ్రాసే వంతు తాము తీసుకొన్నారు. ఆ విధంగా అవతరించింది, వారి మొదటి భక్తిరసప్రధానమయిన నాటకం రాధాకృష్ణ.

రాధాకృష్ణ నాటకం చదివే భావితరాల వారంతా, ఇటువంటి నాటకం వ్రాసిన ఆ మహనీయుని సమకాలికులెంత అదృష్టవంతులోగదా అని అభినందిస్తారు. అని ఒక విమర్శకుడు అన్నాడు. ఈ నాటకం గొప్పదనం అది పఠన పాఠనాలకు, ప్రయోగానికీ కూడా సమానంగా ఉత్తమమైనది కావడం.

ఈ నాటకంలో ప్రశంసనీయమైనవి మూడు అంశాలు. అవి:

1. రాధాచరిత్రను నిష్కళంకం చేయడం.

2. గౌడీయ వైష్ణవ మతానుసారంగా మధుర భక్తిరసపోషణ నిర్వహించడం.

3. ఇందులోని రచనా శిల్పం.

రాధా మాధవ సంప్రదాయవాదుల దృష్టిలో రాధా కృష్ణులు సీతా రాములవలె, పార్వతీ పరమేశ్వరులవలె దాంపత్య శృంగారం మూర్తీభవించిన రసమూర్తులు. కాని ఆంధ్ర వాఙ్మయంలో రాధకు అంతటి గౌరవ స్థానం తత్పూర్వం లేదు. జనసామాన్యంలో రాధ యొక్క ప్రాచీన అనౌచిత్యభావనానికి మిక్కిలి తోడ్పడింది పానుగంటివారి పరమార్థ రాధాకృష్ణ నాటకము.

ఇక వైదిక సూక్తాలలో మంద మందంగా నిక్వణితమయిన భక్తి తంత్రులు, ఆళ్వారుల తీవ్ర సాధనచేత ప్రతిస్పందితాలై, శ్రీరామానుజ, మధ్వ, వల్లభ, నింబార్కులచే మీటబడి, గౌడీయ వైష్ణవ దర్శనమనే రూపంలో మధురరాగిణిగ రూపొందటం జరిగిందని పెద్దలు వివరిస్తారు. ఆ మధురభక్తి తరంగాలను, సంపూర్ణంగా కాకపోయినా ఆ గౌడీయ వైష్ణవ దర్శన సిద్ధాంతాలను తెలుగు సాహిత్యంలో ప్రతిష్ఠించిన ఘనత రాధాకృష్ణ నాటకానిది.

రాధాకృష్ణ నాటకంలో కథ పెద్దగా లేదు. రాధాదేవి భక్తిలో ఏర్పడిన వివిధ దశాపరిమాణాలను ప్రదర్శించటమే ఈనాటకంలో ప్రధాన ఇతివృత్తం. అయితే రాజసి అయిన సత్యభామ మొదట రాధను ద్వేషించి, పశ్చాత్తాపం పొంది ఆమె భక్తిని మెచ్చుకోవడం అనే ఉపకథను దీనితో జోడించారు. ఈ రెండో వృత్తాంతంవల్ల మొదటిది ఎక్కువగా రాణించింది.

రాధ నారదుడు చెప్పినట్లు— "జీవసంఘముం దుత్తమోత్తమ జన్మ." ఆమెకు శ్రీకృష్ణుని యందుగల అనురాగం "ఐహికానన్యాగర్హ్యా వాంఛాన్వితంబు కాదు, పరమాత్మయందు రాగప్రపూర్ణ జీవునకు గల సంబంధ సిద్ధిగాని."

గౌడీయవైష్ణవ సంప్రదాయం ప్రకారం కృష్ణభక్తిరసము 'స్నేహము'తో ఆరంభమైమాన ప్రణయ, రాగ, అనురాగ, భావదశలను దాటి పరిపక్వమై 'మహాభావము'గా పరిణమిస్తుంది. అటువంటి మహాభావానికి పరాకాష్ఠ దశ 'దివ్యోన్మాదము.' ఈ పరమస్థితికి ఒక్క శ్రీ రాధికకు మాత్రమే అధికారం ఉన్నది. పాంచభౌతికమయిన శరీరం ఈ మహాభావం యొక్క ఆవేగానికి తట్టుకోలేదు. రాధికను వర్ణిస్తూ గోస్వామి "మహాభావోజ్జ్వల చింతారత్నోద్భావిత విగ్రహా" అని అన్నాడు.

చారిత్రక పురుషులలో శ్రీ చైతన్యస్వామిలోను, శ్రీరామకృష్ణపరమ హంసలోను ఈ దివ్యోన్మాద లీలను గమనించవచ్చు. గౌరాంగచరిత్రంలో ఉన్న మహాభావ ప్రకటనాన్ని చూచి ముగ్ధులైన పానుగంటివారు రాధా పాత్రగతంగా దానిని ఆవిష్కరించారు.

అయితే పంతులుగారు శాస్త్రసృష్టితో కృష్ణభక్తి రసాన్ని, భక్తిలోని వివిధ దశలను పోషించలేదు. కవి మానసికానుభూతి ప్రధానంగానే ఈ రస పోషణ నాటకంలో జరిగింది.

రాధ నవనీతం కన్న కోమలమైన అంతరంగం కలది. ఆమె తన్ను తాను సాంగకంగా కృష్ణార్పణం చేసుకొన్నది. అతడు ప్రభువు-తాను దాసి నల్లకలువలు చెవియందు అలంకరింపుకొంటే చంద్రోదయం కాగానే అవి వికసించి, చెవి నంతటిని ఆక్రమించుకొని ప్రాణనాథుని వాగమృతాన్ని అను భవించనీయవేమో! కృష్ణుడు ఎంతకూ రానప్పుడు రాధ రమ్మన్నది అని సందేశం పంపితే అది ఆజ్ఞలాగా స్ఫురిస్తుందేమో! కాక 'నీకు అంగీకార మైన యెడల' అని చేరిస్తే, తనకు అంగీకారం కాదని ధ్వనిస్తుందేమో! ఈ విధంగా తల్లడిల్లిపోయే రాధ మొదట కనిపిస్తుంది.

ఒకసారి శ్రీరామకృష్ణ పరమహంస వివేకానందుణ్ణి ప్రశ్నించారట. అమృతభాండం లభిస్తే ఏం చేస్తావని! ఈగవలె అంచునచేరి ఆస్వాదిస్తావని ఆయన బదులు చెబితే పరమహంస నవ్వుకొన్నారట. అంటే లభించినది అమృతమే అయినప్పుడు పదిలంగా అంచునే అంటిపెట్టుకోవలసిన ప్రాణభయం దేనికి అని భగవాన్ అభిప్రాయం. అదే విధంగా, రాధ భక్తి ఎంత గొప్పది అయినా, అందులో ఒక కొంత భౌతిక ప్రతిబంధకాల భావన తొలి దశలలో గోచరిస్తుంది ఇది క్రమంగా అంతరించింది. రాధ భక్తి మహా భావ దశను చేరుకొన్నప్పుడు గాని ఆమెకు నిరంతర కృష్ణ సన్నిహితత్వము లభించలేదు.

రాధ దివ్యోన్మాదాన్ని చిత్రించే చతుర్థాంకం అత్యుత్తమ కవిత్వ స్ఫూర్తితో నిండిఉన్నది. ఇందులోని ప్రత్యుత్తరము పానుగంటివారి శాశ్వత కీర్తి ధ్వజము.

పంతులుగారి రామాయణ నాటకాలను ఒకటిగా పరిశీలించేటందుకు ప్రక్కన పెడితే, వారి భక్తిప్రధాన నాటకాలలో మిగిలేది విప్రనారాయణ. దీని నామాంతరము వైజయంతీ విలాసము. ఇది పంతులుగారి తొమ్మిదవ నాటకము

ఈ నాటకంలో పాత్రలసంఖ్య తక్కువ. తొండరడిప్పొడి ఆళ్వారు మహాభక్తుడు, అయన భక్తికి దేవదేవి పరీక్షపెట్టింది దేవదేవి సమ్మోహనంలో పడి విప్రనారాయణుడు సానివాడలకు బయలుదేరాడు ప్రసిద్ధమయిన కథలో పంతులుగారు కొంత మార్పుచేసి, సానివాడలో వేశ్యమాత చెప్పుదెబ్బ కొట్టగా విప్రనారాయణునికి ఆదిరంగని పాదతాడనంవలె తోచి తిరిగి భక్తి ఉద్దీపించినట్లు వ్రాశారు.

ఈ ఘట్టాన్ని శిష్యుడు శ్రీనివాసునిచేత వ్యాఖ్యానింపజేస్తూ పంతులు గారు ఈ విధంగా వ్రాశారు.

> 'ఐహికాపేక్ష దిగలాగినప్పు డితని
> భక్తి మెల్లనఁ గ్రుంకి, యాపట్టు దైవ
> కృపనుపీడ హఠాత్తుగా నెగసెఁ బైకి
> గ్రుంగు లాగి విడుచు చెట్టుకొమ్మవోలె."

రాధాకృష్ణ నాటకంలో సంపూర్ణంగా చిత్రించిన దివ్యోన్మాద చ్ఛాయలను పంతులుగారిక్కడ తిరిగి రుచి చూపించారు. ఈ నాటకాన్ని పరిశీలిస్తున్నప్పుడు మనము ఒక విషయాన్ని గమనించవచ్చు రాధాదేవి భక్తి వంటి భక్తినే తిరిగి విప్రనారాయణ పాత్రగతంగా చూపటం జరిగితే అది వట్టి పునరుక్తి ప్రతిధ్వని అవుతుంది, ఆ కారణంచేతనే కావచ్చు; ఇందులో పంతులు గారు దేవదేవి పాత్రపయిన ఎక్కువ శ్రద్ధచూపి పాఠక సామాజికుల దృష్టిని కొంత అటు మరల్చారు. అంత మాత్రాన విప్రనారాయణుని భక్తి తీవ్రతను తగ్గించినట్లు కాదు. ఈ నాటకంలో పానుగంటివారు వైష్ణవ మతసిద్ధాంతాల లోని కొన్ని అంశాలను అపహాస్యం చేయించి, దేవదేవి మాటలద్వారా ఒక సవరణను ప్రతిపాదించారు.

ఆచారాన్ని అనుసరించి విప్రనారాయణుడు "నేను- జడుడను, దురభి మానిని, పాపాత్ముడను" అని నైచ్యానుసంధానం చేసుకోగా దేవదేవి

రెచ్చిపోతుంది. దైవ దివ్యమంగళ విగ్రహ ప్రతిబింబముగ నీ నరదేహము నిర్మింపబడినది. తన్మహా తేజః పవిత్ర స్ఫులింగమైన యాత్మ యీ దేహమున నుంచబడినది, అందుచే స్వనిందా పరుడగువాడు దైవనిందాకరుడు, ఆత్మ ఘాతుకుడు దైవఘాతుకుడు" అని దేవదేవి సిద్ధాంతీకరిస్తుంది.

భక్తిని గురించికూడా దేవదేవి తన అభిప్రాయాలను వెల్లడిస్తుంది. కామికాక మోక్షకామి కాడు అనే సూక్తిలో ఆమెకు నమ్మకముంది. "భక్తికి వడుచుదనము చుక్కయెదురు. రక్తపువేడి యున్నదేహములో భక్తి మొలక లెత్తదు, కాదాచిత్కముగ మొలిచినను వెంటనే పిట్టతలలువైచి మెలికలు బడి మాడును! భక్తి బంగాళాదుంపవలె శీతప్రదేశమునగాని వృద్ధి పొందదు. ఇంక స్పష్టముగ జెప్పలేదా? పండ్లూడినగాని భక్తి బయలుదేరదు. తల వెండ్రుకలు పండినగాని భక్తి చిగుర్పదు - నడుము వంగినగాని భక్తిలేవదు. దేహము క్షయించినగాని భక్తి వృద్ధిపొందదు." దేవదేవి చేసిన ఈ వ్యాఖ్యా నాన్ని వెంటనే పంతులుగారు ప్రతిపక్షం చేయించారు. ఏమయినా ఈ విధంగా దృష్టిని కొంతవరకు ప్రధానంగా దేవదేవి పయికి మరల్చటం జరిగింది,

ఈ నాటకంలో ప్రధానమయిన అంశాలు రెండు. మొదటిది దేవదేవి రాకవల్ల విప్రనారాయణుని భక్తి తీవ్రతలో కొంత లోపం కలిగినా, అతని సద్గుణ సంపత్తిలో ఎటువంటి కొరత ఏర్పడకపోవడం. రెండవది దేవదేవుడు కరుణించి భక్తుడు పతితుడై పోకుండా స్వయంగా కాపాడుకోవటం.

ద్విగుణీకృతమయిన విప్రనారాయణుని భక్తిని చూచి శిష్యుడు శ్రీనివాసుడు అన్న ఈ మాటలు ఎంతో అర్థవంతంగా ఉన్నాయి.

> ఆకు డుల్చినగాని పుష్పాంచితంబు
> కాదు మల్లె; తలంగోయ గాని మొవ్వ
> వేయ దరటి; చెప్పునరాచి విడువగాని
> దనియ మెదుగదు: భక్తి యాదారి యేమొ.

ఆ స్థితిలోఉన్న విప్రనారాయణుడు ప్రతిఒక్కడిని భక్తుడుగా భావించి భక్తుల పాదధూళి తన మేనికి పట్టించుకుంటూ భక్తాంఘ్రిరేణువు అనే పేరు పెట్టుకుంటాడు. కన్నులు మూసుకొని తనలోను వెలుపల అంతటా రంగని

చూచుకుంటాడు, శ్రీనివాసుడు ఆ సమయంలో విప్రనారాయణుని భక్తిని వ్యాకరిస్తాడు, "ఇది భక్తికవధి కాబోలు! ఈతని భక్తిక్రమము నేను నాకు దోచినట్లు కనిపెట్టితిని, మొట్టమొదట నత్వగ్జ్ఞానేంద్రియమగు స్పర్శయందు భగవదనుభవ మారంభమై పులకాంకురాములు కలిగినవి. అటు తరవాత జ్ఞాన సంపత్తిచే నగ్రగణ్యమగు నేత్రేంద్రియమునకుగూడ దదనుభవము వ్యాపించి శ్రీరంగ దేవాలయ మెదుట గానబడ దానిలో రంగని గాంచెను. తరువాత నాలయాది బహిస్సంబంధ శూన్యముగనే నన్నే రంగనిగ భావించెను. అటు పైన లోకమంతయు రంగమయమై కంటికి గానబడెను. తరువాత బాహ్యేంద్రియ వ్యాపార మక్కఱలేకయే యాంతరదృష్టిచే రంగని దనలోను వెలు పలను గాంచెను." కొంతవరకు ఈ క్రమము రాధా భక్తిలోను ఉన్నదే!

శ్రీపాదుకాపట్టాభిషేకం ... 

ఇంతవరకు చెప్పుకున్న రెండు నాటకాలలో ప్రధాన పాత్రలు భక్తి ప్రపత్తులు గల వ్యక్తులు. రామాయణ కథలోనో భగవంతుడే ప్రధానపాత్ర. ఆ భగ వంతుని చుట్టూ తక్కిన పాత్రలు కథాగతిని అనుసరించి పరిభ్రమిస్తూ ఉంటాయి. కాబట్టి వాటిలో ప్రత్యేకభక్తి గోచరించదు. త్యాగరాజస్వామి ఆలాపించినట్టు ఆ తళుకు చెక్కుల ముద్దుబెట్ట కౌసల్య ఏమి తపం చేసిందో, శ్రీరామ రారాయని పిలువ దశరథుడేమి తపము చేశాడో, పరిచర్య చేయ సౌమిత్రి, తనవెంట చనచూడగా ఉప్పొంగిన కౌశికుడు. ఈ విధంగా వాళ్ళం దరూ ఏమి తపం చేశారోగదా అనిపిస్తుంది శ్రీరామచంద్రుడు కేంద్రంగా ఆయనతో రకరకాలుగా అల్లుకొనిపోయిన పాత్రల ప్రీతి, వాత్సల్య, మాధుర్య. స్నేహ దాస్య భావాలను ఆవిష్కరించటంలోనే పానుగంటి వారు భక్తిరస విశిష్టతను ప్రదర్శించారు.

పానుగంటివారి దశరథుని పాత్ర చాలా స్ఫుటరేఖలు దిద్దుకున్న పాత్ర, శ్రీరాముని పయిన దశరథునికున్న అనురాగం జగత్ప్రసిద్ధమయినదే కాని పానుగంటివారు దశరథ పాత్రచేత కల్యాణరాఘవ నాటకంలో చెప్పించిన ఈ మాటలు పరిశీలిస్తే, ఆ మాటలువిన్న విశ్వామిత్రుడు అన్నట్లే దశరథుడిని మహాదృష్టవంతుడు అనకుండా ఉండలేము.

"శ్రీరఘూద్వహు డిట వెలసినది మొదలు
కనుల కఱవు దీర నతని గాంచుటందు
వీను లలరగ బలుకులు వినుటయందు
నును బులుక లూరఁ దొడఁ బెట్టికొనుటయందు
దనివి దీఱఁగఁ దల మూరుకొనుటయందు
మురువుమురువుగఁ జెక్కిలి పుడుకుటందు
తనువు హాయిగఁ గౌగిలి గొనుటయందు
ఒక నిమిస మాతనిన గానకుండు నపుడు
రామ! రఘువీర! రాఘవా! రామచంద్ర!
యనుచు నోరారగాఁ బిల్చుకొనుట యందు
నటునిటును నాతని వెదకులాడుటందు
తెరపిలేదు! తీఱికలేదు! విరతిలేదు;
ఆపుదలలేదు; తుదలేదు; హద్దులేదు;
అలపులేదు; సొలుపులేదు; నిలుపులేదు;
చాలుచాలు లే, దిఁక సరిసరియు లేదు;
సర్వ రాజ్య తంత్రంబులు చప్పబడియెఁ
గొఱకొఱనుచు సుమంత్రుడు గొణగుకొనియె
వహ్ని తంత్రంబులును జల్లపడియె: మౌని
విభుని యూరుపు కాసంత వెచ్చబడియె
ఇన్ని యేల? రాముని గాంచి యింతగాకఁ
బ్రాకు లాడెడు నేనెట్లు రాము విడచి
దివికి బోదునో యనుచు సందియము దోచు"

దశరథునికి రాముని పయిన ఉన్న అనురాగాన్ని ఒక్కముక్కలో చెప్పాలంటే, "అమ్మయెడఁ జూపు నిల్పి మాటాడుచుండ - అట్లు మాటాడి నను జూడమయ్య యిట్టులనుచు గడ్డము గ్రహియించి యతని మొగము "తన యెడకు త్రిప్పుకొనే వెఱ్ఱి దశరథుడు!

అలాగే వసిష్ఠుడు. వనవాసానికి బయలుదేరనున్న రాముని చూచి కౌసల్య దుఃఖ వివశయై "వసిష్ఠ భగవానుడా! మీరాజ్ఞ యిచ్చిన పట్టాభి షేక మహూర్తము వృథాపోగూడదు. కావున శ్రీరామ భద్రునిప్పుడే పట్ట

భద్రుని చేసి మమ్ము, గృతార్థులఁ జేసి రక్షింపుము" అని ప్రాధేయ పడింది. అక్కడ వసిష్ఠుడు చెప్పిన మాటలు.

ఇరువదై దేండ్లనుండియే యీ మాహాత్ము
నెరుగుదువు నీవు, నేనో యనేక హాయ
నములనుండి తలంచి మననముచేసి,
భక్తిఁ బ్రేమించి పూజించి, బహు విధముల
సేవఁజేయుచు నితని సచ్చిదమల స్వ
రూప చరణ సందర్శన రూఢమతిని
గర్హ్యమగు పురోహితతను గాంచి రఘుకు
లమును గనిపెట్టుకొనియుంటి విమల చరిత!
ఇతని పైన నీయనురాగమే యధికమొ?
రామనామ సంస్మరణ పూర్వకముగ జప
మాల ద్రిప్ప నరిగి పోవు వ్రేళ్లులు గల
ముదిమి గడ్డపు మునిరాగము ఘనమొ? కను
ఇంతి వౌటను జాపురం చేద్చుచుంటి
వేను బురుషుడ నందుపై ఋష్యాదార
నాముఁడను బెద్దగాన లోలో మఱిగెద
నితని విశ్లేష మెవడు సహింపగలడు?"

ఇదేవిధంగా బాల రామలక్ష్మణులను ప్రదర్శించే కల్యాణ రాఘవ నాటకంలో లక్ష్మణుని అనుబంధాన్ని చక్కగా నిరూపించారు పంతులుగారు. విశ్వామిత్రుడు తాటకనుగూర్చి వివరించబోతూ సుందోపసుందుల కథను బాల రామలక్ష్మణులకు చెప్పసాగాడు.

విశ్వా: సుందోపసుందులని

లక్ష్మ: ఊఁ- అన్నదమ్ములా?

విశ్వా: అవును నీకెట్లు తెలిసెను?

లక్ష్మ: పేళ్ళనుబట్టి. నాకు మా తండ్రి ఉపరాముడని పేరేలపెట్టలేదో?

ఈవిధంగా పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు తమ మనస్సంతా రామమయం చేసుకొని రామమయమయిన కథా జగత్తును నాటకీకరించారు.

10)

వనవాసరాఘవ, విజయరాఘవ నాటకాలలో కూడా శ్రీరామునికి, తక్కిన పాత్రలకు ఉండే అనుబంధాన్ని పంతులుగారు ప్రదర్శించినా వారిదృష్టి ఎక్కువగా రామ మహాత్మ్యాన్ని వివరించే దిశగా మరలింది, ఆ కారణంచేత ఆయా ఘట్టాలలో భక్తి నిగూఢభక్తిరూపాన్ని తాల్చటం జరిగింది. ఉదాహరణకు యుద్ధంచేసి తిరిగివస్తున్న శ్రీరామచంద్రుని మూర్తిని అంగదుడు వర్ణించిన ఈ ఘట్టాన్ని పరిశీలించవచ్చును.

కనుగొలుకులైన నెఱ్ఱన గాకయుండ నా
యని గట్టిగానైన నఱవకుండ,
నొడలు చెమ్మటచేతఁ దడిఁయైనఁ గాకుండ
సిగముడియైనను జెదరకుండఁ,
గోపచిహ్నము లేమి దీపింపకుండ, ర
ణోత్సాహ దశయైన నొదవకుండఁ
బల్లెత్తు పలుకైనఁ బగతుర నాడక
యుండ మూలబలంబు రెండుగడెల
లోన లీలగాఁ గడతేర్చి దానవాధి
పతికి నిట్టులు చేసి, యెవ్వండు సేసె
నో యటంచు నుండు తటస్థు నోజ నహహా!
ఇట్టి యద్భుత చారిత్ర మెచటఁగలదు?"

ఈ విధంగా రామ మహత్త్వాన్ని రామతత్త్వ మహత్త్వాన్ని పంతులుగారు చాలా సందర్భాలలో మనోహరంగా నిరూపించారు.

ముముక్షువులకు, ప్రధానంగా ఉన్న మూడు మార్గాలు భక్తి, జ్ఞాన, కర్మమార్గాలు. ఈ మూడింటిని గూర్చి, వీటి అంతరాలను గూర్చి, ప్రాస్తావికంగా పంతులుగారు తమ రచనలలో చాలాచోట్ల చర్చించారు. రాధాకృష్ణ నాటకంలో చివరన నారదుని పాత్రను ప్రవేశపెట్టి, అతనిచేత భక్తి యోగాన్నిగూర్చి ప్రసంగిపజేశారు. అందులోని భావాలను ఈ వ్యాసం మొదటనే ఉదాహరించడం జరిగింది. వ్రణ పీడితుడయినవాడు వైద్యుడిచ్చిన మత్తుమందు తాగి విస్మృతుడై బాధ లేదని అనుకొన్నట్లే నిర్గుణ బ్రహ్మసంధాననిష్ఠ బహుళంగా అస్వప్న గాఢనిద్రపోయి అద్వైతసిద్ధి అయిందని

తలఁచుకోవడం జరుగుతుంది. నెలయున్న ఏ విధంగానైతే వర్ణసంపుటితమైతేనే గాని నోట పలుకరాదో అదే విధంగా నిర్గుణ తత్త్వాన్ని కేవలమనో నియతితో తలచటం ఎవ్వరికీ సాధ్యంకాదు, భక్తి యోగాధికతను నిరూపించడంకోసమే కృష్ణావతారం జరిగింది అని నారదుని ఉపన్యాస సారాంశము. కృష్ణునిచేత కూడా ఈ నాటకంలో పంతులుగారు భక్తియే ముక్తి సాధనమని దానికి జ్ఞాన కర్మములు అంగములని చెప్పించారు. ఈ భక్తికికూడా ఆరంభ దశలో విగ్రహాపూజ అవశ్యకమేనని పంతులుగారి భావన, శ్రీకృష్ణునిచేత చెప్పించిన ఈ మాటలు అందుకు నిదర్శనము.

"వర్ణతతి జూచి వ్రాసియు బలికి మఱిగు
ణించిననుగాని పాండిత్య మెటులరాదో
మొదట నట్టులు విగ్రహ పూజలేక
ముక్తి సాధనమగు భక్తి పుట్ట దెపుడు".

అయితే భక్తి ప్రపన్నతల పేరిట కర్మ పరిత్యాగాన్ని సంపూర్ణంగా పంతులుగారు సమర్థించలేదు, వారి సాక్షి వ్యాసాలలోని "కాలస్వరూపుడు" లో ఈ విషయాన్ని చాలా తీవ్రంగా విమర్శించే ఉన్నారు. విప్రనారాయణ నాటకంలోకూడా శ్రీనివాసునిచేత ఈ ప్రస్తావన చేయించారు. దివ్యోన్మాద స్థితిలోఉన్న విప్రనారాయణ స్వామిని చూస్తూ శ్రీనివాసుడు అంటాడు,

"విగ్రహారాధనము, వర్ణ విభజనంబు
లింగ భేదంబు నిట్టి శ్రీరంగభక్త
వరున కక్కఱ లేవన్ని పట్ల దేవు
పొడగనెడు నాతనికి భేదబుద్ధి యెట్లు?

ఇట్టి పరమ ప్రసన్నున కెట్టి కర్మ
ములు పనియెలేవు: స్నాన సంధ్యలను మాని
విస్మృతి కొఱకు చెడద్రాగి వీరవైష్ణ
వ ప్రపన్నుల మనుకొంట వట్టి తప్పు,

కర్మ శూన్యత్వము ప్రపత్తిఁ గలుగవచ్చు
గర్మశూన్యతను ప్రపత్తి కలుఁగఁబోదు;

కవిత ధీశక్తి భాగ్యంబు కలుగవచ్చు
గాని సంపదచే బుద్ధి కలుగగలదె?

భక్తి యాత్మలో నిండెడు వఱకు స్మరణ
నృత్యములు తప్ప వటుపైన నేమిలేవు
నీటిలో ముంచబడు కూజ నిండువఱకు
గుడగుడను గాని పిదప కిక్కురను నొక్కొ?"

ఈ విధంగా భక్తినిగూర్చి పానుగంటివారు అక్కడక్కడ పాత్రలచేత చేయించిన వ్యాఖ్యానాలను పరిశీలిస్తుంటే, స్థూలంగా వారు విశిష్టాద్వైత మార్గాన్ని హర్షించినట్లు కనబడుతుంది. అయితే ఒక్కమాట ఇక్కడ స్పష్టం చేయదగి ఉన్నది. పానుగంటివారు మతత్రయ సంప్రదాయ రహస్యాలను క్షుణ్ణంగా అవలోకించినవారు, అయితే శాస్త్ర మార్గంకంటె వారికి రసానుభూతి మార్గమే ఎక్కువ ప్రీతికరమైనది. శాస్త్రపద్ధతి అనుభవానికి దారి చూపించవచ్చు. అంతకమించి దాని ప్రయోజనం లేదు. అనుభవంలోకి వచ్చినప్పుడు ఆ రసానుభూతి అన్ని శాస్త్రమార్గాలకంటె అతీతమైనది, అవిచ్ఛిన్నమైనది అవుతుంది, ఇకొంక రీతిగా చూస్తే, ఈలాంటి అనుభవం సంపాదించుకోవడానికి పూర్వసుకృతి కావాలిగాని కేవల శాస్త్రజ్ఞానం కానేకాదు అందుచేత ఈఅనుభవాన్ని శాస్త్రపద్ధతిగా వ్యాఖ్యానం చెయ్యబూనటం అంత మంచిది, అవసరముకూడా కాదు.

ఈ భావాన్నే విప్రనారాయణ నాటకానికి నాందీ ప్రస్తావనలు వ్రాసియిచ్చిన శ్రీ కూచి నరసింహంగారు సూత్రధారుని చేత చక్కగా చెప్పించారు.

"పూర్వసుకృతంబుచేతను బుట్టు భక్తి
పూర్వదుష్కృతముల నద్ది పొలియుఁ గొంత
యిహ పురాకృత కర్మంబు లేచి నరుని
ద్రిప్పుజుమి జలావర్తస్థ తృణముగతిని."

# జయకావ్యమూ - కొన్ని విశేషాలు

శ్రీ అనుముల వేంకట శేషకవి, శతావధాని

పరిచయము :

పేరు — శ్రీ అనుముల వేంకట శేషకవి, శతావధాని.

జననము — 8-8-1907 - నంద్యాల నివాసము

విద్యార్హతలు : ఇంటర్ గ్రూపు. డి. విద్వాన్, శతావధాని

రచనలు : 1. భారతోపన్యాసాలు, 2. నవోఢ (కావ్యం)
3. చింతాదేవి (కావ్యం) 4. భజగోవిందం
4. వేళాకోళం (నాటిక) 6. అంబాదేవి (నాటకం)
7. సమాజ ఘోష (నాటకం) 8. అనేక పాఠ్య పుస్తకములు

ఉపాధ్యాయ వృత్తి నుండి విరమించి సాహిత్యధర్మ ప్రచారకోపన్యాసములు చేయుచున్నారు. అష్టావధాన శతావధానములు కూడ నిర్వహించిరి.

వీరి భారత పరిశోధనానుభవముల విషయమే యీ వ్యాసము ప్రకటించు చున్నది.

"సాత్యవతేయ విష్ణుపద సంభవమై; విబుధేశ్వరాబ్ధి సం
గత్యుప శోభితంబయి; జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము, నిరంతర సంతత పుణ్య సంపదు
న్నత్యభివృద్ధి సేయు, వినినం, గొనియాడిన, నెల్లవారికిన్.

విష్ణు పాదంనుంచి పుట్టిన గంగ ఎంత పవిత్రమో, సత్యవతీ నందనుడైన వేదవ్యాసులవారి సృష్టినుంచి పుట్టిన మహాభారతం (భారతీయ భారతి) అంత పవిత్రం. ఆ గంగ దేవలోకంనుంచి వచ్చి సముద్రంలో కలుస్తుంది. ఈ గంగ కూడా పండిత శ్రేష్ఠుల సమూహానునే సముద్రంతో సంబంధం కలిగి ఉంటుంది. ఆ గంగలో మునిగితే పుణ్యమూ, పురుషార్థమూ పెరుగుతుంది; ఈ గంగను గురించి విన్నా, పొగడినా అందరికీ ఆ ఫలితం దక్కుతుంది.

గంగానది, స్వర్గ మర్త్య పాతాళాల్లో ప్రవహించేది. స్వర్గంలో మందాకిని; భూలోకంలో భాగీరథి; పాతాళంలో భోగవతి; ముల్లోకాల్లో మూడు పేర్లు, త్రిలోక పావనియైన గంగతో, భారతాన్ని పోల్చటం గమనింపదగింది. 'వ్యాసో నారాయణో హరిః' — అన్నారుగా? విష్ణుమూర్తి అవతారమే వ్యాసులు. ఆయన రచన సామాన్యమా? అందులోనూ ఆయన సత్యవతీ తనయుడట! అందులోనూ చమత్కారమేమంటే — సత్యం తప్ప ఇతరం ఆయన నాలుకకు రాదని ఏ నీళ్లైనా కొన్నాళ్ళకు చెడిపోవచ్చునో ఏమోకాని, ఎన్ని సంవత్సరాలైనా వాసన పట్టనివి గంగా జలాలు. ఆనాటి నుంచీ ఈనాటిదాకా భారతమూ అలాంటిదే. అందుకే, 'వింటే భారతం విను! తింటే గారెలు తిను!' అనేసామెత. నములుతూ ఉంటే గారెలు వదల బుద్ధి పుట్టదు; వింటూంటే భారతమూ అంతే! పూర్వం, శ్రవణమూ, మననమూ, నిధిధ్యాసలూ - అంటే, అంత గౌరవం. 'ధర్మే చ - అర్థే చ - కామే చ - మోక్షే చ, భరతర్షభ! యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్క్వచిత్' అన్నారుగా? ధర్మార్థకామమోక్షాలు నాలుగూ, నాలుగు పురుషార్థాలు. వాటిని గురించి ఇందులో ఏమున్నదో అదే అన్నిటా (అన్ని గ్రంథాల్లోనూ) ఉన్నది ఇందులో ఏది లేదో అదింకెక్కడా (ఏగ్రంథంలోనూ) లేదు. 'What is not in Mahabharata, is not found elsewhere' మహాభారతంలో చెప్పని విషయాలేవీ ఎక్కడా లేవన్నమాట!

ప్రవృత్తి మార్గమూ, నివృత్తి మార్గమూ ఈ రెండు మార్గాలకూ సంబంధించిన అన్ని ధర్మాలూ ఇందులో ఉన్నాయి.

"అందరూ ఒకేసారి మోక్షమార్గం అవలంబించటం మంచిదే! కాని, అది సాధ్యమా? దేశ మంతా ఒక్కసారి సన్యాసం పుచ్చుకుంటే, అకస్మాత్తుగా అందరూ సన్యాసులుగా మారితే - ఏమౌతుంది? చేతిలో ఉన్న పక్షి (ధర్మం) చేయిదాటిపోతుంది. చెట్టుమీది పక్షి (మోక్షం) సులభంగా కైవసం కాదు. అందువల్ల పతనమే! బౌద్ధులూ, జైనులూ, ముసల్మానులూ, క్రైస్తవులూ - ఎల్లవారికీ ఒకే సూత్రం - ఒకేనియమం - విధిస్తారు, అదే పెద్ద పొరపాటు! బలవంతంగా ఎల్లరనూ ఏకం చెయ్యటానికిచేసే ప్రయత్నం లాభం లేనిది" అంటాడు, వివేకానందస్వామి, 'ప్రాక్పశ్చిమాలు' (East and West) అనే గ్రంథంలో. ఉదాహరణకు - 'అహింసా పరమో ధర్మః' - ఎవరూ కాదనటం లేదు. కాని, నీవు గృహస్థువు! నిన్నెవరైనా ఒక చెంప కాయ కొడితే, ఇంకో చెంప చూపుతావా? ప్రతీకారంగా రెండు చెంపలూ వాయిస్తావా? కసి తీర్చుకోక పోవటం పాపమంటుంది మన ధర్మశాస్త్రము. సమయానుకూలంగానూ, సందర్భానుసారంగానూ చతురోపాయాల నుప యోగించి ఇహంలో సుఖించటమే ధార్మికునివిధి. ఆ తరువాతనే మోక్షం.

ధర్మ మంటే ఏమి? ఇహసుఖానికో, పరసుఖానికో చేసే ప్రయత్నం అది కర్మానుసారం. మోక్ష మంటేనో? ఇహసుఖాలైనా, పరసుఖాలైనా ప్రకృతి శాసనాన్ని ఉల్లంఘించటం సాధ్యంకాదు. ఒకటి ఇనుప సంకెలా, ఇంకోటి బంగారు సంకెలా. రెండూ మరణానికిలొంగినవే. శాశ్వతం కావు ఈ రెండింటినీ వదలమంటేనే, శరీరబంధా లన్నిటినీ త్రెంచుకుంటేనే, కలిగేది మోక్షం.

ఈ మోక్షమనేది ఒక్క మన భారత దేశంలోనే తప్ప, ఇంకెక్కడా లేదు. ముక్తాత్ములు ఈదేశంలో తప్ప ఇంకెక్కడా ఇంకవరకూ లేరు. మున్ముందు బయలుదేరుతారేమో? మంచిదేగా?

ఆదికాలంనుంచీ మనదేశంలో ధర్మమూ, మోక్షమూ - అమడ పిల్లలు కలిసిమెలసిఉండేవి. భీష్ముడూ, యుధిష్ఠిరుడూ, అర్జునుడూ, విదురుడూ, కర్ణుడూ - మొదలైన ధర్మోపాసకులవెంబడే - వేదవ్యాసులూ, జనక మహా రాజూ, వసిష్ఠ విశ్వామిత్రాదులూ మోక్షకాములుండేవారు. ఐతే, బౌద్ధ మత ప్రవేశంతో అందరూ ధర్మాన్ని వదలి మోక్షాన్ని కోరసాగినారు

'ధర్మం శరణం గచ్ఛామి' - ఉత్త నోటిమాటే! అందరూ సన్యాసులే కావటం మూలాన -అది కేవలం మోక్ష ధర్మమే! గృహస్థుల కుపయోగించేది కాదు. వైదికమతం - 'స్వధర్మం నిర్వహించు' అంటుంది. ఆ స్వధర్మం కర్మమూలమని, చక్కగా ప్రచారం చేస్తుంది, 'స్వధర్మే నిధనం శ్రేయః' - అనే గీతావాక్యం మన కంతా తెలిసిందే!

ప్రతివ్యక్తిలోనూ ఏదో ఒక శక్తి - ఒక ప్రత్యేకత - అదంతా పూర్వకృత సంచితం. క్రియా త్యాగం చేసి ప్రశాంతంగా ఎవరుండగలుగుతున్నారో, వారి యెడల ఆ శక్తి బాగా పని చేస్తుంది. అందాకా, పుణ్యమూ పాపమూ - అనే రెండు రకాల కర్మల ఫలితాలను సుఖమూ, దుఃఖమూ- అనే పేరుతో అనుభవించక తప్పదు. మఱి, తప్పనప్పుడు పాప కర్మలు మాని, పుణ్య కర్మలు మాత్రమే చేస్తూండటం మేలు కాదూ? అదెలా సాధ్యం? అంటే, ముందుగా, 'ఎవరి కేది మంచి?' - అని తెలుసుకోవలసి ఉంటుంది. ముముక్షువు కొకటి మంచి, జిజ్ఞాసువుకింకొకటి మంచి, ధర్మావలంబికి వేఱొకటి మంచి - ఈ మంచిలో, ఏమంచి ఎవరి కనుసరణీయమో, వివరించటానికే, భగవద్గీత బయలుదేరింది.

> అద్వేష్టా సర్వ భూతానాం, మైత్రః కరుణ ఏవ చ
> నిర్మమో, నిరహంకారః, సమదుఃఖసుఖః, క్షమీ (12-3)

ద్వేషం లేనివాడూ, అన్ని ప్రాణులయందూ మైత్రినీ, కరుణనూ చూపే వాడూ, అహంకారమమకారాలు లేనివాడూ, సుఖ దుఃఖాలను సమానంగా భావించే వాడూ, క్షమావంతుడూ - ఈ మాటలన్నీ మనకు కాదు: ముముక్షువుకు మాత్రమే!

> క్లైబ్యం మాస్మగమః, పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే,
> క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ, పరంతప! (2-3)

అర్జునా! నపుంసకుడివి (పౌరుషహీనుడివి) కాబోకు నీకది తగదోయ్! నీచమైన పిఱికితనాన్ని నిరాకరించు! ఓ శత్రుసంహారకా! లే - ఇలాంటి మాటలన్నీ మనవంటి ధర్మావలంబులైన గృహస్థులకు,

ఏ వ్యాపారమైనా, వ్యవహారమైనా - సదసన్మిశ్రితం కానిది లేదు. ఏ పని చేసినా ఇంతో అంతో పాపం తప్పదు. ఐతేమాత్ర మేమి? ఏమీ చెయ్యక సోమరిగా తిరగటం కంటే, ఏదో ఒకటి చెయ్యటం మేలు - వస్తువులు పడిఉండటం కంటే, ఏదైనా కొంచెం ఆహారం మంచిది కాదా? అందుకే, పంచసూన దోష నివృత్త్యర్థం — మన ప్రాచీనులు వైశ్వదేవం చేసేవారు - పంచసూనాలంటే, ధాన్యం దంచటమూ, విసరటమూ, చెరగటమూ, రుబ్బడమూ, వండటమూ - అనే అయిదు పనులు, ఆయా పనుల్లో, ఎన్నో పురుగులు, మనకంటికి కానరానివి, పడి చావటం మామూలే, ఆపాపం పోగొట్టుకోవటానికే 'వైశ్వ దేవం', అనే యజ్ఞం, లేదా, అగ్నికార్యం,

మనలో అనేకులు భగవన్నామసంకీర్తన చేస్తున్నారు. ప్రణవోపాసన చేస్తున్నారు. భక్తినీ, ఆనందాన్ని పరవశించి ప్రదర్శించే వారున్నారు. 'అంతా నీవయే స్వామీ!' అంటూ అలవి అలవి పలికే వారున్నారు. కాని, వారేమైన మారినారా? వారి ముఖాల్లో తేజస్సు ప్రతిఫలిస్తూందా? మెట్టుకు మెట్టూ వారేమైనా ఎక్కిపోగలుగుతున్నారా? ఏమీ లేదే? ఎందువల్ల? మనోవాక్కాయకర్మలు ఏకం కావటం లేదన్నమాట! ఎవరి ధ్యానం నిజమైన ధ్యానం? ఏది ఫలకారి? ఎవరు సర్వసంగ పరిత్యాగంచేసి సర్వేశ్వరుని యిష్టానికి తన్నుతాను సమర్పించుకో గల్గుతున్నారు? అనివార్యంగా, అన్ని కాలాల్లో తైలధారవతుగా, పిడుగు పడునట్లుగా భగవన్నామ సంకీర్తన చేయగలుగుతున్నారు? చిత్తశుద్ధి కలవావారు మాత్రమేకదా? ఆ చిత్తశుద్ధి ఎలా కలుగుతుంది? సత్క్రియాచరణవల్ల మాత్రమే అట్టివారే ధార్మికులన్న మాట!

1. శుద్ధ సాత్విక గుణం ప్రబలంగాఉంటే, నిరంతర ధ్యానమగ్నుడై నిష్క్రియుడై మానవుడు కడతేర గలుగుతాడు

2. రజోగుణం ప్రబలంగాఉంటే, మంచీ, చెడ్డా-రెండూ చేస్తుంటాడు.

3. తమోగుణం ప్రబలంగాఉంటేనో? మందుడై, మొద్దుపోరి, ఏమీ చెయ్యడు. బాహ్యాచర్యలను బట్టి ఎవరెవరో, తేల్చటం మనతరం కాదు, ఎవరి మనస్సును వారే ప్రశ్నించుకోవలసి ఉంటుంది అలా ప్రశ్నించుకుంటేనే గాని, ఈ సంగతి తేలదు. పండునుబట్టి చెట్టు,-ఫలాన్నిబట్టి మానవుడి ఉన్నతి,

వేపచెట్టు వేపచేల్తే, మంచిగంధపుచెట్టు మంచిగ ధపుచెట్టే! 'జాలియ మరదంతే దుర్జనరూ'— (తుమ్మచెట్టుతో సమానులు దుర్జనులు) అంటూ పాట పాడి నాడు, పురందరదాసు, తుమ్మచెట్టు, అలసిసొలసి తన్నాశ్రయించిన వారికి నీడ నిస్తుందా? పండ్లూ కాయలూ పనికి వచ్చేవి దానికున్నాయా? ఉండేవి గ్రుచ్చుకొని బాధపెట్టే ముండ్లు మాత్రమే కదా?

'గొడ్డుటావు పిదుక కుండ గొంపోయిన
పాల నీదు, పండ్లు రాలదన్ను;
లోభివాని నడుగ లాభంబు లేదయా!'

—అంటాడు వేమనయోగి.

సత్త్వ సంపన్నుల్లో ఆ పరమశాంతీ, ఆ నిష్క్రియతా, ఆ మహిమలూ మహామనశ్శక్తులన్నిటినీ ఒక మధ్యస్థానానికి లాగి ఉంచుకో గలిగినందున-కలిగి వాయి. అలాంటి మహాత్ములు మనవలె చేతులతో, కాళ్ళతో ఏ పనీ చేయవల సిన అవసరములేదు. ఇచ్ఛామాత్రంతోనే అన్ని పనులూ అప్పటి కప్పుడే జరిగిపోతాయి. వారు ఇంటింటికీ వెళ్ళి 'నన్ను పూజించండి'- అని అడుక్కో వలసిన అవస్థ పట్టదు. అంతా వారినే వెదుక్కుంటూ వెళ్ళుతారు. బూటకమైన వేష భాషలతో, జనాన్ని మోసగించే వారేమి బోధిస్తారు? ఇట్టి వారిని నమ్ము కుంటే ఎవరు తరిస్తారు?

ఉద్దేశం మంచిదైనా, యుక్త సాధనాలు చూపక బౌద్ధ మతాదులు దేశాన్ని క్షీణదశకు తీసికొని వచ్చినప్పుడు. వేదాలు చెప్పిన సాధనమే సరి యైనదని ఘంటాపథంగా ఉపదేశించటమే, మహాభారతం చేసిన పని. ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సిద్ధికి దారిచూపి తగిన నియమాలు విధించేది నిజానికొక్క వేదమతమే?

ధర్మార్థ కామ మోక్షాలకు పరస్పర విరోధం సంభవించకుండా, సనా తన వైదికమతాన్ని పునః ప్రతిష్ఠ చేసినవారు శ్రీమతాచార్యులు, ఈ మతా చార్యులందరికీ మార్గదర్శకులై, ఆ గురుపరంపర కాదిపునాది నెలకొల్పి, సన్న్యాసాన్ని నియమబద్ధంగా అమలు పరచింది, వేదవ్యాసులవారు. వారు మలచిన జ్ఞానజ్యోతే మహాభారతం. కురుక్షేత్రానికి సమీపంలో వ్యాసస్థలి, ఇప్పటికీ ప్రసిద్ధమే.

"ఏ సరస్వతీ నదీ తీరాన ఋషులంతా వేదమంత్రాలు వల్లిస్తూ కూర్చొనేవారో, ఆ నది ఎండిపోయింది. ఆ నీళ్ళే పడమరగా ప్రవహించి-యమునగా వెలసింది. ఆసరస్వతి, మానవుల జ్ఞాపకార్థం, విద్యాధిదేవతగా పేరుకెక్కి విలసిల్లింది"—అంటాడు, కె. యం. మున్షీజీ.

ఆదికవి వాల్మీకి ఉపనిషత్తు అన్నిటినీ ఆకళించుకొని, చతుర్వింశతి తత్వాత్మికమైన గాయత్రి మహామంత్రాన్ని మేళవించి, 24,000 శ్లోకాలతో రామాయణ రచన సాగిస్తే, ఆనందమూ, రతణా అబ్బినట్లు త్రేతాయుగంలో జనం సంతోషించింది. ద్వాపరాంతంలో వ్యాసులవారిదీ అదే పరిస్థితి, వేదాలు విభజించినా, పురాణాలు కొనసాగించినా, కనులఎదుట జరిగిన చరిత్రను చిత్రించకుండా ఉండలేక పోయినాడు. వాల్మీకికి శ్రీ రామ సందర్శన మెలాంటిదో, వ్యాసులకు శ్రీ కృష్ణ సందర్శన మలాంటిది. కేవలం ఒక కృష్ణుడేనా? నరనారాయణులు జంటకృష్ణులైనారు. యాదవ కృష్ణుడూ. పాండవకృష్ణుడూ: తాను ద్వైపాయన కృష్ణుడెందుకైత పొంగినాడో? 24 కేశవనామాలనే జోడించినాడు, మహాభారతంలో. ఉపాఖ్యానాలన్నిటినీ తొలగిస్తే, భారతంకూడా 24 వేల గ్రంథమే!

"చతుర్వింశతి సాహస్రం చక్రే భారత సంజ్ఞితం
ఉపాఖ్యానై ర్వినా తావద్ భారతం ప్రోచ్యతే బుధైః"

రామాయణంలో సుందరకాండకూ, భారతంలో భగవద్గీతకూ, కలిగిన మహత్తర గౌరవం, లోకవిదితమే కదా?

24 గుణాలు ప్రకృతివి జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచకాలు పదీ; పంచభూతాలు, పంచ తన్మాత్రలూ, పదీ; అంతఃకరణ చతుష్టయం, నాలుగు; వెరసి 24. ఇరవై అయిదో తత్వం- పరమాత్మ.

'మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరం'- భగవంతుని పెత్తనంతో ప్రకృతి, సమస్త చరాచర ప్రపంచాన్ని ప్రసవిస్తుంది కదా? కాబట్టి వాల్మీకులదీ, వ్యాసులదీ, ఒకే దృష్టి. ఒకే మతం, ఒకే మార్గం, ఒకే దీక్ష, వారికి స్వార్థంకానీ, లాభాపేక్ష కానీ లేదుకదా? లోకశ్రేయమే వారి లక్ష్యం రామాయణం- 'వేదః ప్రాచేతసాదాసీత్'- అనిపించుకున్నట్లే, భారతం పంచమ వేదమనిపించుకుంది.

'కేశవా, నారాయణా, మాధవా'– ఈ 24 నామాలనూ పరిశీలించండి! ఎక్కడా రామనామం కానరాదే? కారణం? రామనామానికో ప్రత్యేకత, నారాయణంలోని–రా, నమశ్శివాయలోని-మ, రెండూ కలిపి చేసినగారడీ, తారకం. ఇది నామరూపాల కలితం.మాయామానుష విగ్రహుడైన రాముడు తాను దేవుడినే కానని చెప్పుకుంటే, లీలామానుష విగ్రహుడైన శ్రీకృష్ణుడు తానే దేవుడినని చాటుకున్నాడు. అక్కడ, ప్రకృతి వేఱూ, పురుషుడువేఱూ ఇక్కడ తానే ప్రకృతీ, తానే పురుషుడూ– అంటారు పెద్దలు.

రామాయణకాలం 26వ మహాయుగమనీ, భారతకాలం ఇప్పటి మన 28వ మహాయుగమనీ, మామూలుగా పండితు లంటుంటారు. కాని,

"త్రేతా ద్వాపరసంధి నుద్ధత మదాంధీభూత విద్వేషి జీ
మూతోగ్రశ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్; దీర్ఘని
ర్ఘాతక్రూర కుఠారలూన నిఖలక్షత్రోరుకాంతారుడై."

"త్రేతా ద్వాపరయోస్సంధౌ– రామః ప్రహరతాం వరః
అసకృత్పార్థివం క్షత్రం– జఘానామర్ష చోదితః."

—ఆది. 2 అ.

'త్రేతా ద్వాపరసంధి'- ఈ త్రేతా యుగమే కాని, 26 వ మహా యుగంలోది కాదని తేలుతుంది. పరశురాముడు 21 సార్లు, క్షత్రియరాజుల అడఁకని గండ్రగొడ్డలితో నరికి, ఆరక్తంతో నింపిన మడుగుకే శమంతక పంచక మని చెప్పటానికీ, భారతంలో ఈ ప్రశంస వచ్చింది, పరశురాముడు, భారత కాలంలోనూ, రామాయణ కాలంలోనూ ఉండిన మహాపురుషుల్లో ఒకడు కదా? రాజు లందరినీ చంపిన ఎంతకాలానికో, శ్రీరామునితో భేటి కనుక, ఈ త్రేతలోనే రామాయణం జరిగిందని తెలుస్తుంది.

భీష్ముల వారికీ, ద్రోణులవారికీ, కర్ణుడికీ, పరశురాముడు గురువు, శ్రీరామునికీ, బలరామ కృష్ణులకూ, శక్తిప్రదాత- ఈయన తల్లి రేణుక, ప్రసేనజిత్తు కూతురు. క్షత్రియ కాంత, తండ్రి జమదగ్ని; ఆ జమదగ్ని తల్లి సత్యవతి కూడా క్షత్రియకాంతే! గాధిరాజు కూతురు, అంటే, విశ్వామిత్రుని

అక్కగారు, ఋచీకుడి అర్ధాంగి కాళ్ళండలో కాలితే, సహింపలేక, సూర్యుని మీద కోపగించి బాణం వేయబోతాడు. సూర్యుడు భయపడి బ్రాహ్మణ రూపంలోవచ్చి గొడుగూ చెప్పులూ సమర్పించిపోతాడు. ఏమి తపస్సు? ఎంత మహిమ? ఆ కాలంలో ధారాళంగా కులాంతర వివాహాలు జరిగేవని తోస్తుంది. అగస్త్యపత్ని లోపాముద్రకూడా క్షత్రియకాంతయేకదా? శాపమో వరమో, ఏదో ఒక కారణంగా ఇలాంటి వివాహాలు కోకొల్లలు. ధృతరాష్ట్రుడు వైశ్యకాంతను పెండ్లాడటం లోకవిశ్రుతమే, యుయుత్సు డామె కొడుకు, పాండవపక్షాన చేరుతాడు, యుద్ధానికి ముందు.

హనుమంతుడూ, జాంబవంతుడూ, ఈ రెండు కాలాల్లోనూ ఉన్నారు. సౌగంధికాపహరణ సమయంలో భీముడికి హనుమద్దర్శనమౌతుంది. జాంబవంతుని కుమార్తె జాంబవతి శ్రీకృష్ణుని వివాహ మాడుతుంది.

ఇక బలిచక్రవర్తి హిరణ్యకశిపుని మునిమనుమడూ, ప్రహ్లాదుని మనుమడూ, విరోచనుని కొడుకూ, వామనావతారానికి కారణమైనవాడు. రావణుడితణ్ణి దర్శించినాడు. ఇతని కూతురు వజ్రజ్వాల, కుంభకర్ణుని భార్య. కొడుకు బాణాసురుడు; తన కుమార్తె ఉషను, శ్రీకృష్ణుని మనుమడైన అనిరుద్ధునికిచ్చి పెండ్లి చేసినవాడు. అంటే బలిచక్రవర్తి త్రేతాయుగమూ, కూతురి త్రేతాయుగమూ, కొడుకు ద్వాపరయుగమూ, ఎలా సమన్వయిస్తారో, ఈ యుగభేదాలను?

ధర్మరాజు చేసిన రాజసూయానికిగాను, సహదేవుడు దక్షిణ దిగ్విజయానికి వెళ్ళి, విభీషణుని దగ్గరనుంచీ ఘటోత్కచుని ద్వారా కప్పం తెప్పించినాడట! కిష్కింధనుంచి సుగ్రీవుడుకూడా గుహునిద్వారా కప్పం చెల్లించినాడట!

మయుడు ఖాండవదహన కాలంలో అర్జునుడు తన ప్రాణాలు రక్షించినందులకై కృతజ్ఞతా సూచకంగా మయసభ నిర్మించి ధర్మరాజున కిచ్చినాడు. మయుని కుమార్తె మండోదరి, రావణుని పట్టపురాణి. కాబట్టి, రామాయణ, మహాభారత కాలాల్లో ఇతడూ ఉన్నాడు.

"అశ్వత్థామ బలి ర్వ్యాసః, హనుమాంశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః"
—అన్నారు అయితే, తక్కినవారి మాటో?

రామాయణానికీ, భారతానికీ ఇంకోరకమైన లంకెకూడా ఉంది. రామావతారంలో ఏఏ పనులు జరిగినాయో, తత్ఫలితాలు కృష్ణావతార కాలంలో లభిస్తాయి. శ్రీరామ పత్నిని హరించిన రావణుడే కదా, ఈ జన్మలో శిశుపాలుడై పుడతాడు? ఇతడు పెండ్లాడటానికి సిద్ధమైన రుక్మిణిని, ముందుగానే కృష్ణుడు హరిస్తాడు, రామచంద్రమూర్తిని ఆలింగనం చేసుకో దలచి ఆ కోరిక తీరని ఋషులే, గోపికలై కోరిక తీర్చుకుంటారు. రాముని చేత చెట్టు చాటునుంచి బాణపు దెబ్బతిన్న వాలియే, బోయవాడై పుట్టి కృష్ణునిమీద కసి తీర్చుకుంటాడు. సీతాదేవిని నిందలపాలు చేసిన రజకుడే, మళ్ళీ రజకుడై పుట్టి కంసుని సేవిస్తుంటే, మధురానగర ప్రవేశకాలంలో, తొలిముద్దగా- అకారణంగా కృష్ణుడు చంపుతాడు.

ఉపనిషత్పరంగా రామాయణమూ, గీతా పరంగా భారతమూ సమర్థిస్తే, బ్రహ్మమంత్ర పరంగా భాగవతం; ఇలా ప్రస్థానత్రయం వ్యాఖ్యానింప బడిందా? అనిపిస్తుంది. సనాతన ధర్మప్రచారానికి ఇంతకంటె యోగ్య గ్రంథాలున్నాయా?

జయకావ్యం భారతమా? భాగవతమా? రెండూనా? అనే ప్రశ్నలకు ఆస్కారం లేకపోలేదు, "నారాయణం నమస్కృత్య" అనే శ్లోకానికి తెలుగు పద్యం భాగవతంలో దొరుకతుంది.

"నారాయణునకు నరునకు
భారతికిని మ్రొక్కి; వ్యాసు పదములకు నమ
స్కారము చేసి; పఠింతు ను
దారగ్రంథంబు, దళితతను బంధంబున్."

శౌనకాది మహర్షులు నైమిశారణ్యంలో 12 ఏండ్ల సత్రయాగంచేస్తుంటారు. శౌనకుడు, కులపతి, ఏ విద్వాంసుడైన బ్రాహ్మణుడు, పదివేలమంది జిజ్ఞాసువులకు అన్నదానం ద్వారా, భరణపోషణలు నిర్వహిస్తాడో, అతడు కులపతి.

అనేక వ్యక్తుల సహాయంతో, అనేకులకు జ్ఞానమూ, సదాచారమూ, శిక్షణనిస్తూ అన్నవస్త్రాలు పంచుతూ, తృప్తి పరచేది, సత్రయాగం,

అంటే, ఇదే ఒక కళాశాల, 12 ఏండ్ల చదువు సాగించే విద్యార్థులంతా ఇక్కడ ఉంటారు ఈ గురుకులానికి ఋషులూ, రాజర్షులూ, మహర్షులూ, బ్రహ్మర్షులూ-వచ్చి అప్పుడప్పుడూ ఆదేశాలిచ్చి వెళ్ళుతుంటారు రాజులే ఖర్చులన్నీ భరిస్తారు, భక్తిశ్రద్ధలూ, వినయ విధేయతలూ-విద్యార్థి లక్షణాలు. ఈ కాలానికీ ఆ కాలానికి చదువుల్లో ఎంత తారతమ్యమో? గమనించండి!

ఇక్కడికి కుశలవక్త, ఉగ్రశ్రవసూతి దయచేస్తాడు, శుద్ధాంతఃకరణులైన మునులంతా సభతీర్చి కూర్చున్నారు. అడిగినారు కదా-

"ఏయది హృద్యం? మపూర్వం
బేయది? యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బై యుండు? అఘనిబర్హణ
మేయది? అక్కథయ వినగ నిష్టము మాకున్."

హృద్యం-కథ మనోహరంగా, హృదయాన్ని కదిలించేదిగా ఉండాలి; అపూర్వం ఇంతకుముందు ఇలాంటి కథ ఉండకూడదు; జ్ఞానం పూర్తిగా లభించేదీ, పాపాలు పోగొట్టేది; ఇన్ని లక్షణాలున్న కథే మాకిష్టం - అంటారు, ఋషులు-భారతానికి గుణాలన్నీ ఉన్నాయని సూచన.

సూతుడు క్రమంగా, జనమేజయుని సత్రయాగాన్ని ప్రశంసిస్తూ, కథారంభం చేస్తాడు. జనమేజయుడు, పరీక్షిత్తు కొడుకూ, అభిమన్యుని మనుమడూ అర్జునుని మునిమనుమడూ, అంటే, పాండవవంశ వివర్ధను డన్నమాట!- ఎత్తుకోంగానే, 'సరమ' అనే దేవశునీ, దాని కొడుకు- 'సారమేయుడూ'-క్రీడార్థము భూలోకానికి వచ్చి, యజ్ఞశాలలో ప్రవేశిస్తారు- అంటాడు.

మనకు వెంటనే, దేవలోకంలో కుక్కలుకూడా ఉంటాయా? ఆ లోకం ఎక్కడుంటుంది? ఎలా ఉంటుంది? యజ్ఞానికీ కుక్కకూ సంబంధం ఏమైనా ఉంటుందా భారత కథ కుక్కతో మొదలై- కుక్కతోనే ముగుస్తుందా? అవును! స్వర్గారోహణ పర్వంలో కాదు- మహాప్రస్థానిక పర్వంలో - దేవేంద్రుడు ధర్మరాజు కెదురుపడి దివ్యరథ మెక్కమంటే- తనవెంట వచ్చిన

కుక్కనుకూడా రథమెక్కిస్తేకాని, తాను రానంటాడు. 'అమర్త్యభావము కుక్కకే మాడ్కిగలుగు?'.అని కూడా ప్రశ్నిస్తాడు, సురపతి, కుక్కకోసం నాకలోకసుఖాన్నికూడా అత్యపెట్టని ధర్మరాజు భూతదయకు సంతోషించి, ఆ రూపాన్ని వదలి యముడు ప్రత్యక్షమౌతాడు.

"విను! భక్తియుక్త మిదియని
శునకముఁ జేపట్టి నీవు, సురపతి కొనివ
చ్చిన యరద మెక్కనొల్లవ?
అనఘా! సరి నీకు దివమునందును గలరే?"

అనిపించుకొని, ధర్మరాజు, మేనితో స్వర్గానికి తరలుతాడు.

కుక్కకథ ఉత్తర రామాయణంలోనూ ఉంది.

"ఆలించుచున్న నచటికిఁ
గౌలేయక మొకటి వచ్చి! కడువడి నెత్తిం
గీలాలధార దొరఁగన్:
దూలుచు మొఱసేయ; లక్ష్మణుడు కని కరుణన్."

—ఉ. రా.

లక్ష్మణుడు కొలువుకూటం బయట నిలిచి, ప్రజలతో మాట్లాడుతూ వారి మాటలు వినే సమయంలో, ఈ కుక్క నెత్తిపగిలి నెత్తురు కారుతుంటే, తూలుతూవచ్చి- రామునితో మొఱపెట్టుకోవలెనని లక్ష్మణునికి చెబుతుంది. రాముడు విచారించి న్యాయం చేకూరుస్తాడు

దత్తాత్రేయుల వారివెంటా వేదాలే 4 కుక్కలై తిరుగుతా యంటారు. కాలభైరవ వాహనం కుక్క.

వైశ్వదేవం చేసేవారు విధిగా-శ్వానబలీ, కాకబలీ వేస్తారు.

భూత బలివల్ల- అంటే పశుపక్ష్యాదులను తృప్తి పఱచటంవల్ల కొన్ని కోరికలు నెఱవేరుతాయి.

ఇక్కడ్ఙ కథలో జనమేజయుని తమ్ములు ముగ్గురూ, కుక్కపిల్లను కొట్టి పంపుతారు. హర్ష విషాదాలను అమితంగా ప్రదర్శించే స్వభావం కుక్కది,

కుక్కపిల్ల పెద్దగా ఏడుస్తూ, తల్లి దగ్గఱకు వస్తుంది. తల్లి కారణం అడిగి తెలుసుకొని, కోపంతో నేరుగా రాజును సమీపించి;

"క్షితినాథ! కడు నకరుణా
న్వితులై నీతమ్ము లతివివేక విదూరుల్
మతిఁ దలపక; నా పుత్రకు
నతి బాలకు, ననపరాధు నడచిరి వెలుచన్."

"తగునిది తగదని యెదలో
వగవక; సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగి జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్."

అని చెప్పి, బెదరించి, శపించి మాయమైపోతుంది, జనమేజయుడు విస్మితుడౌతాడు, దేవతలవలె కుక్కగూడా అదృశ్యం కావటం గమనింప దగింది. తన సత్రయాగాన్ని ముగించుకొని, రాజు హస్తినాపురం చేరుతాడు. కాని, కుక్కభయం బాగా మనసులో పాతుకొని పోయింది. ఏదో భయం, వ్యాధి కారణంగా పరిణమించే సూచనలు కానరాసాగినాయి కాబోలు! శాంతిక్రియలు చేయించగల మంచి పురోహితునికై అన్వేషణ సాగించినాడు. అనేక ముని జనాశ్రమాలు తిరిగి జనమేజయుడు శ్రుతశ్రవసుడనే ముని కొడుకు, సోమశ్రవసుని పురోహితునిగా అర్థించి, తెచ్చుకుంటాడు శాంతి పౌష్టికాలు సాగిస్తాడు.

"గురుకులమునందు గురులకుఁ
బరిచర్య లొనర్చి తా నపరిమిత నిష్ఠా
పరుడై : జ్ఞానము వడసెను
గురుదయః నణిమాదికాష్టగుణములతోడన్."

అంటూ తరువాత ఉదంకుని కథ ఆరంభమౌతుంది. ఏది నేర్చుకుంటే ఇంకేమీ నేర్చుకో నక్కఱలేదో-అదీ విద్య, అలాంటి తత్త్వజ్ఞానాన్ని సాధించి వాడు పైల శిష్యుడైన ఉదంకుడు. అణిమాది అష్టసిద్ధులూ అబ్బినాయి, గురు శుశ్రూషాఫలం అట్టిది.

'తత్ – త్వం' – అనే రెండక్షరాల కూడిన తత్వం. తత్ – అది, అంటే ఆ పరబ్రహ్మం; 'త్వం' – నీవు. నీవే పరబ్రహ్మవు – అనే బోధే తత్త్వం - ఆ పరబ్రహ్మే ప్రపంచం కూడా - కాబట్టి నీకూ ప్రపంచానికి భేదం లేదు. నీవు పిండాండమూ, జగత్తు బ్రహ్మాండమూ. పిండాండంలో ఉండేదే బ్రహ్మాండంలో; బ్రహ్మాండంలో ఉండేదే పిండాండంలో, నీవు ప్రపంచంలో ఉన్నావు; ప్రపంచం నీలో ఉంది, ప్రపంచమంతా ఒక ఎత్తూ, నీ వొక ఎత్తూ. ఈ రెండూ వేఱు వేఱు—అనుకోవటమే అజ్ఞానం. నిన్ను నీవు మరచి ప్రపంచం కోసం పరుగులు తీస్తే, అజ్ఞానం మొసలియై నిన్ను మ్రింగటానికి తయారౌతుంది. దాని జోలికిపోతే, దుఃఖాలపాలౌతావు. దుఃఖాలే బంధకారణాలు వాటిని మొదలంట తెగ నఱకు! – ఇలా బోధించి ఉద్ధరించేవాడే గురువు అంటాడు విద్యారణ్య స్వామి, తన పంచదశిలో.

విద్యాభ్యాసానంతరం గురుదక్షిణ పుచ్చుకొమ్మని ఉదంకుడు కోరితే, గురువు నిరాకరించి, గురుపత్ని నడగ మంటాడు. అప్పుడు ఉదంకుని, మహారాణి కుండలాలు తెమ్మంటుంది గురుపత్ని– సరేనని ప్రయాణం సాగిస్తాడు. పౌష్యమహారాజును చూచి, దీవించి, కోరిక తెలుపుతాడు. పాత్రమెరిగి దానం కదా? రాజు, అంతఃపురానికి వెళ్ళి తెచ్చుకోమంటాడు.

ఆ కుండలాలే గురుపత్ని ఎందుకుకోరింది? అనే సంగతి కథలో లేదు. వాటి మహిమచేతనే నేమో? రాణి పతివ్రత – కంటికి కానరాదు. "త్రిభువన పావనుడవైన నిన్ను అశుచివనలేను. ఆ దేవి పతివ్రత కనుక అశుచులకు కానరాదు." – అంటాడు రాజు, ఉదంకుడు దారిలో జరిగిన సంఘటన జ్ఞాపకం చేసుకుంటాడు. ఎందుకైన మంచిదని, ఆచమనం చేస్తాడు. ఆమె కనబడుతుంది. ఆచమన ప్రశంసం, ఇక్కడ గమనించదగింది.

రాజు అనంతరం భోంచేసి వెళ్ళమంటాడు కుండలాలు భద్రపఱచుకొని, భోజనానికి కూర్చున్న ఉదంకునికి, అన్నంలో ఒక వెంట్రుక వస్తుంది. కేశదుష్టమైన అన్నం పెట్టిస్తావా? అంధుడవై శాపఫలాన్ని అనుభవించు! – రాజు కూడా ప్రతిశాప మిస్తాడు. అనపత్యుడవు కమ్ము - అని. తర్వాత ఇద్దరు శాపా లుపసంహ రించుకుందా మనుకుంటారు. కాని, రాజు తనకది అసాధ్యమంటాడు.

" నిండు మనంబు నవ్యనవనీత సమానము; పల్కు-దారుణా
ఖండల శస్త్రతుల్యము; జగన్నుత! విప్రులయందు నిక్కమీ
రెండును; రాజులందు విపరీతము; కావున, విప్రుడోపు; నో
పం డతిశాంతుడయ్యు నరపాలుడు శాపము గ్రమ్మరింపగన్."

మనసు మెత్తనా మాట కఠినమూ - బ్రాహ్మణ లక్షణం. తద్విపరీతం రాజ లక్షణం. ఈ పద్యాన్నే మచ్చుతునకగా గ్రహించి, 200 ఏండ్ల తరువాత, నెల్లూరు నేలిన మనుమసిద్ధి మహారాజు, భారతరచన కొనసాగించటానికి తగిన కవిగా తిక్కనను, ఎన్నుకుంటాడట! పై పద్యానికి వన్నె పెడతాననీ, వాసన కల్పిస్తాననీ, అన్నట్టుగానే, తిక్కన తన రచనలో ఈ కథకు మెఱుగులు దిద్దుతాడు. ఉదంకుని కథను ఆయన ఇంకో రకంగా చిత్రిస్తాడు.

ఉదంకుడు, గౌతమ శిష్యుడు; ఎన్నాళ్ళకూ ఏమీచెప్పడు ఒక నాడు కట్టెల మోపు తెచ్చి క్రింద పడవేస్తుంటే, జడ ఒకటి తెల్లబడి ఊడివస్తుంది ఘోరువ ఏడుస్తాడు, తన వయః పరిపాకం తప్పినందుకు, గురుపుత్రిక ఆ కన్నీటిని చేతబట్టి, వేడికి తట్టుకో లేక క్రింద విడిస్తే, భూమిదద్దరిల్లుతుంది. గురువు చేరదీసి అడిగితే - ఉదంకుడు; "శిష్యులందఱపైఁ గల కరుణ మీకుఁ బెద్దకాలమేని, మునివరేణ్య! నా వలన లేదా? దాని కుమ్మలింపకెట్టు లుండవచ్చు?" — అంటాడు. అప్పుడు దయకలుగుతుంది, గురువుకు.

"ఎల ప్రాయమిచ్చితిని నీ
కలఘుమతీ! యిచ్చెదను మదాత్మజ నుల్లం
బలరగఁ బెండిలి గమ్మని
పలికి, మఱియు నా తపస్వి పతి యిట్లనియెన్"

"నీ తేజంబు సహింపగ
నీ తామరసాక్షి దక్క నెవ్వరికిఁ దప
స్విఖా! శక్యముగా దిది;
చేతోగతిఁ జూచి తగవు సిద్ధించుటకై"

"అధర్మంబుగాకుండు నట్లుగా వరంబిచ్చితి" — అంటాడు. అనుగ్రహించి ఆ కన్యకారత్నానికి సైతం తనువు మారుస్తాడు. జన్మాంతరాన్ని

పొందిన వారై, ఇరువురూ వివాహమాడి, పరస్పరం అనుకూలంగా గృహాస్థాశ్రమంలో ప్రవేశిస్తారు. గురుదక్షిణ అడగమంటాడు శిష్యుడు. 'నీవు పరాయి వాడవా?' అంటాడు గురువు.

"అంత నిలువక ముని పత్నికతడు భక్తి
నెఱిఁగి; 'తల్లి! మీరానతి యిండు! మీకు
వలయు నట్టి పదార్థ మవశ్యమును, స
మాహరింతు; నే,' ననుటయు; నయ్యహల్య."

బలవంత పెట్టి అడిగితే ఎట్టకేలకు, "మిత్రసహాఖ్యు దేవి కుండలములు తెమ్ము. తమ్ముడా!" - అని సెలవిస్తుంది. సంతోషించి ఉదంకుడు బయలుదేరుతాడు మరునాడు గౌతముడా శిష్యుని జాడ తెలుసుకొని, అహల్యతో

"ఆ సౌదాస నరేంద్రుం
డాసురచరితుండు: శాప మాతని నటుగాఁ
జేసిన యది; మానుష మాం
సాసక్తుండగు తెలియంగఁ డమ్ముని యతనిన్."

"అయ్యయ్యో! ఎంతపని చేసినావు? ఆ మిత్రసహ మహారాజు శాపగ్రస్తుడు; అతనికే సుదాసుడని కూడా పేరు. ఒకనాడు వేటకై వెళ్ళి, రెండు పులులను చూచి, ఒక దాన్ని కొట్టేలోగా రెండవది దనుజాకారం దాల్చి పారిపోయింది. కొంతకాలానికి రాజు యాగం చేస్తుంటే, దానవుడు వసిష్ఠరూపంలో వచ్చి నరమాంసంతో భోజనం పెట్టమని అడిగి, మాయమౌతాడు. తానే వంటల వాడై దనుజుడు, నిజమైన వసిష్ఠునికి, నరమాంస భోజనం ఏర్పాటు చేస్తాడు. ఆయన వల్ల, రాజు - నరమాంసభక్షక రాక్షసుడయ్యేట్టు - కోపించబడి, అడవిలో సంచరిస్తున్నాడు, సుమా!" - అని గౌతముడు వివరిస్తాడు.

అప్పుడా మెమాత్ర మేమి చేస్తుంది? "తెలియక పంపినాను, స్వామీ! అనుగ్రహించ," మంటుంది. ఉదంకుడు శూన్యాటవిలో రాజును చూస్తాడు. రక్తసిక్తమైన తనువూ, కోరమీసాలూ, మిడిగ్రుడ్లూ - కేవలం రాక్షసా-

-కారమే! - "అబ్బా! ఆకలికి తట్టుకో లేకుండా ఉన్నాను. సమయానికి తటస్థపడినావు. ఇదుగో నిన్ను తింటా," నంటూ రాజు సమీపిస్తాడు ఇంకో డై తే ఏమయ్యేవాడో? ఉదకుండు తొణకకుండా నిల్చి

"గురుకార్యంబునకై భూ
వర! నిన్నుం గాన నేను వచ్చితి; గుర్వ
ర్థరతులు హింస్యులుగా: రి
ట్లరయక యాడుదె యధర్మమగు మాట? నృపా!"

'భూవర! నృపా!' - రెండు సార్లు సభోధించట మెందు కంటే, దేహ స్మృతి కలిగించటానికి. గురుకార్యం- అంటాడు. తాను హింసకు తగని వాడ నని హెచ్చరిస్తాడు. అధర్మం ఆడుతావా? జాగ్రత్త! అన్నట్టుగా, బెదరింపు కూడా జోడిస్తాడు.

ఆధైర్యమూ. ఆ తేజస్సూ చూచి రాజు, తగ్గుతాడు. 'అంతగా అవ సరమైతే, గురుకార్యానంతరం వచ్చి ఆహారమౌతానులే!' - అని ఉదంకుడు రాజును బుజ్జగించినట్లు, పలుకుతాడు, 'నామాట నన్మృతంబు సొరదుసుమా! నీ వర్థికోటి కిష్టపదార్థా లిచ్చేదాతవు కదా? తప్పక నా కోరిక తీరుస్తావని నమ్మివచ్చినాను' - అని అనేక విధాల బతిమాలుతాడు, రాజు సమ్మతించి, 'ఏమి కావలెనో అడుగు!' - అనగానే, 'నీ ధర్మపత్ని ధరించే కుండలాలు' - అంటాడు.

'ఒరుల ధనం బిచ్చువా రుందురా ? ఇంకేదైనా అడుగు!' అంటాడు రాజు. "నెపం పెట్టి నిరాకరించవద్దు! నాకవేకావలె " నంటాడు, ఉదంకుడు.

'అవ్వాని యున్న చోటికిం జను, మేం బుత్తెంచితినని చెప్పి, నీవాంఛి తం బెటింగింపు' మని రాజతనిని రాణివాసాన్ని గుర్తుగా చూపి, పంపుతాడు.

మహారాణి మదయంతి-ఆనవాలు తెమ్మంటుంది. తిరిగి వచ్చి అభిజ్ఞాన మడిగితే.

అతం, "డీగతి నేమమగు నని నిష్ఠింపరాదు; ఇది వెలిగాగ లేదు వేఱ గతియుమ"—అని చెప్పమంటాడు. మదయంతి సంతసిల్లి, 'గురుహితార్థీ! కుండ లాలివిగో!—

"సురలు గంధర్వులు నురగులు నిక్కుండ
లము లకుఁ బెక్కుపాయముల వేచి
తిరుగుదు; రెంగిలి వోరసినఁ నేమటి
నీవు నిద్రించిన; నేల నిడిన;
నపహరింతురు; భక్తి నర్చించి; యిని దాల్ప
నాకలి, నీరువ, ట్టగ్ని భయము;
విషవికారము, భూత భేతాళ బాధలు
వొరయవు; వినుము! బాలురకునైనఁ
బెద్దవారికైనఁ బెట్టినఁ నయ్యాయి
కొలది నమరియుండుఁ; గురియుఁ బసిడి;
వీని నప్రమత్త వృత్తిమైఁ గొని చను
మయ్యా! గురులు నిన్ను నభినుతింప."

ఉదంకు డామెను దీవించి, కుండలాలు తీసికొని, నవ్వు ముఖంతో రాజు దగ్గరకు వచ్చి, "దేవా! నీవల్ల కృతార్థుడనైనాను. ఆనవాలుగా నీవు చెప్పిన వాక్యం నిగూఢం; అభిప్రాయమేమో? వినవలెనని కుతూహలంగా ఉంది. చెబుతావా?"—అంటాడు.

"బ్రాహ్మణులను రాజులు పూజిస్తారు. నేనూ విప్రార్చన చేయటం మామూలు. విప్రుని చేతనే యిల్లైనాను, చిన్న తప్పుతో, ఇంకోదారి యీ దురితం తొలగించుకోవటానికి తోచటంలేదు, భూసుర పూజ దుష్కరం; ఇది కాదంటే ఇంకో మార్గం కలదా?-కాబట్టి, విశిష్ట రత్నమయ మహా కుండల దానంతో ఈ కీడు నీ వల్ల మానవచ్చు ననుకున్నాను," అని వివరిస్తాడు, రాజు.

భృగువంశ వరేణ్యుడైన ఉదంకుని సన్నిధివల్ల రాజులో ఈ మార్పు కలిగింది. 'మళ్ళీవచ్చి ఆహారమౌతాను. తప్పక వస్తాను. సంభాషణ మాత్రంతో మనం స్నేహితులమైనాము' - అనే ఉదంకుని చూచి, రాజు, మెత్తబడిన చిత్తంతో.

"చంపెదు నట్టి నాకడకు సంయమివల్లభ! వత్తురయ్య నీ
పెంపును నిక్కముం దెలిసెఁ; బ్రీతుడనైతి; మదార్తి నీ తప
స్సంపదఁ జేసి పాపు!"

అని ప్రార్థిస్తాడు.

"వీతకళంకుడ వైనావులే! నీ మంచే నిన్ను కాపాడుతుంది. సాంద్రామల కీర్తియైన గౌతమమహర్షి దయ నీ మీద ప్రసరించుగాక!" అంటూ మేను నిమిరి, శాపమోచనం కలిగిస్తాడు ఉదంకుడు.

ఉదంకుని ప్రయాణం ముందుకు సాగింది ఉన్నట్టుండి దారిలో బిల్వ వృక్షం కనబడింది, పక్వ ఫలాలతో చెట్టు విరగగాచింది. బిల్వ వృక్షమహిమ ఎట్టిదంటే.

"ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో
వనస్పతి స్తవ వృక్షోథ బిల్వః
తస్య ఫలాని తపసా నుదంతు మాయా
అంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మిః."

అని శ్రీ సూక్తంలో ఉంది (సూర్యునివంటి తేజస్సు కలిగిన ఓ లక్ష్మీదేవీ! నీ ప్రసాదంవల్ల బిల్వవృక్షం లభించింది. దీని ఫలాలు నీ మహామహిమ చేత అంతరింద్రియ, బహిరింద్రియ దారిద్ర్యాన్ని తొలగించు గాక!)

కుండలాలు భద్రపరచుకున్న జింక చర్మాన్ని ఆ చెట్టు కొమ్మకు తగిలించి, చెట్టు ఎక్కినాడు. పండ్లు కోయటానికి, ఒకటి రెండు పండ్లు కోసి తిన్నాడో, లేదో? తటాలున గాలి వీచింది-చెట్టు కదిలింది-జింక చర్మం నేల మీద పడింది, ఎక్కడ కనిపెట్టుకొని పొంచి ఉన్నాడో, తక్షకుడు; పెద్ద నాగు పాము రానేవచ్చింది. కుండలాలు హరించి పుట్టలో దూరింది.

బ్రాహ్మణు డాశ్చర్యపడుతూ దిగివచ్చి, కూచిగా మొనగలిగిన కట్టెను సంపాదించి, పుట్టను త్రవ్వసాగినాడు. దేవేంద్రుడా కట్టెకు వజ్రాయుధ శక్తి కలిగించినాడు. నేలబ్రీలి దారి ఇచ్చింది, పాతాళం ప్రవేశించినాడు. కాని, కోట గవని వాకిండ్లు మూసుకొన్నాయి. బహురత్నజాలదేదీప్యమానమైన

ఆ తలుపులు తెరచుకునే మార్గం? డిల్లవడి చూడ సాగినాడు. అంతలో బంధువువలె ఒక గుఱ్ఱము మయింది. ఎఱ్ఱని ముఖమూ, తెల్లని శరీరమూ- ఉదంకుడు విపులార్థవంతాలైన మంత్రాలతో స్తుతించి నాగ కులమంతా తనకు వశమయ్యేట్టు అనుగ్రహించమన్నాడు. కుడిచెవిలో ఊద, మనింది గుఱ్ఱం! ఊదడమే తడవు, తక్షణం ఆ గుఱ్ఱం సకిలించింది.

"పాతాళైక నికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతో మార్గ వినిర్గతోగ్ర దహనార్చుల్ః పన్నగవ్రాతముల్
భీతిల్లెన్; భుజగాధినాథు మనముఁన్ భేదిల్లెఁః గల్పాంతసం
జాత ప్రోద్ధత బాడబానలశిఖాశంకాధికాతంకమై."

గుఱ్ఱం ఇంద్రియాల్లోనుంచి బయలుదేరినాయి మంటలు. పన్నగాలు భీతిల్లినాయి. వాసుకి, నాగరాజు దద్దరిల్లినారు. కల్పాంతకాల బడబానలం మోస్తరు చుట్టుకున్న మంటల్లో పాతాళలోక భవనాలన్నీ బూడిదై పోతా యన్నంత భయం కలిగింది, తక్షకుడు పరుగెత్తుకుంటూ వచ్చి, విప్రునికి కుండలాలిచ్చి, నమస్కరించినాడు. తప్పు మన్నించమని వేడుకున్నాడు తిరిగి, మాయమైనాడు.

ఉదంకుడు గుఱ్ఱంచుట్టూ తిరిగి ప్రదక్షిణంచేసి, ఆ మంట లారిపోగానే 'ఎవర?'ని అడిగినాడు. నీ గురువుకు గురువును; అగ్నిదేవు డంటారు నన్ను'- అని జవాబు వచ్చింది. తరువాత ఉదంకుడు గౌతమాశ్రమాన్ని చేరి, గురు పత్ని కా కుండలాలు సమర్పించుకొని, ఆమె మెప్పు పొందినాడు.

అగ్ని, గుఱ్ఱమే ఎందుకైనాడు?–అని ఇక్కడ ప్రశ్న, ఇంకే రూపమో ఎందుకు ధరించరాదు? అనేవి అనుబంధప్రశ్నలు. ఇందుకు పై పద్యంలోనే సమాధానముంది, 'బడబానల శిఖా'—బడబాగ్ని నీళ్ళలో గుఱ్ఱం రూపాన పుడుతుంది. కాబట్టి, ఆది అగ్నిరూపమే!

గుఱ్ఱంలో ఉన్నంత ఉడు కింకెక్కడా ఉండదట! దాని కెప్పుడూ సంతో షమేకాని, దుఃఖం కలుగదట! సకిలింపు సంతోష సూచకమే; కాని, ఇతర సూచనలు చేయలేదట!

కుడిచెవిలో ఊదటం-మన సంప్రదాయాన్ని సూచిస్తుంది, జాత కర్మా దుల్లో పసిబిడ్డను మూర్ధాఘ్రాణం చేసి కుడి చెవిలో మంత్రం పలుక మంటారు,

ఇక అహల్యా వృత్తాంతంలో, సందేహాస్పదమైన విషయ మొకటుంది

అహల్యా ద్రౌపదీ తారా తారా మండోదరీ తథా;
పంచకన్యాః పఠేన్నిత్యం, మహాపాతక నాశనమ్.

అహల్య బ్రహ్మమానస పుత్రిక, అయోనిజ, ద్రోణధృష్టద్యుమ్నాదు లకూ, సీతా ద్రౌపదీ ప్రభృతులకూ అయోనిజత్వం సుప్రసిద్ధం, మత్స్యం కడుపులోనుంచీ సత్యవతి పుట్టుకా, దేవకీదేవి ఏడవ గర్భం ఇంకో భార్య యైన రోహిణీ దేవిలో ప్రవేశించి బలరాముని పుట్టుకా, మహిష గర్భంలో నుంచి మహిషాసురుని పుట్టుకా, సాంబుని కడుపులో ముసలం పుట్టుకా, హోమకుండంలోనుంచి ద్రౌపది పుట్టుకా జరిగినాయి

అహల్యను అందఱు దేవతలూ కోరినారు. భూప్రదక్షిణం చేసి వచ్చిన వారి కిస్తామని ప్రకటించ బడింది. గౌతముడు సప్తఋషుల్లో స్థానం సంపా దించ వలసినవాడు. బ్రహ్మర్షి కాబోయేవాడు. నారదుని సలహాతో ఆలో చించి నిర్ణయం తీసికొన్నాడు. గో శబ్దానికెన్నో అర్థాలు. భూమికీ గోవనే పేరుంది; మాతకూ గోవనే పేరుంది. 'గోమాతా గురు జన్మభూః' - కాబట్టి, అక్కడే కామధేనువుంటే, అది ఈనుతూ ఉంటే, ప్రదక్షిణ నమస్కా రాలు చేసి, భూప్రదక్షిణ ఫలితాన్ని పొంది పందెం గెలుచుకొని, అహల్యను వివాహమాడినాడు, గౌతముడు.

అహల్య మనోవాక్కాయకర్మలతో గౌతముని ప్రేమిస్తూ, కాపురం చేసింది. శతానందుడనే కొడుకు పుట్టి, పెరిగి పెద్దవాడై, జనకమహారాజు పురోహితుడైనాడు. అందాకా, ఆమె పాతివ్రత్యానికి భంగంరాలేదు.

కాని, దేవేంద్రుడొకవంక సమయంకోసం పొంచి, ఆలోచించు కుంటూనే ఉన్నాడు తాను తపస్సుకు అధికారి. ఎవరే తపస్సు చేసినా, పరీక్షించే పని అతనిది. గౌతముని తపస్సు - జరుగ వలసినంతగా జరగటం లేదు. అతడు సంసారంలో పడి కొట్టుకుంటున్నాడు, అప్సరసలను మించిన

అపురూప సుందరి భార్యగా దొరికింది. ఈ బంధం తొలగిస్తేకాని, గౌతముడు కఠోరమైన తపస్సు చేయడు; అట్లా చేస్తేనే కాని బ్రహ్మర్షి పదవికి అర్హుడు కాలేదు అతన్ని ఉద్ధరించటానికి ఆమె మీద అసహ్యం పుట్టిస్తే సరిపోతుంది. అయితే, తానేమో శాపం పొందక తప్పదు. అపకారాన్ని సహించి కూడా, ఉపకారం చేయటం ధర్మం - అనుకొని, కోడియై కూసి ఎడబాయని గౌతముని కెడబాటు కలిగించి, ఆ వేషంతో తానుతయారై, అహల్యను మోసగించి, శాపం పుచ్చుకొని, అదృశ్యుడైనాడు.

గౌతముడు పట్టరాని కోపంతో భార్యను గూడా శపించి ఆశ్రమాన్ని వదిలి, హిమాలయాలకు వెళ్ళి, తపస్సు పండించుకొని, బ్రహ్మర్షి కాగలిగినాడు. అహల్య తప్పేమీలేదు కనుక, శ్రీరామ పదస్పర్శ - అనే భాగ్యానికి నోచుకుంది. శాపమోక్షానంతరం పవిత్రురాలై భర్తను యథాపూర్వంగా సేవించింది. తెలియని తప్పుకు, ఘోర శిక్ష అనుభవించి నందున ఆమె మీద భగవంతునికి దయకలిగింది.

ఈ విధంగా మహాభారతంలో అడుగడుగునా అతి రహస్యమైన అంశాలున్నాయి, కథవేఱూ, సత్యం వేఱూ - ఆ సత్యాన్ని బోధించకపోతే అపార్థాలు స్ఫురిస్తాయి. మాదిరికి కుచేలుని కథే తీసుకుందాము.

"అదానదోషేణ భవేద్దరిద్రః
దారిద్ర్య దోషేణ కరోతి పాపం
పాపాదవశ్యం నరకం ప్రయాతి
పునర్దరిద్రః పునరేవ పాపీ"

అని కదా పెద్దలన్నారు? దానం చెయ్యని దోషం వల్ల దరిద్రుడై పుడతాడు; దరిద్రుడైన దోషం వల్ల పాపం చేస్తాడు! పాపం చేత తప్పక నరకంలో పడతాడు; మళ్ళీ దరిద్రుడై, పాపం చేస్తూనే ఉంటాడు.

ఈ సిద్ధాంతానికి భంగంగా, కుచేలుడెట్లా భాగ్యవంతుడైనాడు? భగవంతుడు కూడా కర్మ ఫలితాన్ని తప్పించలేడుకదా? ఇందుకు సమాధానాన్ని మనం కథలో వెదకవలసిఉంటుంది.

కుచేలుడు శ్రీకృష్ణసందర్శనార్థం వస్తూ వట్టిచేతులతో రాగూడదని తనకు కలిగిన కొద్ది అటుకులు తెచ్చినాడు - భగవంతుని మనస్సులో ఆలోచన మొదలయింది. ఏమిరా? నాకు సహాధ్యాయి. చెలికాడూ - వీడెట్లా దరిద్రుడై నాడు? - ఆ సంగతి తేల్చమని దేవతల నడిగినాడు. వారు ఖాతా విప్పి కుచేలుని పుణ్యపాపాలు గణించి, దానం చెయ్యనందున, దరిద్రుడై నాడని తెల్పినారు.

'అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫల మశ్నుతే' - ఉత్కటమైన పుణ్యపాపాలకు ఇక్కడే (వెంటవే) ఫలం లభిస్తుంది. కాబట్టి అటుకులదానం తానే పుచ్చుకున్నాడు. ఎక్కడో ఉన్న భగవంతునికి నైవేద్యం పెడితేనే ఎంతో పుణ్యమైతే, ప్రత్యక్షంగా ఉన్న భగవంనికిచ్చిన నైవేద్యం ఎంతో పుణ్య ప్రదము.

చరాచర ప్రపంచంలోని జీవరాసులన్నిటికీ పిడికెడటుకులు దానమిచ్చినంత పుణ్యం కుచేలునికి లభించింది. అప్పటి కా విధంగా అతని పుణ్య పరిపాకం కలిసి వచ్చినట్లయింది. కాబట్టే, ఒక్కసారిగా కనివిని ఎరుగనంత భాగ్యవంతుడు కాగలిగినాడు.

---

# తెలుగు వ్యాకరణమునకు కావలసిన సంస్కృత వ్యాకరణము

శ్రీ పుప్పులూరి విశ్వేశ్వరయ్య

**పరిచయము :**


| | |
|---|---|
| పేరు | : శ్రీ పుప్పులూరి విశ్వేశ్వరయ్య |
| జననము | : కర్నూలు 27-1-1920 |
| విద్యార్హతలు | : ఎం. ఏ. (సంస్కృతము).<br>బి. యల్ ; బి. ఇడి |
| రచనలు | : ప్రౌఢమనోరమపై ఆంగ్లవ్యాఖ్యానము,<br>పరిభాషేందుశేఖరముపై తెలుగు వ్యాఖ్యానము |


సంస్కృత వ్యాకరణ మభిమాన విద్యయైనందున, తెలుగు వ్యాకరణము గూడ పరిశోధించి తత్ఫలితముగ వెలువరించినదే యీ వ్యాస మందలి విస్తృత విషయము

## వ్యాకరణ మతిప్రాచీనము

భారతదేశమునందు వ్యాకరణమునకు విశిష్ట స్థానము కలదు మన దేశములో ఎన్నో భాషలున్నను అన్నింటిలో కొలదిగనో, గొప్పగనో సంస్కృత పదములు తత్సమ తద్భవ రూపములలో నున్నవి. అన్ని భాషలును సంస్కృతమునుండియే పుట్టినదను వాదము విపరీతవాదము, కాని గీర్వాణ భాషా ప్రభావము దేశ భాషలపై నుండినదని, నున్నదని సర్వు లంగీకరించ

వఱసినదే, ఇన్ని భాషలు సన్నిహిత రాష్ట్రము లందుండుటచే నాయా రాష్ట్రములవారు తమ తమ భాషా సౌష్ఠవమును కాపాడుకొనుటకై వ్యాకరణములను రచించుకొనిరి. ఇట్టి ప్రయత్నములు ప్రాచీన కాలములలోనే జరిగినవి. సంస్కృత వ్యాకరణము నేటికి మూడు వేల వత్సరములకు ముందే ప్రారంభింప బడినది. మహర్షి పాణిని తన అష్టాధ్యాయిని రచించుటకు ముందే ఎందరో వైయాకరణు లుండిరనియు, వారు విశిష్టాభిప్రాయములు కలిగి యుండిరనియు మనకు అష్టాధ్యాయినుండి తెలియుచున్నది.

వేదవాఙ్మయము నందు కొన్ని వ్యాకరణ విశేషములు సూచింపఁబడినవి. 'ప్రత్యయః, ధాతుః, ప్రాతిపదికం' మొదలగు సంజ్ఞలు శ్రుతి యందున్నవి.

"చత్వారి శృంగాః త్రయోస్య పాదాః
ద్వే శీర్షే సప్త హస్తా సో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి
మహోదేవో మర్త్యాం ఆవివేశ"

అను కారికను మహర్షి పతంజలి వ్యాకరణపరముగా వ్యాఖ్యానించి యున్నాడు. చత్వారి శృంగాః-నామాఖ్యాతో పసర్గనిపాతములు. త్రయోస్య పాదాః-భూత వర్తమాన భవిష్యత్ కాలములు ద్వే శీర్షే-రెండు విధములైన శబ్దములు; నిత్యమైనది, కార్యమైనది. సప్తహస్తా సోఽస్య. ఏడు విభక్తులు గలది. అని భాషను ఒక విచిత్ర వృషభమువలె ఋషి వర్ణించి యున్నాఁడు. అట్టి సూచనలేకాక వేదభాషయందుండు విశేషములను తెల్పు ప్రాతిశాఖ్యలు వెలువడినవి, అనంతరము మునిత్రయమువారు క్రమముగా సూత్ర వార్తిక భాష్యములను రచించిరి

## వ్యాకరణము శాస్త్రము

సంస్కృత వ్యాకరణము భాషా విశేషములను తెల్పు సూత్ర సముదాయము మాత్రమే కాదు, అదియొక శాస్త్రము. ఆంగ్లమున దీనిని 'System' అని అనువదించుచున్నారు, ఒక రూపమును సాధించుటకు వేరు వేరు అధ్యాయములలో నుండు సూత్రములు కొన్ని అవసరము. ఇట్టి శాస్త్రములకు

నిర్దుష్టమైన నిర్వచనములుగల సంజ్ఞలు; అతివ్యాప్తి, అవ్యాప్త్యభావ దోష రహితమైన పరిభాషలు; సర్వతోముఖమైన, సర్వతో భద్రమైన సూత్రజాలము; ప్రక్రియా లాఘవముగల వివిచ్య కథనము (అదే,వి+అ+కరణము) అవసరములు.

మాటలు వచ్చియు రాని వయస్సునందు కిండర్ గార్టెన్ బడులకు బాల బాలికలను పంపి ఆంగ్ల భాషాముఖమున విద్యను నేర్పదలచిన ఈ రోజులలో వ్యాకరణ మొక శాస్త్రమనినచో బోధపడదు. ఆంగ్లభాషా పరిచయానంతరము స్వభాషను సవతి ప్రేమతో నేర్పువారికి వ్యాకరణ పరిచయము సహితము ఆంగ్ల వ్యాకరణ పరిచయానంతరమే! ఆంగ్ల భాషకు కొన్ని వ్యాకరణ సూత్రములున్నవి. కాని వ్యాకరణ శాస్త్రము ఈ నాటికిని లేదు, కనుకనే శాస్త్రమనగా దాని స్వరూప మిట్టిదని పలువురకు తెలియదు.

## వ్యాకరణమేల ?

మన దేశమునందు సంస్కృత వ్యాకరణము 25 శతాబ్దముల ముందే శాస్త్రముగ వెలసినది, అంతేకాదు, వ్యాకరణము వేదాంగములలో నొకటి, షడంగములతో కూడిన వేదములను అభ్యసించుట భారతీయునికి విధి.

"బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః
షడఙ్గో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ."

వేద పురుషునికి శిక్షా శాస్త్రము ఘ్రాణము, అనగా ఊపిరి; కల్పము చేతులు; నిరుక్తము శ్రోత్రము; ఛందస్సు పాదములు; జ్యోతిషము కన్నులు వ్యాకరణము ముఖము. సర్వాంగములలో ముఖము ప్రధానమైనది. ఇట్లు వ్యాకరణము ప్రధాన వేదాంగము. దీనికి మహర్షి పతంజలి మహాభాష్యమే ప్రమాణము, దేవర్ణ, ఋషిఋణ, పితౄణములలో, ఋషి ఋణమును దీర్చుటకు సాంగముగ వేదము నధ్యయనము చేయవలెనని శ్రుతి పలుకుచున్నది.

ఆనందవర్ధనుఁడు ధ్వన్యాలోకమను గొప్ప యలంకార శాస్త్రమును రచించెను. దానిలోని సిద్ధాంతములను ఆతని తరువాత వచ్చిన ఆలంకారికు లందరు నంగీకరించిరి, కొందఱతని సిద్ధాంతముల ఖండనలను ఖండించిరి. కావ్య విమర్శనా పద్ధతులలో నూతన దృక్పథములను ప్రసాదించినదీ గ్రంథ రాజము. దానిలో వ్యాకరణమును గూర్చి యిట్లున్నది.

"ప్రథమే హి విద్వాంసః వైయాకరణాః
వ్యాకరణ మూలత్వాత్ సర్వ శాస్త్రాణామ్."

పండితు లందఱు ప్రథమమున వైయాకరణులు. ఎట్లన సర్వశాస్త్రములు వ్యాకరణ మూలములు. ఏ శాస్త్రమును జదివిన విద్వాంసుడైనను వ్యాకరణమును ప్రథమమున చదివియే యుండవలెనని భావము. సర్వ శాస్త్రములు వ్యాకరణమూలములనుట యెట్లు? ఏ శాస్త్రమును నేర్చుట కైనను భాష రావలెను. దానికి వ్యాకరణ మవసరము. ఇది యొక సమాధానము భారతదేశమున అత్యున్నత శ్రేణిలో ప్రథమమున వ్యాకరణ శాస్త్రమే ఎసంగినది, ఈ శాస్త్రములో నుద్భవించిన న్యాయములు, యుక్తులు లోకోక్తులు, పెక్కులు ఇతర శాస్త్రములలో స్వీకరించిరి. సంస్కృత వాఙ్మయ ప్రపంచమున మహత్ శబ్ద పూర్వకమైన గ్రంథనామములు రెండే యున్నవి. మహాభాష్యము, మహాభారతము, మొదటిది మహర్షి పతంజలి వ్రాసిన వ్యాకరణ శాస్త్ర గ్రంథము. దీనిలోఁ జూపిన న్యాయ యుక్తి లోకోక్త్యుదాహరణముల విలువనుబట్టి దానికి మహాభాష్యమని కీర్తి వచ్చినది. ఇట్లు వైదుష్యమునకు ప్రాణాధారములైన సామగ్రి మొదటిసారిగా వ్యాకరణ శాస్త్రమున వెలువడినది. కావున సర్వ శాస్త్రములు వ్యాకరణ మూలములే, ఇది రెండవ సమాధానము, విద్వత్కారణము వ్యాకరణమని అనంద వర్ధమని తాత్పర్యము. పిండితార్థమేమనగా భారతదేశమున వ్యాకరణమునకు విశిష్ట స్థానమున్నది. 1. అది అతి ప్రాచీనమైనది, 2. అది యొక శాస్త్రము, 3. అదియొక వేదాంగము, 4. అంతియేకాదు. ప్రధానమైన వేదాంగము, 5 దానిని చదువుట భారతీయునికి విధి 6. అది సకల శాస్త్రములకు మూలముగాన దానిని నేర్చుట యవసరము.

## నహి నహి రక్షతి

సరే, బాగున్నది కాని ఆది శంకరాచార్యులు "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే" అనిరే, దానిమాట యేమి?

"భజగోవిదం భజగోవిందం, గోవిందం భజ మూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే, నహి నహి రక్షతి డుకృఞ్ కరణే."

ఇది మోహముద్గరమున తొలిశ్లోకము. "ఓ మూఢబుద్ధి గలవాఁడా! గోవిందుని భజింపుము. సన్నిహితకాలము సంప్రాప్తించినపుడు నిన్ను 'డుకృఞ్ కరణే' రక్షింపదని దీని యర్థము. శ్రీ శంకరుల శిష్యులలో వొకడు వ్యాకరణమును ప్రీతితో చదువుచుండెను, వాఁడప్పుడప్పుడు "డుకృఞ్ కరణే" అనుచుండెననియు, వానికి దాని నిష్ఫలత బోధించుటకిట్లు శ్రీ శంకరులు వ్రాసెననియు పిచ్చిపిచ్చిగా కథలు చెప్పుదురు, వారు శ్రీ శంకరులు ప్రక్క నిలుచుండి విని, చూచి తెలిసికొనినట్లు, దీని వలన వ్యాకరణ శాస్త్రము మన మతగురువులచే నిందింపఁబడినదని సర్వులు భావింతురు. ఇది సరికాదు. సన్నిహిత కాలము దాపరించినప్పుడు వ్యాకరణమేకాదు, ఏదియు రక్షింపదు, గోవిందుఁడును మృత్యువు నరికట్టడు, పోవువాఁడు పోవలసినదే, గోవింద భజనమువలన మోక్షము లభింపవచ్చును. కాదు వైకుంఠవాసము కలుగవచ్చును. ఇది సాధారణముగ చెప్పదగిన సమాధానము.

నిజమునకు మానవుఁడు నేర్వఁగలవి రెండున్నవి. విద్య అవిద్య, మొదటిది సాధించుటకు గోవిందుని భజన సాధనము. ఇతర విద్యలన్నియు అవిద్యా కోటిలోనివి, ఇన్ని విద్యలలో శ్రీ శంకరుల కంటి కాగినది వ్యాకరణము. అదియే అవిద్యలలో మేటిది దానిని నిషేధించిన నన్నియు నిషిద్ధములగును. కనుకనే "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే" అని చెప్పఁబడినది. "నహి నహి రక్షతి తే వ్యాకరణమ్" అనియేల చెప్పలేదు? నిజమే. డుకృఞ్ కరణే అనునది ఒక సంస్కృత ధాతువు దాని యర్థము "కృ" ధాతువు దానికి "డు" అనియు "ఞ్" అనియు అనుబంధములు వైయాకరణులు చేర్చి పలికిరి. కరణ మను నర్థమునందున్నదీ ధాతువని "కరణే" పదము చెప్పుచున్నది. ఇదంతయును వ్యాకరణశాస్త్రము కల్పించినది ప్రకృతి ప్రత్యయములుగ పదములను విభజించుట కృత్రిమము, సర్వేశ్వరుఁడు ధాతువులను ప్రత్యయములను విడివిడిగా సృజించి తిఙన్త కృదన్తములను చేసికొనుఁడని యాదేశింపలేదు. "డుకృఞ్ కరణే" అనుటలో శ్రీ శంకరుల యభిప్రాయమేమన అవిద్యలన్నియు కృతకములు. ఆత్మవిద్య ఒక్కటే జీవికి సహజమైనది" అని. దీనినే భంగ్యంతరముగ నిట్లు చెప్పవచ్చును. వాఙ్మయమును వేదములని, తదితరములని రెండు భాగములుగ భావింపవచ్చును. పరమాత్మని ప్రతిపాదించునవి వేదములు. జీవికి వేదార్థమును సుగమమగు రీతి తెల్పుటకు పుట్టినవి వేదాం

గాదులు. వీనిలో ప్రధానమైనది వ్యాకరణము, దానిని నిషేధించిన నన్నింటిని నిషేధించినట్లే, కనుక "కాళిదాసేన గద్యాన్తే" అనుట ఎట్లు కాళిదాసు నుగ్గడించినట్లో, Even Homer nods అనుట ఎట్లు Homer కవిని పొగడినట్లో, అట్లే ఆదిశంకరుడు "నహి నహి రక్షతి డుకృఞ్ కరణే" అనుటయు వ్యాకరణ ప్రాశస్త్యమును చెప్పినట్లే.

శబ్దశాస్త్ర మిట్టిదై యుండ నేటి విద్యావిధానములో దీనికి నప్రధాన స్థానము నొసంగుటయు, కొన్ని విడిసూత్రములను మాత్రము నేర్పుటయో, లేక కొన్ని ప్రకరణములను మాత్రము బోధించుటయో జరుగుచున్నది. సైపు యంత్రమును కొనదలచి యొకఁడు, ధరనడిగి తెలిసికొని, అబ్బ! అంత ప్రియమా! అట్లైనచో నాకు యంత్రమంతయు వలదు. ఈ యక్షరములు మాత్ర మిమ్మనన్నట్లున్నది. కారంతయు వలదు, చక్రములు, మెత్తని సీట్లు చాలు నన్నట్లున్నది, వ్యాకరణమొక శాస్త్రము, దానిని సంపూర్ణముగనే చదువవలెను. ఆరు ప్రకరణములు చాలునని విశ్వవిద్యాలయములు విధించుట దానిని శాస్త్రముగ గుర్తింపక పోవుటకు నిదర్శనము.

## తెనుఁగు వ్యాకరణమునకు సంస్కృతభాషతోడ చెలిమి

మొదటి తెనుఁగు వ్యాకరణమును నన్నయభట్టారకుఁడు సంస్కృత భాషలో వ్రాసెను. తెనుఁగు వ్యాకరణమునకును సంస్కృతమునకును ఇది మొదటి సంబంధము. 1. సంస్కృతభాష అల్పాక్షర మసందిగ్ధము సారవంతము విశ్వతోముఖ మస్తోక మనవద్య మగు సూత్రములను రచించుటకు మేలైనదని గ్రహించి భట్టారకుఁడట్లు చేసెను, ఇంతియే కాదు. దేశభాషలలో నెన్నయైన తెనుఁగునందు పెక్కు సంస్కృత పదములు తత్సమ తద్భవ రూపములు దాల్చి మెలంగుచున్నవి. ఇది రెండవ సంబంధము 2. దీనిని బట్టియే ఋ ౠ ఌ ః ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష లు సంస్కృత సమంబులంగూడి తెనుఁగున వ్యవహరింపఁబడు నను సూత్రము పుట్టినది.

3. తెలుఁగు వ్యాకరణమునందు కొన్ని పదములు సంస్కృత పర్యాయములచే వివరింపఁబడినవి. "క్త్వార్థంబయిన యిత్తునకు సంధిలేదు." క్త్వా యనునది సంస్కృత ప్రత్యయము, ఇట్లే ఆశీరాద్యర్థకంబులు, శతృతు

మాన-తర్య చేదాద్యర్థకంబులు మొదలగునవి. శతృప్రత్యయము, తుమున్ ప్రత్యయము సంస్కృత వ్యాకరణము నందలివి, ఆచ్ఛిక పరిచ్ఛేదమున సర్వ నామములను వేర్కొనునపుడు సర్వతావదర్థకము ఇయదర్థకము, కియ ద్యావదర్థకము కతిపయార్థకము, బహ్వర్థము అని వరుసగా అన్ని ఇన్ని, ఎన్ని, పెక్కు, పలు శబ్దములకు వివరణగా సంస్కృత పర్యాయ పదము తీయఁబడినవి. తెనుఁగు వ్యాకరణమునకును సంస్కృతమునకును ఇది మఱి యొక సంబంధము.

వ్యాకరణము తెనుఁగు భాషదైనను దాని మొదటి సూత్రము "సంస్కృతమునకు వర్ణము లేబది." తెనుఁగు వ్యాకరణమునకును సంస్కృత శబ్ద శాస్త్రమునకును ఇంతటి దృఢ సంబంధమున్నది. ఇంతే కాదు. "అనుక్త మన్యతో గ్రాహ్య"మని వాగనుశాసనుఁడే సెలవిచ్చియున్నాఁడు. తెనుఁగు వ్యాకరణమున నెంత యనుక్తము, అనగా సంస్కృత వ్యాకరణమునుండి యెంత గ్రాహ్యమో తెలిసికొనుటయే యీ వ్యాస (ఉపన్యాస) లక్ష్యము.

దీనికింత ప్రయత్నమేల? "స్త్రీ లింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబులం గూడి యిందు బ్రవర్తిల్లు" (తత్సమ. 86). కనుక స్త్రీ ప్రత్యయ ప్రకరణమును," సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు" (సమాస 8 వివరణ) కనుక సమాస ప్రకరణమును చదివిన చాలునుకదా ? అని యడుగ వచ్చును. అంతమాత్రమే యైనచో నెట్టి కృషియు పనిలేదు, ఈ విషయమును సంజ్ఞలు, పరిభాషలు మొదలగు భాగములుగ విభజింపవచ్చును.

## సంజ్ఞలు

సంజ్ఞలన పారిభాషిక పదములు (Technical terms). సంజ్ఞానం సంజ్ఞా అనియు సమ్యక్ జ్ఞాయతే అనయా అనియువ్యుత్పత్తిని చెప్పవచ్చును. చెప్పదలచిన విషయమును సంగ్రహముగను, స్పష్టముగను చెప్పుటకు సంజ్ఞలవసరము. "లఘ్వర్థం సంజ్ఞాకరణమ్" అని భాష్యకారులు చెప్పిరి. Technical terms are essential for brevity and precision. తెనుఁగు వ్యాక

రణమునందు కొన్ని సంస్కృత సంజ్ఞలు గ్రహింపఁబడినవి. వానిలో కొన్ని టిని నిర్వచింపకయే, వివరింపకయే చిన్నయ సూరిగారు వాడిరి.

1. అచ్, హల్ అను స్వరవ్యంజనములకు సంస్కృత వ్యాకరణ సిద్ధ సంజ్ఞలను వాడుటయేగాక ప్రత్యాహారమను పదమునుగూడ క్రియా. 8 సూత్ర వివరణములోఁ జెప్పెను, "లకారంబునకు డుఁబువులను ముజ్ఞాగు".. "ఇందు ఇకారంబు ప్రత్యాహారార్థంబు" ప్రత్యాహార మనఁనేమి? అదెట్లేర్ప డును? "ఆదిరన్త్యేన సహేతా" యను పాణినీయ సూత్రానుసారము ప్రత్యా హార మేర్పడును. "అన్త్యేనేతా సహిత ఆదిర్మధ్యగానాం స్వస్యచ సంజ్ఞా స్యాత్" అని దాని యర్థము. అచ్, హల్ అను ప్రత్యాహారములు శివ సూత్రములలోని ఇత్తులతో నేర్పడినవి. డుజ్ఞు, రుజ్ఞు, వుజ్ఞు అనునవి, తెనుఁగు వ్యాకరణమున సంస్కృత సూత్రానుసార మేర్పడిన ప్రత్యాహార ములు. డు నుండి ఇ కారము వఱకునుండు వానికి డుజ్ఞు అని సంజ్ఞ, దీనికి ప్రత్యాహారమను పేరెట్లు కల్గినది? "ప్రత్యాహ్రియన్తే సంక్షిప్యన్తే వర్ణాః (వర్ణకాః వా) యస్మిన్" అను నర్థముగల దాపదము.

2. విభక్తి, పురుష, లకారము, ఉత్సర్గము, విశేష్యము, కృదంతము, అవ్యయము, ప్రత్యయము, తద్ధితము, సమాసము పూర్వపదము, ఉత్తరపదము లోనగు సంజ్ఞలు కొన్ని సంస్కృత వ్యాకరణమునను నిర్వచింపఁబడలేదు. అవి తెనుఁగున నట్లే ప్రయుక్తములైనవి, కొన్ని సంజ్ఞలు సంస్కృతమున నిర్వ చింపఁబడి యుండియు తెనుఁగున వివరణ రహితముగా ప్రయోగింపఁ బడి నవి. "సంయోగము." ఇది తత్సమ 85వ సూత్రముక్రింద అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు జీప్ ప్రత్యయంబు లేమిం జేసీత్యాది పంక్తియందు గలదు. ఆచ్ఛిక 15లో సంయోగంబు పరంబగునపుడెల్లచో...అనియు కలదు. సంయోగము "హలోనన్తరాః సంయోగః" అను పాణినీయ సూత్రముచే నిర్వచింపఁబడినది. "అవసానము" ఇది సంధి పరిచ్ఛేదపు 20, 47, 55 సూత్రములలో ప్రయుక్తము "అవసానంబునందు ద్రుతంబునకేని ద్రుత స్వరంబునకేని లోపంబు బహుళంబు గానగు."-సంధి 20, "మధ్యమ పురు ష ము వర్ణకంబునకు హాలవసానంబులు పరంబు లగునపుడు..." సంధి 47, వాక్యావసానంబున సంధిలేమి దోషంబుగాదని యార్యులండ్రు. 55. అవసాన మను పదమునకు 'విరామోఽవసానమ్' అని సంస్కృతవ్యాకరణ నిర్వచనము

"లోపము" ఇది పెక్కు సూత్రములలో ప్రయోగింపఁబడినది. "అదర్శనం లోపః" అని దీని నిరుక్తి. అవ్యయమను శబ్దము సంధి 24 వివరణలో మన్నది. పదమను పదము పలుచోట్ల నున్నది, సంధి 11వ సూత్రమున "అంధ్వవ గాగమంబులం దప్ప నపదాది స్వరంబు..." అనుచోట అపదాది యను సమాసమున్నది. పదముకానిది అపదము. పదమనగా నెట్టిది? లోకములో ప్రయోగార్హమైన శబ్దము అని సామాన్య నిర్వచనము. వీని కన్నింటికి యౌగికార్థమే నిర్వచనము కాఁగలదని సూరిగారి యాశయమై యుండును. గురు సంజ్ఞ సంధి-20 లోను క్రియా 66 లోను వాడఁబడినది. లఘుసంజ్ఞ క్రియా-66వ సూత్రమున ప్రయుక్తము. కాని యీ సంజ్ఞలు నిర్వచింపఁబడలేదు. 'హ్రస్వం లఘు సంయోగే గురు దీర్ఘం చ' అని సంస్కృత వ్యాకరణమునఁ జెప్పఁబడినది.

3. ఊష్మములను శబ్దము సమాస పరిచ్ఛేదపు 14వ సూత్రవివరణలోఁ జెప్పఁబడినది. "బాహుళకముచే నూష్మ రేఫంబులకు ద్విత్వంబు గలుగదు." ఊష్మములెవ్వి? "శషసహ"లు. ఉదాహరణములను బట్టి తెలియవచ్చును. అయినను "శషసహ"లకు ఊష్మములను నది సంస్కృత వ్యాకరణ సిద్ధ సంజ్ఞ. ఇట్లే దన్త్యములు, తాలవ్యములను శబ్దములు ఆస్యస్థానమునుబట్టి వర్ణములకుఁ గల్గినవి, తెనుఁగు వ్యాకరణమున వివరణ రహితముగ వాడఁబడినవి అనగా వర్ణములకు ఉత్పత్తిస్థానములు బోధింపఁ బడలేదు. వానిని సంస్కృత వ్యాకరణమునుండి తెలిసికొనవలెను.

4. సూరిగారు సంజ్ఞాపరిచ్ఛేదమున "దన్త్య తాలవ్యంబులయిన చజలు సవర్ణంబులు" అని సూత్రించిరి గాని సవర్ణ సంజ్ఞను నిర్వచింపలేదు, దీనిని చదివినచో చ చ̄లు సవర్ణంబులు, జ జ̄లు సవర్ణము లనిమాత్రమే తెలియును, అ, ఆ, ఆ౩ లు సవర్ణములనిగాని ఇ, ఈ, ఈ౩లు సవర్ణములనిగాని క ఖ గ ఘ ఙ లు సవర్ణములనిగాని తెలియదు. "బహుళః తెనుగు వ్యాకరణమున వీని సావర్ణ్యమునకు ప్రయోజనము లేదేమో" యని సందియము సయితము కలుగ వచ్చును. సావర్ణ్యమువలన ప్రయోజనమేమి? వ్యాకరణ సూత్రములలో కొన్ని వర్ణముల నుచ్చరించిన నవి తమ సవర్ణములనుకూడ గ్రహించునని "అణు దిత్సవర్ణస్య చాప్రత్యయః" అను పాణినీయ సూత్రము చెప్పుచున్నది. దీనినే గ్రాహక శాస్త్రమందురు, సవర్ణ సంజ్ఞవలన సవర్ణగ్రాహక శక్తి కల్గుటయే

ప్రయోజనమని సూరిగారు "తాలవ్య చకారంబు దన్త్య చకారంబునకును, తాలవ్య జకారంబు దన్త్య జకారంబునకును గ్రాహకములని తాత్పర్యము" అని వ్రాసిరి, దీనివలన చ జ లు స్థిరములుకావు. అవి వరుసగా పరుష సరళములు, ఈ సూత్రమునందే కాక, సవర్ణ గ్రాహకత యితర సూత్రములలోను అవసరము, "ఇగ్గోరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు" తత్సమ 44. అను సూత్రమున 'ఇ' అనువర్ణము ఇ ఈ లను గ్రహించును. కనుకనే శ్రీ ధీ పదములలో ప్రథమైకవచనము లోపించినది, ఇకారము ఇ ఈ ల నెట్లు గ్రహించును? "అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః" అను సంస్కృత వ్యాకరణ సూత్రానుసారము. ఇ ఈ లు సవర్ణములనియెట్లు తెలియుచున్నది? "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్" అను పాణినీయ సూత్రమునుబట్టి, ఏ వర్ణములు ఒకే ఉత్పత్తి స్థానమును ఒకే అభ్యన్తర ప్రయత్నమును కల్గియుండునో అవి ఒకదానికొకటి సవర్ణములు. ఇ ఈ లు తాలువునందు పుట్టునవి. అచ్చుల కన్నింటికి వివృతమను అభ్యన్తర ప్రయత్నము. కావున ఇ ఈలు సవర్ణములు. "ఇకారంబు మీఁది కు ను వు క్రియా విభక్తుల యుత్వంబున కిత్వంబగు" నను సూత్రమునను ఇకారము ఇఈ లను గ్రహించును. హరిని హరికిని వలె. శ్రీని, శ్రీకిని, అను నవియు నుదాహరణములు. దీనిచే విహితమైన ఇత్వము ఈకారమునకును వర్తించు చుండుటచేతనే "ఈ ధాతు యుష్మదర్థంబుల మీఁది వాని యుత్వంబున కిత్వంబు రాదు" అను 27వ సూత్రము రచింపఁబడినది.

ఇట్లే "ఉకారాంత గోశబ్దంబుల కంతట వు వర్ణకంబగు" నను సూత్రమున ఉకారము ఊ కారమును సహితము గ్రహించును, గోవు, తరువు ఇత్యాదులే కాక "భ్రూవు" అను శబ్దము నయిత ముదాహరణము. తత్సమ 55 వ సూత్రమున దీనిని సూరిగారు చూపియున్నారు.

"ఇ ఉ ఋ ల కించుక్కు పరంబగునపు డయు గవు గరుక్కులగు." (క్రియా 64) ఈ సూత్రము నందు గ్రహణక శాస్త్రముచే దీర్ఘంబులును గ్రహింపఁబడును. కనుకనే సూరిగారు వానిని కూడ చూపిరి.

| | | |
|---|---|---|
| జి - జయించు | నీ - నయించు | ఇవి దీర్ఘాంతములు |
| ద్రు - ద్రవించు | లూ - లవించు | |
| ధృ - ధరించు | తౄ - తరించు | |

దన్త్య తాలవ్య చజలకు దప్ప తక్కిన వాని సావర్ణ్యము నిర్వచింపఁబడ లేదు కదా. అదెట్లు తెలియును? సంస్కృత వ్యాకరణము నుండి తెలిసి కొనవలెను. "అనుక్తమన్యతో గ్రాహ్యమ్," "తుల్యాస్య ప్రయత్నం సవర్ణమ్; అణుదిత్సవర్ణస్యచాప్రత్యయః" అను సూత్రములు మన తెనుఁగు వ్యాకరణమునకు ఆవశ్యకములు. ఈ సూత్రములవలననే సావర్ణ్యము గ్రహణక శాస్త్రము బోధపడుచుండ "దన్త్యతాలవ్య ములైన చజలు సవర్ణంబు" "లను సూత్రమేల? స్థాన భేదమును బట్టి దన్త్యతాలవ్యములైన చజ లకు 'తుల్యాస్య ప్రయత్నం సవర్ణ' మను సూత్రానుసారము సావర్ణ్యము లభింపక పోగా సంజ్ఞా 7 వ సూత్రము ప్రత్యేకముగా విధించుచున్నది. (ఇట్టి విశేషవిధి సంస్కృతమునను గలదు "ఋ ఌ వర్ణయోః మిథః సావర్ణ్యం వాచ్యమ్" ఋ కారము మూర్ధన్యము ఌ కారము దన్త్యము. అయినను ఇవి వార్తికము చే సవర్ణములు).

(౮) అట్లైన వ్యాకరణమున హ్రస్వాచ్చులకు విధింప బడిన కార్యము దీర్ఘములకును వర్తించునా? రాముఁడు + అతఁడు - రాముఁడతఁడు. "లూ + అను ధాతువు" ఇచ్చోటను సంధి యగునా? గిరి గిరులు, హరి హరులు. ఈ కారమునకు బహువచన ప్రత్యయము పరమైనపుడు ఉకారాదేశము వచ్చునా? అడుగవలసిన ప్రశ్నములే- సమాధానమేమన హ్రస్వాచ్చులకు తకారమును చేర్చి (సూత్రమున) ఉచ్చరించినచో నవి దీర్ఘ (ప్లుత) ములను గ్రహింపవు, ఇట్లు తెనుఁగు వ్యాకరణమున చెప్పఁబడ లేదే? అవును. "అనుక్తమన్యతో గ్రాహ్యమ్"సంస్కృత వ్యాకరణమున "తపరస్తత్కాలస్య" అను సూత్రము దీనిని బోధించు చున్నది. ఇట్లు త కారమును జేర్చి పలుకుటను తపరకరణ మందురు- ఉత్తునకు సంధి విహితము. ఊ కారము గ్రహింపఁబడదు. అది తత్కాలముకాదు. ఉకార మొక మాత్ర కాలము గలది. ఊ కారము రెండు మాత్రల కాలము గలది, కనుక "లూ యను ధాతు" వనవలెను. "ఇత్తునకు బహువచనంబు పరంగునపు డుత్వంబగు" తత్సమ 45. హరులు గిరులు, కవులు, రవులు, యామినులు, ధామినులు, "ఇత్తు" అనుటచే రెండు మాత్రల కాలముచ్చరింప దగు ఈ కారము గ్రహింవఁడదు. కనుక ఈ కారాంతములకీ సూత్రము వర్తింపదు. దీనినే "తపర కరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు. శ్రీలు, స్త్రీలు, లకోరీలు" అని సూరిగారు వ్రాసిరి.

(6) "నామ" మను సంజ్ఞను సూరిగారు నిర్వచింపక "నామంబు వా ప్రాతిపదికంబు" అని వివరించిరి. ప్రాతిపదిక మనిన మనకు (బాలురకు) బాగుగ తెలియునని తలంపు కాదు. అనుక్తమన్యతో గ్రాహ్యమని యాశయము. సంస్కృత వ్యాకరణమున ఈ సంజ్ఞ "అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్" "కృత్తద్ధిత సమాసాశ్చ" అను రెండు సూత్రములచే నిర్వచింపఁ బడినది. వీని జ్ఞానము తెనుఁగు వ్యాకరణమున కవసరము. (1) ప్రత్యయ, ప్రత్యయాంత ధాతువులలో నేదియు గాక అర్థవంతమైన శబ్ద స్వరూపము ప్రాతిపదికము (2) కృదంతములు, తద్ధితాంతములు, సమాసములు ను ప్రాతిపదికములు. ఈ రెండవ సూత్రమేల? కృత్ తద్ధితములు ప్రత్యయములు. ప్రత్యయాంతములు ప్రాతిపదికములు కావని మొదటి సూత్రము చెప్పుచున్నది. కనుక కృదంతమునకు తద్ధితాంతములకు ప్రాతిపదికత్వము మొదటి సూత్రముచే ప్రాప్తింపక పోగా రెండవ సూత్రము విధించుచున్నది. కృదంతములకు తద్ధితాంతములకు ప్రాతిపదికత్వము లేకున్న నేమగును? చిన్నాదులకు టికవర్ణకంబగు. (తద్ధిత. 8) చిన్న శబ్దమునకు టిక ప్రత్యయము (తద్ధిత ప్రత్యయము) చేర్చగా "చిన్నటిక" అగును దీనికి ప్రాతిపదిక సంజ్ఞ లేనిచో విభక్తి ప్రత్యయములు పుట్టవు. "చిన్నటికము" అను రూపము సిద్ధింపక పోవును.

"అక వర్ణంబు మాఱ్వాదులకగు" (కృదంత 19) మాఱు, అమ్ము పంపు ఇత్యాది ధాతువులకు "అక" యను కృత్ ప్రత్యయము చేరును. మాఱక, అమ్మక, పంపక అని సంధ్యనంతరము రూపమేర్పడగా ప్రాతిపదికత్వము కలదు గాన ము వర్ణకము వచ్చును, మాఱకము, అమ్మకము, పంపకము ఇత్యాది రూపములు సిద్ధించును.

ప్రాతిపదిక సంజ్ఞకు నింకను ప్రయోజనము కలదు. బేరము నేస్తము అను శబ్దములకు "కాక్తియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు" నను తద్ధిత 11వ సూత్రముచే కాప్రత్యయము రాగా బేరము + కా అని యుండ "ము" వర్ణకము ఎట్లు లోపించును? "బేరము + కా" అను దానికి తద్ధితాంతత్వమును బట్టి ప్రాతిపదికత్వమున్నది. "సుపోధాతు" ప్రాతిపదికయోః అను సంస్కృత వ్యాకరణ సూత్రముచే ము వర్ణకము లోపించును. ఈ సూత్రము తెనుఁగు వ్యాకరణ

మున లేదే? అను క్రమన్యతో గ్రాహ్యము కదా. "బేరకా" దీనికి "మహత్తు అగు మగాదులకుం గయరాదులకును డుజ్జగు నుత్వంబుగాదు." అను అచ్ఛిక 4 వ సూత్రముచే "డుజ్" వచ్చును. బేరకాఁడు; నేస్తకాఁడు.

కాప్రత్యయము "బేర" శబ్దమునకే యేల చేరదు? మువర్ణలోప మనవసరమగును కదా యని ప్రశ్నింప వచ్చును. "సుబంతాత్తద్ధితోత్పత్తిః" ప్రయోగార్హమైన పదమునకే తద్ధిత ప్రత్యయము చేరును అని సిద్ధాంతము. మఱియు అటాదిగణమున (ను అటనుటాములలోను జాలాదులలోను ఓ యాది గణమునను) ము వర్ణకాంతములు కొన్ని పఠింపబడినవి. ఇంతయే కాదు "సుబంతాత్తద్ధితోత్పత్తిః" అను సిద్ధాంతమునంగీకరింపనిచో "రామునితనము" ఇత్యాదిరూపములు సిద్ధింపవు. "తన వర్ణకంబు త్వార్థంబునందగు." (తద్ధిత-1) ఈప్రత్యయము "రాముని యొక్క" అను విభక్త్యంతమునకు చేరును "రాముని యొక్క + తన" అని యుండ తద్ధితాంత మగుటచే ప్రాతిపదికత్వము కల్గి "సుపో ధాతు ప్రాతిపదికయోః" అను సంస్కృత వ్యాకరణ సూత్రము ననుసరించి "యొక్క" అను "ప్రత్యయము లోపించును. "ని" ఏల లోపింపదు? అది ప్రకృతికి అంతావయవముగ వచ్చినది. ప్రత్యయ భాగము కాదు. "రామునితన" ప్రాతిపదికముగాన దీనికి ము వర్ణకము వచ్చును, రామునితనము.

ఇఁక సమాసమునకు ప్రాతిపదిక సంజ్ఞ కావలయునా? కావలెను. కూరలు + కాయలు అని పదములకు ద్వంద్వ సమాసము చేయగా విభక్తి ప్రత్యయములు "సుపో ధాతు ప్రాతిపదికయోః" అను సూత్రాను సారము లోపించును. కూర + కాయ. అట్లవసరము లేదు, "సమాసవిభక్తికి లోపంబగు లట్టునకు గాదు" అను (సమాస 26 వ) సూత్రముచే లోపము సిద్ధించును కదాయని వాదింప వచ్చును. సమాసమునకు ప్రాతిపదికత్వము లేకయే విభక్తి లోపము తెనుఁగు వ్యాకరణ సూత్రము చేతనే సిద్ధించును. నిజమే. కాని "కూరగాయ" అను సమాసమునకు ప్రాతిపదికత్వము లేనిచో విభక్తి ప్రత్యయము పుట్టదు. "కూరగాయలు" అను రూపసిద్ధి కుదరదు "కూరలు + కాయలు అను చోట కూరలు శబ్దము లోని 'లు' మాత్రము లోపించినచో కూరగాయలు సిద్ధించునుకదా" యని వాదింపవచ్చును. అది సరికాదు. "కాయలు" అను శబ్దములోని "లు" ప్రత్యయము కాయల

బహుత్వమును తెల్పుచున్నది. కాని కూరలయు కాయలయు బహుత్వమును దెల్పుట లేదు. అది కాయ శబ్దము నకు చేర్పఁబడినది. "అదంతయు నాకు ననసరము. రూపము కుదిరినది కాదా" అనరాదు. దానిలో వినిగమకము లేదు, అది యుక్తి రహితము. మఱియు నితర సమాసములలో నిట్టి గడుసు దనము సాయపడదు. చూడుఁడు "అలు + మగఁడు" అను శబ్దములకు ద్వంద్వసమాసము చేసినచో త్వదుక్తరీత్యా "అలు మగఁడు" అనునన్ష్ట రూపముండును. ఉత్తరపదవిభక్తి లోపింపదని కదా వాదము. సిద్ధాంతమువ నట్లుకాదు. సమాసవిభక్తి లోపింపగా "అలుమగ" అను సమాసమునకు ప్రాతిపదికత్వము, దాన నద్దానికి విభక్తి ప్రత్యయము, బహుత్వ ముము బట్టి "లు" వర్ణకము, వచ్చి "అలుమగలు" అయినది,

ఇట్లే తత్సమ 10వ సూత్రమున "చేత తోడ లోపల వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు" అని చెప్పి ప్రత్యయంబు వర్ణ కంబని ప్రాచీనులు వ్యవహరింతురు అని సూరిగారు వ్రాసిరి. వర్ణకమను తెఁగు వ్యాకరణ సంజ్ఞను సంస్కృత వ్యాకరణ ప్రసిద్ధమైన ప్రత్యయముచే వివరించుటచే ప్రత్యయపద మన్వర్థమనియు, కనుక సువిదితమనియు సూచింపఁ బడినది. (మబ్బులు అనగా మేఘములు అన్నట్లు. మనకు మేఘశబ్ద పరిచయ మెక్కువ.) ప్రకృతిం ప్రతి ఏతి ఇతి ప్రత్యయః ప్రకృతినిగూర్చి వచ్చునది (వచ్చి చేరునది) అనునర్థము గలదా శబ్దము. మఱియు సంస్కృతమున ప్రత్యయః, పరశ్చ అను సూత్రములచే ప్రత్యయము ప్రకృతికి పరమందు చేరు నని నియమము (బహుచ్ అనుప్రత్యయ మొక్కటి ముందు చేరును.) వర్ణక మును ప్రత్యయముగ వివరించుటచే నీ నియమము తెనుఁగునను కలదని చెప్పి నట్లైనది.

# 3

## పరిభాషలు

శాస్త్రమునందు, శాస్త్రకారుడు పాటించిన సూత్రరచనా పద్ధతులు, శాస్త్రములోని సూత్రములను అర్థముచేసుకొను రీతులు మొదలగు విషయము లను చెప్పునట్టి వాక్యములను పరి-భాషలందురు, పరి సర్వశాస్త్రీభాషంతేఅను

నర్థమున పరిభాషాఃఅను పదమేర్పడినది. పరిభాషలను ఆంగ్లమున Cannons of interpretation అందురు. సంస్కృత వ్యాకరణమున పరిభాషలు పెక్కులున్నవి. కొన్నింటిని పాణిని ఆచార్యుడే సూత్రములుగా రచించెను. మరికొన్నింటిని తాను రచించు సూత్రములలో పాటించి, సూచించెను. అట్టి వానిని జ్ఞాపిత పరిభాషలందురు. ఈ జ్ఞాపిత పరిభాషల స్వరూపమును, వీనిని జ్ఞప్తిచేయు జ్ఞాపకములను మహర్షి పతంజలి తన మహాభాష్యమునందు చెప్పెను, ఇంకను లోక న్యాయ సిద్ధములని వాచనికములని, మరిరెండు విధములైన పరిభాషలు కలవు, వీనినన్నింటిని తెలిసికొనినగాని సంస్కృత వ్యాకరణము సులభముగాను, సమగ్రముగను బోధపడదు, పరిభాషా సూత్రములుగాక ఇతరములు దాదాపు 180 గలవు. (వీనినన్నింటినిచేర్చి వివరించిన గ్రంథము పరిభాషేందు శేఖరము, దీనిని నాగోజిభట్టు రచించెను.)

తెనుఁగు వ్యాకరణమునందును చిన్నయసూరి 1. ఐత్తు బిందు పూర్వకంబగు (తత్సమ. 19), 2 అన్యయుష్మ దస్మత్కార్యంబులం దుత్తరంబు బలీయంబు, 3. ఇటన్ విశేషం బుత్పర్గంబునకు విభాషను బాధకంబగు. ఇత్యాది పరిభాషలను కొన్నింటిని చెప్పెను. ఇవిగాక కొన్ని సంస్కృత పరిభాషలను సూత్ర రచనలకు ఆధారముగా చేసెను. వానిని క్రింద కమపరిచిన విధముగా విభజింపవచ్చును.

వ్యాకరణ కార్యములు నాలుగు విధములు. 1. ఆదేశములను ఇచ్చునవి, 2 ఆగమములను చెప్పునవి. 3. లోపములను చేయునవి, 4. ప్రత్యయాదులను విధించునవి. ఈ నాల్గు కార్యములను క్రిందికారిక చక్కగా వివరించుచున్నది.

స్థానే శత్రువ దాదేశః
ఫాలే పుండ్రవ దాగమః
దంతానామివ లోపస్స్యాత్
మిత్రవత్ ప్రత్యయా పరే.

లోపమునైత మొకవిధమైన ఆదేశమని సంస్కృత వ్యాకరణ సాంప్రదాయము. ఆదేశము దేనిస్థానములో వచ్చునో దానిని "స్థాని" అందురు.

దీనిని చిన్నయసూరిగారు క్రియా 66 సూత్ర వివరణలో "ఋస్థానికంబగు గుణంబు రపరంబయి యుండు" అని వాడియున్నారు.

సంస్కృత వ్యాకరణమున ఆదేశములను గూర్చిన పరిభాషలు కొన్ని యున్నవి, ఆదేశము ఒకే వర్ణమైనచో అది స్థానియొక్క చివరి వర్ణములకు వచ్చును, 'అలోన్త్యస్య' అని సూత్రము. ఆదేశమునందు ఏకాధిక వర్ణము లున్నను, శకారము ఇత్‌గాగల ఒకేవర్ణమైనను స్థానికంతటికి ఆదేశించును. తెనుగు వ్యాకరణమునందు సూరిగారు సాధ్యమైనంతవరకు సంస్కృత వ్యాకరణ పరిభాషల ఉపయోగము లేకుండునట్లే సూత్రములను రచించెను. ఎట్లనగా స్థానిని నిర్దేశించుటలో స్పష్టతను శ్రద్ధను చూపెను. కర్మధార యంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. (సంధి-82) పు,ంపు అను ఆదేశ ములు ము(మకార, ఉకారముల)స్థానమున వచ్చును, కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు బహువచనము పరంబగునపుడు నిత్యముగానగు. (అచ్ఛిక. 18) 'కుజ్' అనునది అనేకాల్లు. ఇది నకార, ఉకారముల రెంటిస్థానమున వచ్చును, ఇట్లు ఉదాహరణములనెన్నేని చెప్పవచ్చును. తేతేరులు తెచ్చున కగు(క్రియా. 93). వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు (తత్సమ .56) ఇట్లు స్థానులను నిర్దేశించుటలోనే స్పష్టతయుండగా "అనేకాల్ శిత్ సర్వస్య" అను పరిభాష. అవసరములేదు. సర్వాదేశము లన్నియు తెనుఁగునందు సాధారణముగా అనే కాల్లులే, ఒకేవర్ణము ఎక్కువ వర్ణములుగల స్థానికి ఆదేశముగా నీయతలచి నపుడు సూరిగారు ఇంకను శ్రద్ధను సూచనను చూపును.

ఉదంత సంస్కృత నామంబుమీఁది సంబుద్ధి డుజ్జునకు నూకారంబు ప్లుతంబా దేశంబు విభాషనగు. (తత్సమ-85) ఈ సూత్రమున ఆదేశంబు అను పదము ప్లుతోకారము సర్వాదేశమని తెలుపుచున్నది. ఓ విష్ణూ (8). ఔప విభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబు గానగు (అచ్ఛిక-88) అత్వమనగా అకారము ఒకేవర్ణము, తృతీయా సప్తముల ప్రత్యయములు చేత, తోడ, అందు, న లు అనేకాల్లులు. అకారము అంతా దేశమగునా యను సందేహము లేకుండుటకై "ఆదేశము" అను పదము సూత్రమునందు నివిష్టమైనది. "ఇచ్చునకు సర్వంబున కీయగు" (క్రియా-92). సర్వంబునకు అనుపదముచే ఈకారము సర్వాదేశమని సూచింపఁబడినది. ఇందుకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగానగు. (అచ్ఛిక-23).

ఎకారము సర్వాదేశమనుటకు సూత్రమునందు మాఱుగా అనుపదము చేర్చ బడినది చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని ను-స్థానంబున బిందువేని విభాషనగు (క్రియా-55) బిందువు ఏకాల్లు ఇది "ను"అను నక్షరము నకు సర్వాదేశమని సూచించుటకే "నుస్థానంబున" అను రచన చేయఁబడినది. ఈ పద్ధతినే సూరిగారు (క్రియా-58) సూత్రమునందును అవలంబించి యున్నారు. తి దు ట లు పరంబగునపు డన్వాదుల నుస్థానంబున నున్నయు నుండు డులోపంబును విభాషనగు. (క్రియా. 58) ఇట్టిసూత్రములలో ప్రత్యేక శ్రద్ధ యేలచూపఁబడినది? సూత్రకర్త మనస్సునందు సర్వాదేశము అనేకాల్లు కావలెననియు, శకార మిత్తుగా నీయఁబడలేదనియు మెలఁగుచున్నది "ఇచ్చున కీశ్ అగు" అనినచో "అనేకాల్శిత్ పరస్య"అను పరిభాషా జ్ఞానము అధ్యేత కవసరమగును.

కాని కొన్ని చోటులందు ఎట్టి సూచనయు లేదు. "అగు పోవుల కడ వ్రాల కిద్వక్రంబులు పరంబు లగునపుడు యకారంబగు." (క్రియా-99) గు, వు అనునవి స్థానులు. ఆదేశము యకారము మాత్రమే, ఏకాల్లు. ఇది సర్వాదేశమనుటకు సూచనలేదు. "ఆచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగానగు" (క్రియా-108) ఆదేశములు ఐకార ఔకారములు, ఏకాల్లులు. స్థానులు బహువర్ణకములు "చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు" (క్రియా. 109) స్థాని అనే కాల్లు, ఆదేశము తకారమాత్రమే, ఏకాల్లు ఇట్టిచోట్ల నివి సర్వాదేశములని వ్యాఖ్యానింపవలెను. సూరిగారు ఉదాహరణములచే నట్లు వ్యాఖ్యానించిరి.

ఇట్లు రచనను సాగించియు, కొన్నిచోట్ల అలోన్త్య పరిభాషను ఆధార ముగాజేసి సూత్రములను వ్రాసెను. 1. చేత, తోడ, వలన ల కిత్వంబు సమాసంబు లంటగు. సంధి-(43) ఆదేశము, ఇకారము, ఏకాల్లు. ఇది తుదివర్ణము నకే ఆదేశించును. నీచేతి ప్రోపు, నాతోడి చెలిమి, నీవలని భయము, 2. ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు ( తత్సమ-52) భ్రాతృ జామాతృ, కర్తృ, భర్తృ మొదలగు శబ్దములు ఋకారాంతంబులు. ఈ శబ్దములన్నింటికి స్త్రీవద్భావంబు కలుగును. అదే వాక్యముననే అత్వమగు నని కలదు. ఋకారాంతంబున కత్వంబుఅగునని సూత్రింపఁబడినను, అకారాదేశము ఋకారమునకు మాత్రమే. ఎందులకు? "అలోన్త్యస్య" విధాత్ర

ధాతృ సవితృనేతృశబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీవద్భావంబులు విభాషనగు (తత్సమ 53) అను సూత్రమునను అత్వము అన్త్యాదేశముః. ఎట్లు "అలో న్త్యస్య", షష్ఠీ నిర్దిష్టస్యాన్త్యస్య అలః ఆదేశః స్యాత్. అల్ అనగా వర్ణము. ఈ సంస్కృత పరిభాషను మనమేల గ్రహింపవలెను ? అనుక్తమన్యతో గ్రాహ్యమ్. (4) రై గ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు. (తత్సమ. 64) ఓకారము చివరి వర్ణమునకే ఆదేశించును. రై, రో, గ్లౌ, గ్లో. (5) ఊరు మొదలగువాని కిత్వంబగు. (ఆచ్ఛిక. 30) ఊరు, ఊరిని, కాలు, కాలిని, మ్రాను మ్రానిని ఇత్యాది. ఇకారము అంత్యాదేశము (6) టివర్ణంబు పరంబగునపుడు క్రిందు, మీఁదు, ముందు, వు వర్ణంబుల కత్వంబగు (అచ్ఛిక 37) అత్వమన అకారము. ఏకాల్లు. ఇది అన్త్యాదేశము. ఏల ? "అలోన్త్యస్య". క్రిందటి, మీదటి, ముందటి మాపటి. (7) దివీతరంబగు డుజ్ఞపరంబగునపుడు ఉన్నాను బంధంబునకు దీర్ఘంబగు. (క్రియా. 15) దీర్ఘము అంత్యాదేశము. ఉన్నాఁడు, ఉన్నారు ఇత్యాదిగ రూపములేర్పడును (8) ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. (క్రియా. 30) మనము వందుదము. అకారాదేశను తుది వర్ణమునకు వచ్చును. (9) "అక్కటాదుల జడ్డకు లోపంబు విభాషనగు. ప్రకీర్ణ. 6". జడ్డ యనగాద్విరుక్తమైన హల్లు "అక్కట" లో కరద్వయము జడ్డ. మఱి జడ్డకు లోపమనిన నెట్లు ? అలోన్త్య పరిభాషచే జడ్డలోని చివరి వర్ణము లోపించును. "అకట".

"ఆదేశము ఒకే వర్ణమైనపుడు అది తుది వర్ణమునకుగాక దేనికి వచ్చును? ఉన్నాను బంధమునకు దీర్ఘమనిన చివరి యకారమునకే కాక దేనికగును ? "ఉన్నను" అను రూపమెక్కడేని యుండునా ? అట్లేర్పడినను (సమాస. 13) చే హ్రస్వంబాదేశంబగును కదా ?" అని వాదింపవచ్చును. నిజమే అట్లైన సూరిగారు (సంధి. 51) లో అనుకృతిని నమ శబ్దము తుది యత్తునకోత్వము విభాషనగు. (సంధి. 51) అని ఏల చెప్పెను ? అను కృతిని నమశ్శబ్దమునకు ఓత్వము విభాషనగు అనిన చాలదా ? రై గ్లౌ శబ్దంబులకు వలే దీనికిని ఓత్వము తుది వర్ణమునకే వచ్చియుండును గదా ? సూత్రకారుడు ఇట్లు తుది యనుశబ్దమును తత్సమ పరిచ్ఛేదపు 32, 33, 54, 68, 80 సూత్రములలోను, ఆచ్ఛిక 35 లోను వాడియున్నాడు. ఈ సూత్రములలో అలోన్త్య పరిభాషపై సూత్రరచన ఆధారపడలేదు. "అంత" శబ్దము వాడి-

నను ఒకచోట సందేహము వచ్చినది. ట వర్ణకం బాడ్వాదుల కగు నగుచో నంతలోపంబగు. (కృదంత. 7). ఇచ్చట అంతలోపం బనగా వర్ణలోపమా? అక్షరలోపమా? అక్షరలోపమని వ్యాఖ్యానింపవలెను. ఆడు, ఆట, ఊరు ఊట ఇత్యాద్యుదాహరణములచే సూరి అక్షరలోపమను వ్యాఖ్యానమును సూచించెను. తత్సమ- 81 లో "మహాద్వాచకంబు లగు సాంతంబుల కంత లోపంబేని" అనుచో అంతలోపమనగా హల్మాత్ర లోపమే.

ఇక దీర్ఘము తుది అచ్చునకే కదా అను వాదమున్నది. అట్లనుటకు వీలులేదు. "ఇక కవులు పరంబులగునపుడు కమనకు దీర్ఘంబగు". (కృదం-3 సూత్రవివరణ) ఈ దీర్ఘము కములోని ఉకారమునకు కాదు. అకారమునకు "కామక కామపు" ఈ దీర్ఘంబెట్లు? వ్యాఖ్యానము వలన "కానుక" అను సూత్ర కారోక్తోదాహరణ మట్లు వ్యాఖ్యానించినది. ఇట్లన్ని స్థలములలో వ్యాఖ్యానమే శరణ్యమా? కాదు ఎన్నో సూత్రములలో తొలి యచ్చు మీది వర్ణములకెల్ల, (సంధి. 38) తొలి దీర్ఘంబునకు (ప్రకీర్ణ. 12) అద్యక్షర శేషంబులై (కృదంత. 8) తొలి హల్లునకు (ప్రకీర్ణ. 10) అద్యక్షరములకు (ప్రకీర్ణ. 22) ప్రథమాక్షరంబులు (తత్సమ. 10) అని ప్రత్యేక నిర్దేశమును చేసియున్నాఁడు.

ఆదేశముల విషయమున మఱొక సంస్కృత పరిభాషాజ్ఞానమవ సరము. "సంస్కృత సమంబులం దికారాంతములయిన శబ్దముల యుపధా చ జలు బహువచనంబు పరంబగునపుడు దంత్యములగును." (సంజ్ఞా. 10) ఇక్కడి ప్రక్రియను గమనింపుడు, అర్చి + లు, వాజి + లు. శబ్దము లికా రాంతములు. ఇకారమునకు ముందు వర్ణములు చకార జకారములు. ఇవే, ఇట్టివే ఉపధా చ జ లు వీనికి దంత్యములగును. అనగా చ, జ లాదేశము లగును. ఎప్పుడు? బహువచనము పరంబగునపుడు. వేనికి? "ఉపధాచజలకు" అని సూత్రముననే యున్నది కదా? కాని చజలకు బహువచనము పరమందు లేదే. ఇకారము మధ్య మున్నదే. అవును. మఱి సూత్రమెట్లు ప్రవర్తించును? దీనికి "యేన నావ్యవధానం తేన వ్యవహితేపి" అను సంస్కృత వ్యాకరణ పరిభాష సమాధానము. యేన- దేనిచేత, న + అవ్యవధానం – వ్యవధా నము తప్పకయుండునో, తేన – దానిచేత, వ్యవహితేఽపి – వ్యవహితమైనను కార్యములు జరుగును అని అర్థము. ప్రకృతము చ జ లకును బహువచనము

నకును నడుమ ఇకార వ్యవధానమున్నది. ఇది తప్పనిసరిగా నుండవలసినదే, లేనిచో చజలు ఉపధా చజలు కాకపోవును. ఉపధ యనగా దుదివర్ణమునకు ముందు వర్ణము. చివర ఇకారములేనిదే చ జ లెట్లు ఉపధలగును? కనుక ఉపధా చజలకు బహువచనము పరమైనట్లే. ఇకార వ్యవధానము సహింప వలసినదే. ఇట్లే "సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగు నపుడు గుణంబగు" (క్రియా. 63)

ఖిద్-భేదించు, ఛిద్-ఛేదించు, పుష్-పోషించు, హృష్-హర్షించు. ఈ ఉదాహరణములలో లఘూపధములకు ఒక హల్లు వ్యవధానముండగా ఇంచుక్కు పరమైనది. "వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు (తత్సమ. 46)" కలికి, ములికి, చెలిమి, బలిమి, ఇత్యాదులు ఇకారాంతములు గలవి. వీని ఉపోత్తమము. అనగా తుది అక్షరమునకు ముందరి అక్షరము నాల్గింటిలోను "లి" అను అక్షరము ఉపోత్తమము దాని ఇకారమునకు ఉపోత్తమేత్వము అని పేరు. ఈ శబ్దముల ఉపోతమేత్వమునకు ఉకారము ఆదేశమగునని సూత్రము చెప్పుచున్నది. ఎప్పుడు? బహువచనము పరమగునపుడు. కలికి + లు బహు వచనము తుది ఇకారమునకు పరమైనది. ఉపోత్తమేత్వమునకు కాదు. అయి నను "యేన నా వ్యవధానం తేన వ్యవహి తేపి" అను పరిభాషానుసారము ఉత్వము వచ్చును. కలుకులు, ములుకులు, చెలుములు, బలుములు ఇత్యా దులు. చివరి ఇకారమునకు ఉత్వము (తత్సమ. 45) చే వచ్చును.

సంస్కృత వ్యాకరణమున ఆదేశములు స్థాని, ధర్మములను కలిగి యుండునని "స్థానివదాదేశో నల్విధౌ" అను పరిభాషా సూత్రము చెప్పు చున్నది. ఒక జిల్లాకు క్రొత్త కలెక్టరు వచ్చెననుకొనుఁడు. ముందుండిన అధికారి యే యే సంస్థలలో పదవిని బట్టి కార్యవర్గ సభ్యుడుగ నుండెనో ఆయా సంస్థలలో క్రొత్త కలెక్టరు సయితము సభ్యుడే యగును అట్లే ఒక స్థానియందు వ్యాకరణ సూత్రమును బట్టి వచ్చిన ఆదేశము స్థాని గుణము లను కలిగి యుండును. ఈ పరిభాష తెలుగు వ్యాకరణమునందును మన మంగీకరింపవలెను. (1) ఔపవిభక్తికముల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగానగు. (అచ్చిక. 88) తృతీయా విభక్తి ప్రత్యయ ములకు బదులుగా అకారము వచ్చును. ఇది సర్వాదేశం బనియు, ఆదేశ

పదంబట్లు చెప్పుచున్నదని ముందు మనవి చేసితిని. ఇపుడీ అకారమునకు విభక్తిత్వంబున్నది, ఇది స్థానివద్భావము చే కల్గినది. ఈ ఆదేశమునకు విభక్తిత్వము లేకున్న నేమి ? అట్లు లేకున్నచో "తృతీయాదులకు నుగాగమంబగు"(తత్సమ 8) అను సూత్రముచే నుగాగమంబు రాకపోవును. రాకున్న నేమి ? ఊరన్ + ఉన్నాడు = ఊరనున్నాడు గొడ్డట నరికెను. అనుచోట్ల ద్రుతము రాకపోవును. వలుతం గలిసె ననుచో అరసున్నయు, సరళాదేశము రాకపోవును. (2) దవిీతరంబగు డుజ్జు పరంబగునపుడున్నాను బంధంబునకు దీర్ఘంబగు (క్రియా. 15) డుజ్జు అనగా డుబ్రువులును ముజ్జులు. ఈ అరింటిలో ది, వి, అనునవి లేవు. కనుక దవిీతరంబగు నవనేల ? క్రియా 12 సూత్రముచే "అమహదర్థంబునందు డుబ్రులకు దువులగు నున్నాను బంధంబు మీఁద దివియగు (క్రియా. 12) అను సూత్రముచే డుబ్రులకు దివి, దువులు ఆదేశమగు. ఈ ఆదేశములు స్థానివంటివి. స్థానిని గ్రహించుటచే వీనిని గ్రహించినట్టగును. కనుక "దవిీతరంబయిన" సార్థకము. దివి అనునవికాక తక్కిన డుజ్జులు పరమగునపుడు ఉన్నానను బంధంబునకు దీర్ఘంబు వచ్చును. (3) అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు (క్రియా. 100) అగు అను ధాతువు యొక్క కడ్రవాలునకు ఇకార వక్రంబులు పరంబులగునపుడు యకారము సర్వాదేశమగును. అని క్రియా. 99 వ సూత్రము చెప్పుచున్నది. ఈ 100 వ సూత్రము వక్రము గూడుచో అగునకు దీర్ఘమును విధించుచున్నది. పై సూత్రముచే అగు + ఎను అనియుండ యకారాదేశము రాగా అయ్ + ఎను అను దశ ఏర్పడును. ఈ దశలో "అగు" అను ధాతువు ఎక్కడున్నది? అది అయ్‌గా మారియున్నది. మఱి దీర్ఘమెట్లు ప్రవర్తించును ? ఏకదేశమునందు. అనగా ఒక భాగమందు మార్పున్నను, ఆ శబ్దము భిన్న శబ్దముకాదు, తోక తెగినంత మాత్రమున కుక్క, కుక్క కాకపోవునా ? దీనిపై నాధారపడి "ఏకదేశ వికృతం అనన్యవత్" అను పరిభాష యేర్పడినది. దానిని బట్టి అయ్ అనునదే అగు ధాతువు.

ఈ సూత్రప్రవృత్తియందు మఱియొక విశేషమున్నది. యకారాదేశము వచ్చిన పిదప అగు ధాతువు హలంతమైనది. దీనికి దీర్ఘము వచ్చుననిన, దేనికి వచ్చును ? యకారమునకు దీర్ఘము లేదే ? ఈ ప్రశ్నకు సమాధాన మేమనగా "అచశ్చ" అను పరిభాషా సూత్రము. హ్రస్వము, దీర్ఘము

ప్లుతము అను శబ్దములచే సూత్రము అచ్చును విధించినచో నది అచ్చునకే కలుగును. దీనిని బట్టి అకారమునకే దీర్ఘము వచ్చును. యకారవ్యవధానము అడ్డురాడు. "ఆయెను"

"ఏకదేశ వికృత మనన్యవత్" అను పరిభాషకు మఱిరెండు లక్ష్యములున్నవి మన తెనుగు వ్యాకరణమున. 1 తత్సమ ప్రకరణపు 25, 26 సూత్రములలో "ను" అను ద్వితీయా విభక్తి ప్రత్యయము కొన్నిచోట్ల "ని" గా మారు నని చెప్పబడినది. "ను" "ని" లలో ఏకదేశమునందు మాత్రమే మార్పు కలిగినది. "ను" అనునది ద్రుతము అనగా ద్రుతమునకు ప్రకృతి భావ రూపము. పై పరిభాషను బట్టి "ని" అనునది ద్రుతము. దీనికి ఈ పేరు లేకున్న నేమి? లేకున్నచో చూచెను రాముని నడిగెను మగనిన్ ఇత్యాది వాక్యావసానములందు ద్రుతస్వరమునకు లోపము సిద్ధింపకుండును. 2. రైగ్లౌ శబ్దముల కొత్వంబగు (తత్సమ. 64) ఓత్వము అంత్యాదేశమని ముందు మనవి చేసితిని. రైగ్లౌ శబ్దముల ప్రథమైకవచనము "ఇగ్లౌ రాయు గంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు (తత్సమ. 44) అను తత్సమ 44 సూత్రముచే లోపించును. ఓత్వము వచ్చిన పిదప నయితము ఇగ్లౌసూత్రము చేతం బ్రథమైకవచవమునకు లోపంబు" కలుగునని సూరిగారే 64 వివరణలో వ్రాసిరి. ఇగ్లౌ సూత్రమునందు గ్లౌరై అను శబ్దములు పఠింపబడినవి గాని రోగ్లో శబ్దములు లేవే? మఱి యా సూత్రముచే వీని ప్రథమైకవచనమెట్లు లోపించును? "ఏకదేశ వికృత మనన్యవత్" రోగ్లోలు రైగ్లౌలే.

కొన్ని సూత్రములలో స్థాని నిర్దేశింపఁబడలేదు. "సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు" క్రియా, 66 గుణంబగుననిన, దేనికగును? లఘూపధంబునకు అది ఏప్రాణమైనను కావచ్చునా? అ, ఇ, ఉ, ఋ, ఌ లు లఘువులు. అన్నింటికిని గుణము ప్రాప్తించునా? దీనికి సమాధానము సూత్రమున లేదు. కనుకనే సూరిగారు వివరణమున "ఇ, ఉ, ఋ, అను వానికి సొరిదిని ఏ,ఓ అర్ అనునవి"...అగుననిరి. ఈ యర్థ మెట్లు లభించినది? "ఇకో గుణ వృద్ధీ" అను సంస్కృత పరిభాషా సూత్రము కలదు, ఏ సూత్రమున "ఇకః" (ఇక్కులకు) అను షష్ఠ్యంత పద మున్నటలే ఎఱుంగవలెనని ఆ పరిభాష యర్థము, ఇక్కులనగా ఇ, ఉ, ఋ

(ౠ) అను వర్ణములు. వీనిలో అవర్ణము లేదు. కనుక భక్షించు రక్షించు
త్యజించు ఇత్యాదులలో లఘూపధ గుణము రాదు. ఋస్థానికంబగు గుణంబు
రపరంబయి యుండు నను పంక్తియు "ఉరణ్రపరః" అను పాణినీయ సూత్ర
మును అనుసరించియే అని గ్రహింపవలెను

మఱియొకటి "తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెత్వంబు
చూపట్టెడు." (తద్ధిత. 20) ఎత్వము దేనికి? తత్పూర్వాక్షరమునకు పూర్వ
సూత్రము కులవాచకంబునకు స్త్రీ వాచ్యంబగు నపుడు కుత్సితార్థంబునందు
తవర్ణకంబును విధించినది. కులవాచక శబ్దముల చివరి యచ్చున కెత్వమని
గ్రహింపవలెను. ఇట నెత్వము అలోన్త్య పరిభాషానుసారము ప్రవర్తిల్లును.
చెంచెత. మాలెత

ఇక ఆగమములను గూర్చిన పరిభాషలు. ఆగమము అనగా వర్ణా
ధిక్యము అని సూరిగారు సంధి 3 లో చెప్పిరి. వర్ణాధిక్యమను సమాసము,
వర్ణము యొక్క అధిక్యము అను అర్థమునందును వర్ణముల యొక్క అధిక్య
మను అర్థమునకు తుల్యరూపము కలిగియున్నది. ఇక్, ఉక్ లోనగు ఏకవర్ణా
గమములును టుక్ అలిక్ అరక్ లడాది బహువర్ణాగమములును "వర్ణాధి
క్యంబు" అను నిర్వచనముచే గ్రహింపఁబడుచున్నవి.

ఆగమములు రెండు విధములు టిత్తులు, కిత్తులు, టకార మిత్తుగా
గలవి టిత్తులు. తెనుఁగు వ్యాకరణమున మూడే టిత్తులున్నవి. యట్,
లట్, ఇయుట్ అనునవి. తక్కినవి కిత్తులు, కకారమిత్తుగా గలవి. ఇత్తనగా
నేమి? "కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు
మానంబడు వర్ణమిత్తనంబడు" అని సూరిగారు తత్సమ 19 వ సూత్రవివర
ణలో చెప్పిరి. (దీనిని సంధి 8 వ సూత్రముననే చెప్పియుండఁదగినది) ఈ
వాక్యమునందు ఆది పదము ఆగమానుబంధములను గ్రహించును. "వర్ణ
మిత్తనంబడు" అనుచో ఏకవచన మతంత్రము. వర్ణముగాని వర్ణంబులు గాని
ఇత్తనంబడు అని యర్థము, మఱియు తెనుగు వ్యాకరణమున వర్ణమనగా
అక్షరమనియు నర్థము. దీనిచే నుజీ, పడజీ, ఽజీ ప్రభృతులలో వర్ణద్వయ

ము న కిత్సంజ్ఞ సిద్ధించుచున్నది. సంస్కృత వ్యాకరణమున "ఉపదేశేఽజను నాసిక ఇత్, హలన్త్యమ్" లోనగు సూత్రములచే ఇత్సంజ్ఞ విధింపబడినది, మఱియు "తస్య లోపః" అను సూత్రముచే వీనికి లోపము చెప్పబడినది. ఈ రెండు పనులను చేర్చి సూరిగారు పై వాక్యమును వ్రాసిరి. ఇట్లు వ్రాయు టలో నొక విశేషమున్నది. పడ జి మొదలగు వానిలో "జి" మొత్తమునకు పాణినీయ సూత్రముచే ఇత్సంజ్ఞ లభింపదు. సంస్కృత సూత్రానుసారము ఇత్సంజ్ఞ తెలిసికొందరని విడిచి పెట్టినచో నిట క్లేశము గలిగియుండును. యథాన్యాసములో నట్టి క్లేశము లేదు ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయో గమునందు మానబడు వర్ణముకదా కనుక "జి" ఇత్తు,

అగమములను టిత్తులుగను, కిత్తులుగను విధించుటవలన విశేషమేమి? దీనికి తెనుగు వ్యాకరణమున సమాధానము లేదు. "ఆద్యన్తౌటకితౌ" అను పాణినీయ పరిభాష టిత్తులు ఆద్యవయవములని కిత్తులు అంతావయవములని చెప్పుచున్నది. యట్ అను అగమము టిత్తు. ఇది "సంధిలేనిచోట స్వరంబు కంటెంబరంబయిన స్వరంబునకు యడాగమంబగు" (సంధి 8) అను సూత్రముచే రెండవ స్వరమునకు అధిక వర్ణముగ చేరును ఈ చేరుట యకారము ఎక్కడ చేరును? పరస్వరమునకు ఆద్యవయవముగ చేరును? మా + ఊరు. అని యుండ యకారము ఊకారమునకు మొదటి అవయవముగచేరి "యూ" అగును, మా + యూరు-మాయూరు ఆద్యవయవము గానగునని చెప్పనిచో దోషమేమి? ప్రత్యయములు, అనుబంధములు వేనికి విధింపబడునో వాని కవి పరమందు వచ్చును. యడాగమమనక, యకారాగమమనిన ఈ యాగమ స్థానము పరస్వరమునకు పరమందమని పొరపడుటకు వీలున్నది మా + ఊయ్రు అను విరూపము ఏర్పడకుండుటకు యకారము అద్యవయవముగ నీయబడినది. ఇట్లే లట్, ఇయుట్, అను అగమములు టిత్తులు ఆద్యవయవ ములు. లడాగమము (తత్సమ 81) వ సూత్రమునందు విధింపబడినది. బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమంబగు (తత్సమ 81) ల అనునది అగమము. లకార అకారములుగల అక్షరము ఇది "లను, లచేత, లకొరకు, లకు" ఇత్యాదిగా విభక్తి ప్రత్యయములకు ముందు వచ్చి చేరును. ల అను అక్షరము ద్వితీయాది విభక్తులకు ముందు వచ్చును అని చెప్పిన చాలును కదా? ద్వితీయాది విభక్తులకు ఆద్యవయవముగ వచ్చునని చెప్పనేల? అడుగవలసిన

ప్రశ్నమే లడాగమము విభక్త్యవయవము కానిచో వృక్షములచేత అను రూపము సాధ్యముకాదు. ఎట్లన "వానికి మువర్ణ కేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు" (తత్సమ 40) వృక్ష + చేత అని యుండ బహుత్వంబున "ల" అను అక్షరము వచ్చును. ఇది విభక్త్యవయవము. వృక్ష + లచేత దీనికి ముగాగమము రావలెను, వృక్ష అను ప్రాతిపదికకు పరమైనది విభక్తి కావలెను. అప్పుడే ముగాగమము వచ్చును. వృక్షము కొరకు, వృక్షముయొక్క ఇత్యాదులలో క్లేశము లేదు. బహువచనములు లడ్విశిష్టమైనవి "విభక్తి" కావలెను. కనుక లడాగమము ఆద్యవయవముగనే యుండవలెను. నుగాగమము సిక్ నక్ ఇత్యాద్యాగమములు కిత్తులు. ఇవి పాణినీయ పరిభాష సూత్రముచే అంతావయవములు. వేని కివి విధింపబడునో వాని చివరి భాగములుగా వచ్చి చేరును.

సూరిగారు యట్టగును లట్ అగును అని రచింపక యడాగమంబగు, లడాగమంబగునని ఆగమ శబ్దమునుచేర్చి సూత్రరచన గావించియున్నారు, కొన్ని సూత్రములలో మాత్రము ఆగమశబ్దము లేదు. "సంస్కృతంబున కంగ లామల కించుక్కగు" (క్రియా 68) ఇ ఉ ఋ కించుక్కు పరంబగునపు డయుగవు గరుకులగు. (క్రియా. 64). సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు (క్రియా 70) ఈ సూత్రములలో కకారమిత్తుగా నుండుటనుబట్టి, వీనిని అంతావయవములుగా తెలిసికొనవలెను. ఇంకను కొన్ని సూత్రములలో టకార, కకారములను ఇత్తులుగ నీయక సూరిగారు వానిని విశేషించి అంతాగమంబులుగా విధించిరి " ఓ శబ్దంబునకుం బురుష నీచ స్త్రీపురుషామంత్రణంబులందు యి-సి-రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు (తత్సమ 16)టి వర్ణంబు గొన్నింటి యంతాక్షరంబు న కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికి బర్యాయంబున రెండును బ్రాయికంబుగనగు (అచ్చిక. 31) ఆట్లు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును...నగు. (అచ్చిక-84) ఇట్లే కారక పరిచ్ఛేదమున వు-ను-లు. రు-ము-లు అంతాగంబులు ప్రాయికంబుగా విధింపఁడినవి, ఇవిగాక కొన్ని సూత్రములలో పూర్ణబిందుపూర్వక డకారంబు ఆగమంబుగ విధింపఁబడినది. ఇది దేనికి అవయవమో చెప్పఁబడ లేదు. అచ్చిక 6. సూత్రము చూడుఁడు. అచ్చిక 32, 33 సూత్రములలో పూర్ణబిందువు ఆగమమే. ఈ విధముగా ఆగమములను విధించుటలో

సూత్రమునందు "అంతా" అను పదమును చెప్పవలసియున్నది. టిత్, కిత్ కరణములలోని రచనా లాఘవమును స్ఫురింపజేయుటకు సూరిగారు ఈ సూత్రముల నిట్లు రచించిరి కాబోలు!

ఆగమములకు మఱియొక గుణమున్నది. ఆగమము అనెడి అవయవము ఏ అవయవికి చేరునో దాని గుణమును పొందినదై దానిని గ్రహించు దానిచే గ్రహింపఁబడును. (దీనికొక లౌకికోదాహరణము చెప్పెదరు. ఒక సంచికి ఒక పుస్తకమును చేర్చినచో అది సంచిని గ్రహించినపుడు గ్రహింపబడును. ఒక పుస్తకమునకు ఒక బొమ్మ నతికించినచో పుస్తకము నెత్తినపుడు బొమ్మయు గ్రహింపబడును ఇట్లే) విభక్తికి లడాగమము చేరినచో విభక్తి యనగా లడ్విశిష్ట విభక్తి ప్రత్యయమును గ్రహింపఁబడును. "సమాస విభక్తికి లోపంబగు" అనినచో లడ్విశిష్ట విభక్తికిని లోపము ప్రాప్తించును. కనుకనే "ఇట్టునకుకాదు" అను నంశము సార్థకము మఱియు "కాలురు కాలుర చేతను" అను రూపప్రక్రియను గమనింపుఁడు. కాలు + చేతను అని యుండగా బహుత్వవివక్షఁ జేసినపుడు తత్సమ 81చే లడాగమము వచ్చును. ఈ యాగమము విభక్త్యవయవము కానిచో నిది విభక్తిలకారము కాకపోవును అపుడు "అదంతంబయి దీర్ఘ పూర్వలోపధంబయిన మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు". (తత్సమ-88) అను సూత్రముచే రేఫాదేశము రాక పోవును. మఱియు నాచ్ఛిక పరిచ్ఛేదములో 5, 8, 9, 10, 11 సూత్రములలో "బహువచనలకారమునకు" అను దళము లడాగమము విభక్తికి చెంది తద్గ్రహణముచే గృహీతమయినపుడె సాధువగును. అపుడే పగతురును గండం డ్రనుచేతను, విలుకాండ్రచేతను, చేయువులను, అండ్రను ఇత్యాదిరూపములు సిద్ధించును. ఆచ్ఛిక 12వ సూత్రమున "బహువచనము పరంబగునపు"డనిన లడ్విశిష్ట ప్రత్యయము పరంబగునపుడను నర్థమిప్పినము అప్పుడే గుండ్లచేతను మొదలగు రూపములు కుదురును. దీనికి యడాగమ పరిభాష ఆవశ్యకము "బహువచనము పరంబగుడు" అను దళము ఆచ్ఛిక 13, 18, 19, 20, 21, 22 సూత్రములందును గలదు, సొరిదిని త్రాళులచేత, కలఁకులను, గోఁగులను, మీలను, ఊలచేతను, ఆలను వంటి రూపములా సూత్రములచే చేర్పడును.

## మఱికొన్ని పరిభాషలు

1. కొన్ని సూత్రములలో అనేక స్థానములకు అనేక ములాదేశము లీయఁబడినవి. వీనిని గూర్చి సందేశము కలుగకుండుటకు "యథా సంఖ్య మనుదేశ సమానామ్" అను సంస్కృత పరిభాష నాశ్రయింపవలెను. పరుషములకు గసడదవలు సంధి, 13, 15 సూత్రములలో నివి, పరుషములకు సరళములు. సంధి, 16. "ఎదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముజ్ఞులకు వుజీ రుజీ యగు." క్రియా 34 ముజ్ఞులు రెండు. ము వర్ణకము, డు బు అనునవి వీనికి క్రమముగా వుజీ రుజీ అనునవి ఆదేశములగును. వినవే, వినరే, ఇత్యాదు లుదాహరణములు. "ఇ ఉ బు ల కించుక్కు పరంబగున పుడయుగవు గరుక్కు లగు. క్రియా-64. ఈ సూత్రమునందు క్రమము అవయవులకు ఆగమములకు గలదు. అగు, వచ్చు, చూచు లకు "ముత్తు" పరంబగునవుడు కా రా, చొరు చూడులగు, క్రియా 91." నాలుగు స్థానములకు, నాలుగు సర్వాదేశము లున్నవి. "అగు నకను కనులకు ముజ్జత్తులు పరంబులగునపుడు కానా కానలు విభాషనగు· క్రియా-96" ఈ సూత్రమునందు స్థానులకు నిమిత్తములకు మఱియు స్థానులకు, ఆదేశములకు యాథా సంఖ్యమున్నది. ఎట్లన అగునకు "ముజ్జు" పరంబగునపుడు "కా" అను సర్వాదేశము వచ్చును, అను కను లకు "జీత్తు"లు పరంబగునపుడు నా కానలను సర్వాదేశములు వచ్చును. "ఇట బిందుపు మీఁది తదలకు నిత్యవైకల్పికంబులయి టడలగు" క్రియా59. ఈ సూత్రమునందు. స్థానులకును, ఆదేశములకేగాక కార్యవిధులకును, యాథాసంఖ్యమున్నది. తకారములకు నిత్యముగా టకారము వచ్చును దకారమునకు వికల్పముగా డకారమువచ్చును. అంటివి, ఉంటివి. మొదటి దానికి ఉదాహరణములు, అండురు, ఉండురు అనియు, అందురు, ఉందురు అనియు రెండవదాని వైకల్పికోదాహరణములు. ఈ పరిభాష లేకున్ననేమి? సమ సంబంధములేని విధియందు యాథాసంఖ్యముండదు, "ఇటంగృత్తగతవ వేములు పరంబులగునపుడు క. గ, చ, య, వలకు లోపంబగు "కృదంత 2 నిమిత్తము లాఱు, క, గ, త, ప, వ, ఇమి. స్థానులయిదు. క, గ, చ, య, వ కనుక యథాసంఖ్య పరిభాష వర్తింపదు.

2. అమహాదర్థంబునందు డు[జులకు దువులగు నున్నాను బంధంబు మీఁద దుని యగు క్రియా 12. ఈ సూత్రమునందు డుజ్‌రు అనునవి స్థానులు. రుప్రత్యయము ప్రథమపురుష బహువచనమునకును, మధ్యపురుష బహువచ నమునకును తుల్యము. ఈ సూత్రమున రెండును గ్రహింపఁబడుచున్నవా? ఒకటే గ్రహింపఁబడు చున్నదా? ఏది గ్రహింపఁబడుచున్నది? అను ప్రశ్నలుద్భ వించును వీనికి సమాధానమేమనగా డుజ్ అను ప్రథమ పురుష ఏకవచన ప్రత్యయ సాహచర్యమున రుప్రత్యయము ప్రథమపురుష బహు వచన ప్రత్య యమేచ గ్రహింపఁబడును. ఈ విశేషార్థమెట్లు వచ్చినది? "సహ చరితా సహ చరితయోః సహచరితస్యైవ గ్రహణం" అను సంస్కృత వ్యాకరణ పరి భాష చెప్పుచున్నది. దీనిని బట్టి సహచరితమైన ప్రథమ పురుష బహువచన మునే గ్రహింపవలెను, ఈ పరిభాషను బట్టియే ఇకార వక్రంబులనగా ఇ కారము, ఎత్వము అను నర్థము సిద్ధించుచున్నది. ఇ కారము తాలవ్యమగు టచే దాని సాహచర్యమును బట్టి తాలవ్య వక్రమే గ్రహింపఁబడుచున్నది.

3. లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమ బునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాషనగు. (తత్సమ. 48) ఈ సూత్రములో ముగాగమ లోపమొకటి, పూర్వస్వరమునకు దీర్ఘమొకటి విధింపఁబడుచున్నవి వజ్రమున అను పదమునకు వజ్రాన రూపాంతరము దీనిచే నేర్పడును. ముగాగమ లోపము మాత్రము కాని, పూర్వ స్వర దీర్ఘము మాత్రము కాని వచ్చినచో వజ్రన, వజ్రామున అను ననిష్ట రూపము లేర్పడును ఇవెట్లు నిషిద్ధములైనవి? "సన్నియోగ శిష్టానాం సహ వా ప్రవృత్తిః సహవా నివృత్తిః" ఒకే సూత్రమునందు చేర్చి విధింపఁబడిన కార్య ములు రెండును ప్రవర్తించును, లేక రెండును ప్రవర్తింప కుండును ఈ పరిభాష తత్సమ. 58 సూత్రమునను ప్రవర్తిల్లును లేకున్న "విధాతుఁడు" వంటి వికృత రూపములు ఏర్పడును.

4. హలంతంబు ప్రథమైకవచ నాంతతుల్యం బిందు నామంబగు తత్సమ. 67 "శ్వ శబ్దంబు దప్ప నకారాంతంబులెల్లం బ్రథమైకవచన తుల్యంబులె యగునని యెఱుంగునది." అని వ్రాసిరి ఈ వాక్యమునందు "ప్రథమైకవచన తుల్యంబులె" అను పదమును గమనింపుడు ప్రథమైకవచ నము ప్రత్యయము నకారాంత శబ్దములెల్లం బ్రత్యయతుల్యములగునా

ము వాక్యము నెట్లు వ్యాఖ్యానింపవలెను. "శ్వ శబ్దంబు దప్ప నకారంబులెల్లం బ్రథమైక వచనాంతర తుల్యంబులె యగునని యెఱుంగునది" అని యే సూరిగారి యాశయము సూత్రము "ప్రథమైక వచనాంత తుల్యంబు" అను సమాసమునే గ్రహించినది. ప్రథమైకవచన తుల్యంబనిన ప్రథమైక వచనాంతతుల్యంబను నర్థమెట్లు కల్గును, దీనికి సమాధానము "ప్రత్యయగ్రహణే యస్మాత్సవిహితః తదాదేస్త దన్తస్య గ్రహణమ్" అను పరిభాష ప్రత్యయమును సూత్రమున గ్రహించినచో నది. అట్టి ప్రత్యయమంత మందుగల శబ్దమును తెల్పను. కనుక ప్రథమైక వచనమనగా ప్రథమైక వచనాంతమని యర్థము.

దీని కింత వ్యాఖ్యావమేల? అంత శబ్దము. ముద్రణ స్ఖాలిత్యమను కొనవచ్చును. కదా? యని వాదింప రాదు. తరువాతి ముద్రణములలో నిట్లే యున్నది. మఱియు నీప్రత్యయ గ్రహణ పరిభాష మఱొక సూత్రమునను సూరిగారు వాడియున్నారు. "నఞ్యంతంబగు నగుధాతువు క్రియా విశేషణంబుల కనుప్రయుక్తంబగు, నఞికి విభాషనగు" (క్రియా-115) ఈ సూత్రమునందు "నఞికి" అనగా నఞ్యంతమునకని యర్థము. అట్టిదే క్రియా విశేషణంబు, ఈ యర్థము సయితము ప్రత్యయ గ్రహణపరిభాషా ఫలితము.

5. సిద్దే సత్యారభ్యమాణో విధిర్నియమాయ భవతి" అను పరిభాషయుఁ దెనుఁగు వ్యాకరణమున కవసరము. సంధి 49వ సూత్రమును జూడుఁడు "ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుఝ్ఝులకు లోపంబు విభాషనగు" ఈ సూత్రము మొదటి చూపునకు వ్యర్థమని తోచును. ముడుఝ్ఝులు "లూణ్మధ్యమపురుషలకు ముడుఝ్ఝులగు" నను క్రియా 29వ సూత్రముచే పురుల శాదేశములుగ విధింపఁబడినవి. ఆదేశములు స్థానులను బోలియుండును. "స్థానివదాదేశోఽనల్విధౌ" అను పరిభాషా సూత్రము నిది వలకే మనవిచేసితిని. అట్లు మధ్యమ ముడుఝ్ఝులును క్రియలకుచేరు ప్రత్యయములే వీనివి క్రియా విభక్తులందురు. సూరిగారును తత్సను 26లో "ఇకారంబు మీఁది కనుపు క్రియావిభక్తుల..." అని చెప్పిరి, సంస్కృత వ్యాకరణమునను విభక్తి సంజ్ఞ సుప్పుఁకుమ్ము (అనగా నామవాచకమునకుచేరు ప్రత్యయములకును) తిఙ్ఙులకును విధింపఁబడినది. సంధి 41వ సూత్రము "ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు", నని ముడుఝ్ఝులకే కాక

విభక్తుల కన్నింటికి సామాన్యముగ లోపమును బహుళముగ జెప్పుచున్నది. దీని చేతనే మధ్యమ ముదుజ్జులకు కోరినట్లు లోపము బహుళముగ ప్రాప్తించు చుండ నీ 49వ సూత్రమెందులకు ? 41వ సూత్రముకూడ ఆమ్రేడితము పరం బగునపుడే ప్రవర్తించును. అదియును వైకల్పికముగ రాగలదు. కనుక 49వ సూత్రము వ్యర్థముకదా?

ఇట్లు స్థూలదృష్టికి మొదట వ్యర్థమని తోచును. ఎంతో శ్రమపడి శ్రద్ధతో రచింపఁబడిన వ్యాకరణమునందు ఒక సూత్రమంతయు వ్యర్థముగ రచితమైయుండునా? అవసరములేనిదే సూత్రకర్త దీనిని రచించియుండునా? దీని యవసరమెప్పుడు కల్గును? సంధి 41 ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగునను సూత్రముచే ముదుజ్జులకు లోపము ప్రాప్తింపనపుడే 49వ సూత్రమావశ్యకము. సామాన్యముగ విభక్తి లోప మును విధించు సూత్రమునందు ముదుజ్జులు మాత్రము చేర్పఁబడలేదనుటకు వినగమకములేదు. మఱేమనవలెను? 41వ సూత్రము క్రియా విభక్తులకు వర్తింపదని చెప్పవలెను. అప్పుడే మధ్యమ ముదుజ్జులకు వైకల్పిక లోపవిధా నము సార్థకమగును.

దీని పర్యవసానమేమనగా 41 సూత్రము సుబ్విభక్తులకు ఆమ్రేడితము పరంబగునపుడు లోపమును బహుళముగా విధించుచున్నది. 49వ సూత్రము క్రియా విభక్తులలోని మధ్యమ ముదుజ్జులకు ఆమ్రేడితము పరంబగునపు డట్టి లోపమును విభాషగ విధించుచున్నది. తక్కిన క్రియావిభక్తుల మాటయేమి? వానిని గూర్చి యీ రెండు సూత్రములు కించిత్తైనను పలుకుటలేదని స్పష్టపడి నదికదా. కనుక మధ్యమ ముదుజ్జులుదప్ప ఇతర క్రియావిభక్తులు ఆమ్రేడితము పరమైనపుడు లోపింపవని పిండితార్థము, ఈ యర్థమును సాధించుటలో సంస్కృత వ్యాకరణ పరిభాష యెట్లుపయోగ పడినది?

ఈ యర్థకల్పనకు నదియే కారణము. సిద్ధేసతి (41వ సూత్రముచే విభక్తిలోపము సామాన్యముగా) లభించుచుండగా ఆరభ్యమాణః (ప్రారం భింపఁబడుచున్నట్టి (యీ 49వ) విధిః సూత్రము కలదో అది నియమాయ నియమముకొఱకు (క్రియా విభక్తులలో మధ్యమ ముదుజ్జులకు మాత్రమే లోపము వచ్చునను నియమముకొఱకు) భవతి అగుచున్నది, దీనినిబట్టి "చెప్పెను

చెప్పెను" "నిలచిరి నిలచిరి," ఇత్యాదులలో విభక్తి లోపముగారాదు. సూరిగారు సమాస 6వ సూత్రవివరణలో "ఈ నియమముచేఁ బల్లిదుఁడు, మల్లుడు, కావలుడు, రావణుడు ఇత్యాదుల సమాసంబులేదు" అని చెప్పిరి. తత్పురుషాదులకు లక్షణంబు సంస్కృతోక్తంబేయని 3వ సూత్రమునను, విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబనియు అదియే కర్మధారయంబనియు చెప్పియు, మరల కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజ విశేషణ పూర్వపదంబయియుండు. అని సూత్రించుటచే నియమ మేర్పడినది. దానిచే డుమంతంబులు కర్మధార యంబునందు పూర్వ పదములుగా నుండవు.

6. "ఋకారాంతంబున కత్వంబునను స్త్రీ వద్భావంబునగు" నను సూత్రప్రవృత్తి విషయమున మఱియొక పరిభాష అవసరము. సంస్కృతమున ఋకారాంత శబ్దములు పుంలింగ, నంపుంసక లింగములలో పెక్కులున్నవి. స్త్రీలింగమున మాతృ, దుహితృ, స్వసృ, ననాందృ, యాతృ అనునవి మాత్రమే కలవు. ఈ ప్రకృత సూత్రము ఈ అయిదు స్త్రీలింగ ప్రాతిపదికలకు వర్తించిననే మాత, దుహిత, స్వస, ననాంద, యాత అను రూపములు సిద్ధించును. ఈ సూత్రముచే ఋకారమునకు అకారాదేశమును, శబ్దమునకు స్త్రీ వద్భావమును వచ్చుచున్నవి కాని ఈ అయిదు శబ్దములు సహజముగనే స్త్రీ లింగములుకదా ? వీనికి స్త్రీవద్భావము అవసరములేదు అత్వము మాత్రము వచ్చిన చాలును. కాని అట్లు వీలుపడదు. ఎందుకనగా "సన్ని యోగ శిష్టానాం సహావా ప్రవృత్తిః సహావానివృత్తిః" అను పరిభాషచే అత్వ స్త్రీవద్భావములు వచ్చిన రెండును రావలెను. లేక రెండును రాకూడదుకదా? ఈ సమస్యకు ఏమి సమాధానము? అత్వము మన కవసరము. కమక సూత్రము ప్రవర్తించినదనియే చెప్పవలెను. అట్లైన స్త్రీ వద్భావము వచ్చి ఏమి మార్పును చేసినట్లు? ఏమియునులేదు. దీనికి సమాధానమేమనగా "పర్జన్యవత్ లక్షణప్రవృత్తిః" సూత్రములు మేఘునివలె ప్రవర్తించును. మేఘుఁడు నీరుకోరు పైరుల పైననేగాక, నీరూరు బావులలోను, నీరు పారు నేరుల పైనను వర్షించును. అట్లే ఈ సూత్రము ఋకారాంతము లన్నింటి కిని ప్రవర్తించును. స్త్రీత్వమున్నను స్త్రీవద్భావము వచ్చును.

7. సూరిగారు తద్ధితప్రకరణమునందు, "ఇట విశేషంబుశ్వర్గంబునకు విభాషను బాధకంబగు (తద్ధిత 2)అను సూత్రమును రచించిరి, ఇదియొక పరిభాష. దీనిని వారు "వాసరూపో స్త్రియామ్" అను సంస్కృత పరిభాషా సూత్రమును మనంబునందుంచుకొని రచించినట్లు తోచుచున్నది ఆ సూత్రము కృత్ ప్రత్యయములలో అసరూపమైన అపవాద ప్రత్యయము ఉత్సర్గమునకు వికల్పముగా బాధకమని చెప్పుచున్నది. బాలవ్యాకరణ సూత్రమున "అసరూపమైన" పదము లేకుండుటయు, తద్ధిత ప్రకరణమునకు వర్తించుటయు అను విశేషములున్నవి. సంస్కృత పరిభాష ధాత్వధికారమునకు వర్తించును.

8. బాలవ్యాకరణమున సంధి. 9వ సూత్రములో "ప్రథమేతర విభక్తి విధి నిరవకాశంబు కావున దీనిని బాధించెడిని అను వాక్యము కలదు. ఇఁకాదులకుఁదప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు." అని సంధి 9వ సూత్రము చెప్పుచున్నది. సంధి రెండవ సూత్రము "ప్రథమేతరవిభక్తి శత్రర్థ చు వర్ణంబులందున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును" అని చెప్పుచున్నది ఈ ఉకారములన్నియు ద్రుతము పరమందుగలవి. 9వ సూత్రములో చెప్పిన ఇకాదులు నాలుగు, ఇఁక, ఇగ, ఎట్టకేలకు ఎట్టకేని వీనికి సూత్రము సంధిని విధించుచున్నది, తక్కిన ద్రుతప్రకృతికములకు సంధి నిషేధింపఁబడినది ఈ నిషేధము ప్రథమేతర విభక్తి విధిని బాధించునా అని ప్రశ్న, బాధి పదు. అది నిరవకాశముగావున దీనినే బాధించును. ఈ సమాధానమునకు ఆధారము "నిరవకాశా హి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే" అను సంస్కృత పరిభాష, దానికి తక్రకౌండిన్య న్యాయ మాధారము

9. సంస్కృత వ్యాకరణమున సూత్రక్రమము అను వృత్తిసౌకర్యమును బట్టియు ఉత్తరోత్తతర సూత్రము బలీయమను సిద్ధాంతము ననుసరించియు, ఇంకను "పూర్వత్రా సిద్ధమ్" అను సంకేతమును బట్టియు, మరికొన్ని విశిష్ట పరిభాషలను బట్టియు నిర్ణీతమయినది. ఇట్టి క్రమము తెనుఁగున లేదు. అయినను "పరాన్నిత్యంబలవత్" అను పరిభాషా సారమిందు గృహీతము. పరసూత్రముకంటె పూర్వమయిన నిత్యసూత్రము బలీయమని దాని అర్థము. తెనుఁగు వ్యాకరణమున సూత్ర పౌర్వాపర్యము బలమును నిర్ధారణ చేయదని ముందే మనవిచేసితిని. కనుక "పరాన్నిత్యమ్ బలవత్" అను దానిలో నిత్యంబలవత్ అను అంశమే సారమని తలచి సూరిగారు గ్రహిం-

చిరి నిత్యము కాని దానికంటే నిత్యమయినది బలీయము, క్రియా పరిచ్ఛేదపు పదునవ సూత్రమున దీనిని చూడనగును. "గురువిరహితంబులయి యయాంతంబు లయిన యేకస్వర ద్విస్వరంబుల యించుగ్వర్ణంబుల కి యుడాగమంబు విభాష నగు" క్రియా-50. ఈ సూత్రముచే విహితమయిన ఇయుడాగమము జి అను ధాతువునకును ప్రాప్తించినది, కాని ఇంచుగాగమము పరమయినపుడు దానికి "ఇ ఉ ఋ లు కించుక్కు పరంబగునపు డయుగపు గరుక్కులగు" క్రియా-64 అను సూత్రముచే అయుగాగమమును ప్రాప్తించినది జి + ఇంచు అని యుండగా ఇయుడాగమము వచ్చునా? అయుగాగమము వచ్చునా?

ఇయుడాగమము ఇంచుక్కున కాద్యవయవమగును. అపుడది ఇయించు అను రూపమును పొందును. భజియించు ఇత్యాదిరూపము లేర్పడును. వాని అయుగాగమము ధాతువున కంత్యావయవమయి జి + అయు + ఇంచు అని యుండగా సంధి 11చే జయు + ఇంచు సంధి 1చే "జయించు" అగును. ఈ స్థితిలో ఇయుడాగమము రానేరదు. ఏలయన జయు + ఇంచు అను దశలో ధాతువు ద్విస్వరధాతువయి గురువిరహితంబయి యుండియు యాంతంబయి నది. కనుక ఇయుడాగమమురాదు. అటుకాక ఇయుడాగమము వచ్చినను. జి + ఇయించు అనియుండ యడాగమ పరిభాషచే నది ఇంచుక్కు పరమయి నట్లే భావింపఁబడి క్రియా. 64చే అయుగాగమము రాగల్గియున్నది ఇట్లు ఈ రెండింటిలో అయుగాగమము రెండవది వచ్చినను, రాకున్నను ప్రసక్తి కల్గి యున్నది. ఇట్టిదానినే "కృతాకృత ప్రసంగి" అందురు. అట్టిది నిత్యము. కనుక అట్టిది కానిదానిని బాధించును. దీనినంతయు సూరిగారు "జి + ఇంచు -అనుచో నిత్యంబగుటం జేసి యయుగాగమంబు రాఁగా యాంతంబగుటం జేసి యి యుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృత ప్రసంగి నిత్యంబునాఁ బడు" అని సంగ్రహముగా చెప్పిరి.

10. సంస్కృత వ్యాకరణమున సమాస విధాయక సూత్రములలో నొక విశేషముగలదు. సాధారణముగా సమాసమునందు రెండు పదము లుండును. సూత్రమును రచించుటలో "ఈ రెండు పదములు సమసించును" అని చెప్పక "ఒక పదము మరియొకదానితో సమసించును." అని చెప్పుట సంప్రదాయము. అనగా సమాసములోని రెండు పదములలో నొకదానిని కర్తగా జేసి అది రెండవదానితో సమసించునని పద్ధతి, ఇట్లేది ప్రథమాంత

ముగ సమాసవిధి సూత్రములలో నిర్దిష్టమగునో దానికి "ఉపసర్జనము" అని పేరు "ప్రథమా నిర్దిష్టమ్ సమాస ఉపసర్జనమ్" అని సూత్రము ఈ ఉపసర్జన సంజ్ఞవలన ప్రయోజనమేమి? "ఉపసర్జనమ్ పూర్వమ్" ఉపసర్జన సంజ్ఞగల పదము సమాసమున పూర్వపదమగును అని పరిభాష. దీనిని సూరిగారు సమాస 7వ సూత్రములోను, 8వ సూత్రములోను, 26వ సూత్రములోను పాటించియున్నారు "అచ్ఛిక శబ్దముతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వం బగు" సమాస 7. స్త్రీసమంబు అని ఈ సూత్రమున ప్రథమాంత పద మున్నది. అదిఉపసర్జనము, కనుక నదిపూర్వ పదమయియుండును. అనగా స్త్రీ సమముకాని పదము అచ్ఛిక ద్వంద్వ సమాసములలో పూర్వపదముగా నుండ నేరదు. ఈయర్థముననే "మగఁడును బిడ్డలును-పల్లమును గట్టును ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున నెఱుంగునది." అని సూరిగారు వివరించిరి.

# 6

## అనువృత్తులు

సంస్కృత వ్యాకరణములో సూత్రరచన సంక్షేప సౌకర్యముగను, ఉత్తరోత్తర సూత్రమును పూర్వసూత్రమునకంటె బలీయమగునట్లును, కావింపబడినది, "మాత్రాలాభః, పుత్రలాభః దాక్షీపుత్రస్యపాణినేః" సూత్రమునందు ఒక మాత్రకాలములో నుచ్చరింపగల వర్ణము తగ్గినచో పుత్రోత్సవముగా మహర్షి పాణిని భావించెను. కనుక పై సూత్రములో చెప్పిన పదముమీఁది సూత్రమునకు రాగలదని ఆ పదమును ఆ మీఁది సూత్ర ములో సూత్రకారుఁడు రచింపడు. ఇట్లు మొదటి సూత్రములనుండి మీఁది సూత్రములకు పదములను తెచ్చుకొనుటను అనువృత్తు లందురు.

"హ్రస్వం లఘు; సంయోగే గురు; దీర్ఘం చ."

ఈ మూడు సూత్రములను గమనింపుడు. మొదటి సూత్రము. హ్రస్వాచ్చుగాని, హ్రస్వస్వరముగల అక్షరముగాని లఘుసంజ్ఞ గలదని చెప్పు చున్నది, రెండవ సూత్రమునకు హ్రస్వమ్ అనుపదము అనువర్తించును. సంయోగే సంయోగము పరమగుచుండగా హ్రస్వమ్ - హ్రస్వాక్షరము గురు సంజ్ఞగలదగును. మూడవ సూత్రము "దీర్ఘం చ" దీనికి రెండవ సూత్రము

నుండి గురువను పదము అనువర్తించును. హ్రస్వమను పదము రాదు, దీర్ఘించ దీర్ఘముకూడ గురుసంజ్ఞ గలదని అర్థము, ఇట్లు రచించుటలో రెండవ సూత్రములో హ్రస్వమను పదము, మూడవ సూత్రములో గురువను పదము రచింపకయే సూత్రకారుఁడు ఈప్సితార్థమును బోధించెను.

మఱియొక ఉదాహరణము "అనచిచ" అను సూత్రమున్నది. దీనికి "అచోరహాభ్యాంద్వే" అను సూత్రమునుండి అచః ద్వే అను పదములును, "యరోను నాసికేను నాసికోవా" అను సూత్రమునుండి యరః, వా అను పదములును అనువర్తించును, వీని నన్నింటిని అన్వయించినచో "అచః పరస్య యరః ద్వేవాన్తః న త్వచి" అను నర్థమేర్పడును. అష్టాధ్యాయీ సూత్రరచన అంతయు నిట్లే సాగినది.

తెనుఁగు వ్యాకరణమునందు నీతైనంతవఱకు అనువృత్తు లవసరము లేకుండగ సూత్రములు రచింపఁబడినవి చూడుఁడు. కర్మధారయంబులందు త్తున కచ్చు పరంబగునపుడు టుగాగమంబగు (సంధి. 28), కర్మధారయంబునందుఁ బేర్వాది శబ్దముల కచ్చు పరంబగునపుడు టుగాగమంబు విభాషనగు. (సంధి-29) ఈ సూత్రము పేర్వాదులకు విభాషనగు అని రచించి యుండిన మీఁది సూత్రమునుండి ఇతరపదములు అనువర్తించియుండును. అట్లే పేదాది శబ్దంబుల కాలు శబ్దము పరంబగునపుడు కర్మధారయంబునందు రుగాగమంబగు (సంధి-30) ఈ సూత్రమును పేదాదుల కాలుశబ్దంబు పరంబయిన రుక్కగు అని చెప్పినచో చాలును. కాని సూరిగారట్లు చేయలేదు. తెనుఁగు వ్యాకరణమున 465 సూత్రములేగలవు. సంగ్రహార్థము విద్యార్థులకు అనువృత్తి క్లేశమును కల్పింపరాదని సూరిగారు భావించిరి.

అయినను చిన్నయసూరిగారు సంస్కృత వ్యాకరణమునందు పాండితీపటిమ గలవారగుటచే నప్రయత్నముగా కొన్నిచోట్ల అనువృత్తి పద్ధతిని గ్రహించిరి. మచ్చునకు కొన్ని సూత్రముల నుదాహరించెద.

1. అనుదంతమగు తెనుఁగు డుమంతమునకు నిగాగమము నిత్యముగానగును. (తత్సమ-24) ఈ నిగాగమము ఎప్పుడువచ్చునో చెప్పఁబడలేదు. దీనికి ముందైన డు మంతంబునకు ద్వితీయా ద్యేకవచనంబు పరంబగునపుడు

నిగాగమంబు సర్వత్ర విభాషనగు. (తత్సమ-28) అను సూత్రమునుండి "ద్వితీయా ద్యేకవచనంబు పరంబగునపుడు" అను పదము అనువర్తించును. మగనిని, మగనిచేత ఇత్యాది ఉదాహరణములు. అను వృత్తులు కాని నిగాగమము ప్రథమైక వచనమునను బహువచనములందును అతివ్యాప్తి చెందియుండును. "మగనిడు మగనిలచేత" ఇత్యాద్యనిష్టరూపము లిపు డేర్పడవు.

2. ఉకారాంత జడంబునకు నవర్ణకంబగు (కారక-18) న ప్రత్యయ మే అర్థంబున నగును? పై సూత్రమునుండి "అధికరణంబునకు" అను పద మను వర్తించును "ఉకారాంతమైన యధికరణ వాచియయిన జడంబునకు నవర్ణ కంబగునని అన్వయము. ఘటంబున జలంబున్నది. దేవదత్తునకు మోక్షమున నిచ్చుగలదు".

3. ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబగు (కారక. 28) దీనికి "రాము డొక్క బాణంబున వాలిం గూలఁజేసె"నని ఉదాహరణము. సూరి గారు "బాణము చేనని యర్థము" అని వివరించిరి. ఈ యర్థవివరణను బట్టి నవర్ణకము వికల్పంబని భావింపవలెను. లేనిచో బాణము సహాయమున" అని వివరణయుండును. కాని సూత్రమున విభాషనగు, వికల్పముగనగు అను పదములు లేవు కనుక పై సూత్రము "జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగానగు (కారక. 22) అనుదాని నుండి బహుళంబుగానగు పదము అనువర్తించును. లేనిచో "ఖడ్గంబుచేత ఖండించె నను కారక 4 సూత్రోదాహరణము అసాధువగును.

4. ఒకానొక చో విశేషంబుల షష్టికిం బ్రథమ విభాషనగు (కారక. 27) విశేషణముల షష్ఠి విభక్తికి ప్రథమావిభక్తి వికల్పముగా ఆదేశమగునని సూత్రము చెప్పుచున్నది, కాని విశేషణములెట్టివి? విశేషణము లెక్కడ యుండునపుడు ఈ సూత్రము ప్రవర్తించును? సూత్రాక్షరములలో దీనికి సమాధానములేదు. "సుగుణాభిరాముఁడు రామునకు జోహారు నొనర్చెద." ఈ వాక్యమును "జోహారు నొనర్చెదరామునకు సుగుణాభిరాముఁడు?" అని రచించుటకు వీలులేదు. అనగా సూత్రము విశేష్యమునకు ముందుండు విశేషణమునకే వర్తించును. ఇట్టి అర్థమును ఈ సూత్రమునకు చెప్పుటకు దీనికి

ముందు సూత్రమైన, "సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబుల యందెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగానగు" అను సూత్రము నుండి "ముందు ప్రయోగింపంబడు" అను దళమనువర్తించును. పై సూత్రమున ప్రయోగింపంబడు అను పదము సమాపక క్రియ యయినను ఈ సూత్రమున నది క్రియా విశేషణమగును ముందు ప్రయోగింపంబడు నట్టి విశేషణంబుల అని అన్వయము.

5. స్ఫురికి గుణంబు విభాషనగు (క్రియా. 6) ఈ గుణమెప్పుడు వచ్చును? ముందు సూత్రము నుండి "ఇంచుకు పరంబగునపుడు" అను పదముల అనువర్తించును. ఈ అనువృత్తులు క్రియా 68, 69 సూత్రములకు వచ్చును.

6. చెడునకుం జుక్కాగమంబుల ను డా కళఘు రేఫంబునగు (క్రియా. 91) ఈ కార్యము లేఅర్థము నందగును? ప్రేరణంబున అను పదము 73 సూత్రము నుండి అనువర్తించును. ఈ పదము క్రియా. 82, 83 సూత్రములలో సయితమవసరము. మధ్యమందు ఈ కొన్ని సూత్రములకి అనువృత్తిరాదు. కనుక నిటమండూక ప్లుతిగా అనువృత్తి వచ్చినదని భావింపవలెను.

8. ఇచ్చునకు సర్వంబు కీ యగు. (క్రియా. 92) "ఈ" ఆదేశము ఇచ్చు ధాతువున కెప్పుడగును? సూత్రము చెప్పదు. ముందు సూత్రమైన "అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తుపరంబగునపుడు కారా చొరు చూడు లగు" (క్రియా. 91. అను దాని నుండి "ముత్తుపరంబగునపుడు" అను దళమను వర్తించును. ఈ అనువృత్తి 93, 94 సూత్రములలోను కావలెను. కాని 95 వ సూత్రమునకు రాదు. కనుకనే ఆ సూత్రమున "జీత్తు పరంబగునపుడు" అను పదములున్నవి. దాని మీఁది సూత్రమైన 96 లో ఈ అనువృత్తి యవసరము. కాని 95 వ సూత్రమునకు రానిది. 96 న కెట్లు వచ్చును? కనుకనే ఆ సూత్రమున "అగునకును కనులకు ముజీత్తులు పరంబులగు నవుడు కానా కానలు విభాషనగు" మఱల చెప్పఁబడినది.

సూరిగారు తన బాలవ్యాకరణమునందిట్లు కొన్ని చోట్ల అనువృత్తులను పాడుచున్నానని సంధి 48 వ సూత్రముననే సూచించెను. అది ఎట్లన "వ్యతిరేక మధ్యమ ము వర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాషనగు." ఈసూత్రము

నందు స్థూలదృష్టికి 'ఎల్లయెడల' అను పదము అనవసరమగును. నమ్మి కుము + ఇట = నమ్మికిట; నమ్మకుమిట. ఎల్లయెడల అనుదళము సార్థకము కావలెననిన ఈ సూత్రము కొన్నిచోట్లనే ప్రవర్తించునేమో అనుభీతి సూత్ర కారునకు కలిగియుండవలెను. అదెట్లు? దీనికి ముందు సూత్రమైన "మధ్యమ పురుష ము వర్ణకంబునకు హ్రాలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగు" (సంధి 47) అను దానినుండి ఈ సూత్రమునకు "హ్రాలవసానం బులు పరంబులగునపుడు" అను పదము అన్వర్తించు నేమోయని భయము. అపుడు దానిని నమ్మకు; నమ్మకు వానిని-అను నిట్టిచోట్ల నే సూత్రము ప్రవర్తించును? మొదటిది అవసానమున లోపము రెండవది హల్లు పరమై నప్పటి లోపము. ఈ రెండు చోట్లనేకాక అచ్చుపరమైనపుడును మువర్ణలోప మిష్టము కనుక నే సూత్రమున "ఎల్లయెడల" అని చెప్పియు సూరిగారు నమ్మకుము + ఇట అని అచ్చు పరమైన ఉదాహరణము నొక్కదానినే చూపిరి. దీనిచే మున్ముందు వ్యాకరణమునం దక్కడక్కడ అనువృత్తి పద్ధతి అవలంబింపబడినదని సూచితము,

అనువృత్తి పద్ధతికి పరాకాష్ఠ అధికార సూత్రమనదగును ఒక పదము కాని ఒక పదజాలముకాని, చెప్పఁబోవు కొన్ని సూత్రములలో నవసరమయి నపుడు ఆచార్యుఁ డట్టిదానిని ముందే అధికారసూత్రముగనిచ్చును, అట్టి సూత్రము వ్యాకరణ కార్యమును విధింపదు. మీఁది సూత్రమున కనువృత్తి గావచ్చును. ఇట్టి అధికారసూత్రములు సంస్కృత వ్యాకరణమున మెండుగ నున్నవి. తెనుఁగునందు చిన్నయ సూరిగారు 'ధాతువునకు' అను నొక్క దానినే రచించిరి. ఇది క్రియా పరిచ్ఛేదపు మొదటి సూత్రము. దీనిని సూరిగారు "ఇది యధికార సూత్రంబు- ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగునని యెఱుంగునది" అని వివరించిరి. అనువృత్తి పద్ధతిని ప్రధానముగ గైకొనినవారు కాదు గాన వారట్లు వివరించిరి. "ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యంబయిన యుత్వంబున కిత్వంబగు" (క్రియా 85) దేనితో కూడుచో నను ప్రశ్నకు "ధాతువులకు" అను పదమనువృత్తమై తృతీయాంతముగ విపరిణామము నొందును. ధాతు వుతో కూడుచోనని సమాధానము ఇది సంస్కృత వ్యాకరణరీతి.

"మధ్యమ పురుష ము వర్ణకంబునకు......" ఇత్యాదినుండి "హాలన పానంబులు పరంబులగునపుడు" అను పదము అనువర్తింపవని సూరిగారు సంధి 48లో "ఎల్లయెడల" అను పదముచే సూచించిరని మనవి చేసితిని. మఱికొన్ని సూత్రములలో కొన్ని యనువృత్తు లవసరమని తదేతచ్ఛబ్దముల చేతను, తథాత్రేతరార్థకములచేతను సూచించిరి. తచ్ఛబ్దముచే సూచన 1. వానికి మువర్ణకేతరంబయిన విభక్తి పరంబగునపుడు ముగాగమంబగు. (తత్సమ 40) వానికి ననగా అమహన్నపుంసకముల కదంతములకని యర్థము తత్సమ 39 లోనివీ మాటలు. 2. దాని యంతిమమకారంబునకు లోపంబగు. (తత్సమ 71) దాని యనగా 70 లోఁ జెప్పబడిన "మతుబాదికంబు యొక్క ద్వితీయైకవచనాతంతుల్య నామము యొక్క" అని భావము 3. అందు రెండేసి ప్రథమ మధ్య మోత్తమంబు లనంబడు" (క్రియా 9) అందు- డుఱ్ఱు పురుషము ఙ్ఞులందని యర్థము. 4 వానిలో రుములు బహువచనములు. పెఱ లేకవచనంబులు (క్రియా 10.) వానిలో ననగా (క్రియాది నుండు) డుఱ్ఱుపురుషముఙ్ఞులలోనని యర్థము. 5. వానికి లోపంబు బహుళంబుగా నగు, (క్రియా 45) వేనికిః ముందు సూత్రమున జెప్పఁబడిన ఎడి యెడు వర్ణకంబులకని యర్థము. 6. జేత్తుపరంబగునపుడు వాని పుదకర్ణంబు విభాషను లోపించు" (క్రియా 95) ఏ వాని పుకర్ణకములు? క్రియా 94 లోఁ జెప్పిన దావు నోవుల పువర్ణకములు. 7 ఇట్లే క్రియా 111, 112, 113 సూత్రములలో తచ్ఛబ్దము 110 లో నను ప్రయుక్తమగునని విధించిన "తెంచు" ధాతువును పరామర్శించును. 8 క్రియా 116 "దానికి హ్రస్వంబు విభాషనగు" దాని కనగా "మఙ్యంతంబగు నగు ధాతువున"కని యర్థము. ఇది క్రియా 115 లో క్రియా విశేషణంబుల కనుప్రయుక్తంబగునని చెప్పఁబడినది. 9. ఏతద్ శబ్దముచే సూచన సంధి 39 లో "ఇకార్యంబులు" అను సమాసమునను, కారక 84 లో "ఈ యాగమంబులు" అను దశములోను చూడనగును. ఇకార్యములనగా లోపనుగాగమంబులు లేక లోపద్విత్వంబులగునను నర్థమును సూరిగారే వివరించిరి. ఈ యాగమంబు లనగా పునులు, రుములు, కారక 83 లో విహితములని భావము,

ఇతరార్థకముచే సూచన సంజ్ఞా 6 లో (ఇతరములగు హల్లులు స్థిరములు) సంధి 51 వివరణలో (ఈ కార్యము లాంఛిచో సహితము గనంబడి

యెడి) సంధి 39 లో (అన్యంబులకు సహిత మిక్కార్యంబులు ... ...) క్రియా 102లో (లాఁతిచో సహితము కాదేశాదులు కనంబడియెడి) క్రియా 128 వివరణలో (లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి) ప్రకీర్ణ 18 లోను (లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి) చూడవచ్చును. ఇతరార్థకమును వినినంతనే "దేనికంటె ఇతరము ?" అను ప్రశ్నముద్భవించును. దానికి సమాధానముగ పూర్వ సూత్రోక్తమనువర్తించును. ఇతరములగు హల్లులు వేనికంటె నితరములు? సంజ్ఞా 5 లో నుండి "పరుషములు, సరళములు" అనువర్తించును. దీనికి "అన్యార్థాది యోగజంబగు పంచమికి కంటె వర్ణకంబగు (కారక 12)" పరుషసరళములకంటె నితరములగు హల్లులు స్థిరములని అన్వయము ఇట్లు "తక్కినవి యుభయంబులు (తత్సమ 18)" తత్సమ 11, 12 లో జెప్పిన ఏక బహువచన ప్రత్యయములగు "డుమువునలు" గాక తక్కినవని యర్థము.

తథార్థకము మూఁడు సూత్రములలో గాన నగును (1) "అట్లు రేను గోను శబ్దముల ను వర్ణఁబు గుజ్జగు" (అచ్చిక 19) అట్లనగా 18లో చెప్పినట్లు బహు వచనము పరమగునపుడు నిత్యముగను, ఏకవచనము పరమైనపుడు వికల్పముగ నని యర్థము (2) అట్లు పుగాగమంబును మాన్వాదులకగు (క్రియా. 74) పుగాగమంబును అనుటచే 73లో జెప్పఁబడిన చుగాగమము సంగ్రహింపఁ బడును. అట్లు అనగా "ప్రేరణంబున బహుళముగా" నని పూర్వ సూత్రోక్తము. (3) "అట్లు చుక్కుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు, నగుచో వాని కడప్రాలు లోపించు" క్రియా. 76. అనగా "ప్రేరణంబున బహుళంబుగా" నని యర్థము.

అత్రార్థకము, ఇట శబ్దము. ఇది అనువృత్తులను సూచింపదు. కాని ఇతరసూత్రసాపేక్షతను గాని ప్రకరణ సంబంధమునుగాని తెల్పును. తద్ధిత 2 లోను కృదంత 2 లోను క్రియా 59 లోను ఇట శబ్దము కలదు క్రియాపరిచ్ఛేదపు 54 లో "ఇ దలివి" అను (అత్రత్యార్థక) పదము గలదు విద్యార్థులకు సులభ గ్రాహ్యమగుటకై అనువృత్తులను సాధ్యమైనంతవఱకు నాదరింపని సూరిగారు ప్రకరణము నంతయు జ్ఞప్తికిఁదెచ్చు "నిట" శబ్దము నీ స్థలములలో గ్రహించెను. అనువృత్తులెట్లు పూర్వసూత్రజ్ఞాపకావసరములలో అట్లే ప్రకరణము నంతయు జ్ఞాపకముంచుకొను నవసరముగలదీ యిట శబ్దగ్రహణము ఈ సామ్యమునుబట్టి యీ ప్రసంగ మిట సుసంగత మయినది.

## వ్యాకరణ శాస్త్రయుక్తులు

## (Technical devices borrowed from Sanskrit Grammar)

(1) నిర్దేశము : మహర్షి పాణిని సూత్రముల రచించుటలో కొన్ని పదములను వాడెను. అవి వైయాకరుణునిచే, శిష్టునిచే, ఆచార్యునిచే ప్రయుక్తములు. కనుక సాధువులు ఇట్టి ప్రయోగములు తమసాధుత్వముచే శాస్త్రమును బోధించును. ఇట్టి వానిని నిర్దేశము లందురు. "కన్యాయాః కనీనచ" అను సూత్రముచే కన్యాశబ్దమునకు అపత్యార్థమున "కనీన" అను ఆదేశము. అణ్ ప్రత్యయము విధింపఁబడుచున్నవి. వీనిచే "కానీనః" అను రూపమేర్పడును. వ్యాసుడు, కర్ణుడు కానీనులు. ఈ సూత్రమునందు కన్యా శబ్దము ప్రయోగింపఁబడినది. ఇది ఆచార్యునిచే ప్రయుక్తము కావున సాధువు ఈ ప్రయోగమువలన కన్యాశబ్దమునకు "వయసి ప్రథమే" అను సూత్రముచే జీప్ ప్రత్యయము రాదని తెలియుచున్నది. నిర్దేశము వలన లభించు జ్ఞానము, నిర్దేశముండు (నిర్దేశముగల) సూత్రోద్దిష్టార్థమునకంటెన్ భిన్నము; అధికము. ఇట్లేన్నెని నిర్దేశములు గలవు ఈపద్ధతిని చిన్నయ సూరిగారు ఒక్క సూత్రమునందు మాత్రము వాడియున్నారు. "సమాసంబున యందు ద్రుతంబునకు లోపంబగు." (సంధి. 24) సమాసంబునయందు అను ప్రయోగ మును గమనింపుఁడు. సప్తమీవిభక్తి ప్రత్యయములు రెండు అందు, న అను నవి, సమాసమనునది ఉకారాంతము, జడము, కనుక దీనికి కారక 18 చే నవర్ణకము రాదగును. సమాసంబున అట్లుగాక కారక 17చే అందు వర్ణక మును చేర్చినచో నుగాగమము తత్సమ 28 చేకల్గి సమాసమునందు అగును. కాని ఈ నిర్దేశము నవర్ణకమును ద్రుతరహితముగను దానిపై అందు వర్ణకమును రెంటిని చూపుచున్నది. సమాసంబున + అందు – సమాసంబున యందు. న వర్ణకమిట "కళ"గ నున్నది. కనుకనే యడాగమము. ఈ నిర్దే శముచే ఒకానొకచో అధికరణమునందు "నయందు" అను ప్రత్యయము ప్రకృతికి చేరునని సూచింప బడినది. ఆరణ్య పర్వమందలి ప్రయో గము : "దేవ నీ వనిమిషనాయకత్వమునయందభిషిక్తుఁడవై ముదంబుతో నను బనిగొమ్ము..." ఈ నిర్దేశముచే వ్యాఖ్యాతము. దీనినే సీతారామా

చార్యులుగారు. "ఉపసంశ్లేషములగు సమహత్తుల కందు వర్ణకము పరంబగు నపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి" అని సూత్రించిరి. ప్రౌఢ వ్యాకరణమున

(2) నిపాతనము : ఆచార్యుఁడు, పాణిని మహర్షి, కొన్ని సూత్రములలో ప్రక్రియను జెప్పక సిద్ధరూపములను జూపును. అట్టి సూత్రములను నిపాత (న) సూత్రములందురు "సిద్ధ ప్రక్రియస్య నిర్దేశః నిపాతనమ్" అని బాల మనోరమాకారుఁడు వివరించెను ప్రక్రియ నంతయు సిద్ధముచేసి లోకమున ప్రయోగార్హమైన రూపమును సూత్రమునఁ జూపుట నిపాతనమని యర్థము. "వేధ పురోధ పురోధసుఁడు" (తత్సమ. 82) "వేధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిపాతింపఁ బడియె"నని సూరిగారే వివరించిరి. ఈసూత్రమున విడి నుడులు అనగా వ్యస్త పదము లున్నవి. తెనుఁగు వ్యాకరణమున ఇట్టి సూత్రములింకను నేకు గలవు. పయ్యెద పయ్యెద (ప్రకీర్ణ 5) నౌ శబ్దంబునకు నావయగు. (తత్సమ. 63) ద్యువాహ్యచ్ఛబ్దంబులకు దివి వాృదియగు. (తత్సమ 84) తక్కిన నాల్గింటిలో నిపాతనముల యర్థము సయితమీయఁ బడినది. కద్రువ నాగమాత. (తత్సమ-51) పృథ్వీవాచి భూ శబ్దంబునకు భువియగు (తత్సమ 62). మహత్వంబున స్వార్థపరంబగు రాజ శబ్దము రాజునాఁబడు. (తత్సమ 78) యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు (తద్ధిత-21)

నిపాతనమను నీయుక్తి సంస్కృత వ్యాకరణమునుండి గ్రహింపఁ బడినది. ఇది లఘ్వర్థము కల్పితము.

(3) జ్ఞాపకము : పాణిన్యాచార్యుఁడు కొన్ని సూత్రములలో నొక పదమునో, పద్ధతినో, ప్రక్రియనో అవలంబించి దానిచే నొక విశేషార్థమును సూచించును. ఇట్టి విశేషార్థము కొన్నిచోట్ల పరిభాషలుగ నేర్పడియున్నవి. తెనుఁగున నట్టి పరిభాషలు లేవుగాని, జ్ఞాపకములు రెండు మూఁడు కలవు. క్రియా పరిచ్ఛేదపు 66వ సూత్రమున సూరిగారే చెప్పిరి, "ఈ జ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమం బగునని యెఱుంగునది." 66వ సూత్రము "నిర్జినామంబుకయుగాగమంబు గలుగదు" అని చెప్పుచున్నది. అయుగాగమము ఇకారాంత ధాతువులకు ఇంచుగాగ

మము పరమగునపుడు 64చే విహితము. నామములు ధాతువులు కావుకదా! వానికంటె ఇంచుగాగమము పరముగ నుండదుకదా మఱి వానికి అయుగాగమ ప్రాప్తియే యుండదు. అట్టితఱి నామంబుల కయుగాగమంబగలుగదననేల? కుందేటి కొమ్ముతో గోకుకొన రాదన్నట్లునది. కుందేటికి కొమ్ము లుండవు దానికొమ్ముతో గోకుటెక్కడిది? అట్టి యసంభవమును నిషేధించుట వ్యర్థము. అట్లే "నామంబుల" యను పదము వ్యర్థము. కాని తెలిసి తెలిసి రచించిన సూత్రకారుఁడు వ్యర్థపదమును వాడునా? అపదము సార్థకము కావలెనన్న నామంబులకు ఇంచుగాగమము పరమగుట సంభవము కావలెను. ఈయర్థమునే సూరిగారు "ఈజ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించుగాగమంబగునని యెఱుంగునది" అని వ్రాసిరి.

ఇట్టి యుక్తిచేతనే మధ్యమ పురుషక్రియలయం దిత్తునకు సంధియగు (సంధి. 7) అను సూత్రము నిత్యవిధియైనది. సంధి 15వ సూత్రమును ఇట్లే నిత్య విధియైనది. అచ్చిక 18వ సూత్రమున "బహువచనము పరంబగు నపుడు నిత్యముగాను" అనుటచేత నేకవచనము పరమైనపుడు వికల్పముగనని యర్థము లభించినది.

ఈ సందర్భమున తత్సమ 57వ సూత్రము పరిశీలింపఁదగినది "స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు లోపంబగు" స్త్రీలింగ శబ్దములకు (అమహత్తులు కానివానికి) నేసూత్రముచే ప్రథమైక వచనము వచ్చును? అవి ఉకారాంతములైనచో. "ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు" నను 4-చే వువర్ణకము వచ్చును. తక్కిన స్త్రీలింగ శబ్దములకు ప్రథమైకవచన ప్రత్యయము విధింపఁబడలేదు. (డుఙ్ మహత్తులకు వచ్చునది మువర్ణకము అమహన్నపుంసకముల కదంతములైనవానికి వచ్చునది, వు వర్ణకము ఉకారాంతములకే విహితము.) ఈ లోపవిధానముచేతనే స్త్రీ లింగంబులకు ప్రథమైకవచనము విధింపఁబడినదని, జ్ఞాపకము చేయఁబడినది. ఇట్లు జ్ఞప్తిచేసి దానికి లోపమును విధించుటవలన ప్రయోజనమేమి? రమ, వనిత, మీననేత్ర అను రూపములలో మార్పుండదుకదా? నిజమే కాని ప్రథమైకవచన విధియు, లోపమును లేనిచో నవి పదములు కానేరవు, ప్రాతిపదికలుగనే నెన్నఁబడును.

4. విభాషా, బహుళమ్, అనువిధులు: సంస్కృతమున "నవేతి విభాషా" అను నిర్వచనమున్నది. అది భాష్యకారులచే నన్యథా సాధితము. "క్వచిత్ప్ర

వృత్తిః, క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ శిష్టప్రయోగమను సృత్య లోకే విజ్ఞేయమేతత్బహుళ గ్రహే తు" అని బహుళ పదము వివరింపఁబడి నది. సూరిగారు విభాషగనగును అని 72 సూత్రములలో చెప్పెను విభాషా శబ్దమునకుండు నిషేధరూపమగు విశేషార్థమును సంధి 37వ సూత్రమున చెప్పెను "వ్యవస్థిత విభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు" ఇందు పేర్కొనఁబడిన విభాష సంధి 13వ సూత్రమున విధింపఁబడినది "ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోపసంశ్లేషంబులు విభాషనగు ఇట్లే "పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోప పూర్ణబిందువులు విభాషనగు. (సంధి) 47 అను నీ విభాషయు నిట్టి విశేషార్థము గలది. "ఈ కార్యము కర్తృనాచి మువర్ణకమునకు గలుగదు" దీనినిబట్టి అశ్వము పడియె గజము పడియె మొదలగు స్థలములందు లోపపూర్ణబిందువులు వారింపఁ బడినవి

బహుళమను పదమును సూరిగారు రాదాపు నలువది సూత్రములలో వాడియున్నారు. బహుళపదమునకు "బహూన్ అర్థాన్ లాతి గృహ్ణాతీతి బహులమ్" అను వ్యుత్పత్తిని చెప్పవచ్చును, అవేవనగా ప్రవృత్తి, అప్రవృత్తి విభాషసూత్రోక్తరీతికి భిన్నము, బహుళమనినచో ఈ నాల్గు అంశంబు లుండ వలెనని నియమము లేదు. రెండుగాని అధికముగాని ప్రయోజనములున్నను బహుళంబు గానగునని సూత్రింప వచ్చును. సూరిగారు ఈ నలుబది సూత్ర ములలో అక్కడక్కడ తామే దీని ప్రయోజనమును నిరూపించిరి. సంధి 36 వ సూత్రము యొక్క బహుళ పదప్రయోజనమును సూరిగారు స్వయముగా 37, 38 సూత్రముల వృత్తులలో వివరించిరి. "బహుళ గ్రహణముచే మీదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు "37 వివరణ "బహుళగ్రహణముచేత గ్రొత్త కుండ లిత్యాదుల లోపంబులేదు. క్రీఁగాలు, క్రీఁదొడ ఇత్యాదులందు గ్రింది శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణము చేతనని యెఱుగునది" 38 వివరణ. ఇట్లు దీనిలో నాల్గర్థములును గలవు, ఇంక సంధి 4. తత్సమ 58, కారక 22, 24 సమాస 14 క్రియా పరిచ్ఛేదములో 73, 74, 76, 117 సూత్రముల క్రింద ఇట్టి వివరణ కలదు.

5. కార్యాతిదేశము: మహర్షి పాణిని కొన్ని సూత్రములలో మరి యొకచో విధింపబడిన కార్యములు వేఱొక శబ్దమునకు కల్గునని చెప్పును.

"తృజ్వత్ క్రోష్టుః" అను సూత్రమున "క్రోష్టు" శబ్దమునకు తృజంత శబ్దములకు వలె కార్యములగునని చెప్పెను ఇట్టి విధానమును కార్యాతిదేశమందురు; ఈ పద్ధతిని సూరిగారు తత్సమ 18, 41, 52, 58, 60, 61, 65, 66, 75, 76, 77, 86 సూత్రములలోను, ఆచ్ఛిక 2, 8, 26 సూత్రములలోను కారక 19 వ సూత్రములోను అవలంబించిరి.

క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబులగు తత్సమ 18. మిత్రాదులు పుంలింగతుల్యంబులగుటచే నేమగునో చెప్పబడలేదు. కార్యాతిదేశము అను సంస్కృత పద్ధతిని బట్టి ఉత్వదుజ్జలు తత్సమ 21, 22చే వచ్చునని తెలియవలెను. ఇట్లే స్త్రీవద్భావ స్త్రీ తుల్యత్వ స్త్రీత్వములలో తత్సమ57 చే ప్రథమైకవచన లోపంబు కల్గునని తెలియవలెను. సూరిగారు కార్యాతిదేశమును తత్సమ ప్రకరణములో 18 సూత్రములలో వాడియు దానిని ఆచ్ఛిక రెండవసూత్రము క్రింద వివరించిరి.

ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుం గ్లీబసమంబులు నయి యుండు. (ఆచ్ఛిక-2) స్త్రీ సమత్వాతి దేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును గ్లీబసమత్వాతి దేశంబుచే మువర్ణకంబు నగునవి యెఱుగునది అని వివరించిరి,

# 8

సంస్కృత వ్యాకరణములోని సంజ్ఞలను పరిభాషలను పద్ధతులను యుక్తులను సూరిగారు తెనుఁగు వ్యాకరణమున వాడియు, కొన్ని సూత్రములలో స్పష్టముగా సంస్కృత వ్యాకరణ జ్ఞానము తెనుఁగున కవసరమని తెల్పిరి, తత్సమ 85వ సూత్రమున "స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీ ప్రత్యయంబులంగూడి యందు బ్రవర్తిల్లు," అని చెప్పిరి, దీనినిబట్టి సంస్కృత వ్యాకరణములోని స్త్రీప్రత్యయ ప్రకరణజ్ఞాన మవసరము.ఆ సూత్రముక్రింద కొన్ని ఉదాహరణములనిచ్చి సూరిగారు "అంగాదులకుఁదప్ప సంయోగోపధంబులకు జీష్ ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి- పద్మనేత్రి ఇత్యాదు లసాధువులు". అని వ్రాసిరి. సంయోగోపధములకు జీష్ ప్రత్యయము ఎందువలన లేదో ఏయే శబ్దంబులకు ఏయే స్త్రీప్రత్యయములు విహితములో తెలుసుకొనుటకు స్త్రీ ప్రత్యయ ప్రకరణమును చదువవలెను. దీనిని గమనించి

శ్రీవజ్ఝల చిన సీతారామశాస్త్రిగారు తమ ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వం నందు సంస్కృత స్త్రీప్రత్యయ విధాయక సూత్రములను ముఖ్యమైన వానిని కొన్నింటిని వివరించియున్నారు.

ఇట్లే "తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు" అని సమాస. 8వ సూత్రమున సూరిగారనిరి. దీనినిబట్టి సంస్కృత సమాసప్రకరణము ఆంధ్రవ్యాకణ సమగ్రత కవసరము. మరియు ఆ సూత్ర వివరణలో సిద్ధంబు, సర్వంబు గ్రాహ్యంబనిరి. సిద్ధసమాసంబులు సంస్కృత వ్యాకరణసూత్రానుసార మేర్పడినవి, సిద్ధసమాసంబులు సిద్ధమైయుండ నవస రంబులేదు, అనగా సంస్కృత మహాకవులు ప్రయోగించినవే మనము గ్రహింప వలెనని నియమము లేదు. సంస్కృత సమాస సూత్రానుసారము మనము సిద్ధముచేసికొనవచ్చును, కనుక నట్టి జ్ఞానమవసరము! మఱియు నా వివరణ లోనే "ముఖపద్మము-చరణ కమలములు- ఇట్టి యుపమానోత్తర పదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులు లేవని యెఱుంగునది". అని వ్రాయం బడినది. విపరీతంబులు సిద్ధంబులు ఏలలేవు? అను ప్రశ్నము బాలురకు ముద్భ వించును. దీనికి సమాధానము సంస్కృతవ్యాకరణ సమాస ప్రకరణమున సిద్ధించును.

తత్సమ 77వ సూత్రమున సూరిగారు. ఇమనిజంతంబులకు స్త్రీత్వం బును బహుళంబుగ విధించిరి. ఇమనిజంతంబులనగా "ఇమనిచ్" ప్రత్యయ మంతమందుగలవి, ఈ ప్రత్యయము ఏ సూత్రముచే విధింపబడినది? ఇది పర మయినపుడు ఏమార్పులు ప్రకృతికగును? ఇత్యాదివిషయములు బాలురు సంస్కృత వ్యాకరణమునుండి తెలుసుకొనవలెను.

ఇంతవరకు నాకు తోచినట్టి నా బుద్ధి కందినట్టి సంస్కృత విశేషము లను తెనుఁగు వ్యాకృతికి కావలసిన వానిని సేకరించి వ్రాసితిని. ఈ యంశ ములను సూరిగారేల వివరింపకయేవాడిరి? ఈ ప్రశ్నలను, వారినే అడుగవలె లన్న తప్పించుకొనుట యగును. వారు బాలవ్యాకరణము రచించునపుడు తెనుగువారికి సహజ పాండిత్యము కొంత యుండెడిది, బహుళంబుగ నగుననిన తెలియకుండునా? సిద్ధసమాసంబులను గుర్తింపడా ? సంస్కృత గ్రంథములను చదువడా? ఇత్యాది విశ్వాసముచే వీని వివరణ నుపేక్షించియుండును. కోడి గ్రుడ్డంత బంగారము లేనివా డెవడని ఒక ధనికు డనుకొనినట్లు.

ఈ వ్యాసమునందు నేను పేర్కొనక వదిలివేసిన యంశములు కొన్ని యుండవచ్చును. దీనిలో గుణలేశమున్న సద్గురుద్గురు ప్రతిభా విశేషఫలము. ఇందలి దోషములేవయిన నున్న అవి నావేయని అంగీకరింప వెనుదీయను. అట్టి దోషములను నాకెఱింగించిన వారికెల్లపుడు కృతజ్ఞుడనై యుందును.

ఇతి శమ్

## ఈ రచన కుపకరించిన గ్రంథములు

1. బాలవ్యాకరణము.
2. రమణీయము.
3. ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము.
4. సిద్ధాంత కౌముదీ.
5. ఘంటాపథ వ్యాఖ్య.

# కొన్ని చమత్కార శ్లోకాలు

ఆచార్య శ్రీ ఎన్. వి. కృష్ణమూర్తి

**పరిచయము :**

| | | |
|---|---|---|
| పేరు | : | ఆచార్య శ్రీ ఎన్. వి. కృష్ణమూర్తి |
| జననము | : | కర్నూలు |
| విద్యార్హతలు | | బి. యస్. సి (ఆనర్సు) : ఎం. ఏ. (తెలుగు) |
| రచనలు | | మనస్తత్వ శాస్త్ర వ్యాసములు, కొన్ని శాస్త్రీయ వ్యాసములు, మతుక్కణా ఖేటము, అంతిమ యాత్ర అదీయేమొ. ఖం ఖం, స్తనయిత్నుసృష్టి, నాగరకత, మున్నగు పద్యాలు, గేయములు, అభినవ సీతా రావణ సంవాద ఝరి యను సంస్కృతపద్యకావ్యము నకు ఆంగ్లేయ వ్యాఖ్య. |
| పదవి | | కర్నూలు ఉస్మానియా కళాశాలలో జంతుశాస్త్ర శాఖాధ్యక్షులు; ఆచార్యులు. |

కవితా చమత్కారములపై వీరికిగల అనుగారాభినివేశములే యీ రచన యందు చూడనగును

["అనుక్త మన్యతో గ్రాహ్యామ్" అను విషయముపై శ్రీ పుప్పలూరు విశ్వేశ్వరయ్యగారు ఉపన్యసించిన సమావేశమున ఆచార్య శ్రీ. ఎన్. వి. కృష్ణ మూర్తిగారు అధ్యక్షస్థానము నలంకరించియుండిరి. ప్రధానోపన్యాసము ముగిసిన తర్వాత అధ్యక్షుని మలి పలుకులుగా శ్రీ. ఎన్. వి. కృష్ణమూర్తి గారు వ్యాకరణ ప్రాముఖ్యము నుగ్గడించుచు, కొన్ని చమత్కార శ్లోకముల జదివి వానియర్థమును వివరించిరి ఈ చమత్కార శ్లోకములు పాఠకుల కాహ్లాదమును గూర్చగలవని ఆకాంక్ష—సం॥]

"అనుక్త మన్యతో గ్రాహ్య'మ్మను వాక్యము తెలుగువ్యాకరణమున చెప్ప బడని విషయమును సంస్కృత వ్యాకరణమునుండి గ్రహింపవలెనను మార్గముపదేశించుచున్నది. కాని చిన్నయసూరి తన బాల వ్యాకరణమున [బాలురకుద్దిష్టమయినది-గ్రహణ ధారణ పటువైనవాడు (స్తనంధయుడు కాడు!) బాలుడు కొన్ని తార్కిక, వైదాంతిక పరిభాషలుగూడ వాడి యున్నాడు. ఉదాహరణమునకు, క్రియా పరిచ్ఛేదమున, 8,4 సూత్రము లలో "భూతంబునా విద్యమాన ధ్వంసప్రతియోగి" "భావినా విద్యమాన ప్రాగభావప్రతియోగి" అను వాక్యము లున్నవి. వీనిని సంపూర్ణముగా నర్థముచేసికొనవలెనన్న, తార్కిక జ్ఞాన మవసరము. అట్లే కారకపరిచ్ఛేద మున, 17వ సూత్రములో "ఔపశ్లేషికంబు, వైషయికం, బభివ్యాపకం బని యాధారంబు త్రివిధంబు. ఘటమందు జలమున్నది, అన్నిటియం దీశ్వరుండు గలండు." అను వాక్యములున్నవి. "ఔపశ్లేషికము, వైషయికంబ, అభి వ్యాపక" మను నిట్టి పారిభాషిక పదముల అర్థము గ్రహించుటకుగాని, ఘటమందు జలమున్నది, అన్నిటియం దీశ్వరుడు గలడు, అను నీరెండు వాక్య ములలోని ప్రయోగ విశేషములను తెలిసికొనవలెనన్నగాని, వేదాంత శాస్త్ర జ్ఞానము తన్మాత్రమైన నుండియే తీరవలెను. కాబట్టి "అనుక్త మన్యతో గ్రాహ్యమ్" అనుచోట "అన్యతః" అనగా సంస్కృత వ్యాకరణమునుండి, తర్క-వేదాంతాది శాస్త్రములనుండి గ్రహింపవలసి యుండుననుటయే విండి తార్థము. సూరి యథార్థముగా సూరియే. అతడు ఆంధ్రశబ్ద చింతామణిని చాలవరకు యథాతథముగా ననుసరించి యుండవచ్చును. కాని అతడు ప్రదర్శించిన సూత్రీకరణ విధానమునకు శాస్త్రపాండిలికి, నవరస భరితము లైన ఆయన ఉదాహరణములకు ఆంధ్రలోకము జోహారులర్పింప వలసినదే.

శ్రీ శంకర భగవత్పాదులు భజగోవింద శ్లోకములలో "నహి నహి రక్షతి డు కృఞ్ కరణే" అనుటతో వారు వ్యాకరణ శాస్త్రమును కించపరచి రను సంశయము పొడసూపవచ్చును. కాని న్యాయమరయగా శ్రీ శంక రులు సర్వవిధ శాస్త్రములకు, విద్యలకు, కళలకు వ్యాకరణ మొక్క-దానినే ప్రతీకగా, ప్రతినిధిగానిల్పి దాని నిస్తులప్రాశస్త్యమును ప్రకటించిరనుట స్పష్టము.

శాస్త్రాధ్యయమునకుగాని, కావ్యరసాస్వాదమునకుగాని, వ్యాకరణ జ్ఞానముండియే తీరవలెను వ్యాకరణ సూత్రముల నేకరువుపెట్టుట అనవసరము; అయినను, వ్యాకరణ ప్రక్రియలను గమనించి, చక్కగా పదవిచ్ఛేదము జేసికొనిననే, అన్వయక్లేశములేకుండ అర్థము సుబోధమగును. మానసము రసానందమున నుయ్యాలలూగును. సంస్కృత సాహిత్యమున రసగుళికలవంటి చమత్కార శ్లోకములు కోకొల్లలుగా నున్నవి. కొన్నింటిని మాత్రము మీకు నివేదింతును; చిత్తగించుడు.

1. "భాండే జలమ్ వా తక్రమ్ వా
నీరో మోరో వదాంగనే
మార్గమాలోక్య గంతవ్యమ్
ముల్లుస్యాత్ తత్ర కంటకమ్."

ఇందులో "నీరో-మోరో", "ముల్లు-కంటకమ్" అనెడు నీ పదముల జంటలలో చమత్కారమున్నది. ఇయ్యవి ద్విభాషాపదాలు. నీరో—ఇవినీళ్లా? లేక మోరా-తమిళభాషలో "మోర్" అనగా మజ్జిగ—అంటే మజ్జిగయా? అని ప్రశ్న. అట్లే ముల్లు అనిన తెలుగున కంటకమని అర్థము. ముల్లు తెనుగు మాట; కంటకము సంస్కృత పదము ఈ ద్విభాషావద చిత్రము బాగున్నది కాని, సంస్కృత శ్లోకమున కర్థము చెప్పుకొనుటకు మాత్రము వ్యాకరణ జ్ఞానమత్యవసరము,

భాండే, జలమ్, వా, తక్రమ్, వా—కుండలోనున్నది నీరా లేక మజ్జిగయా?

నిః + రోమ + ఊరు = నీరోమోరు - సంబోధనమున హే నీరో మోరో-ఓనునుపైన (రోమరహితములైన) తొడలు గలదానా! (అంగనే); వద-పలుకుమ! మార్గమ్ + ఆలోక్య గంతవ్యమ్—బాగుగాచూచి నడువవలసిన మార్గమిది, ఎందు కనగా-తత్ర, ముల్లు కంటకమ్ స్యాత్-అక్కడ (ఆమార్గములో) బాధను కలిగించెడు (ముదం లునాతి—సంతోషమును హరించు నట్టి వంటి) కంటకముండగలదు (జాగ్రత్త!)

2. అంబలి ద్వేషిణం వందే
ఊరుపిండీకృతాసురమ్
ఉరగాయ కృతత్రాసమ్
పాలనేతిప్రియం గవామ్.

ఈ శ్లోకములో నున్నటువంటి "అంబలి ఊరుపిండి, ఉరగాయ, పాల నేతి" పదాలు మనకందరకు చాల సర్వసామాన్యములైన భోజన పదార్థాలు. ఈమాటల కూర్పులోనే చమత్కార మిమిడియున్నది.

అం! బలిద్వేషిణం—బలికి శత్రువైన విష్ణువును ఊరు, పిండీకృత, అసురమ్-రాక్షసుని తొడలను పిండిచేసినట్టియు.

ఉరగాయ (ఊరగాయకాదు)—కాళీయునికి కృతత్రాసమ్—క్లేశమును కలిగించినట్టియు (ఫణములనెక్కి తొక్కిన)

గవామ్, పాలనే + అతిప్రియమ్—గోవులను పాలించుటలో చాల ప్రీతి గలిగినట్టియు.

(బలిద్వేషిణం) శ్రీవిష్ణువునకు, వందే = నమస్కరించెదను

ఇందులోని సమాసములను విగ్రహ వాక్యములతో పొందించుకొని (ఉదా॥ ఊరుపిండీ కృతాసురమ్) పదవిచ్ఛేదము సరిగా చేసికొని (ఉదా॥ పాలన్యేతి ప్రియమ్), అర్థగ్రహణ మొనర్చుటకు వ్యాకరణపరిచయ మెంతే వవసరము.

3. "విరాట నగరే రమ్యే
కీచకాదుప కీచకమ్
అత్ర క్రియా పదమ్ వేత్తుమ్
యో జానాతి స పండితః॥"

ఇది సామాన్యముగా పండితులనోట మెదలెడు శ్లోకమే.

రమ్యే—సుందరమైన

విరాట నగరే—విరాట నగరమున

కీచకాదుపకీచకమ్ — పెద్ద వెదురుబొంగునుండి చిన్న వెదురు బొంగునకు.

ఈ పదాలలో నేది క్రియా పదమో తెలుసుకొనగలిగినవాడే పండితు డనెడు నవాలీశ్లోకములో ప్రతిధ్వనించు చున్నది.

రమ్యే—ఇది విశేషణము ; విరాటనగరే, కీచకాత్, ఉపకీచకామ్—ఇవి నామవాచకాలు—వీనిలో క్రియా పదమేది? ఇది క్లిష్టమైన సమస్యయే, కాని వ్యాకరణ జ్ఞానముండినచో నిది ఒక్కతుటిలో దోచును, విరాటనగరే అనెడి పదగుచ్ఛమును, విః+అట+నగరే అని విచ్ఛేదము చేయవచ్చును. అట్లు చేసినచో :—

విః-పక్షి; నగరే (రమ్యే)-(సుందరమైన) నగరమున అట—చరించెను. అని అర్థము చెప్పనగును. అనగా అందమైన పట్టణమున పక్షి పెద్దవెదురు బొంగునుండి చిన్నవెదురు మీదికి ఎగిరెను (చరించెను) అని అర్థము. కాబట్టి ఇట చరించు అనునర్థముగల "అట" అనునది క్రియా పదమని గ్రహింప నగును. విరాట అను దానిని విః+అట అనివిచ్ఛేదము చేసికొనుటకు వ్యాకరణ జ్ఞానమవసరము కాదా! ఇది తెలియనివాడు శ్లోకమందలి చమత్కారము నాకళింపు చేసికొనగలడా?

*"అభినవసీతారావణ సంవాదఝురీ" అను నొక కావ్యమున్నది. అది ఆద్యంతము చమత్కార నిర్భరము. అందులో రెండువిధములైన చిత్రములు ప్రదర్శితములైనవి. మొదటిది ప్రతి దత్తాక్షరీ చిత్రము. రెండవది చ్యావితాక్షరీ చిత్రము

కావ్యవస్తువేమనగా : అశోక వనముననున్న సీతతో రావణుడు ప్రగల్భములు బలుకుట, ప్రతి శ్లోకమున, మొదటిమూడు పాదములలో రావణుడు తన్ను దాను బొగడుకొనుచు శ్రీరాముని నిందించును. నాల్గవ పాదమున సీతాదేవి దానికి ముక్తసరిగా ప్రత్యుత్తరమిచ్చును. ఆప్రత్యుత్త రమును మనము జాగ్రత్తగా పరిశీలింతుమేని, అందులో నొక సంకేత మిమిడి యుండును అసంకేతము నుపయోగించినపుడు, ఆదేశ్లోకములోని పదములకు

---

* అభినవ సీతారావణ సంవాదఝురీ కావ్యకర్త శ్రీ బచ్చు సుబ్బ రాయగుప్త, ఔకు, కర్నూలు జిల్లా-ప్రచురణము 1966 – దీనికి మత్కృత ఆంగ్ల వ్యాఖ్యయు గలదు

దటాలున వేరొక అర్థము సిద్ధించును. రావణస్తుతి రావణ నిందగను, రామ నింద రామస్తుతిగను మారును. ఇదియే చిత్రము. రెండుశ్లోకముల మాత్ర ము దాహరింతును.

4. క్షోణీనందిని! శత్రుదాహ కృతివిజ్ఞాతః సదాహాంగతా-
పత్త్యోఘ స్తవతు ప్రహారితయశావన్యాగ మాద్వల్లభః
సర్వేషామహితం విభిన్నమపి చ ప్రాపోష్ణతి గాత్రం న కిం
రే! వా క్తేత్వపహాసినీ భవితుమే వై షార్హతి క్రవ్యభుక్.

సీతాదేవితో రావణు డీవిధముగా నుడువుచున్నాడు, "నేను శత్రువులను భస్మీకరించుటలో నిపుణుడను (శత్రు, దాహకృతి, విజ్ఞాతః) నా కెట్టి క్లేశములు నులేవు (గతా పత్త్యోఘః) ఇక ని వల్లభుడో (రాజ్యమును వీడి) వనగమనమువలన తన కీర్తినే కళంకిత మొనర్చికొనివాడు. అతని శరీరమా ఇతరులకంటె విభిన్నమై, అందరికిని, అహితమైనదికూడ". సీతాదేవి చెప్పిన జవాబేమనగా: ఒరే! మాంసాశనా! నీ వాక్కు కేవల మపహాసిఃప (అపహాసినీ) దగినదే".

ఇచ్చట "అపహాసినీ" అనెడి విశేషణ పదములో విశేషమున్నది, అప+హా+సినీ-అపహా (విగతహాకారా సతీ)" హాకారరహితమైనదియును; సీ-(బోస్యాస్త్రీతి) సకారముతో కూడినది- దీనికి స్త్రీలింగరూపము - సినీ; (విశేష్యమైన "వాక్" స్త్రీలింగవాచకము కాబట్టి) సారాంశమేమన.- ఓరీ రావణా! నీ వాక్కు హాకారమును దొలగించి, సకారమును జేర్చుటకు మాత్రమే తగియున్నదని సూచన. కనుక హాకారమున్న చోట్లనెల్లెడ సకారము నుంచినచో ;–

| ఉన్నపదములు | మార్చవేదిన పదములు |
|---|---|
| "శత్రుదాహకృతి విజ్ఞాతః" | —"శత్రుదాస కృతివిజ్ఞాతః |
| "సదాహాంగతా పత్త్యోఘః" | —"సదాసంగతా పత్త్యోఘః" |
| "ప్రహారితయశాః" | —"ప్రసారితయశాః" |
| "సర్వేషా మహితం" | —"సర్వేషా మసితం" |

రావణుని స్వస్తుతి నిందగామారును, "నేను శత్రువులకు దాసుడనై యుండుటలో నిపుణుడను, ఎల్లప్పుడు బాధాకలితుడను" అని అర్థమువచ్చును.

రామనింద రామశ్లాఘనగా పరిణమించును-నీ వల్లభుడో వనగమనము చేత (పితృవాక్య పరిపాలనమువలన) వ్యాపించిన కీర్తిగలవాడై నాడు; అతని విగ్రహము శ్యామలమై (అసితం), ఇతరుల శరీరము లన్నిటికంటె విలక్షణ మైనది, అనగా లోకోత్తరమైనదని భావము.

"అపహాసినీ" అనుచోట-"తే వాక్ అపహా, విగతహాకారాసతీ; సినీ, సకారసహితా; షోష్యాస్తీతి సీ, తస్య స్త్రీలింగే సినీతి రూపమ్; అత ఇనిఠనౌ, ఇతి పాణినిః- ఇంత వ్యాకరణ ప్రక్రియఉన్న ఈ అపహాసినీ పద మే శ్లోక మందలి ప్రతిదత్తాక్షరీ చిత్రమున కాయువుపట్టు.

ఇక చ్యావితాక్షరీ చిత్రమున కొక యుదాహృతి :-

అసునాథస్తు ధరాసుతే! వికల సత్తేజాశ్చ జానామ్యహమ్
న సురాపాలక సత్పరాక్రమ ఇతి ప్రఖ్యాతిమూర్తః కిము
అపి కాంత్యా కలయావృతోవహమయి! మాంజానాసి సీతే! నకిం
ఖల! రేऽలం త్యజ వాదమేతమఖిలంకంవాపి మాజల్పతాత్.

ఇందులో మొదట రావణుడు, "ఓ ధరాసుతా! సీతా! నీ ప్రాణ నాథుడు శకలీ భూతసత్పరాక్రముడు (సత్పరాక్రమము లేనివాడు)" అని రాముని తూలనాడును. అతడు తర్వాత తన్ను దాను స్తుతించుకొనుచు, "నేను దేవరక్షణ పటిష్ఠుడ (సురాణాం అపాలకః) నను కీర్తిపొంది యుండ లేదా? నేను శోభావంతుడను, కలానిధినని నీకు తెలియదా" అని ప్రశ్నిం చును. దీనికి సమాధానముగా సీతామహాదేవి "ఓనీచుడా! మాటాడకుము; నీ ఈ వాదమునంతయు వదలివేయుము. ఇక ఎట్టివాదమును చేయకుము" అని మందలించును.

సీతా ప్రత్యుక్తిలోనున్న సంకేతితార్థమును పరిశీలింతము. రేలంత్యజ; రే = ఒరే! లం-లకారమును; త్యజ-త్యజింపుము; కంవాత్యజ-కం వా-కకార మునుగాని; త్యజ- త్యజింపుము. కమపి వా త్యజ-లకారమునుగాని, కకార మునుగాని, రెండింటినిగాని; త్యజ - త్యజింపుము అనగా; పైశ్లోకములో మొదట లకారమును, తర్వాత కకారమును, అటుతర్వాత "లక" అను రెండక్షరములను తీసివేసి అర్థమును గ్రహింపవలెనని భావము.

ఉన్నపదములు :—

ధరాసుతే వికల సత్తేజాః
సురాపాలక సత్పరాక్రమః
కాంత్యాకలయావృతోహం

లకార లోపము :—

ధరాసుతే వికస త్తేజాః
సురాపాక సత్పరాక్రమః
కాంత్యాకయావృతోహం

కకార లోపము :—

ధరాసుతే విలస త్తేజాః
సురాపాల సత్పరాక్రమః
(సురాపః + అలసత్పరాక్రమః)
కాంత్యాలయా వృతోహం

"లక" అను రెండక్షరముల లోపము :—

(ధరాసుతే విస త్తేజాః)
ధరాసుతేన అవిస త్తేజాః
సురాపా సత్పరాక్రమః
(సురాపః + అసత్పరాక్రమః)
కాంత్యాయావృతః
(కాంతి + అయ + అవృతః)

లకార కకారలోపములు జరిగినపుడు, రాముడు వికసిత తేజుడగును. "లక"లు లోపించినపుడు (అవి సత్తేజాః-అర్కః అనగా సూర్యుడు) సూర్యుని వంటి తేజస్సుగలవాడను అర్థము వచ్చును ఈ విధముగా రామనింద రామ స్తుతిగా మారిపోవును, ఆత్మస్తుతి, ఆత్మాధఃకరణముగా పరిణమించును. లకార కకార లోపములవలన రావణుడు సురాపాయి (తాగుబోతు) యనియు పరాక్రమ హీనుడనియు, అశోభావంతుడనియు దేలును, లక అను అక్షర

ద్వయలోపము సంభవించినపుడు, అతడు సురాపాయి, అసత్పరాక్రముడు, సౌందర్య లాభరహితుడు (సురాపః, అసత్పరాక్రమః, కాంత్యాయాభ్యాం అవృతః) అనెడి అర్థమేర్పడును,

ఈ విధమైన నారికేళపాక భరితమో లేదా కపిత్థపాక భరితమో అయిన కవితలోని రసమును గ్రోలవలెనన్నచో, నది వ్యాకరణ జ్ఞానముండినవే సాధ్యపడును. నిశితముగా యోజించి, పదములను తలచి చూచి, ప్రయత్నించి అంతర్గర్భితముగానున్న అమృతభాండమును వెకలించి అద్దాని నాస్వాదించుటవలన గలిగెడు ఆనందము మేరలేనిది, మరువలేనిది, మరపురానిది.